ఓం

శ్రీ గణాధిపతయే నమః

ఓం శ్రీ మాల్యాద్రి లక్ష్మీనృసింహ స్వామినే నమః

ఓం శ్రీ సద్గురు, మొగలిచర్ల శ్రీ దత్తాత్రేయ స్వామినే నమః

ఓం శ్రీ లలితా త్రిపురసుందర్యై నమః

ఓం శ్రీ జగద్గురు ఆది శంకరా చార్య స్వామినే నమః

# "భవాని సౌందర్యలహరి"

రచన

**శ్రీమతి - పవని నిర్మల ప్రభావతి**

అంకితం

**శ్రీ మాల్యాద్రి లక్ష్మీనృశింహ స్వామి వారి**

దివ్యపాదా రవిందములకు

భక్తి ప్రపత్తులతో

అంకితం

రచయిత్రి

**పవని. నిర్మల ప్రభావతి**

# BHAVANI SOUNDARYA LAHARI

by

**Pavani Nirmala Prabhavathi**



This book is published with the financial Assistence of Tirumala Thirupathi Devasthanam under their scheme. Aid to Publish Religious Books.

**Price : Rs. 125-00**

Printed at :

**Swamy Offset Printers**

VIJAYAWADA.

✆ : 578211, 572832

మాతృశ్రీ పవని నిర్మల ప్రభావతి గార్కి ఓం నమోనారాయణాయ స్మరణలతో వ్రాయునది

అమ్మా,

మీరు అత్యంత ప్రేమతో పంపిన "భవానీ సౌందర్యలహరి" వ్రాతప్రతిని చూచుట జరిగినది.

మీ కృషి శ్లాఘనీయము, సామాన్యులకు కూడా సరళముగా అర్థమయ్యే రీతిలో సాగిన మీ రచనా కౌశలము పాఠకలోకానికి ఒక వర ప్రసాదము. ఈ గ్రందము మొత్తము లలితా సహస్రనామాలలో "అనవద్యాంగీ" అనే (వంక పెట్టుటకు వీలులేని అవయములు కలది) నామానికి స్థూలమైన వివరణయే ఈ భవాని సౌందర్యలహరి అని నా భావన, కాబట్టి పాఠకలోకము ఈ గ్రంధములోని అర్థాన్ని ఆస్వాదించి, ఆనందించి జగన్మాత పరమేశ్వరి అనుగ్రహమునకు పాత్రులగుదురు గాక.

ఇట్లు

**స్వామి వాసుదేవానందగిరి**

"శ్రీ సద్గురు సేవాశ్రమం"

"విశ్వబంధుతపోవన్ ట్రస్ట్ (రిజిస్టర్డ్)

పెదపులిపాక

(పెనమలూరు మండలం)

క్రిష్ణాజిల్లా

# నా మనవి

1998 సం॥, ఆగస్టు నెల 7వ తేదీ, చీరాలలో డాక్టర్ వీరేశలింగం, చి. సౌ. సుమిత్ర దంపతుల పెద్దమ్మాయి చి.సౌ. శ్రీదేవి వివాహానికి మమ్మల్నిద్దరినీ వచ్చి, వధూవరులను ఆశీర్వదించి వెళ్ళవలసిందిగా కోరింది చి.సౌ బీరక సుమిత్ర. ఆమె మాకు చిరపరిచితురాలు. నేను వ్రాసిన "శ్రీ శిరిడీ సాయినాధ భాగవతం" ఫెయిర్ కాపీ వ్రాసింది ఆవిడే! మాకు చిరాలలోని "సప్తగిరి లాడ్జిలో" రూం బుక్‌చేయించిందామె. వివాహానంతరం - వధూవరులను ఆశీర్వదించి, లాడ్జిలోని మారూములో - వేటపాలెం సారస్వత నికేతన్ గ్రంధాలయ సెక్రటరీ - చిరంజీవి R.V. శేషగిరిరావు - వారి శ్రీమతి చి.సౌ పద్మావతిగార్లు మావద్ద కూర్చున్నారు. నలుగురం సత్సంగంలో వున్నాము. శేషగిరిరావు గారి దంపతులు "జిల్లెళ్ళమూడి అమ్మ". అకుంఠిత భక్తులు మృదుభాషులు. మితభాషులు. సత్సంత్కారంగల అరుదైన దంపతులు. ఆడంబరంగా పైకి కనిపించని - వాణి వినిపించని చి. శేషగిరిరావు గొప్ప సాహితీవేత్త, విజ్ఞానవేత్త. ఎన్నో భాషలలోని భక్తి - వైజ్ఞానిక గ్రంధాలను ఆపోసనపట్టిన మేధావి! - కానీపైకి పొంగడు. వాగాడంబరత అనవసరంగా ప్రదర్శించని నిండు కుండలాటివ్యక్తి. ఇక చి.సౌ॥ పద్మావతి "సద్గృహిణి" అనే పదానికి ఆకారం దాల్చినట్లుగా, చెఱగని చిరునవ్వు, అతిథిపూజ, లలితా సహస్రనామ స్తోత్ర సామూహిక పారాయణాలు చేయిస్తూ, "సౌందర్యలహరి" సామూహిక పారాయణాలు చేయిస్తూ, ఎందరో గృహిణిలను తనవెంట ఆధ్యాత్మిక బాటలో పయనింపజేస్తున్న గొప్ప ఇల్లాలు! ఇద్దరికిద్దరూ అమ్మవారి ఉపాసకులు. దేవీభక్తులు!

నేను, నామాటల మధ్యలో శ్రీ ఆదిశంకరాచార్యులవా రి "సౌందర్యలహరి" కినా మనసుకు అమ్మవారు తోపింప జేసే విధంగా వ్యాఖ్య వ్రాయాలని తీవ్ర సంకల్పం కలుగుతోందనీ - అందుకు అవసరమైన "సౌందర్యలహరి" వ్యాఖ్యల గ్రందాలు ఏవైనా "వేటపాలెం" సారస్వత నికేతన్ గ్రంధాలయంలో వుంటే - మరోకమారు వీలుచూచుకొని వచ్చి - రెండు రోజులుండి పరిశీలించి వెళ్దామని వుందనీ చెప్పాను. అందుకు పద్మావతి తమవద్దే ఒక బృహత్ వ్యాఖ్య ఒకటివుందనీ - అలాటిది తనకు పూర్తిగా అర్ధంకాలేదనీ - "మీరైతే అర్థం చేసుకుంటారనీ" అన్నది. సరే అది, రిజిష్టర్ బుక్ పోస్టులో మాకు పంపమని చెప్పాము. మరునాడు తేదీ 8-8-98 ఉదయం ఒంగోలు - విజయవాడ ప్యాసెంజరులో మాదంపతులం విజయవాడ వెళ్తామని చెప్పాము. అలాగే మరునాడు ఉదయం రైలులో " ఉ॥ 6-45కు కూర్చున్నాము కంపార్ట్‌మెంటులో చీరాలస్టేషన్‌లో! దూరాన్నుండి R.V. శేషగిరిరావు - పరుగెత్తుకు వస్తూ కనిపించారు. ఆశ్చర్యపోయాము. ఆయన - మా వద్దకువచ్చి, మా చేతులలో "శ్రీ చదలవాడ జయరామ శాస్త్రిగారు" రచించిన సౌందర్యలహరి వ్యాఖ్య బృహత్ గ్రంధం పెట్టి -

నమస్కరించాడు ఆయాసపడ్తూ. "అయ్యో! నాయనా! ఇంతకష్టపడ్డారెందుకు ? పోస్టులో పంపితే సరిపోయేది కదా ?" అన్నాము - తెల్లవారగానే, వేటపాలెం నుండి చీరాలకు స్కూటర్ మీద వచ్చి - ట్రెయిన్ కదిలేలోగా ఆయాసపడ్తూ పరుగెత్తుకు వచ్చిన ఆతడి భక్తికి మాదంపతుల హృదయాలు ఆర్ధ్రమైపోయాయి. "మీరు సంకల్పించిన మహత్తర యజ్ఞానికి, మావంతు సహకారం ఇలా అందించగలిగితే చాలనుకున్నాము!" అన్నాడు అతడు భక్తిగా, ట్రెయిన్ కదిలింది. నేను ఇంతవరకూ చూడని, చదవని గొప్ప గ్రంధం ఇలా నాచేతులలోనికి వచ్చింది. ఇది కేవలం అమ్మవారి అపారకరుణ. చి.సౌ. శ్రీదేవి వివాహం అన్నది ఒక కారణం మాత్రమే!

తమ ఏడుతరాల తాతగారు కీ॥శే లోల్ల లక్ష్మీధరుడు గారు వ్రాసిన "సౌందర్యలహరి" సంస్కృత వ్యాఖ్యానికి - తమ తెలుగు అనువాదవ్యాఖ్యను - శ్రీ చదలవాడ జయరామ శాస్త్రిగారు ఈ గ్రంధంలో చాలాచాలా వివరణతో వ్రాసి - తాంత్రిక గ్రంధాలుండి ఆయా శ్లోకాలకు ఆయా గ్రంధాలలో చెప్పిన యంత్రాలూ, బీజాక్షరాలూ, యంత్ర పూజావిధానాలూ, ఆ పూజలవలన పొందే సిద్ధులూ అన్నీ వివరంగా వ్రాశారు. విజయవాడలో ఎనిమిదిరోజులు మా అమ్మాయి గాయత్రి వద్దవున్న నేను ఆ గ్రంధాన్ని పూర్తిగా భక్తి శ్రద్ధలతో పారాయణం చేశాను రాత్రింబగళ్లు! కొంతవరకూ అర్ధమైంది. మరికొంత అర్ధంకాలేదు. మరికొన్ని వ్యాఖ్యల పుస్తకాలు మా మిత్రులూ, ఆత్మీయులూ పంపారు. అవీ పారాయణంచేశాను. కానీ శ్రీ చదలవాడ జయరామ శాస్త్రిగారి గ్రంధం - రామాయణాలలో వాల్మీకి రామాయణం ప్రామాణిక గ్రంధం అయినట్లు - ప్రామాణిక గ్రంధం అనిపించింది నామనసుకు.

హైదరాబాదులో 28-1-1998 - తేదీ చి. R.V.శేషగిరిరావు - చి.సౌ. పద్మావతి దంపతుల, పెద్దబ్బాయి చి. రాహుల్ వివాహం జరిగింది. ఆ వివాహానికీ మా దంపతులను వచ్చి వధూవరులను ఆశీర్వదించవలసిందిగా చి. శేషగిరిరావు దంపతులు - మరీ మరీ కోరివున్నారు గనుక వెళ్లాము. బ్యాండుమేళాలు, పాట కచేరీలు - ఇలా వివాహానికి ముందు ఆధునిక పద్ధతులలో జరిగిపోతోంది కార్యక్రమం. చి.సౌ. పద్మావతి అతిధులను స్వాగతించటంలో తలమునకలై వున్నది. చి.శేషగిరిరావు అంతే - మమ్మల్నిద్దర్నీ సాదరంగా ఆహ్వానించారు. ఐదు నిముషాలు తీరిక చిక్కింది. చి.సౌ. పద్మావతి నిరంతరం సౌందర్యలహరి పారాయణ చేస్తున్న వ్యక్తి గనుక - నా చెవిలో ఒక్క శ్లోకం రాగయుక్తంగా పాడమని కోరాను. ఆమె - ఏ మాత్రం సంకోచం, విసుగు - లేకుండా నా కుడిచెవివద్ద తనముఖం పెట్టి - "సౌందర్యలహరి" మొదటిశ్లోకం - రాగయుక్తంగా గానంచేసింది. నాహృదయంలో ఒకానొక ప్రకంపన తరంగం ఉవ్వెత్తుగా లేచింది. "చాలు! ఇకచాలు .. శిఖరిణీ వృత్తంలో ఆదిశంకరాచార్యులవారు రచించిన ఈ శ్లోకాలు - గానంలో ఈ పద్ధతిలో పాడితేబావుంటాయి! అనిపించింది. సంతోషంగా

చెప్పాను ఆమెతో. ఆ తర్వాత వివాహసమయంలో చి.సౌ. బీరక సుమిత్ర - చి.సౌ. శ్రీదేవి ఆమె భర్తవచ్చి కలుసుకున్నారు మమ్మల్ని వివాహం పూర్తయ్యాక - వధూవరులను ఆశీర్వదించటం పూర్తయ్యాక - జనాలకు దూరంగా కూర్చుని చి.సౌ. సుమిత్రను కూడా మూడు శ్లోకాలు పాడమని కోరాను. ఆమె తనకమ్మని కంఠస్వరంతో - మూడుశ్లోకాలు గానంచేసి, బాంబేసిస్టర్స్ క్యాసెట్ వుందమ్మా "సౌందర్యలహరి" - అదివినండి". అని చెప్పింది. సుమిత్రగానంలో కూడా - సౌందర్యలహరి శ్లోకాలు నా హృదయంలో ప్రతిధ్వనించాయి.

ఆ తర్వాత చాలాగ్రంధాలు "సౌందర్యలహరి" వ్యాఖ్యకు సంబంధించిన వన్నీ పారాయణం చేశాను. ఎక్కువభాగం శ్రీజయరామ శాస్త్రిగారి వ్యాఖ్య ఆధారంగా వున్నవే అవికూడాను.

ఈ యంత్రపూజలకు అతీతంగా "సౌందర్యలహరి"లో శ్రీ శంకర భగవత్పాదులవారు సమాజానికి అందించదలచిన సందేశం ఏమైవుంటుంది ? అనే ఆలోచన నన్ను రాత్రింబవళ్లు ఊపిరి సలప నివ్వటంలేదు. ఆది శంకరాచార్యులవారు సిద్ధులకోసం పాకులాడే వారు కారు. వారికి ఆ సిద్ధులన్నీ కరతలామలకం! ఆ సిద్ధులు వారికి ఊడిగం చేస్తాయి. సిద్ధులపై ఆశతో ఆధ్యాత్మికబాటలో పతనం చెందమని వారు చెప్పరుగాక చెప్పరు.

వామాచార పూజలలో - ముఖ్యంగా తామసపూజలు - తాంత్రికపూజలూ చేసే వారెవరో - ఈ త్రాంతిక సిద్ధులను చొప్పించారే తప్ప, ఆది శంకరాచార్యులవారు స్వయంగా, సశరీరులుగా కైలాసం వెళ్లి, పరమేశ్వరీ, పరమేశ్వరుల వద్ద బోధగా పొందిన "సౌందర్యలహరిని" తాంత్రిక సిద్ధులకు ఆశపడే స్తోత్రంగా రూపొందించరు. అది, అసంభవం, అసంబద్ధము.

"నీ ఆలోచనే కరెక్ట్ ప్రభావతీ! నీ ఆలోచనకు అనుగుణంగానే నీవు వ్రాయి!" అన్నారు మా శ్రీవారు. ఈలోగా విజయవాడ, హృద్రోగ నిపుణులు. డా॥ కీ॥శే॥ చలపతిరావుగారి పుత్రులూ - కౌండిన్య సగోత్రోద్భవులూ - విజయవాడ కనకదుర్గ అమ్మవారి అకుంఠిత భక్తులూ - ఆ ఆలయ ట్రస్ట్ బోర్డులో మెంబరుగా చాలాకాలం సేవచేసి, కనకదుర్గ అమ్మవారి ఆలయ అభివృద్ధికి ఘాట్‌రోడ్ నిర్మాణం మొదలైన సేవలలో తనవంతు సహకారం, సేవ అందించిన, శ్రీదేవీ ఉపాసకులూ, లలితా సహస్రనామ స్తోత్రానికి లఘువ్యాఖ్య వ్రాసి - ఎందరో లలితా భక్తులకు అమ్మవారి పూజకు మార్గదర్శనం చేసిన మహామనీషి ఆధ్యాత్మిక భావనా బలంతో వ్యాధులను కూడా అరికట్టగలరని నిరూపించగలిగిన భక్తుడూ అయిన - నాకు పరోక్షగురు తుల్యులూ, సోదరతుల్యులూ అయిన శ్రీ డాక్టర్ T.V.A.S. శర్మగారు - "సౌందర్యలహరికి" వ్యాఖ్యవ్రాసి, ఆ DPT శుద్ధప్రతిని - మా శ్రీవారికి ఇచ్చారు - మమ్మల్ని చదివి అభిప్రాయం తెలుపవలసిందిగా కోరుతూ! అది పారాయణం చేసాను చాలా గొప్పగానూ, చక్కగానూ వున్నది.

కానీ నాది పరిమిత జ్ఞానం - అందువలన కొంత జటిలంగా అనిపించింది. "పంచభూతాల పంచీకరణ" కు చాలా గొప్ప వివరణ ఇచ్చారు వారు. అది కొద్దిగా నా ఈ సౌందర్యలహరి వ్యాఖ్యలోనికి అవసరమైతే తీసుకుంటానని అనుమతి కోరాను సోదరులు శ్రీ డా॥ T.V.A.S శర్మగారిని "తప్పక తీసుకోమ్మా! తప్పక వ్రాయగలవు సౌందర్యలహరి వ్యాఖ్యనీవు!" అంటూ ప్రమాధినామ సంవత్సర ఉగాది పర్వదినాన-వారు వారి స్వగృహంలో-నన్ను మనసారా ఆశీర్వదించారు. పంచదశి షోడశి మంత్ర వివరణ నేను కోరగానే - వివరించి - ఆశీర్వదించారు. ఉగాది శుభారంభం ఇలా జరిగిందని మా దంపతులం ఎంతగానో ఆనందించాము. మధ్యలో కొన్నినెలలు-"సౌందర్యలహరి" వాఖ్య వ్రాయ లేనేమోననే నిస్పృహకు గురయ్యాను. కారణం ఆ జగన్మాత అపారకరుణ పరిపూర్ణంగా నాపై వర్షించలేదనిపించింది. "ఇక వ్రాయలేను" అని నిర్ణయించుకున్న సమయంలో ఆషాడమాసంలో - ఆజగన్మాత అపారకరుణ కురిపించి, ఆది శంకరాచార్యుల వారు సశరీరులుగా కైలాసం వెళ్లి, పార్వతీ పరమేశ్వరులను దర్శించిన ఘట్టం- నా మనోనేత్రాలముందు ఒక గొప్ప సినిమాలా చూపింది జగన్మాత! ఆ ఘట్టమే నా వ్యాఖ్యకు ప్రారంభ కథగా రూపొందింది ఆ జగన్మాత అక్షర రూపిణియై ఈ సౌందర్యలహరి వ్యాఖ్య ఆతల్లి కరుణ కిరణమే! ఆ తల్లిరూపమే! అక్షరం అక్షరంలో ఆ ఆదిపరాశక్తి స్వరూపమే నిలిచింది! ఈనా "సౌందర్యలహరికి" స్ఫూర్తి - శ్రీ ఆదిశంకరాచార్య విరచిత "భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం." పదిహేడు (17) శ్లోకాలు గల ఆచిన్న స్తోత్రంలో ఆదిశంకరులు "చిదానందలహరినీ, సౌందర్యలహరినీ" మేళవించారు అద్భుతంగా. ఈ శ్లోకాలు ఆదిశంకరాచార్యులవారు ఎప్పుడు వ్రాశారో – ఆ చరిత్రలోనికి నేను వెళ్లదలచలేదు - కానీ ఈ భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం – పదిహేడు శ్లోకాలకూ విస్తృత వ్యాఖ్యానంగా, సౌందర్యలహరి 100 శ్లోకాలూ వారి హృదయంలో రూపు దిద్దుకుని వుండవచ్చునన్న ఊహనాకు కలిగింది! ఇది కేవలం నా ఊహే! దీనికి ఏ ఆధారమూ నేను చూపలేను. (రెండింటిలో గల భావసారూప్యత గమనిస్తే అర్థమౌతుంది.) అందుకే నా ఈ సౌందర్యలహరి వ్యాఖ్యకు "భవానీ సౌందర్యలహరి" అని నామకరణం చేశాను. ఇక మరొక్క మార్పు - పాఠకులందరికీ - అమ్మవారి భక్తులందరికీ సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

సగుణ రూపంలో భగవంతుణ్ణి లేదా భగవతిని దర్శించగలిగితే తప్ప - స్తోత్రం చేయగలిగితే తప్ప - నిర్గుణ రూపంలోనికి భక్తులు నిరాటంకంగా పయనించలేరు! సగుణరూప వర్ణన ముందుగా వ్యాఖ్యవ్రాసి, ఆతర్వాత నిర్గుణరూప వ్యాఖ్యవ్రాస్తే, క్రొత్తగా సాధనలోనికి అడుగెట్టిన ఆస్తికులకు సాధకులకు, అవగాహన త్వరగా ఏర్పడుతుందనే సదాశయంతో, సదాలోచనతో నేను ఆదిశంకరాచార్యులవారి సౌందర్యలహరి శ్లోకాలలోని ప్రథమ ఎనిమిది శ్లోకాలను

అధ్యాయంగా వ్రాసి, ఆ తర్వాత 42వ శ్లోకం నుండి, 99వ శ్లోకం వరకూ గల అమ్మవారి "సౌందర్యలహరి" వర్ణన వ్యాఖ్యవ్రాసి - ఆ తర్వాత మరలా 9 శ్లోకం నుండి, 41వ శ్లోకం - చివరగా ఫలశృతి - (వినతి) గా 100వ శ్లోకం వరకూ అమ్మవారి "చిదానందలహరి" వ్యాఖ్యవ్రాశాను.

ఇది ఆదిశంకరాచార్యుల వారంతటి జగద్గురువు రచించిన "సౌందర్యలహరి"ని అటు-ఇటుగా మార్చటమన్న అహంకారంగానీ, అవిధేయతగానీ, అపచారం చేద్దామనే భావనకానీ కాదు! కానేకాదు, "సౌందర్యలహరి" అతిగహనమైనది. గుహ్యమైనది. మంత్ర, యంత్ర తంత్ర - బీజాక్షర సమాకలితమైనది. "సుందరకాండ" పారాయణలానే, "సౌందర్యలహరి" పారాయణ మాత్రంచేత - మొండి వ్యాధులూ, దీర్ఘవ్యాధులూ, బాధలూ, సమస్యలూ, దారిద్ర్యాలూ - సర్వం పటాపంచలై పోతాయి. పారాయణ భక్తి శ్రద్ధలతో చేసేవారికి స్తోత్రం కొంగుబంగారమైనది. అందువలన ఇదిపైకి అమ్మవారి "సౌందర్యవర్ణన" లా తోపింపజేస్తూ - ఆలోచించగలిగిన వారికీ - ఆధ్యాత్మిక రహస్యాలను అవగాహన చేసుకొనే సామర్థ్యంగల భక్తులకూ సర్వప్రకృతిలో - సర్వచరాచర జగత్తులో, సర్వవిశ్వంలో, భగవతి సాకార, నిరాకార రూపాలను సాక్షాత్కరింప జేయగల అద్భుత మహిమాన్వితమైన స్తోత్రం! అయితే దీనిని ఆపళంగా చెబితే ఎక్కువ మందికి అర్థంకాదు. కథలు కథలుగా చెప్పాలి. ఆప్రయత్నమే చేసాను. అందులో ఎంతవరకూ సఫలీకృతురాలని కాగలిగానో - ఆ జగన్మాత కరుణకే అర్పిస్తున్నాను. ఈనా ప్రయోగమును సహృదయులైన - దేవీ ఉపాసకులూ, మహాకవులూ, పండితులూ - తర్క విద్యాప్రవీణులూ, సాధారణ భక్తులూ అందరూ - అర్థం చేసుకుంటారనీ - ఆశీర్వదిస్తారనీ ఆకాంక్షిస్తున్నాను.

ఇక నేను త్వరత్వరగా వ్రాసిన వ్రాతప్రతిని, ఫెయిర్ కాపీ వ్రాసి ఇవ్వవలసిందిగా నేను కోరగానే, సంతోషంగా అంగీకరించి - తనకున్న గృహబాధ్యతలతో బాటు - ఓర్పుగా, నా ఈ వ్యాఖ్యను ఫెయిర్ కాపీ వ్రాసి ఇచ్చిన సద్గృహిణి చి.సౌ. శ్రీమతి K. జయశ్రీ (W/o K.V.V. సత్యనారాయణగారు టెలికాండిస్ట్రిక్ట్ మేనేజరు - ఒంగోలు) కి ప్రత్యేకంగా ఆశీస్సులు తెలుపుతున్నాను. ఆమె నాకంటే వయసులో చాలాచిన్నది. కానీ ఆధ్యాత్మికంగా జ్ఞానవృద్ధురాలు. శ్రీదేవీ ఉపాసన ఆమె జీవితధ్యేయం. ఆమె చేయని వ్రతం - పూజ - సామూహిక పారాయణం లేవంటే అతిశయోక్తి కాదు. నిత్య సత్యం. దేవీ నవరాత్రులలో - 108 మంది సువాసినులకు సువాసినీ పూజ సాంగోపాంగంగా తొమ్మిదిరోజులూ రోజుకు పన్నెండుమంది ముత్తైదువులకు చొప్పున చేసిన దేవీ భక్తురాలు. లక్ష కుంకుమార్చనలు - లక్ష మల్లెపూలతో అమ్మవారి అర్చన (నలభై కిలోల మల్లెపూలు) లక్ష పసుపుకొమ్ముల వ్రతం - లలితా "కోటి సహస్రనామ సామూహిక పూజ - "దేవీ ఖడ్గమాలా" మండలపూజా కార్యక్రమాలూ, "శ్రీవిద్యా పంచదశ మాలా (తిథి

దేవతలపూజ) ఇలా - నిరంతరం తానుచేస్తూ, ఇతర గృహిణులను ప్రోత్సహిస్తూ - వారిచేత చేయిస్తూ - తన గృహిణీ బాధ్యతలు నిర్వర్తించుకుంటూ వుండే దేవీభక్తురాలు దేవీఉపాసకురాలు. ఆమె నేను కోరగానే - తనకున్న ఇన్ని బాధ్యతలలోనూ, నా "సౌందర్యలహరి' ' ఫెయిర్ కాపీ బాధ్యత కూడా తీసుకుని, సకాలంలో అది పూర్తి చేసినాకు ఇచ్చిన సద్గృహిణి. ఆమెకు - ఆమె భర్తగారికీ - చిరంజీవులకూ - ఆ జగన్మాత ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధులు ప్రసాదించి నిరంతరం చల్లగా కాపాడాలని మనసారా ఆ జగన్మాతకు మ్రొక్కుతూ మనసారా ఆశీర్వదిస్తున్నాను. "విషువ" పుణ్యకాలాల గురించిన వివరాలు నాకు తెలియజేసిన చిరంజీవి దైవజ్ఞ, ఆగమశాస్త్ర పండితుడు - పొన్నలూరు శ్రీనివాస గార్గేయ (పంచాంగకర్త)కు నా శుభాశీస్సులు అమ్మవారు అతడికి అతడి కుటుంబానికి సకల శుభములు చేకూర్చు గాక! ఈ నామ మహాయజ్ఞంలో మరోమహనీయుడు తమ వంతు సహకారాన్ని అందించటం మాదంపతుల అదృష్టంగా భావిస్తున్నాము.

విజయవాడ దగ్గర - "పెదపులిపాక"లో వుంటున్న "శ్రీవాసు దేవానందగిరి స్వామిజీ - అంఖండ దేవీ ఉపాసకులు లలితా సహస్రనామ స్తోత్ర సామూహిక పారాయణలూ, కోటికుంకు మార్చనలూ, వేలమంది ముత్తైదువుల చేత లలితా సహస్రనామ కుంకుమార్చనలూ - లలితా అమ్మవారి యజ్ఞములూ నిరంతరం జరిపిస్తుండే మహానుభావులు వీరు. అనుకోకుండా మా మిత్రులైన చి. మెంటా మస్తాన్‌రావుగారు చి.సౌ పద్మావతిల వెంట మాగ్రామం 3 సం॥ క్రితం వచ్చారు. మరునాడు శివరాత్రి సందర్భంగా - మా సద్గురువు శ్రీ అవధూత - మొగలి చెర్ల దత్తాత్రేయస్వామి వారి సమాధి మందిరం వద్ద, నూతనంగా నిర్మించిన శివాలయంలో - శివలింగ ప్రతిష్ఠ శ్రీ వాసుదేవానందగిరి స్వామిజీ వారే చేశారు. అట్లా వీరి పరిచయభాగ్యం మాదంపతులకు కలిగింది. ఆ తర్వాత వారు నా "లలితా సహస్రనామస్తోత్ర సర్వస్వం" చదివి - ఎంతగానో ఆనందించి - అభినందించి - పెదపులపాకలోని వారి ఆశ్రమంలో మాదంపతులను సన్మానించి - ఆశీర్వదించారు.

వల్లూరు పూర్ణచంద్రరావుగారి ఆవరణ (ఉదయం పత్రిక ఆఫీసువెనుక) 2 సం॥ క్రితం వీరు నిర్వహించిన బ్రహ్మాండమైన లలితా యజ్ఞం - పంచలోహ విగ్రహం (అమ్మవారిది) కోటికుంకుమార్చన అశేష భక్తులను ఆకర్షించింది. అలరించింది. భక్తి, ముక్తి పథంవైపు నడిపించినది. నా ఈ "భవానీ సౌందర్యలహరి" వ్యాఖ్యకు వారు తమ అమూల్య అభిప్రాయాన్ని - వ్రాసిస్తామని చెప్పారు. లలితా సహస్రనామ స్తోత్ర కోట్ల పారాయణతో పునీతులైన వారి స్వహస్తాలతో - నా ఈ భవానీ సౌందర్యలహరికి వారు తమ ఆశీస్సులు అందించటం - మా

అదృష్టం - అమ్మవారి అపారకరుణగా మేము భావిస్తున్నాము. వారికి మా కృతజ్ఞతాభి వందనములు తెలియజేసుకుంటున్నాను. "శిఖరిణీ" వృత లక్షణం గురించి, నాకు తెలియజేయమని నేను కోరినదే తడవుగా, నాకు ఆ వివరాలు అందించిన గౌరవనీయ సోదరులు - "రామాయణ రస తరంగిణి, "వాసుదేవ కథాసుధ" వంటి ఆధ్యాత్మిక గ్రంథ కర్తలు - అయిన శ్రీ పోలూరు హనుమజ్జానకి శర్మగారి (నెల్లూరు)కు నా ప్రత్యేక కృతజ్ఞతాభివందనములు. అతినిష్ఠా గరిష్టులైన ఆది దంపతుల వంటి ఆదంపతులకు నా శతకోటి నమస్కారములు. నాకు బంధుత్వరీత్యా "చిన్నాన్న" వరుస - వయసులో నాకంటే చిన్నవాడూ - అయిన చిరంజీవి ఎన్.వి. కోటేశ్వరరావు - దేవీ ఉపాసకుడు పాదుకాంత దీక్షాపరుడు, దేవీనవరాత్రులలో - సాంగోపాంగంగా దేవీ ఉపాసన, హోమం - సువాసినీ పూజ నిర్వర్తించే సద్భక్తుడు. కంప్యూటర్స్‌లో పెద్ద ఉద్యోగిగా ఉంటూ - అదునాతన సమాజంలో మెలుగుతూ కూడా తనదైన నిత్యానుష్ఠానం. నియమపాలనా - ఉపాసనావిధి ఏ రోజూ వదలని నిష్ఠాగరిష్ఠుడు నిరాడంబరుడు. అతడు నేనుకోరగానే, శ్రీదేవీ భాగవతం రెండు భాగాలు గ్రంథాలు. రామకృష్ణమిషన్ మైలాపూరు, మద్రాసు వారు ప్రచురించిన చిన్న సౌందర్యలహరి పుస్తకం (అర్థసహితం) దేవీ నవార్ణవ మంత్ర వివరణ. సప్తశతి లఘువ్యాఖ్యానాకు వివరించిన జ్ఞాని. అతడికీ - అతడి కుటుంబానికీ అమ్మవారు సకల శుభములూ చేకూర్చుగాక. "అహోబల" నరసింహస్వామికి సంబంధించిన వివరాలూ, అన్నమాచార్య నా రసింహ కీర్తన - నేను కోరగానే వ్రాసిపంపిన నా స్వంతసోదరి చి.సౌ. ఇందిరకు - అనేక శుభాశీశ్సులు. అమ్మవారు ఆమెకు ఆమె కుటుంబానికీ శాంతిసౌఖ్యాలు ప్రసాదించుగాక. ఇలా, నాకీ మహాయజ్ఞంలో మా మరది చి. పవని శ్రీనాథరావు ( Retd. Ele. Chief ఇంజనీరు) హైద్రాబాదు - "స్కంద పురాణం" వంటి పురాణ గ్రంథాలు పంపించాడు. అతడికీ అతడి కుటుంబానికి అమ్మవారు సుఖశాంతులు ప్రసాదించుగాక. అలాగే కోరకుండా తమ మనసుకు తోచి తామే ఇష్టంగా విరాళాల రూపంలో ధనం పంపిన ఆత్మీయులూ, శ్రేయోభిలాషులకూ - నా ఈ మహాయజ్ఞనికి - తమవంతు సహకారంగా, సౌందర్యలహరికి సంబంధించిన పుస్తకాలు పంపిన వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు - అపార మాతృ మమతతో కూడిన ఆశీశ్శులూ అందజేస్తున్నాను. వారందరి పేర్లూ క్రిందవేరుగా వ్రాస్తున్నాను. పుస్తకాల పేర్లూ వ్రాస్తున్నాను.

నా ఈ గ్రంథానికి - తిరుమల తిరుపతి దేవస్థానంవారు 20000 (ఇరవై వేల రూపాయలు) ఆర్థికసాయం అందించారు. వారికి నా ప్రత్యేక కృతజ్ఞాతాభివందనములు.

నేను ఒక గ్రంథం వ్రాయటం ఒక్కత్తు. ఇది ఒక మహాయజ్ఞం - అయితే, ఆ గ్రంథాన్ని ఎంతో ధనవ్యయ, ప్రయాసలకు ఓర్చి, గ్రంథ రూపంలో - పుస్తకరూపంలో సర్వాంగ సుందరంగా

తీర్చిదిద్ది - భక్తులూ జిజ్ఞాసువులూ అయిన పాఠకులకు అందేలా చూడటం. మరోమహా యజ్ఞం. ఈ రెండవ యజ్ఞాన్ని మా॥శ్రీవారు. శ్రీ పవని శ్రీధరరావుగారు చేశారు. మిగతా నా ఆధ్యాత్మిక గ్రంథాలన్నిటికి వారే ఈ రెండవ మహత్తర యజ్ఞం నిర్వహించారు.

నా ప్రతి ఆధ్యాత్మిక గ్రంథం - వెలుగు చూస్తున్నదీ అంటే - దాని వెనకాల నా భర్తగారు - శ్రీ పవని శ్రీధరరావుగారి అకుంఠిత దీక్ష - పట్టుదల నా గ్రంథ రచనపట్ల వారికి గల అపార ప్రేమ గౌరవాభిమానములే ప్రధాన కారణం - వ్రాయటం వరకూ నావంతు అయితే - ప్రింటింగ్‌కు ఇవ్వటం - డబ్బు పెట్టుబడిగా పెట్టడం - ప్రూఫ్‌దిద్దటం - అంతా వారు స్వయంగా చూచుకుంటారు. అలా వారు నాకు సహకరించకపోతే - నా ఏ గ్రంథమూ వెలగుచూచేదికాదు. నా భర్తగా, నా సద్గురువుగా, నాకు గ్రంథ రచన విషయంలో చక్కని సలహాలు, సూచనలు ఇచ్చే ఆత్మీయులుగా, - నా ఈ గ్రంథరచనల్లో నాకు ఏ సత్కీర్తి దైవం అనుగ్రహించాడో - దాని వెనకాల అదృశ్య హస్తంగా వున్నది - నా భర్తగారి ప్రోత్సాహం, సహకారం అని సవినయనంగానూ, సగర్వంగానూ, మనవిచేసుకుంటున్నాను. అంచేత కేవలం నా భర్తగారు గానేగాక - ఆయన నాకు తల్లి, తండ్రి, స్నేహితుడు, మార్గదర్శి అంటాను.

వారికి నా ప్రత్యేక నమస్సుమాంజలులు - అర్పించుకుంటున్నాను.

నా ఈ "భవానీ సౌందర్యలహరి"కి ప్రత్యక్ష్య, పరోక్ష - ఆర్థిక, గ్రంథరూప సహాయ, సహకారాలు అందించిన ప్రతి ఒక్కరికీ నాకృతజ్ఞతాభివందనములు. ఎందరో మహానుభావులు అందరికీ వందనములు. వయోవృద్ధులకు నమస్కారాలు. జ్ఞానవృద్ధులకు నమస్కారాలు. నాకంటే వయస్సులో చిన్నవారికి శుభాశీశ్శులు.

మాపై నిరంతరం తన అపారకరుణ కరుణ కురిపిస్తూ - కాపాడుతున్న మా ఇలవేల్పు శ్రీమాల్యాద్రి లక్ష్మీనృసింహస్వామి వారికి ఈ నా "భవానీ సౌందర్యలహరి"ని అంకితం ఇస్తున్నాను. మా సద్గురువు శ్రీ (మొగలిచెర్ల) దత్తాత్రేయ స్వామివారి అపారకరుణా; శ్రీ లలితా పరమేశ్వరి అపారకరుణా సర్వకార్యాలకూ ఆద్యుడూ - విఘ్ననాయకుడూ అయిన విఘ్నేశ్వరుని అపారకరుణలతో ఈనా గ్రంథం పూర్తి అయ్యింది. మనస్సుకు అపారమైన శాంతి లభ్యమైంది.

ఇక వుంటాను.

మీ సోదరి

**పవని నిర్మల ప్రభావతి.**

ఆర్థికసాయం అందించిన మిత్రులు, శ్రేయోభిలాషులూ, పేరు తెలియని అజ్ఞాత భక్తులు (ఒక రూపాయి మొదలు 50 రూపాయలువరకూ సత్సంగ కార్యక్రమాలలో నా చేతులతో దక్షిణగా పెట్టిన వారెవరో, వారి పేర్లేమిటో నాకు తెలియవు.) అందరికీ హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు. ఆజగన్మాత అపారకరుణ, వారి కుటుంబాలనూ, వారందరినీ, ఎలవేళలా కాపాడుగాక.

వివరాలు ఈ క్రింద వ్రాస్తున్నాను.

| | | | రూ - పై |
|---|---|---|---|
| 1. | శ్రీ. R.V. శేషగిరిరావు<br>పద్మావతి | దంపతులు<br>వేటపాలెం. | 1116 - 00 |
| 2. | శ్రీమతి. బీరక సుమిత్ర<br>w/o. డా॥ వీరేశలింగంగారు. | చీరాల | 1000 - 00 |
| 3. | పులివర్తి జయలక్ష్మి అన్నపూర్ణమ్మగారు<br>బాలాజీహోం భవానీపురం విజయవాడ. | | 2000 - 00 |
| 4. | బి. నాగేశ్వరి w/o. బి. సుబ్బారావుగారు<br>(పులివర్తి జయలక్ష్మిగారి తనూజ)<br>విశాఖపట్నం. | | 1000 - 00 |
| 5. | S. వరలక్ష్మి<br>S. నరసింహరావుగారు<br>BHEL. హైదరాబాదు | దంపతులు | 1000 - 00 |
| 6. | నందిగం శివపార్వతి గారి ఇంటివద్ద (BHEL) సత్సంగం జరిగిన సందర్భంగా 19-1-200 తేదీ, పేరు తెలియని భక్తులు సమర్పించిన దక్షిణలు - (హైదరాబాదు) | | 300 - 00 |
| 7. | K. అప్పారావుగారింట్లో, (కుకట్‌పల్లి) - హైదరాబాదు పేరు తెలియని భక్తులు ఇచ్చిన దక్షిణలు. | | 400 - 00 |
| 8. | "గాయత్రీ" పీఠంలో (ఒంగోలు) సత్సంగం సందర్భంగా పేరు తెలియని భక్తులు ఇచ్చిన దక్షిణలు. | | 400 - 00 |

| | | | |
|---|---|---|---|
| 9. D.V. రమణారెడ్డి - దంపతులు. ఒంగోలు | | 200 | - 00 |
| 10. పాలపర్తి భవానీ పాలపర్తి భుజంగరావుగారు (గురుగాంవ్ - హర్యానా) | దంపతులు | 1500 | - 00 |
| 11. C. శ్యాంమోహనరెడ్డి ఇందిరాదేవి (హైదరాబాదు) | దంపతులు | 5000 | - 00 |
| 12. R.L. మనోహరరెడ్డి లావణ్యకుమారి | దంపతులు (హైదరాబాదు) | 1116 | - 00 |
| 13. T. నాగభూషణం కరుణకుమారి | దంపతులు (కాకినాడ) | 100 | - 00 |
| 14. చెరువు పర్వతవర్ధని హైదరాబాదు | | 1000 | - 00 |
| 15. శ్రీమతి చుండూరు శ్యామలాంబ మద్రాసు | | 500 | - 00 |
| 16. వెన్నం సీతాకుమారి W/o. వెన్నం రామమోహనరావు (Late) | తెనాలి | 1116 | - 00 |

**నోట్:**

**"భవానీ సౌందర్యలహరి వ్యాఖ్య"రచనకు ఉపకరించిన గ్రందాలు :-**

1. శ్రీ చదలవాడ జయరామ శాస్త్రిగారి గ్రంథం. (సంస్కృతమూలం "లోల్ల లక్ష్మీధరుడు)
2. సౌందర్యలహరి పద్యరచన.
3. సౌందర్యలహరి - తుమ్మలపల్లి రామలింగేశ్వర శర్మగారు రచించినది.
4. మూలశ్లోకాలకుగానూ రామకృష్ణమిషన్ మైలాపూర్ మద్రాసు వారు ప్రచురించిన సౌందర్యలహరి శ్లోకాలు - అర్థాలు గల పుస్తకం.
5. సాధన గ్రంధమండలివారు 1964లో ఆంధ్రప్రభలో ప్రచురిస్తుండిన (ఎడిటర్ నీలంరాజు ఆదిశేషయ్యగారి ఆధ్వర్యంలో) వ్యాసాలు 1965లో "జగద్గురుబోధలు"గా పుస్తకరూపంలో ప్రచురించిన చిన్న పుస్తకం. వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు, అపర శంకరావతారులుగా ప్రసిద్ధిచెందిన పరమాచార్య వారు తమిళంలో ప్రవచించిన

ఆధ్యాత్మిక ప్రసంగాలకు తెనుగు అనువాదం - అనువాదకులు - యం.వి.బి.ఎస్.శర్మ కలంపేరు - "విశాఖ" పుస్తక ప్రచురణ సాధన గ్రందమండలి - తెనాలివారు చేసినది.)

6. "స్కంద పురాణం"
7. దేవీ భాగవతం (రెండుభాగాలు)
8. "రూపధ్యాన రత్నావళి"

(కశ్యప శిల్పశాస్త్ర గ్రంథం, దేవీ దేవతా చిత్రాలతో ధ్యాన శ్లోకాలతో వుండే బృహద్గ్రంథం.

9. "దివ్యజ్యోతి" భారతదేశంలోని సర్వదేవాలయాలూ, పుణ్యక్షేత్రాలూ స్వయంగా దర్శించి, - వాటి వివరాలు - క్షేత్ర పురాణాలలోని ముఖ్యాంశాలు - ఆయా పురాణాలలోని ఘట్టాలకు సంబందించిన క్షేత్రాలూ, ఆలయాలూ అన్నీ ఒక గొప్ప "సిలబస్"లా అందించిన గొప్ప గ్రంథం.

రచయిత శ్రీ పోతిరెడ్డిగారు.

10. ఈ నా భవానీ సౌందర్యలహరికి స్ఫూర్తి - శ్రీ ఆదిశంకరాచార్య విరచిత "భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం - 17 శ్లోకాలు -

"స్తోత్రరత్నావళి. స్తోత్రమంజరి" అనే పుస్తకాలలో వున్నది. ఇవి అన్ని భక్తిపుస్తకాలు అమ్మే షాపులలో దొరుకుతాయి. (రామకృష్ణా మిషన్ ప్రచురణలు - మైలాపూర్. మద్రాసు)

11. "శంకరాచార్యులు" (జాతీయ జీవిత గ్రంథమాల } మూలం :- టి. ఎమ్. పి. మహాదేవన్ అనువాదం ఇలపావులూరి పాండురంగారావు

12. శ్రీకాళహస్తి మహాత్మ్యము.

(ఎమెస్కో పాకెట్ బుక్స్‌లో వచ్చినది)

జగద్గురు శ్రీ ఆది శంకరాచార్యుల వారు. తమ శిష్యగణంతో హిమాలయ పర్వత ప్రాంతాలలో ఆధ్యాత్మిక సత్సంగ గోష్టులు చేస్తూ విహరిస్తున్నారు. వారిలో చాలామంది శిష్యులకు ఆ మహద్గురువు వెంట తాము సర్వతీర్ధయాత్రలూ, క్షేత్రముల దర్శనమూ, పుణ్యనదీస్నానాలూ చేయవలెనని కోరికగా వుండేది. శిష్యుల యొక్క ఇలాటి ఆధ్యాత్మిక కోర్కె తీర్చని తీర్చలేని పరమగురువు ఎవరూవుండరు. శిష్యుల కోర్కె మంచిదయినపుడు దానిని తీర్చవలసిన బాధ్యత - పరమగురువుకు తప్పకుండా వుండి తీరాలి. అందువలననే ఆదిశంకరాచార్యులవారు తమకు అత్యంత ప్రీతి పాత్రులైన తమ శిష్యులను వెంట బెట్టుకుని, కాశ్మీరు మొదలు కన్యాకుమారి వరకు గల దివ్యక్షేత్రాలూ, విఘ్నేశ్వర, సుబ్రహ్మణ్యేశ్వర ఇలా సర్వదైవీ, దేవతాక్షేత్రాలూ సందర్శించారు. ఆయాక్షేత్రాలలో ఆయాదైవదర్శన సమయంలో ఆ మహద్గురువులో నుంచి గంగా ఝరిలా ఉప్పొంగిన అద్భుత కవిత్వంతో ఆయా దైవాలనూ, దేవీ స్వరూపిణులనూ స్తోత్రం చేశారు. అలా ఆ పరమగురువు వ్రాసిన స్తోత్రాలు - అన్నిటినీ ఒక మనిషి ఒక జన్మలో పారాయణం చేసి, కంఠస్థం, హృదయస్థం చేసి, అర్థంచేసుకొని తరించటము కూడా సాధ్యంకాదు. అన్నివ్రాశారు. అంతగొప్పగా వ్రాశారు. వాటిలో శ్రీ భవానీ భుజంగప్రయాతస్తోత్రం" ఒకటి! కేవలం పదిహేడు (17) శ్లోకాలలో అమ్మవారి ఆనందలహరి - చిదానందలహరి- సౌందర్యలహరి - మంత్రతంత్ర శాస్త్రాలను - ప్రతిఒక్కరూ హాయిగాగానం చేసుకొనే విధంగానూ, మనసుపెట్టి కంఠస్థం చేస్తే రెండురోజుల్లో ఎవరికైనా నోటికి వచ్చేట్లుగా వుండేంత సులువుగా వ్రాశారు.

శ్రీ "భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం !"

బ్రహ్మసూత్ర భాష్యములు - త్రిశతిభాష్యము, నిర్వాణషట్కము, శివభుజంగ ప్రయాతస్తోత్రము, శివానందలహరి - ఒకటేమిటి ? ఆయనహృదయంలో కదలాడే ప్రతిభక్తి భావానా ఒక శ్లోకమై ఒకస్తోత్రమై అలరారింది ! ఆ స్తోత్రాలు నియమంగా పారాయణ చేసిన వారికి, వేదమూ, వేదమంత్రాలూ, గాయత్రీ జపము, నిత్యయజ్ఞ యాగాలూ చేసేంతటి ఫలము సంప్రాప్తమైతీరుతాయి. అది ఆ జగద్గురువుకు జగన్మాత ప్రసాదించిన వరం కూడాను. శక్తి పీఠాలెన్నిటిలోనో, శ్రీ చక్రస్థాపన చేసి ఉగ్రరూపిణులుగావున్న అమ్మవార్లను, సౌమ్యరూపిణులుగా, సాత్వికస్వరూపిణులుగా మార్చారు అపరమగురువు.

మరి ఇదంతా ఆయన ఒకజన్మలో సాధించగలిగారూ అంటే - అణిమాద్యష్టసిద్ధులు ఆమహాత్మునికి కరతలా మలకం అయ్యాయి. శిష్యులు తామంతా, తమగురువుగారివెంట నడుస్తున్నామని భ్రమపడుతున్నప్పటికీ ఆ పరమగురువు వారందరికీ ఒకానొక "పరవశత్వం"

కలిగించి వారికి తెలియకుండానే- తమదైన ఖేచరీ విద్యతో, ఒకక్షేత్రం నుండి మరో క్షేత్రానికి - వందలమైళ్లదూరం - చిటికెలో- అడవులనూ - కొండలనూ అధిగమించి మరీ చేరవేసేవారు. వారికిది ఏ మాత్రం తెలియదు. తెలియకూడదు. తెలియనివ్వనిదే వరహస్యమే పరమగురువు యొక్క యోగరహస్య - చమత్కారం ! వారంతా తృప్తి చెందారు.

ఇక ఆదిశంకరాచార్యుల వారు తనదైన చిరకాల కోర్కెతీర్చేకోవలిచారు. అది తీరితేగానీ- తన ఈ జన్మసార్థకత కాదు. కర్తవ్యం పూర్తి కాదు.

ఈ సృష్టి ఏమిటి ? ఎలా ఆరంభమయ్యింది ? అనంతమయిన ఈ శక్తి వివిధరూపాలలో ఈ విశ్వాన్నంతా ఆవరించుకుని యున్నది. ఈ శక్తి స్వరూపమేది . ఇంతటిశక్తీ, వివిధరూపాలలో, ఒకానొకక్రమశిక్షణకు లోబడి ప్రకాశిస్తున్నది ! ఆ నియంత్రణ చేసే మహాజ్ఞాన శక్తి ఏది ?

వారే శివశక్తులు ! వారే పార్వతీ పరమేశ్వరులు. వారిని సందర్శించాలి. ఆ శివశక్తి స్వరూపాలను సామాన్యమానవులందరికీ అర్థమయ్యే భాషలో వర్ణించాలి. ఒక్కమాటలో చెప్పాలంటే, ఒక" పరా" చైతన్యమే ఈ విశ్వంగా రూపొందింది. "సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష. స్సహస్రపాత్" అను మంత్రపుష్పంలోని వాక్యానుసారం, ఈ విశ్వానికంతకూ వేలవేల తలలు, వేలవేల కళ్లు, వేలవేల కాళ్లు కలిగిన ఒక విరాట్‌రూపం - దేహం ఉన్నదని అర్థమవుతోంది కాదా ? ఈ విధంగా దిగివచ్చిన చైతన్యం ప్రపంచమంతటిలో వివిధ రూపములలో, వివిధస్థాయిలలో - జీవులలోని గూఢంగా నిక్షిప్తమయివున్నది. అట్టి జీవరాసులన్నిటిలోని ఉత్తమమైనది మానవస్థితి. ఇది ఇతర జీవముల కన్నా ఉత్తమోత్తమంగా చైతన్యసాక్షాత్కారంతో కూడివున్నదే తప్ప, పరిపూర్ణంగా మాత్రం లేదు. అందుకే మానవులంతా అధ్యాత్మికమయిన పరిపూర్ణ దిశగా కొనసాగాలి. అందుకుగానూ శివశక్తుల పరిపూర్ణ దర్శనంపొంది తీరాలి.

సశరీరాలుగా కైలాసందర్శించాలి. ఆ జగన్మాత జగత్పితలైన పార్వతీ పరమేశ్వరులను దర్శించాలి. వారిలాస్య, తాండవనృత్యాన్ని కనులారా వీక్షించాలి. జగన్మాత "సమయిని" - జగత్పిత "సమయుడు. కాలానికి సంకేత స్వరూపులు. నిత్యాతిథి స్వరూపులు ! ఆ జగన్మాత శక్తిస్వరూపిణి అయిన ఆతల్లి స్థూల, సూక్ష్మ, మంత్ర, తంత్ర, విరాట్‌రూప సౌందర్యాన్ని కనులారా తిలకించిధన్యత చెందాలి ! ఆ సౌందర్యలహరిలో తాను మునకలువేసి- భావితరాలకు ఆ తల్లి స్వరూప, దివ్యత్వ, ప్రభావ, వైభావాలను తేటతెల్లంగా అందించి- ఎక్కువగా చదువులేని వారూ, యోగసాధన చేయలేని వారూ, గృహిణులూ, గృహస్తులూ మరికొందరు జ్ఞానులూ, పండితులూ ఇలా అందరికీ ఆ"సౌందర్యలహరిలో" మునకలువేసి తరించే అవకాశం కల్పించాలి. తానొక్కరు ముక్తి సాధించటంగొప్పగాదు. వేలాది, లక్షలాది మంది- మానవులూ తరించే మార్గం చూపాలి. ఇదే తన జీవితలక్ష్యం. అవతార పరమార్థం.

శిష్యులలో ఎవరికీ సశరీరులుగా కైలాస దర్శనం చేయగల మానసిక, ఆధ్యాత్మిక పరిణితి రాలేదు. అంచేత వారెవరికీ ఈ తన ప్రయత్నం తెలియనివ్వరాదు. దైవదర్శనం విషయంలోనూ, మహాత్ముల దర్శనం విషయంలోనూ, ఆధ్యాత్మికమైన రహస్యాలను తెలుసుకొనే విషయంలోనూ, ప్రతిమనిషీ ఒంటరిగానే వెళ్లాలి. ప్రక్కన పదిమందిని పిల్చుకువెళితే వారిలో

చాలామందికి- ఈ వ్యక్తికి వున్నంత మానసిక పరిణితి, ఓర్పు, భక్తి, శ్రద్ధ వుండకపోవచ్చు. అవతల దైవాన్నీ, మహాత్మునీ విమర్శించేకు సంస్కారం వుండవచ్చు. ఇటువిని - అటుతిరిగి "ఆ ! ఏదోచెప్పారు -ఏదో విన్నాం!" అనే నిర్లక్ష్యభావమూ వుండవచ్చు. అంచేత ఒంటరిగానే వెళ్లాలి. తాను అనుభవం- అనుభూతిసాధించి - ఆ తర్వాత సాధికారికంగా చెప్పి, "సాధనచేయండి !" అని చెప్పవచ్చుగానీ, ముందే దేవరహస్యాలను వెల్లడిచేయరాదు. ఇది మహాత్ముల నియమం. నిజమైన జ్ఞానులువుంటే- వారికి అర్హతవుంటే- వారెలాగూరాగలుగుతారు. అవతలిదైవం - మహాత్ముడుకూడా పదిమందిని చూచి పనికిమాలిన ప్రశ్నలువేస్తారని గ్రహించి మౌనం వహించే ప్రమాదమూ వున్నది. గృహిణీ గృహస్తులలో కూడా కొందరు దంపతులు మాత్రమే ఇలా మాట - మనసు ఒకటిగావుండి - అలాటి మహాత్ములను జంటగాదర్శించగలుగుతారు. లేనివారు - ఎవరికి వారుగానే దర్శిస్తారు.

ఆది శంకారాచార్యులవారు- ఆరోజు శిష్యులతో చెప్పారు. "నేను కొద్దికాలం సమాధిస్థితిలో వుంటాను. మీరెవరూ నాధ్యాన భంగం చేయరాదు. "అంటూ, శిష్యులకిది అలవాటే, వారలా సమాధిస్థితిలోవున్నపుడు వారు తమనిత్య నైమిత్తిక కార్యక్రమాలన్నీ ఆగుహ బయటే చేసుకుంటారు. అప్పుడప్పుడూ తమ పరమగురువు శరీరం అక్కడవుందా లేదా అనిమాత్రం తొంగిచూచి వెళ్లిపోతుంటారు.

అణి మాద్యష్టసిద్ధులూ కరతలామలకం అయినా, ఏనాడూ వాటిని గారడీగా, ఇంద్రజాలవిద్యగా, పరపీడనగా ఉపయోగించని ఆ పరమగురువు. మండన మిశ్రుని భార్య భారతీదేవితో వ గ్వాదంలో - ఆమెను ఓడించటానికిగానూ, తనకు తెలియని, అనుభవంలేని గృహస్థ జీవితాన్ని తాత్కాలికంగా తెలుసు కోవటానికిగానూ "పరకాయ ప్రవేశ" విద్య ఉపయోగించుకున్నారు ఒక్కమారు. అంతే.

ఇప్పుడూ ఆ పరమగురువు- తన శరీరాన్ని గుహలో సమాధిస్థితిలో వుంచారు. ఛాయా శరీరంలో అదృశ్యంగా సశరీరులుగా కైలాసం వైపు తనదైన "ఖేచరీ" విద్యతో బయల్దేరారు. శిష్యులకు ఆయన శరీరం వుందన్న భ్రాంతి మాత్రం కలుగుతోంది ఇక్కడ. కైలాసానికి ముందు మానససరోవరం వుంది. మానససరోవర పరిక్రమణ ఒక గొప్పఅనుభూతి. ఆ పరిక్రమణ చేయగలిగినవారు, మానసిక, శారీరక, ఆధ్యాత్మిక ధృఢత్వం కలిగిన వారుగా వుండాలి. లేనివారు సగందూరంలో అనారోగ్యం తోవెను దిరగటమో, అసువులు బాయటమో జరుగుతుంటుంది. ఆదిశంకరాచార్యులవారు మానససరోవర పరిక్రమణకు ఉపక్రమించారు. సర్వలోకాలలోని శాంతి, మనశ్శాంతి అనేది ఏదైతే వున్నదో, అదే అక్కడ రాశీ భూతమై వున్నది. ఆ మానససరోవరంలోని నీరు - శుద్ధ స్ఫటికంలా - పారదర్శకంగా వున్నాయి. సూర్యకిరణాలు

పడి - ప్రకాశ పరావర్తనం చెందటంతో - కమలాలు సువర్ణకాంతు లీనుతూ సువర్ణ కమలాలని పిస్తున్నాయి. హంసలజంట - అతి నిశ్శబ్దంగా, కేవలం మనిషి ఉచ్ఛ్వాస నిశ్వాసముల వంటి సవ్వడిలా ఆ సరోవరంలో విహరిస్తున్నాయి. ఆచార్యులు అక్కడే నిల్చుండి పోయారు. ఆ హంసల జంటను అవలో కిస్తున్నారు. అవి హసంలా? కాదు. మానవుల ఉచ్ఛ్వాస నిశ్వాసములు. ఉచ్ఛ్వాస నిశ్వాసములతో ప్రారంభమయ్యే "మహా కాలానికి" సంకేతాలు. "కలా, కాష్ఠ, లిప్త, ముహూర్త, ప్రహర, క్షపం క్షణ, నిమేష, గంట, గడియ, అహోరాత్ర- (దివా, సంధ్య - రాత్రి) దిన - వార, పక్ష, మాస, ఋతు, అయన, సంవత్సర యుగ - మహాయుగ, కల్ప, బ్రహ్మ కల్పములనబడే మహాకాలానికి లెక్కలు ఖచ్చితంగా తేల్చే హంసలజంటలు అవి. ఈ కాలం నుండే - పంచభూతములైన భూమి- నీరు- అగ్ని, వాయువు, ఆకాశం ఉద్భవించాయి. ఈ కాలంనుండే- ఈపంచభూతాలనుండే శబ్ద, స్పర్శ, రూప, రస,గంధాలనే ఐదుతన్మాత్రలు- (పంచ భూతముల యొక్క తన్మాత్రలు) ఉద్భవించాయి! ఈ మహాకాలంలో నుండే త్రిగుణాలు - సత్వ, రజ, స్తమోగుణములు ఉద్భవించాయి!

అహో ( ! మహాకాలమా ! కాలస్వరూపమా ! కాలస్వరూపిణీ ! మహాశక్తి స్వరూపిణీ ! నీకునమో వాకములు తల్లీ !" ఆదిశంకరాచార్యులవారు అక్కడే నిలబడిపోయారు. ఆయన ఆలోచనా తరంగాలు మానస సరోవరం నీటిమీది చిరు అలలుగా సాగిపోతున్నాయి ! సత్వరజస్త మోగుణములనేవి మూడే ! కానీ అవిమూడూ 27గా (ఇరవై ఏడుగా) పరిణమించి ఈ జగత్ సృష్టి స్థితిలయాలను నడుపుతున్నాయి. ఈ గుణాలు ఈ పంచభూతాలూ వివర్తనం (వైవర్తం - వ్యాప్తం) చెందిపోతుంటాయి. అవి అమ్మవారి వివిధ శక్తి స్వరూపాలు. వాటిని ఒకక్రమబద్ధంగా నియంత్రించే శక్తి ఏది ? అదే ఈశ్వరుడు - పురుషుడు ! ఏ శక్తినయినా క్రమబద్ధం గానియంత్రించినపుడే అది విశ్వశ్రేయస్సుకు సహకరిస్తుంది. విలయంగానర్తిస్తే అది ప్రళయాన్ని సృష్టిస్తుంది. పురుషునితో (ఆత్మ) కూడినపుడే ఈ సత్వరజస్తమోగుణములు. పైకి ప్రస్ఫుటమౌతాయి ! ఆత్మశక్తితో సంబంధం కలిగినపుడే ఈ గుణాలు మూడూ (త్రిగుణాలు) గోచరిస్తాయి. ఈ ఆత్మశక్తి జడస్వరూపంగా వున్నపుడు "తామసం" అనీ, చైతన్య స్వరూపంగా వున్నపుడు "రాజస"మనీ, "జ్ఞాన "స్వరూపంలో వున్నపుడు "సాత్విక"మనీ అంటారు మహర్షులు ! వారే మంత్ర ద్రష్టలు ! ఒకదానిని ప్రత్యక్ష్యంగా చూచి, స్వానుభవంతో, అనుభూతితో - సాధికారికంగా చెప్పగలిగినవారే ఋషులు - ద్రష్టలు ! మంత్రాన్ని - మంత్రాధిష్టాన దేవతనూ దర్శించినవారే ద్రష్టలు- ఋషులు ! అందువలననే "నానృషి ః కురుతే కావ్యమ్ !" ఋషి కాని వాడు కావ్యరచన చేయలేడు !" అన్నారు వారే ! ధ్యాన సమాధిలో మునిగిపోయినపుడు వివిధజీవరాసులలోని చైతన్య స్థితిగోచరమౌతోంది:

1. తమోగుణం వలన భూమి,పర్వత,వృక్ష, పాషాణములు మొదలైన స్థావరములన్నీ పుట్టాయి. ఆదిశక్తి ఈ రూపంలో ఆవిర్భవించింది ! తమోగుణంతో!

2. "రజోగుణం" వలన మనుష్యులు- మృగములు, పక్షులు, పురుగులు, జలచరములు మొదలైన "జంగమ" (చర) ప్రాణులు పుట్టుకొచ్చాయి ! ఆదిపరాశక్తి రజోగుణ విజృంభణ ఇది !

3. "సాత్వికగుణము" వలన జ్ఞానస్వరూపులైన దేవతలు మహర్షులు - ఆచార్యులు, ఆళ్వారులు, నయనారులు, అవతార పురుషులు, అవధూతలు వివిధరకాల దేవీ దేవతా స్వరూపములు, ఉద్భవించారు. ఆదిపరాశక్తి యొక్క "సత్వగుణ" స్వరూప ప్రతిబింబాలు వీరంతా ! వీరు భూలోకంలోని సర్వప్రాణికోటినీ ఉద్ధరించటానికి అవతరించి. తమభోధలతో, కవిత్వాలతో- కళలతో మిగతా రాజస- తామస మానవులను - ఆధ్యాత్మికతవైపు మరలించి ఉద్ధరించే కారణజన్ములు.

ఆదిపరాశక్తి విజృంభణ (విమర్శ) అంతటితో ఆగలేదు. ఈ సృష్టి విస్తృతపరచటానికి గానూ పైత్రిగుణాలనూ. ఒక్కొక్కదానిని మూడు - మూడు - మూడు - భాగములుగా 3×3×3. (27) విభంజించిందా పరమేశ్వరి అయిన మహాకాలస్వరూపిణి !

ఇలా - విభజింపబడి - సత్వగుణంతో కూడిన సత్వగుణంలోని సత్వగుణంతో - నిర్వికారుడు - నిరంజనుడు - మహాయోగీశ్వరుడు అయిన విరాట్ స్వరూపుడు - సాకార రూపందాల్చాడు.

అందువలననే ప్రకృతిలోని సృష్టిలోని సర్వ వస్తుజాతమంతా, ఇరవైఏడు (27) గుణవిభాగములుగా విభజింపబడివున్నదని తెలియజేశారు మహర్షులు. భగవద్గీతలో శ్రీ కృష్ణ పరమాత్ముడు ఈ గుణత్రయ విభాగ యోగాన్ని అద్భుతంగా వివరించారు. అందువలననే- ప్రకృతి మయమైన మంత్రరూపమైన ''గాయంత్రి'' కీ మూడు పాదములు. (సాత్వికరాజస,తామసములు)" భూర్భువస్సువ" యను మూడు వ్యాహృతులు- మొత్తం 27 అక్షరముల గల మంత్రం ఇది.

ఉపనయన మనగా.

నయనం అంటే కన్ను అని ఒక అర్థం. మార్గం అని మరో అర్థం.

నయనం = మార్గం దేనికి మార్గం.?

ఉప = మరొకరి వద్దకు- ఆమరొకరు ఎవరు ? సద్గురువు ! ఆసద్గురువు వద్దకు మార్గము తెలిపేదే "ఉపనయనము"

మరొక నయనం- కన్ను - దృష్టి- ప్రసాదించేదే ఉపనయనము.

ప్రాపంచికమైన దృష్టిగాక- పారమార్థికమైన దివ్యదృష్టిని ప్రసాదించేదే "ఉపనయనం" ద్విజన్మ- దీనితోనే ఈ సంస్కారంతోనే ప్రారంభమౌతుంది. మతాలకూ- కులాలకు వేరు వేరుగ వుంటాయి ఈ సంస్కార పద్ధతులు. వారి వారి గురు బోధలను అనుసరించి,

ఉపనయనంలో - యజ్ఞోపవీతం ధరింపజేస్తారు. ఇది మూడు వరుసలుగల దారములసమూహము. గాయత్రికి ప్రతిబింబము.

ఒక్కొక్క వరుసకు మూడు అంతరసూత్రములు. ఆ అంతర సూత్రములకు మరల ఒక్కొక్కదానికి మూడు పోగులు. ఇలా మూడు పెద్ద దారపు వరుసలుగల యజ్ఞో పవీతానికి 3X9 = 27 పోగులు (దారములు లేదా సూత్రములు) వుంటాయి. ఈ పోగులే- 27 తంతువులు- 27 భేధములు (త్రిగుణములుX9 = 27) గల త్రిగుణ స్వరూపముఅయిన ఈ జగత్తు. అయజ్ఞోపవీతముధరించి గాయత్రి మాతను అనుష్ఠిస్తూ నియమంగా ధర్మమార్గంలో పరబ్రహ్మస్వరూపాన్ని ఉద్దేశించి సర్వం పరబ్రహ్మస్వరూపంగా భావిస్తూ సర్వకర్మలూ చేయవలెననీ- ఈ యజ్ఞోపవీతమునకు కూటస్థానమైన "ముడియే" "బ్రహ్మముడి" అనీ సత్వప్రధానమగు గుణ సామ్యావస్థయనీ- మహర్షులు చెప్పారు !

ఇట్లా బ్రహ్మవిద్య నెరిగినవాడే బ్రాహ్మణుడు అన్నారు.

బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్రులనబడే వారంతా గుణ విభాగమువలన ఏర్పడిన కులాలేగానీ మరొకటి కాదు. ప్రతి మానవునిలోనూ ఈ నలుగురూ వున్నారు. ఎలా?

పంచభూతాలూ మానవశరీరంగా ఏర్పడ్డాయి !

$\frac{1}{8}$ ఆకాశవ్యష్టిత్వము ,+ $\frac{1}{8}$ వాయువు వ్యష్టిత్వము కలిసి : మనోగోళం మనస్సుఏర్పడుతుంది. మానవునికి ప్రధానమైనది మనస్సు. ఇక్కడే సర్వభావములు ఏర్పడుతాయి. ఇది వాయు(గాలి) ప్రధానమైనది గనుక చంచలముగా వుంటుంది. గాలికంటే వేగంగా పరుగెత్తేదే మనస్సు.

ఆ మనస్సును అదుపులోనికి తెచ్చుకోవటానికి అన్నిరకాల మంత్రాలూ , తంత్రాలూ, సాధనలూ, యోగాలూ, పూజలూ- నిర్దేశించబడ్డాయి.

$\frac{1}{8}$ అకాశఅంశ + $\frac{1}{8}$ అగ్ని అంశకలిసి : బుద్ధిగోళం ఏర్పడుతుంది మానవులలో ! బుద్ధిః కర్మానుసారిణీ ! అన్నట్టు- బుద్ధి తీవ్రతను బట్టే ఆవ్యక్తి కర్మాచరణ వుంటుంది.

$\frac{1}{8}$ ఆకాశఅంశ + $\frac{1}{8}$ జలఅంశకలిసి = "చిత్తము" అనేగోళం ఏర్పడుతోంది.

$\frac{1}{8}$ అకాశఅంశ + $\frac{1}{8}$ పృధ్వి అంశ కలిసి = "అహంకార గోళం" ఏర్పడుతుంది. ఈ విధంగా మానవుని స్థూల శరీరంలో 20 వ్యష్టిఅనే పంచీకృత తత్వములు, 5 సమిష్టి అనే అపంచీకృత తత్వములు కలిసిమొత్తం 25 తత్వములు ఏర్పడుచున్నాయి.

వీటిలో 24 తత్వములు - క్షరమైనవి. నశించిపోయేవి అని అర్థం.

25వ తత్వం - "అత్మజ్ఞానం" అక్షరమైనది. ఎన్నటి కీనశించని దివ్యసంస్కారం ఇది. ఈ ఆత్మజ్ఞానమునే "బ్రాహ్మణవర్గము" అంటారు. బ్రహ్మజ్ఞానం తెలుసుకున్నవాడే బ్రాహ్మణుడు.

ఆత్మజ్ఞానం తెలుసుకున్న జ్ఞానులకు- ముందు విభజించి చెప్పిన త్రిగుణాలలోని తమోగుణ-రజోగుణ ప్రభావములు ప్రసరించవు. అంటవు. "బ్రాహ్మణవర్గం" అన్నది ప్రతి మనిషిలోనూ గల మహాకారణ శరీరం అనగా "జ్ఞాన" స్వరూపం ఇది రూపానికి అందదు కొలతలకు అందదు. జ్ఞానులలోఇది శాశ్వతంగా వుంటుంది. అజ్ఞానులైన సాధారణమానవులలో ఇది తళుక్కున మెరిసి మాయమౌతుంది. కాబట్టి ప్రతి మానవుడిలోనూ "బ్రాహ్మణుడు" ("ఆత్మజ్ఞానం") వున్నాడు.

ఇక ఒకరాజ్యాన్ని మహారాజు తన శాసనంతో, అధికారంతో, విచక్షణతో పాలించిన్నట్లే- ప్రతి మనిషి దేహాన్ని శాసించి పరిపాలించే "కారణ శరీరం" (ఇంద్రి యసమూహం - మెదడు -) "క్షత్రియవర్గం". మానవునిలోని క్షత్రియుడితడే ! ఇతడే క్షేత్రజ్ఞుడు.

ఇక - వ్యాపారలావాదేవీలు క్రయ విక్రయములు - కోర్కెలు అనే ధనం పెట్టుబడిగాసాగే "సూక్ష్మశరీరమే వైశ్యవర్ణము. వైశ్యుడు. ఈ కోర్కెలు అనంతంగాసాగి - ఒక్కొక్కసారి బ్రాహ్మణ-క్షత్రియులిద్దరినీ - దేహంలోనుంచి వెడలగొడతాయి. వాడే లోభి పిసినారి భోగి-గా మారుతాడు.

ఇక కర్మలన్నీ చేయాలి. ఇందులో సేవ- ఉద్యోగ-వ్యవహార- గృహసంబంధమైన కర్మలన్నిటిలో అంతర్గతంగావున్నదిసేవ. అదిచేసే స్థూలశరీరం. ఇష్టంవున్న లేకున్నా పనిచేయాలి. భార్యాబిడ్డల్ని తల్లి తండ్రుల్ని పోషించాలి. అధికార్లకు - తలవంచాలి. సమాజానికి సేవచేసితీరాలి. ఇలా సేవచేయటానికి ఉపకరించే కాళ్లూ, చేతులూ పనులూ అన్నీ శూద్రవర్ణము. కేవలం ఈ సేవ - పనులతో మోక్షంరాదు. అందువలననే శూద్రులకు" మోక్షంలేదు అన్నారుపెద్దలు. ఇక్కడ శూద్ర శబ్దం ఒక కులానిది కాదు. కర్మది ! వృత్తిది. ఆసక్తిది. మనిషిలోని త్రిగుణాలలో ఏది ఎక్కువ తమోగుణమో - దానిది ఈ శూద్రశబ్దం.

కేవలంక్షాత్రంతో మోక్షంరాదు. వ్యాపారంతో మోక్షంరాదు.

బ్రహ్మజ్ఞానం వుండిన బ్రాహ్మణుడు ("ఆత్మజ్ఞానం") తో మోక్షం సాధించాలి. అందువలన ప్రతివ్యక్తి తనలో బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను గుర్తించి- తాను బ్రాహ్మణునిగా మారటానికి కృషిచేయాలి : ఇదే ఆత్మవిద్య. ఇదే బ్రహ్మవిద్య. ఇదే శ్రీవిద్య. ఇదేసాధన చేయాలి.

పంచభూతాలైన - భూమి. నీరు. నిప్పు. (ప్రకాశం-వెలుగు) గాలి - ఆకాశం - మహాకాల స్వరూపిణి అయిన మహాశక్తి విజృంభణ- విమర్శతో చరాచర సర్వసృష్టి స్వరూపంధరించింది - అవే - పృథ్వి - జల- అగ్ని - వాయు ఆకాశతత్వాలుగా, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత. విశుద్ధి, ఆజ్ఞాచక్రాల నాడీమండల చక్రాలుగా ఏర్పడి - బ్రహ్మ గ్రంధి - రుద్రగ్రంధి అనే ముడులుగా ఏర్పడి- ఇడ-పింగళ. నాడులలోని ఉచ్ఛ్వాసనిశ్వాసలనే శ్వాసరూప వాయువుతో- హంసలజంటగామారి. మానవరూపం దాల్చి వున్నాయి.

ఈ పరాశక్తి విరాట్‌రూపాన్ని - సూక్ష్మరూపాన్ని - అమ్మవారి తత్వాన్ని - ప్రజలం...

అందుబాటులోనికి తెచ్చి - వారందరికీ ఆ దర్శనం చేయించి. వారు తరించే సులభోపాయం తెలపాలి ... హంసలజంట మరోమారు తనకర్తవ్యాన్ని బోధిస్తోంది.

"అ ఇ ఉ ణ్ ... ఋక్ .. ఏ ఓ ఙ్ .. ఐ ఔచ్ .. హయ వరట్ ..

లన్ .. ఇ+మజ+ఙనమ్. ఝభ + ఘఢధష్ - జబగడదశ్,

ఖ,ఫ, ఛ ఠ థ, చటతవ్, కపయ్, శషసర్, హల్ ....."

ఉలిక్కిపడ్డారు ఆది శంకరాచార్య ...

ఏమిటి . ఏమిటీనాదం ? విచిత్రంగా వున్న అథ మరుకనాదం ఏమి భోధిస్తోంది? పాణిని వ్యాకరణమా ? కైలాసంలో (జగన్మాత లాస్యము, మహేశ్వరుని శివతాండవం ప్రారంభమైందా ? జగజ్జనని పాదమంజీరముల మంజులనాదం కూడా కర్ణపేయంగా వినిపిస్తోంది. చుట్టూరా చూశారు ఆచార్యులవారు. సంధ్యాసమయం కావాస్తోంది ....

మానస సరోవరం ఆవల "ఓంకార" పర్వత దర్శనం మహాద్భుతంగా అయ్యింది ! ఆనంద డోలికలలో ఆచార్యులవారి హృదయం ఈశ్వరుని నాట్యంతో సమంగా ఆనందనాట్యం చేసిందిక్షణకాలం.

ఒకరీతిగా యుగాల పర్యంతం సాగిపోయే ఉచ్ఛ్వాస నిశ్వాసాంతో ప్రారంభమయ్యే మహాకాలపు లెక్కకు మహాకాల స్వరూపిణి విన్యాసాలకు ప్రతిబింబంగా హంసలజంట సాక్షాత్కారం జరిగింది. సర్వవాఙ్మయానికీ- వ్యాకరణాన్ని ప్రసాదించిన.

నటరాజు నాట్యావసాన సమయంలో - మ్రోగించే ఈశ్వరుని చేతిఢక్క - ఢక్కా నాదం అది. ఇది నాట్యావసానం కాదు. నాట్యారంభం - సంధ్యాతాండవం ప్రారంభమైవుండాలి. కైలాసంలో !

॥ నృత్తావసానే, నటరాజరాజోర్న
నాద ఢక్కాం, నవ పంచవారమ్ !
ఉద్ధర్తు కామ ః సనకాదిసిద్ధా
నేతద్విమర్శే , శివసూత్రజాలమ్ ॥

మహానటరాజుఅయిన పరమేశ్వరుడు 9+15 (నవపంచవారమ్) మార్లుఢక్కమ్రోగించటంలో పలికిన అచ్చులు-హల్లులే- "మహేశ్వర సూత్రాలనే" పేరుతో వ్యాకరణానికి- పాణిని వ్యాకరణానికి మూలసూత్రాలయ్యాయి ! భాషకువ్యాకరణం ప్రాణం !

ఇకవృథాగా కాలయాపన చేయకూడదు. ఒకానొకపరవశత్వస్థితిలో తాను ఇందాకా వుండిపోయాడు - మానససరోవరం వద్ద ! "శివానందలహరి"లోని ఒకస్తోత్రం అక్కడే ఆయనహృదయంలో సురగంగలా ఉబికి వచ్చింది.

శ్లో ॥ నిత్యానంద రసాలయం, సురముని స్వాంతాంబుజాతాశ్రయం

స్వచ్ఛం, సద్విజసేవితం, కలుషహృత్యద్వాసనా విష్కృతం !
శంభుధ్యాన సరోవరం ! వ్రజ ! మనోహంసావతంస ! స్థిరం !
కిం ? క్షుద్రాశయ పల్వలభ్రమణ, సంజాతశ్రమం ప్రాప్యసి ? ॥

(అర్థము = ఓ మనోహంసావతంసా ! (మనస్సా !) శాశ్వతమైన అమృతరసాలయమున్నూ, దేవతలయొక్క, పరమహంసలైన మునులయొక్క, హృదయ పద్మములకు ఆధారమున్నూ, నిర్మలమూ, సద్విజ (రాజహంసల) సేవితమూ, (ద్విజులు = బ్రాహ్మణులు - ద్విజన్మ పొందినవారు. ఉపనయన సంస్కారముతో ద్విజన్మ పొందినవారు. ద్విజులు - హంసలు)

సత్కర్మ వాసనలచేత (పూర్వజన్మ పుణ్యమనే జన్మవాసనలచేత) ప్రకటింపబడినదియునూ అగు "ఈశ్వర ధ్యానము" అనుస్థిరమైన సరస్సును పొందుమా !

ఏక్షుదాశ్రయములైన - (కోరికలు - భోగములు - ఆశలు - దూరాశలు అనే) పడియలను పట్టుకొని తిరుగుటచే కలిగిన ఆ యాసమును పొందెదవు ?") వృధాగాక్షేత్రదర్శనాలు అంటూ కాలయాపన జరిగిపోయింది :

ఇకక్షణం ఆలస్యంచేయలేదా జగద్గురువు ... అదిగో కైలాస శిఖరం ! నా తల్లి జగన్మాతను దర్శిస్తాను. నా తండ్రి జగత్పితను దర్శిస్తాను ! ... ఆ తల్లి - విరాట్‌రూప సౌందర్యలహరిలో మునకలు వేసి తరిస్తాను ...

తల్లీ ! జగన్మాతా ! నేను - నీ బిడ్డను - వస్తున్నాను .. నీ ఒడిలోకి ... నీ పాదాల వద్దకు ... నాకు అనుజ్ఞ ఇవ్వు  తల్లీ !" ఆయన కళ్లముందు శివశక్తుల తాండవ లాస్య నాట్యములు - దృశ్యంగా సాక్షాత్కరించింది !

ఆదిశంకరులు - ఆక్షణంలో పసిపాపగా మారిపోయారు మానసికంగా ! అమ్మను చూడనిదే (బతకలేనంత ఆర్తిగా పిలిచారు ....

కైలాసంలో ....

జగన్మాతపార్వతి - నాట్యంచేస్తోంది లాస్యం.

జగత్పిత నృత్యం చేస్తున్నాడు - తాండవం.

"వాగర్థా వివసంప్రుక్తౌ ...." వాగర్థ - ప్రతి పత్తయోః

వాక్కు - అర్థంలా - వాగర్థముల ప్రతి పదార్థంలా - ఇరువురి భావాలూ- కదలికలు- ముద్రలు - అడుగులు. నృత్యం- ఒకేవిధంగా రూపసామ్యము- నామసామ్యము- అదిష్టాన సామ్యము - అవస్థానసామ్యము - అనుష్టానసామ్యము అనబడే పంచవిధ సామ్యములతో కూడిన శివశక్తుల అద్భుతనాట్యమది !

జగన్మాతకు - ఆదిశంకరుల పిలుపువినిపించింది.

"అమ్మా ! వస్తున్నాను.." ఆ పిలుపు ఆమె గుండెలోతుల్లో ప్రతిధ్వనించింది ! స్తనాలుబరువెక్కాయి ! చాలా కాలంతర్వాత చనుబాలు ఉబికివచ్చినట్లుగా- స్తనాలు బిగుసుకుపోయాయి. "స్వామి ! బిడ్డడువస్తున్నాడు ! నాబిడ్డడూ. మనబిడ్డడూ- శంకరుడు వస్తున్నాడు !" అన్నది. ఆమె లాస్యం లయ తప్పేలా వున్నది.

జగత్పిత ఒక్కక్షణం ఆశ్చర్యంగాచూచి- మరుక్షణం - భువన మోహనంగా నవ్వాడు...

"ఎంతైనా తల్లివి ! స్త్రీవి ! నీకు వినిపించి నంత త్వరగా నాకు వినిపించలేదు కదా అతడి పిలుపు ! అదే తల్లిమనసు ! రానీ! అతడెందుకు వస్తున్నాడో తెలుసా?"

పార్వతి క్షణకాలం భ్రుకుటి ఎగురవేసింది ! ఎందుకన్నట్లు ? ఎందుకైనారానీ ! తనబిడ్డడు - తనవద్దకు పరుగెత్తుకు వస్తున్నాడు..

"నీ సౌందర్యలహరిలో మునకలువేయటానికి ... ప్రపంచానికి ఆ అనందాన్ని అనుభూతిని పంచి - తరింపజేయటానికి ..." అన్నాడు ఈశ్వరుడు.

"అలాగా ! బిడ్డకోరేది - సర్వలోకశ్రేయస్సు అయినపుడు - ఆకోరిక తీర్చటం తల్లిగా నాభాధ్యత కదాస్వామీ ! తప్పక- ప్రసాదిద్దాము ... నా సౌందర్యం - నేను చెబితేబావుండదు. సమంజసమూ కాదు. మీరు నా అర్ధ శరీరం. మీ అర్ధ శరీరంనేను - మీరు అవలోకించే నా సౌందర్యాన్ని - ఆబిడ్డడికి మీరు అను గ్రహించండి ..." అన్నది.

శంకరులాసరికి కైలాసంలో అడుగుపెట్టనే పెట్టారు ...

ఈశ్వర - ఈశ్వరిల లాస్యం - తాండవం ... కళ్లారా చూశారు ...

మరుక్షణం వారా నాట్యం ఆపి ... తమ - సింహాసనం అయిన - చంద్ర శిలా వేదికపై కూర్చున్నారు ...

"తల్లీ ! వచ్చాను !" పరుగునవచ్చి- అమ్మవారిపాదాలపై శిరసు వుంచిమ్రొక్కారు ఆది శంకరాచార్య ... పసిబిడ్డడిలా ఆమెపాదాలు - కాళ్లవ్రేళ్లు- చేతులు- నడుము, పొట్ట- స్తనాలు ముఖము- కిరీటమూ- ఒకటేమిటి- తడుముతూ "అమ్మా ! అమ్మా !" అంటూ ఒకానొకపారవశ్య స్థితిలో- సమాధిస్థితిలో- కి జారిపోయాడు-ఆ ఆచార్యుని ఆనందభాష్పాలు ఆ తల్లిపాదాలను చేతులనూ, స్తనాలనూ ముఖాన్నీ, కిరిటాన్నీ - అన్నిటెనీ- అన్నిటినీ అభిషేకించాయి.

ఈశ్వరుడు - నిరంజనుడు - చిరునవ్వునవ్వాడు.

ఆ తల్లి ... ఆతడి శిరస్సు తన అభయహస్తంతో నిమురుతూ- ఇంచుక వంగి - ఆశీర్వదించింది....

ఆ తల్లి శిరస్సు సత్యలోకంలో వున్నది ! ఆ తల్లికిరీటం సత్యలోకం పై అంచులు దాటుతున్నది. ఆ తల్లి ముఖం బిందువువలె కనపడుతున్నది. శ్రీ చక్రములోని బిందువు ఆ జగన్మాత ముఖమండలం వలె గోచరిస్తున్నది : ఆ ముఖమండలం క్రిందుగా ఇంచుకవంగి ... ఆశీర్వదిస్తూ

ముందుకు వంగిన శరీరంతో, ఇంచుకవంగినస్తనద్వయం - సూర్య చంద్రుల వలె నున్నవి .. దాని క్రింద త్రికోణరూపంగా వున్న ఆతల్లి ఉరము - ఉదరము। కటిప్రదేశము ... అహో ! శ్రీ చక్రస్వరూపిణి జగన్మాత ! జగన్మాత విరాట్ స్వరూపమేశ్రీచక్రంలోని నలభైనాలుగు కోణములు, తొమ్మిది చక్రములు- బిందువుతో కూడిన రచన :- ఇదంతా ఈశ్వర రచన ! పరమేశ్వరుని రచనా కౌశలం !

ఆది శంకరులు తలప్రక్కకు తిప్పారు. ఈశ్వరుడు చిరునవ్వునవ్వుతూనే వున్నాడు. "విశ్వప్రభ" "మహోదయ" "యశోవతి" అనేపేర్లు గల ఈశ్వరుని పురము ఇది ! ఈశ్వరుని సభపేరు "విఘట్టినీ !" ఇక్కడ ఆ స్వామి "సభాపతి" అని పిలువబడతాడు: కొలవబడతాడు. యజమానరూపుడు ఈశివుడే !" హోత్రి !" అనీ కొలుస్తారు సనకసనందనాది సిద్ధులు ! అదే ! ఆస్వామిఫాలనేత్రం ! అగ్నినేత్రం. ముక్కన్ను. ఆపైన శిరస్సు పై అమరిన చంద్రరేఖ ! ఆపైన కిరీటం లాఅమరిని జటాజూటము ! "కపర్దము !" ఆకపర్దంపై గంగ - మెల్లిగా ప్రక్కకు జారుతూ - సకల లోకాల నూపునీతం చేయటానికీ సాగుతోంది ! ఇక్కడ మందాకినిగా, భూలోకంలో భాగీరథిగా, పాతాళ లోకంలో భోగవతిగా కీర్తింపబడుతున్న జలరూపదేవత గంగ!

ఈశ్వరునికత్తి "వజ్రహాసము" అనీ "పరాజితము" అని పేరెన్నికగని- ఈశ్వరప్రతాపాన్ని చాటుతూ ఆప్రక్కనే కొండ శిలకు ఆనించి వున్నది. "పినాక"మనే పేరుగల ఆస్వామి విల్లు ఆకత్తి ప్రక్కనే పెట్టివున్నది. "చంద్రపుచ్ఛము" "ఆతంక "అనేపేర్లు గల "డాలు" కూడా వాటిప్రక్కన పెట్టివున్నది.

"ఖట్వాంగం" అనే శివుని అస్త్రమూ, - దీనినే "సుఖము" అని కూడా అంటారు- ఆ అస్త్రము ఆ స్వామి ఆలోచనలలోనే దాగి వుంటుంది. శాంతి కాముకుడైన పరమేశ్వరుడు ఈ శస్త్రాలనూ అస్త్రాలనూ సాధారణంగా వాడడు. ఉపయోగించడు. త్రిశూలము పేరు "ప్రభంజనం" దాని కొసన "ఢమరుకం" వుంటుంది. శివుని "శంఖము" "విమోహనం"-

అరుగో వారంతా ప్రమధగణములు. భూతపిశాచ పరిచారకులు, సప్తమాతృకలు. అందరూ పరివేష్ఠించివున్నారు ఆస్వామిని. "విభూతి" ఆస్వామి ఐశ్వర్యం. అణిమా, మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తిః ప్రాకామ్యం. ఈ శిత్వం, వశిత్వం అనే ఎనిమిది సిద్ధుస్వామి తన అనన్యభక్తులకు ప్రసాదించే సిద్ధులు, ఐశ్వర్యాలు.

ఇక ఆస్వామి ని వామా, జ్యేష్ఠా, శివా, రౌద్రీ, చిత్తోన్మాదినీ, సుఖా, కాళీ, కళేబరా, భూతదమనీ అనే నవ శక్తులూ పరివేష్ఠించివుంటారు. అవసరమైనపుడు వారు ఆస్వామి కనుబొమ కదలికతో ఆస్వామి అజ్ఞాపాలన చేస్తారు.

జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం, సత్యం, క్షమా, ధృతిః, స్రష్టృత్వం, ఆత్మసంబంధం, అధిష్ఠాతృత్వం అనే తొమ్మిది ఆస్వామిగుణములు. ఇలా నవ శక్తి సమన్వితుడు, నవగుణసమన్వితుడూ అయిన

ఆస్వామి "నవాత్మకుడు" అని పూజింపబడతాడు.

"ఈశా! మహేశా! శివా! శూలీ! ఈశానా! చంద్రశేఖరా! శంకరా! భూతేశా! ఖండపరశు! కృత్తివాసా! గిరీశా! మృడా! మృత్యుంజయా ! కాలకాలా ! ఉగ్రా ! కపర్దీ! శ్రీ కంఠా ! దిగ్వాసా !

వామదేవా ! విరూపాక్షా ! త్ర్యంబకా ! పురారీ ! గంగాధరా ! అంధకరిపో ! వృషధ్వజా ! వృషవాహనా ! పాహిమం ! పాహిమాం !

స్వామీ - జగన్మాత సౌందర్యాన్ని కనులారా వీక్షించాలంటే- నీలోనికి - నీ హృదయంలోనికి నన్నుతీసుకో ! నీ హృదయంలో నా భావనలను నిలుపు ! అప్పుడుగానీ భవాని సౌందర్యలహరిని నేను సగుణంగా, నిర్గుణంగా, మంత్రి, తంత్రరూపంగా, స్థూల, సూక్ష్మ, విరాట్ రూపంగా దర్శించలేను.

కారణం - అఖండశక్తి స్వరూపిణియొక్క శక్తి విజృంభణను - నీవే నియంత్రణచేస్తున్నావు. నీవే ఆశక్తిని క్రమబద్ధీకరించి లోకాలకు శ్రేయస్కరంగా అందిస్తున్నావు ! శివా ! పరమశివా ! పాహిమాం ! పాహిమాం !" ఆదిశంకరులు - ఈశ్వరుని పాదాలు స్పృశించాడు.

ఒకానొక తన్మయస్థితిలో సమాధిస్థితిలోనికి వెళ్లాడు.

"ఈ మనతనయునికి- తమరు బోధించండిస్వామీ!" అన్నది జగన్మాత.

"అవశ్యం కాత్యాయనీ !" అన్నాడు పరమశివుడు.

"ఆదిశంకరా ! లేనాయనా ! అనుగ్రహిస్తున్నాను. దేవభాష అయిన సంస్కృతంలో భావనామాత్రంగా, నీకు బోధిస్తున్నాను." అన్నాడు పరమశివుడు. ఆదిశంకరులు శరీరం హృదయం పులకరించాయి. ఎక్కడలేని శక్తివచ్చినట్లయ్యింది. మంచుకొండపై- అప్రక్కనే - పొట్టిగానూ, దట్టంగానూ - ఎదిగివున్న తాళపత్రవృక్షం (తాటిచెట్టు) వద్దకున డచి గబగబ తాటియాకులు కోసుకువచ్చాడు. పద్మాసనం వేసుక్కూర్చున్నాడు. "శలవివ్వండి స్వామీ ! పరమశివా !" అన్నాడు ఆదిశంకరాచార్య ఘంటం పట్టుకుంటూ! "నాయనా ! శంకరా ! వ్రాసుకో ... ఈ సకల చరాచరములకూ - ఆధారభూతమైనది- శక్తి ... ఆమె కరుణలేనిదే - సహకారంలేనిదే ఈ సృష్టిలోని ధూళికణమైనా, ఆకు అయినాకదలదు ... "ఈశ్వరుడు చెబుతున్నాడు. ఆది శంకరులు వ్రాసుకుంటున్నారు. ఆస్వామి చెబుతున్నది ... ఆయన హృదయంలో శ్లోకరూపంలో అక్షరరూపంగా మారుతోంది స్ఫష్టా స్ఫష్టంగా ! జగన్మాత ఆశీర్వదిస్తోంది తన బిడ్డ అయిన ఆదిశంకరులను చిరునవ్వుతో

ఈశ్వర వాణి ఆగింది. ఆది శంకరుని ఘంటం కూడా ఆగింది.

"నాయనా! ఈ నాసౌందర్యలహరిని - ఎవరుపారాయణం చేస్తారో వారికి శ్రీచకార్చన నిత్యంచేసినఫలము, లలితా సహస్రనామస్తోత్ర పారాయణచేసిన ఫలము సిద్ధిస్తాయి... ప్రతి శ్లోకానికీ ఒకయంత్రం. ప్రతిశ్లోక పారాయణకూ ఒక సిద్ధి ప్రసాదిస్తున్నాను...వెళ్లు ! వెళ్లి ! నీ

కర్తవ్యం నీవు పూర్తి చేసి ధన్యుడివై ... మాసాన్నిధ్యానికి వద్దువుగానీ ..." అన్నది జగన్మాత. "తథాస్తు" అన్నాడు పరమశివుడు. తాళపత్రాలన్నిటినీ ఒద్దికగా కట్టకటారు ఆదిశంకరాచార్య ... జగన్మాత., జగత్పితల వద్ద శలవు తీసుకున్నాడు ... వెనుతిరిగాడు. అప్పుడు జరిగింది అనుకోని సంఘటన.

ఇందాకా నందీశ్వరుడు మౌనంగా కోపంగానూ చూస్తున్నాడు ఈ జరుగుతున్నదంతా ! కైలాసానికి తాను ద్వారపాలకుడు ! జగన్మాత, జగత్పితలకు తానువాహనం ! తాను వారిప్రణయాన్ని - ప్రళయాన్నీ, తాండవాన్నీ, లాస్యాన్నీ కూడా నిరంతరం వీక్షించే అనుమతిపొందిన భక్తాగ్రేసరుడు !

భూలోకంలో శివాలయాల్లోనయినా, ముందుగా నంది దర్శనం చేసుకుని ఆ తర్వాత ఈశ్వర దర్శనం చేసుకోవాలనీ నందితోక, మూపునిమరి - కొమ్ముల మధ్యగా శివలింగాన్నిదర్శించాలనీ - ఈశ్వరుడు స్వయంగావరం ఇచ్చివున్నాడు. అలాటిది సాక్షాత్తు పరమేశ్వర, పరమేశ్వరీ స్థానమైన కైలాసంలో చెట్టంత నందిని - తానుండగా, ఈ ఆదిశంకరాచార్యులనే బ్రహ్మచారి ... సశరీరునిగా కైలాసానికి వచ్చిందిగాక, తన అనుమతి కోరకుండా, తనకిమ్రొక్కకుండా, నేరుగా, అమ్మవారి పాదాలవద్దకూ, ఈశ్వర చరణాల వద్దకూ పరుగుతీస్తాడా ? తనంతటి వాడు తానున్నాడని గుర్తించడా?

జగన్మాతను ఆపాదహస్తకం స్పృశిస్తాడా ? ఈశ్వరుని ప్రసన్నం చేసుకుని సౌందర్యలహరిని" వీక్షిస్తాడా ? బోధపొందుతాడా ?

ఇక

॥ నందీశ్వర నమస్తుభ్యం, శాంతానంద ప్రదాయకం,

మహాదేవ సేవార్థం, అనుజ్ఞాందాతు మర్హపి !" అనే శ్లోకానికి అర్థము, పరమార్థము ఏమున్నది గనుక ?

అమ్మవారి సౌందర్యాన్ని తాను వీక్షించాడు బాఫుంది ! ఇది భూలోకవాసులందరికీ కరతలామలకం చేస్తానని - శివస్వామి దీవెనపొంది మరీవెళ్తున్నాడే బ్రహ్మచారి! అదే జరిగితే - ఇక "సౌందర్యలహరి" పారాయణంతో అందరూ ముక్తులై కైలాసంచేరుకుంటే - తన ఉనికికి - ప్రాధాన్యతా, తనవ్యక్తిత్వానికి విలువా వుంటాయా ?

నందీశ్వరుడైనతాను, ఈశ్వర తాండవాన్నిచూస్తూ. ఆ నాట్యాన్ని ఏకసంధాగ్రాహిలా గ్రహించాడు. పశురూపుడే అయినా, నాలుగు కాళ్లతో - లయతప్పకుండా నాట్యాన్ని చేసిచూపి ఈశ్వరీ ఈశ్వరుల ప్రశంశలు అందుకున్నాడు. ఆ నాట్యాన్నే - భరతమునికి- భావ,రాగ,లయ బద్ధంగా ఉపదేశించాడు. భరతముని - దాని ఆధారంగా "భరతనాట్యం" రూపకల్పనచేశాడు. వీరశైవులలో "నంది మతం" వారు ఎక్కువ. "శిలాదుడు" అనే పర్వతరాజు - ఈశ్వరుని

గురించి ఘోరతపస్సు చేయగా- నందీశ్వరుడాయనకు పుత్రుడుగా జన్మించే వరంపొందాడు. నంది మహాతపస్సు చేసి ఈశ్వర సామీప్యం. ఈశ్వర వాహనంగా వుండే గౌరవం. అదృష్టం పొందాడు.

కొన్ని శైవ క్షేత్రాలలో నందీశ్వరునికే ప్రముఖ పూజ జరుగుతుంటుంది. శ్రీకాళాహస్తిలో నందిసేవ "అనే ఉత్సవం వేలాది శైవభక్తులకు తమభక్తి చాటుకొనే పూజాపద్ధతి. మహానందిలోనూ, నవనందులమండలంలోనూ నందీశ్వరునికే ప్రముఖస్థానం పూజా జరుగుతాయి. నందీశ్వరుడులేని శివాలయం - నందిని దర్శించని శివభక్తుడు వుండడు, ఏలోకంలోనూ! అలాటిది, ఈ బ్రహ్మచారి తన భక్తినీ- అహన్నీ, తనస్థానాన్నీ కించ పరిచినట్లుగా ప్రవర్తించాడు. అమ్మవారి సౌందర్యలహరిని తీసుకొని వెళ్తున్నాడు! అలా జరగటానికి వీలులేదు.

పార్వతీ పరమేశ్వరులు యోగమగ్నులయ్యారు.

నందీశ్వరుడు ఒక్కఉదుటున లేచాడు. కైలాస శిఖరంనుండి మెల్లిగా - ఆనందంగా, ఒకానొక తన్మయస్థితిలో వెళ్తున్న ఆదిశంకరులను ఒక్కసారిగా, వెనకాలనుండి - తననుదురు తోడీకొన్నాడు. పరధ్యాన్నంగా వెళ్తున్న ఆదిశంకరులు ఆ అనుకోని తాకిడికి బోర్లాపడ్డారు. చేతిలోవున్న తాళపత్రాలు- నందీశ్వరుని ప్రభంజనం వంటి ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు చెల్లాచెదరుగా ఎగిరి పడ్డాయి. దూర దూరంగా విసరివేసినట్లు పర్వత సానువులలోను పడ్డాయి ...

"ఎవరు ? ఎవరునీవు ?" తెప్పరిల్లుతూ లేచి. ఆశ్చర్యంగా, బాధగా అడిగారు ఆచార్యులవారు.

అన్నావూ ? ఆ మాట అంటావనే అనుకుంటున్నాను.

ఈశ్వరసాన్నిధ్యంలో వుండే అకుంఠిత శివభక్తుడు వీరశైవభక్తి తత్పరుడు - శివపూజలో "నందిమతము" అంటూ శివలింగముతో జీవనము . శివలింగముతో మరణము అంటూ లింగధారులై- అన్య దేవతలను స్మరించక ఈశ్వరునే దైవంగాకొలిచే నందిమతమునే ఆవిష్కరించిన నందీశ్వరుణ్ణే ఎవరు నీవు ? అని అడుగుతున్నావా ?" హంకరించాడు నంది.

ఆచార్యులవారు వినయంగా నమస్కరించారు. వారి స్మృతిపథంలో అప్పుడు మెదిలింది." నందీశ్వరనమస్తుభ్యం. శాంతా.

నందప్రదాయకం.. మహాదేవసేవార్థం అనుజ్ఞాం దాతుమర్హసి..." అన్నారు నమస్కరిస్తూ.

"చాలు:చాలు ! నీ కపటనమస్కారాలు ! కైలాసానికిరావటమూ, వెళ్లటముపూర్తి అయ్యాక- "నందీశ్వరనమస్తుభ్యం." అంటూ దొంగ స్తోత్రాలు చేస్తున్నావా ? "మరలా హంకరించాడు నంది.

"క్షమించండి నందీశ్వరా ! నేను చేసినది తప్పే ! కానీ ... జగన్మాతను దర్శించే ఆర్తిలో - నాకు మీరు .. మీరేకాదు. ఈ సర్వచరాచరప్రపంచమే గుర్తుకురాలేదు .... క్షమించండి .! "అన్నారు ఆచార్యులవారు మనస్ఫూర్తిగా క్షమాపణలు వేడుకుంటూ, క్రిందపడిన తాళపత్రాలను ఏరుకుంటూ .. కళ్లకు అద్దుకుంటూ..

"ఆగు ! అవి నీ వెంట తీసుకుపోవటానికి వీల్లేదు." మరలా హంకరిచాడు నంది. "ఆగుబ్రహ్మాచారీ ! జగన్మాత జగత్పితలను సశరీరునిగా దర్శించావు. కైలాసానికి రాగలిగావు. నీతపశ్శక్తిని మెచ్చుకుంటున్నాను. కానీ, అమ్మవారికి - స్వామివారికీ సంబంధించిన దేవరహస్యాలను, మానవులందరి ముందు వెదజల్లితే, వారు ఆవిలువ తెలుసుకోగలరా !" సౌందర్యలహరి "అంటే జగన్మాత అంగాంగవర్ణన"- "అసభ్యత" అని సంస్కారంగా ఆలోచిస్తారే తప్ప- వారు అందులోని తల్లివిరాట్ రూపాన్ని దర్శించగలరా ? అపరిణితమనస్కులూ, అతిసులభంగా భక్తినీ, ముక్తినీ - ధనంతో, దర్జాతో - అధికారంతో పొందవలెననే ఇచ్ఛ గలిగివున్న కలియుగ సగటుమానవులకు మంత్రతంత్ర శాస్త్రాలతో మిళితమైవున్న జగన్మాత సౌందర్యలహరి భోధించతగునా ? ఆ తాళపత్రాలు ఇక్కడే - నాకిచ్చి వెళ్లు. అవి నీవు భూలోకానికి తీసుకువెళ్లలేవు. వెళ్లినా, ఈ దివ్యాక్షరాలు ఆ భూమ్యాకర్షణ శక్తులకు మాయంఅవుతాయి సుమా!" మరలా అరచాడు నంది.

"స్వామీ ! అదేమిటి ! ఇవి..ఇవి అమ్మవారి సౌందర్యలహరి .. సౌందర్యలహరి .." ఆచార్యులవారిమాటకు అడ్డొస్తూ, హంకరించాడు నంది "కాబట్టే వద్దంటున్నాను. జగన్మాత సౌందర్యలహరి కైలాసానికే పరిమితం. సనక సనందనాది సిద్ధులూ. నాలాటి భక్తాగ్రేసరులూతప్ప అన్యులెవరూ ఆ సౌందర్యలహరి నిదర్శించే అర్హతా, అందులో మునకలువేసి తరించే అర్హతాలేదు... ఆ తాళపత్రాలు ఇక్కడేపారవెయ్ !"అన్నాడు నంది కర్ణ కఠోరంగా రంకెలువేస్తూ.

"స్వామీ ! నా ఇంతకాలం తపస్సు. సాధన- జీవితధ్యేయం ఇదే !.... ఇవివదిలిపోలేను. నాకర్తవ్యపాలనపూర్తి చేసి - నా ఈ జన్మబంధాలనుండి విముక్తి పొందాలి... నందీశ్వరా ! నీకు శతకోటినమస్కారాలు ! నాదారిననన్నుపోనీ ! అనవసరమైన ఘర్షణతో కాలయాపన చేయకుస్వామీ ! నిన్నుకావాలని కించపరచలేదు. తన్మయత్వంలో- పొరబాటుచేశానేమో ! క్షమించు. నా ఒక్కడి ఉద్ధరింపు కోసం నేనే నాడూ పాటు పడలేదు. అదే నేను కోరివుంటే, ఈ పవిత్రహిమాలయాలలో ఒకగుహలో ముక్కుమూసుకుని కూర్చుని వుండేవాణ్ణి. ప్రస్థానత్రయం (వేదములు- ఉపనిషత్తులు- భగద్గీత) భాష్యములు వ్రాసేవాణ్ణికాను." మనీషా పంచకమూ "వ్రాసేవాణ్ణికాను. "నిర్వాణషట్కము" వ్రాసేవాణ్ణికాను: స్తోత్రాలన్నీ గ్రంథస్థం చేసేవాణ్ణికాను. "ద్వాదశకామంజరి" (భజగోవిందశ్లోకాలు) వ్రాసేవాణ్ణికాను. నా చుట్టూరావున్న మానవలోకంలో ఈకలి కాలంలో. జ్ఞానులూ, అజ్ఞానులూ, పండితులూ, పామరులూ కూడా వున్నారు. జ్ఞానులకు జ్ఞానభోధకు మరొకరిసాయం అవసరంలేదు. పండితులు శాస్త్ర జ్ఞానంతో - తర్కంతో జ్ఞానం సముపార్జించుకుంటారు. కానీ కానీ, పామరులూ, అక్షరజ్ఞానం ఎక్కువగాలేనివారూ, గృహసంబంధమైన పనులతో జీవితమంతా సతమతమయ్యే స్త్రీలూ- గృహసమస్యలతో జీవితం ముగిసిపోయే సగటుగృహస్తులూ ... వీరంతా వీరంతా .. ముక్తి మార్గం చేరుకోవాలి. నా గ్రంథాలు

అన్నీవారి కోసమే ! నాస్తోత్రాలు అన్నీవారికోసమే. ఈ నా సౌందర్యలహరి. వూరికే పారాయణచేసినా. అర్థాలు తెలియకున్నావారు ముక్తి సోపానాలు అధిష్టిస్తారు. ఎందువలనంటే -ఇది సాక్షాత్తుపరమశివుడు నాకు ప్రసాదించినది : దానినే నాకవిత్వంలో పొదిగి. ఒకానొక స్తోత్రస్వరూపంగా మలిచి ఇద్దామని నాఆశ-ఆశయం.... నన్ను వెళ్లనీస్వామీ !"అన్నారు ఆచార్యులవారు ఏరిన సగం తాళపత్రాలను ఒకకట్టగా చుడుతూ - మిగతావాటికోసం వెతుకుతూ.

"వీల్లేదన్నానా ! ఇవీ నీకు దక్కనివ్వను !" ఒక్కసారిగా రంకె వేసి కాలి గిట్టలతో కైలాసగిరి శిఖరాలు కదిలేలా దువ్వి ... ఆచార్యులవారి ని మరలా ఢీ కొనటానికి వెనక్కి అడుగులు వేసి - వేగంగా ముందుకు ఉరికాడునంది ...

"పరమశివా ! జగన్మాతా !" ఆచార్యులవారి ఆర్తనాదం కైలాస శిఖరాన్ని కంపింప చేసిం ...

యోగం చెదిరి. వాస్తవం అర్థమై పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమయ్యారు అక్కడ ! ఒక్క క్షణంలో !

"నందీ ! ఆగు !" ఈశ్వరుడు గర్జించాడు.

"ఏమిటి నీవుచేస్తున్నపని..?" అమ్మవారు కోపంగా అరిచింది.

"జగజ్జననీ నీ సౌందర్యరహస్యాన్ని భూలోక వాసులకు .. ఈ బ్రహ్మచారి ..." నంది ఏదోచెప్పబోయాడు. ఆ సమయంలో పార్వతీ పరమేశ్వరులు అలా అక్కడకు రావటం సుతరామూ సంతోషం కలిగించలేదతడికి.

"ఏమీ ? భూలోకవాసులైన మానవులకు మోక్షమార్గం అవసరంలేదా ! వారంతా నా బిడ్డలుకారా ? ఆదిశంకరుడు ఎవరనుకుంటున్నావు. మా బిడ్డడూ.. అతడిని మేము అనుగ్రహించాము. నీవు నిరోధించవచ్చునా ? "మందలించింది జగన్మాత.

"నాయనా ! శంకరా ! "నీవుక్షేమంగావెళ్లు !" అన్నది ఆశీర్వదిస్తూ ... ఆదిశంకరులు ఆ తాళపత్రాలతోనే తిరిగివచ్చారు. సగం ఎటు ఎగిరిపోయాయో కనిపించలేదా సమయంలో.

నందీశ్వరుడు నొచ్చుకున్నాడు. అదిగమనించిన ఈశ్వరుడన్నాడు.

"నందీ ! నీకోవిషయం చెప్పాలి.

భూలోకవాసులందరికీ జన్మసహజమైనట్లే, మరణము సహజమే ! కానీ ఆ మరణించినవారంత .. వారి వారి జన్మ సంస్కారవాసనలను అనుసరించి. వారి ఆత్మ (జీవుడు) మరల మరల శరీరధారణ చేస్తుంటారు. మానవ- మృగ- పక్షి - క్రిమికీటకాలుగా వారి వారి జన్మ కర్మలననుసరించి మరోదేహం తీసుకుంటారు. మరణించగానే వారి దేహాలను వారి వారి కులాచారాలూ, మతాచారాలను బట్టి దహనం చేయటమో, ఖననంచేయటమోచేస్తారు. గనుక- ఆ దేహంనశిస్తుంది - ఆత్మవాసనల బలంతో - వారు మరో దేహధారణ చేస్తారు.

కానీ అవధూతలు - అవతారపురుషులు కారణజన్ములు అలా కారువారు ఉత్ర్కాంతి' పొందుతారు!'' అన్నాడు పరమశివుడు.

"ఉత్ర్కాంతి" అనగా మరణమే కదాస్వామి ? "అన్నాడు నంది కేశ్వరుడు ఆశ్చర్యంగా.

"అవును! మరణాన్ని "ఉత్ర్కాంతి' అంటారు. కానీ సాధారణ మానవుల మరణంలాంటిది కాదిది. ఒక అవతారపురుషుడో, ఒక మహోభక్తుడో మరణించినపుడు అతడి ఆత్మ పంచ భూతాలలో కలసిపోకుండా ఆ ఆత్మను అష్ఠదిక్పాలకులు, పంచభూతాలు కలసి తమవద్ద తేజోరూపంగా నిలుపుకొని కాపాడుతూంటారు. ఇదే "ఉత్ర్కాంతి "అంటే 'ఉత్' అనగా "పైకి ఎత్తబడిన" "క్రాంతి" అనగా "తేజము" "తేజో రూపశక్తి!" "రక్షింపబడుతున్న ఆత్మశక్తి" అది. ఎవరి చేతనో రక్షింపబడటం కాదు. సాక్షాత్తు దిక్కులు, దిక్పాలకులు, పంచభూతాలు, ఆశక్తిని తమలో, జాగ్రత్తగా వెలిగే దీపారాధనను గాలి తాకిడికి ఆరిపోకుండా చుట్టూరా చేతులు అడ్డుపెట్టో, ఒకానొక గాజు గోళం అడ్డుపెట్టో రక్షించినట్లుగా రక్షిస్తూంటారు వారు.

ఏ పుణ్యదంపతులో, మహాభక్త దంపతులో సంతానం కోసం దైవాన్ని ప్రార్థిస్తూంటారు. వారు కోరేది సాధారణమైన సంతానం కాదు. భక్తుడు జ్ఞానీ, దైవస్వరూపుడూ అయిన బిడ్డడు తమ గర్భవాసాన జన్మించి తమకు అఖండ మోక్షాన్ని, తమతోటి మానవులందరికీ జ్ఞానదానాన్ని ప్రసాదించాలని కోరుకొంటారు.

ఇదిగో! "ఉత్ర్కాంతి" తో తేజోరూపుడుగా అష్టదిక్కులు, దిక్పాలకుల వద్దా పంచభూతాల వద్ద కాపాడబడుతున్న ఆ ఆత్మస్వరూపుడు ఆ తలిదండ్రులకు కారణ జన్మడైన బిడ్డడిగా జన్మనిస్తారు. వారే ఆచార్యులు-ఆళ్వారులు, నయనార్లు వాగ్గేయకారులు, సంత్‌లు మహాభక్త శిఖామణులు మొదలైన కారణజన్ములు. ఆది శంకరాచార్యుడు - నా మరో అంశ! అపర బాలశంకరుడు అని తెలుసుకో. ఇతడు, భారతదేశంలోని "కేరళ" రాష్ట్రంలోని "కాలడి" అనేగ్రామంలో "శివగురు" "ఆర్యాంబా" అనే శివభక్తులు - దేవీ భక్తులు అయిన దంపతులకు నా వరప్రసాదంగా, దేవీ వరప్రసాదంగా జన్మించాడు ఇతడు! అందువలననే పరమగురువుగా పసితనంలోనే మారి యావద్భారత దేశాన్ని తనకవిత్వంతో, తనభాష్యాలతో, తనవాదనా పటిమతో నాస్తికవాదం నుండి కాపాడి మోక్షమార్గంవైపు మరలించాడీ సద్గురువు ! అందువలననే జగద్గురువుగా కీర్తింపబడ్డాడు! అణిమాద్యష్టసిద్ధులు కరతలామలకం అయివున్నా అతడే నాడూవాటిని తన స్వార్థానికి గాని, పేరు కోసంగాని, డాంబికానికి గాని ఉపయోగించుకొనలేదు. జ్ఞానీ, విరాగి, శాంతచిత్తుడూ, స్థిరచిత్తుడూ అయిన ఈ బ్రహ్మచారి నోటివెంట వెలువడిన ప్రతిస్తోత్రము, బీజాక్షర సమా కలితమైన మంత్రంగా భాసించింది. వాల్మీకి, వ్యాస, కాళిదాసాది

మహాఋషులు - కవుల ప్రక్కన ఈ బ్రహ్మచారి కవిత్వం నిలిచి వేదంతో సమాన ప్రతిపత్తి కలిగివున్నది. అతడే వ్రాయాలి సౌందర్యలహరి.

కారణం, జగన్మాత సౌందర్యాన్ని వర్ణించే హక్కు, అర్హత, ఆ ఆదిశంకరులకొక్కరికే వున్నాయి. ఒక శిశువులా, భవరోగాన్ని పారద్రోలే ఒక భిషగ్వరునిలా, అతడే ఆ జగన్మాత విరాట్ రూపాన్ని మానవులకు అర్థమయ్యేలా చెప్పగలడు. నీవు అడ్డుకొని అతడు వ్రాసుకున్న సౌందర్యలహరి, నేను స్వయంగా బోధించిన దానిలో సగం తాళపత్రాలు ఎగరగొట్టేశావు. మంత్రశాస్త్రం అతడి చేతికి చిక్కింది. సౌందర్యలహరిలో "చిదానందలహరి" ఆ మంత్రశాస్త్రం. అదికేవల నిర్గుణ పరబ్రహ్మణి స్వరూపానిది. సౌందర్యలహరిలోని "సౌందర్యలహరి" ఈ పర్వతసానువులలోనే పడిపోయింది. "సౌందర్యలహరి" అమ్మవారి సగుణరూపం విరాట్‌రూపం.

చూశావా! నీ అనాలోచిత కర్మ - కోపం - ద్వేషం ఎంతపని చేశాయో! శ్రీ చక్ర స్వరూపమైన "సౌందర్యలహరిని" నీవుకూడా సరిగా అర్థంచేసుకోలేకపోయావు నందీ!" ఈశ్వరుడు క్షణకాలం చెప్పడం ఆపాడు. నందీశ్వరుడు బాధపడ్డాడు. భయపడ్డాడు. అహం వదిలింది. "స్వామి! పరమేశ్వరా! ఇపుడెలా ? నా తప్పిదాన్ని మన్నించండి. ఆ బ్రహ్మచారికి ఈ తాళపత్రాలు వెదికి ఏరి తీసుకొని వెళ్ళి ఇచ్చిరానా?" అన్నాడు పశ్చాత్తాపంతో.

"ఒద్దు ! ఒద్దు అతడి భావనలో భవాని నిలిచే ఉంటుంది. "భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం" అతడు రచించాడు. అది ఆధారంగా కొరవ సౌందర్యలహరిని అతడేపూర్తి చేయగలడు. నా ఆశీశ్శులు జగన్మాతదీవెనలు వున్న అతడికి తాళపత్రాలు పోయినా ఫర్వాలేదు. అక్షరాలు - వర్ణ స్వరూపిణి అయిన జగన్మాతగా దర్శనమిస్తాయి!" అన్నాడు పరమేశ్వరుడు నందీశ్వరుని మనసు కుదటపడింది.

"తల్లీ! ఇందాకా అతడు నీ బిడ్డడు అన్నావు. విఘ్నేశ్వర, కార్తికేయులుగాక నాలాంటి నీ బిడ్డలు వేలాదిమందిగాక, అతడు నీ స్వంత బిడ్డడు అన్నట్లుగా అన్నావు తల్లీ ! ఏమిటా రహస్యం? తెలుసుకోవచ్చా ?" అన్నాడు నందికేశ్వరుడు వినయంగా భవానికి మ్రొక్కుతూ.

"చెబుతాను విను నాయనా!" అన్నది అమ్మవారు! ముగ్గురూ మరల యధాస్థానంలోనికి వచ్చి కూర్చున్నారు వారి వారి స్థానాలలో! అమ్మవారు ప్రారంభించింది. నందీశ్వరుడు అదివింటూ అర్ధ నిమీలిత నేత్రాలతో అది దృశ్యాలుగా చూడసాగాడు.

"కేరళ" రాష్ట్రంలోని "కాలడి" గ్రామంలో" ఆర్యాంబ", "శివ గురు" దంపతులు అఖండ శివ పూజా దురంధరులు. దేవీ ఉపాసనాపరులు! ప్రతిరోజు ఇద్దరికిద్దరు ఈశ్వరార్చన, అభిషేకం - పూజ అమ్మవారి పూజ చేసి తమకు ఉన్న పదార్థాలతో నైవేద్యం సమర్పించిగాని మరే పని చేయరు. వారికి వున్నదల్లా ఒక ఇల్లు. కొద్దిపాటి భూవసతి! భోగాలపై కోరిక లేని ఆ దంపతలు

ఈశ్వర సమానుడైన పుత్రుణ్ణి కోరారు. అతడే శంకరుడు. బాలశంకరుడు. ఆ తర్వాత ఆదిశంకరులు, జగద్గురువులుగా మారిన బాలుడతడే. ఈశ్వరీ ఈశ్వరుల వరప్రసాదంగా జన్మించిన బాలుడతడు.

శివగురు రోజూ ఈశ్వరార్చన, అమ్మవారి పూజ చేసి పాలునైవేద్యం పెట్టి ఆ పాలు ప్రసాదంగా బాలశంకరునికి ఇచ్చేవాడు. తండ్రి ఇచ్చిన పాలుత్రాగి ఆటలకువెళ్ళేవాడు, ఐదేళ్ళ శంకరుడు. ఒకరోజు శివగురు గ్రామాంతరం వెళ్ళవలసి వచ్చింది. ఆర్యాంబను పూజాదికములు నిర్వహించమని చెప్పి, మధ్యాహ్నం భోజనం వేళకు వస్తానని చెప్పి వెళ్ళాడు శివగురు. ఆర్యాంబ అమ్మవారి పూజకు పూలు - పాలు నైవేద్యం తయారుగా పెట్టుకుంది. కానీ దురదృష్ట వశాత్తు ఆమె బహిష్ఠు అయ్యింది. ఆడుకుంటున్న బాలశంకరుని పిలిపించింది. పూజగదిలోనికి తాను రాకూడదు గనుక శంకరునే తండ్రి నేర్పిన శ్లోకాలు చదివి పాలు నైవేద్యం పెట్టి త్రాగి వెళ్ళమని గోడచాటునుండి, మరోక గదిలోనుండి చెప్పింది. రోజూ తండ్రి, తల్లీ, చేసే పూజ చూస్తున్నాడు గనుక శంకరుడు కాదనలేదు. పైగా ఆకలేస్తున్నది. నైవేద్యం పెడితేగాని పాలు త్రాగటానికి వీలుపడదు. "అమ్మవారికి ఈ ఒక్కపూటకు నైవేద్యం పెట్టకపోతే ఏమౌతుందమ్మా ?"' అన్నాడు. బాలశంకరుడు ఆకలి ఎక్కువగా వుండటంతో.

"తప్పునాయనా! భవానీ తల్లికి ఆకలి వేస్తుంది. ఆమెకు భక్తులిచ్చే నైవేద్యమే ఆహారం. ఆతల్లిని ఆకలితో ఉంచవచ్చా?" అంది ఆర్యాంబ "సరేనన్నాడు". బాలశంకరుడు.

తండ్రిలానే చిన్న మడిబట్ట - కొల్లాయి కట్టుకున్నాడు. విభూతి నొసట పూసుకున్నాడు. పీట పైధావళీ పరచి పద్మాసనం వేసుకొని కూర్చొని శివశ్లోకాలు, అమ్మవారి శ్లోకాలు తనకు తండ్రి నేర్పినవి పలికి "ఓంశివాయై నమ : ! ఓం నమ: శ్శివాయ!" అంటూ మంత్రం జపిస్తూ పూలతో పూజించి పాలునైవేద్యం పెట్టాడు. నైవేద్యం పెట్టి కళ్ళు మూసుకున్నాడు. రోజూతండ్రిలానే! కాస్సేపటికి కళ్ళు తెరచి చూశాడు. చిన్న ఇత్తడి చెంబులో పాలు అలాగే వున్నాయి. ఖర్చు కాలేదు! పార్వతీ పరమేశ్వరులు ఇద్దరూ వస్తారనో, పార్వతీ అమ్మవారు ఒక్కర్తె వచ్చి పాలు తాగి పోతుందనో అనుకుంటున్న శంకరునికి వారిద్దరు గానీ వారిలో ఏ ఒక్కరూ గానీ రాకపోవటం ఆశ్చర్యమనిపించింది. బాధ కలిగింది. కడుపులో ఆకలి ఎక్కువవుతోంది. వాళ్ళు తాగితే కదా తాను కొరవపాలు తాగాలి ఎలా?

"అమ్మా! జగదంబా! త్వరగా వచ్చి పాలుత్రాగు". అన్నాడు శంకరుడు. జగన్మాత రాలేదు.

"భవానీ! తల్లీ! రా! త్వరగా! రా! నాకు ఆకలి వేస్తుంది!" అన్నాడు అయినా ఆ అమ్మ రాలేదు.

బాలశంకరునికి కోపం వచ్చింది. ఆకలి వల్ల దుఃఖమూ వచ్చింది.

"మా నాన్న, మా అమ్మ రోజూ నైవేద్యం ఇస్తే తాగేదానివి కదా. ఈరోజు నేనిస్తే తాగవా? అయితే నేనీ పీటకేసి తల బాదుకుంటాను. మా నాన్నకేమని చెప్పను ? నువ్వు రాలేదని, పాలు తాగలేదని తెలిస్తే నాన్న. నేను పూజ సరిగా చేయలేదని నన్ను కోప్పడతాడు. అందుకే నేను తలబాదుకొంటాను."అని శంకరుడు మొండిగా పీటకేసి తలబాదుకోసాగాడు.

కైలాసంలో అమ్మవారి పీఠం కదల సాగింది. కంగారు పడింది." అరె! ఈ బాలుడి మొండితనం ఏమిటి చెప్మా!" అన్నది. ఈశ్వరుడు నవ్వాడు. "తప్పదు దేవీ! వెళ్ళు! మనమే కదా ఆ బాలుణ్ణి ఆ తలి దండ్రులకు ప్రసాదించాము ?" అన్నాడు. మరొకసారి తలపీటకేసి కొట్టుకున్నాడు శంకరుడు. కాస్తంత రక్తం వచ్చింది. అమ్మవారు దిగ్గున లేచింది. పీఠంపై ప్రత్యక్షమయింది.

"శంకరా! ఆగు! నేనొచ్చాను. పాలు ఇవ్వు తాగుతాను" అన్నది. శంకరుడు కళ్ళెత్తి చూశాడు. ఎర్రని ఉదయభానుని కాంతి పూజా గది అంతా వెల్లువలై పోగా ఒకానొక మహాద్భుత సౌందర్య తేజోరాశి అయిన స్త్రీ మూర్తి, త్రినేత్రయై, పాశాంకుశ ఇక్షు కోదండ ధారిణియై అభయ హస్తంలో పూలగుత్తితో, త్రిపురసుందరి భవాని, నిల్చుని ఉన్నది. ఆ పాద మస్తకం ఆభరణ కాంతి శరీర కాంతితో పోటి పడ్డట్లు బంగారు రంగు మిరుమిట్లు గొల్పుతున్నది. విభ్రాంతిగా చూస్తూ నమస్కరించాడు శంకరుడు. "వచ్చావా తల్లీ! ఇవిగో పాలు! త్వరగా త్రాగు!" అన్నాడు. పాలచెంబు అందిస్తూ. ఆ అమాయక భక్తికి ముగ్ధురాలైంది! జగన్మాత ఆ బాలుని తేజస్సుకు అచ్చెరువొందింది! గడ గడా పాలు తాగేసింది. ఖాళీ చెంబు ఇస్తూ "నీవు కోరినట్లే పాలు తాగేశాను! ఇక వెళ్ళిరానా!" అంది నవ్వుతూ ఆశీర్వదిస్తూ.

"ఇదేమిటి ఖాళీ చెంబుఇచ్చావు? అన్ని పాలు నీవే తాగేశావా ?" అన్నాడు శంకరుడు "నీవేగా తాగమన్నావుగా ? త్రాగేశాను!" అన్నది అమ్మవారు. "భలేదానివే తల్లీ! రోజూ మా నాన్న నీకు నైవేద్యం పెట్టి నీవు తాగగా మిగిలిన పాలు నాకిచ్చేవారు. నేనవి తాగేవాణ్ణి. అమ్మ ఈ రోజు ఎక్కడికీ బయటకు వెళ్లరాదు. ఇంట్లో ఇంకపాలు కూడా లేవు. మరి నేనేం త్రాగను! నాకు ఆకలి వేస్తోంది "అన్నాడు కాస్తంత ఏడుపురాగా.

ఈ సమస్య జగన్మాత ఊహించనిది ఎన్నడూ ఆమెకు ఎదురు కానిది! "తల్లీ! భవానీ! నాకు ఆకలి వేస్తోంది. అమ్మ బయట వున్నది. మరి నాకు పాలు ఎట్లా తల్లీ!" అన్నాడు శంకరుడు ఏడుపు రాగంస్థాయిల్లోనికి వస్తోంది. అమ్మవారికి ఇక తప్పలేదు.

"ఏడవకు నాయనా! ఏడవకు గొడవచెయ్యకు. నేను నీకు పాలు ఇస్తానుగా!" అన్నది. అంటూనే ఆ తల్లి ఖాళీ పాలచెంబు అందుకుని శంకరునిపై పొంగి పొరలిన అపార మాతృ వాత్సల్యంతో రవ్వంత ప్రక్కకు తిరిగి తన స్తనాల నుండి పాలుపిండి ఆ చెంబులోనికి అమృతధారలా కురిపించి ఇచ్చింది.

శంకరుడు పాలచెంబు అందుకుని గటా గటాతాగేసాడు ఒకానొక దివ్య రసాయనం ఏదో శరీరము. హృదయమూ, శిరసూ అంతా పాకి అమృత స్నానం చేయించి నట్లుగా ఒకానొక దివ్య పారవశ్యానికి లోనయ్యాడా బాలుడు. ఆ క్షణంలో సర్వ ప్రపంచం వుందో లేదో అతడికి తెలియదు. తను వున్న గది, పీట, చెంబు, పైకప్పు అంతా, అన్నీ భవాని రూపంగా గోచరిస్తున్నాయి. తనలోపలా, బయటా భవానీయే ఉన్నట్లుంది. అమ్మవారి స్థూలరూపం, సూక్ష్మరూపం విరాట్‌రూపం, మంత్రరూపం. తంత్రరూపం. యంత్రరూపం, నూటఎనిమిది శక్తి పీఠాలు. అష్టాదశ శక్తిపీఠాలు. శ్రీ చక్రం, శ్రీ చక్ర స్వరూపం, శివశక్త్యైక్య స్వరూపం, అమ్మవారి వివిధనామాలు, రూపాలు, వివిధశక్తి స్వరూపిణులు, మహత్మ్యాలు, యోగినీ గణాలు. ఒకటేమిటి సర్వం, సర్వ చరాచర సృష్టి భవానీ మాతగా భాసిస్తోంది.

భవానీలోనే సర్వం వున్నట్లు గోచరిస్తోంది.

సోహం - - అహం బ్రహ్మాస్మి. ఏదో కవిత్వం శ్లోకాల రూపంలో లోపలినుండి ఉబికి వస్తోంది. అక్షర సమామ్నాయమంతా, వ్యాకరణమంతా, అష్టాదశ విద్యలు, చతుష్షష్టి కళలు అక్షర రూపంలో హృదయంలో ఎవరో గురు బోధ చేస్తున్నట్లు నర్తిస్తున్నాయి.

ఆ బాలుని నోటివెంట అనర్గళంగా స్తోత్రం, కవిత్వం వెలువడింది. జగన్మాత కోటి వెన్నెలలు కురిసినట్లు నవ్వింది. దీవించింది. అదృశ్యమైంది. అపుడు మామూలు స్థితికి వచ్చాడు శంకరుడు బాలశంకరుడు పరుగు పరుగున తల్లి వున్న గది బయటకు వెళ్ళాడు. గోడ వారగా నిల్చుని తల్లితో జరిగిందంతా గబ గబా చెప్పాడు. ఆర్యాంబ నమ్మలేక పోయింది. పిల్లవాడేదో భ్రాంతికి లోనయ్యాడనుకుందా తల్లి. మాతృ హృదయం భయపడింది కూడా! "కొంపదీసి ఆ తల్లికి కోపం వచ్చి బాలునికి నెత్తి మొట్టలేదుకదా?" అని భయపడింది. "సరే! ఇదంతా ఎవరికీ చెప్పకు! ఆడుకో ... "అన్నది. శంకరుడు ఆటలకు వెళ్లాడు. భర్త శివగురు మధ్యాహ్నం వచ్చాడు. ఆర్యాంబ జరిగిందంతా చెప్పింది. శివగురు విన్నాడు. ఆలోచించాడు. జగన్మాత, శివుడు తల్చుకుంటే ఏ విచిత్రం జరిగినా ఆశ్చర్యం లేదు. శంకరుణ్ణి పిలిచాడు. అపుడు పూసగుచ్చినట్లు జరిగిందంతా శంకరుడు మరలా చెప్పాడు. భవానిని వర్ణించాడు. ఎర్రని కాంతిని వర్ణించాడు. సోహం --- అహంబ్రహ్మాస్మి అనుభూతిని వర్ణించాడు. చరా చర జగత్తంతా భవానీ భావనామయంగా వీక్షించినది తన చిన్న చేతులు తిప్పుతూ స్పష్టమైన వాక్కులతో చెప్పాడు. తడబడలేదు. భ్రాంతిలా చెప్పలేదు. శివగురుకు బోధపడింది. జగన్మాత తన బిడ్డడిని కటాక్షించింది. తనబిడ్డడేమిటి ఇంకా ? ఇతడు కారణ జన్ముడు! "నాయనా! ఇదంతా ఎవరితో చెప్పకు!" అని మాత్రం అన్నాడు. "అలాగే నాన్నా!" అన్నాడు శంకరుడు. పూజాపీఠం వద్దకు వెళ్ళి సాష్టాంగ పడ్డాడు శివగురు.

"జగన్మాతా! మా దంపతుల జన్మ ధన్యమైంది తల్లీ! నా శంకరుడు నీ బిడ్డడు. నీ అమృత ధారలతో నీ అపార దయాక్షీరం ప్రసాదించావు! మా దంపతులం ఈ బిడ్డడిని ఎట్లా చదివించాలి ? ఏ విధంగా పెంచాలి ? అని మధనపడ్తున్నాం. ఇక మాకు దిగులులేదు. నీవే తల్లివై నీ పాలు ఇవ్వగా ఇక నా బిడ్డడికి రాని-లేని విద్య ఏముంటుంది ? కానీ పదుగురి దృష్టి తగిలేలా కాకుండా ఈ బిడ్డడిని నీవే కాపాడుకోవాలి తల్లీ!" అంటూ ఆ నందాశ్రువులతో జగన్మాత విగ్రహ పాదాలు అభిషేకం చేశాడా కన్న తండ్రి.

ఆ తర్వాత శివగురు తన మరణాన్ని కూడా సంతోషంగా స్వీకరించాడు. ఆర్యాంబకు ధైర్యం చెప్పాడు. "ఈ బిడ్డడి బాగోగులు అన్నీ స్వయంగా జగన్మాత - ఈశ్వరుడు వహిస్తారు! నీవు దిగులుపడకు తల్లిగా నీ కర్తవ్యంగా శంకరుణ్ణి పెంచు. అంతే!" అంటూ అతడు ప్రశాంతంగా మరణించాడు. ఆ ద్రవిడ శిశువే నేటి ఆదిశంకరుడు.

"ప్రస్థానత్రయం" (బ్రహ్మ సూత్రములు. ఉపనిషత్తులు, భగవద్గీతలకు) మహావ్యాఖ్య వ్రాసిన ప్రధమగురువు బ్రహ్మ సూత్రాలకు భాష్య కర్త. భగవద్గీతకు భాష్యకర్త. "నిర్వాటషట్కం" రచించిన మహాకవి. వందలకొలదీ దేవీ దేవతా స్తోత్రాలు ఆశువుగా పలికి, ఆ స్తోత్రాలకు వేద విలువ తేగలిగిన అక్షర పరబ్రహ్మో పాసకుడు. "భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం," "శివానందలహరి' ', "లక్ష్మి నృసింహ కరావలంబ స్తోత్రం" ఇలా, లెక్కకు మించిన అష్టకాలు వ్రాసి తరించిన కారణజన్ముడు. పద్మపాదుడు - హస్తామలకుడు, ౬ ఏకాచార్యుని వంటి పధ్నాలుగు మంది గొప్పశిష్యులకు పరమగురువు.

సశరీరుడై కైలాసంలో అడుగుపెట్టగలిగిన మహాతపస్సంపన్నుడు. మంత్ర - తంత్ర - శ్రీ చక్ర రహస్యాలను స్తోత్రములలో పొందుపరచ గలిగిన మహాజ్ఞాని!"

అమ్మవారు చెప్పటం ఆపింది.

"నందీ! వింటున్నావా! విఘ్నేశ్వరునిలా. కార్తికేయునిలా, నాస్తన్యం (పాలు) త్రాగిన అతడు నా బిడ్డడు కాడా! నా కతడిపై ప్రత్యేక ప్రేమ ఉండదా ? నా సౌందర్యలహరిలో మునకలు వేయగల అర్హత, అధికారం, చొరవ, చనువు, ప్రేమ,.సాధి కారికంగా అతడికి లేవా! అతడు కైలాసం వస్తున్నపుడే నా మాతృ హృదయం పులకరించింది సుమా! ఆ బిడ్డడు కోరినది ప్రసాదించమని ఈశ్వరుని స్వయంగా నేనేకోరాను. ఈశ్వరుడు, బాలశంకరుడు కోరిన "నా సౌందర్యలహరిని" మంత్రపూతంగా, యంత్రపూతంగా ప్రసాదించారు!" నందీశ్వరుడు సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆతడి శరీరం భవాని వాక్కులతో రోమాంచితమైంది. ఆదిశంకరుల పట్ల భక్తి, ప్రేమ గౌరవం ఉప్పొంగాయి, పశ్చాత్తాపంతో కృంగిపోయాడు. తనచర్యతనకే కోపం కలిగించింది." తల్లీ! ఇదంతా తెలియక తప్పుచేశాను. ఆ తాళపత్రాలు..? " అన్నాడు.

"దిగులుపడకు! వాటి అవసరం అతడికిక లేదు. ఒక మారు దర్శించిన నా రూపాన్ని అతడు మర్చిపోలేడు. అతడే వ్రాస్తాడు. నీ ఘర్షణలో ఎగిరిపోయిన తాళపత్రాలలోని విషయాలను!" అన్నది జగన్మాత.

ఇక్కడ ఆదిశంకరులు తన శరీరంలో ప్రవేశించారు. నిద్రలేచినట్లుగా లేచికూర్చున్నారు. చేతిలో తాళపత్రాలు అన్నీలేవు. కొన్నేవున్నాయి. నందీశ్వరుని అనవసరమైన కోపం - ఘర్షణగుర్తుకు వచ్చాయి. నందీశ్వరుడు అమ్మవారి స్వామివారి దేవరహస్యాలు భూలోకవాసులకు తెలియ కూడదనటంలో తప్పులేదు. కానీ స్వయంగా జగన్మాత జగత్పితే అనుజ్ఞ ఇవ్వగా ఇలా కయ్యానికి కాలుదువ్వి నిరపరాధియైన తనపై దాడిచేసి తాళపత్రాలు ఎగరగొట్టటమే బాగాలేదు. ఆ ఎగిరిపోయినవన్నీ అమ్మవారి సగుణరూప విరాట్ రూపవర్ణనకు సంబంధించినవి. "చిదానందలహరి"గా భాసించే- నిర్గుణరూపవర్ణన తాళపత్రాలు చాలా వరకూ తనవద్ద వున్నాయి ఇప్పుడు. "ఈశ్వరా! ఈ శేషభాగం ఎలా వ్రాయిస్తావ్! భూమి ఆకర్షణ శక్తికి ఈ తాళపత్రాలలోనిలిపి కూడా సరిగా గోచరం కావటంలేదు. నాశ్రమ అంతావృధాయేనా ? ఒక మహత్తర అనుభూతిని మరల మరల పొందటం సాధ్యమా ?" ఆ వేదన పడ్డాడు. అపరిమితమైన దు:ఖం పొంగి పొరలి వచ్చింది శంకరాచార్యుల వారికి ఇంత ధ్యానసమాధి. సుమారు వందల సం॥ల తీవ్ర తపస్సుకు సమానమైన సమాధి స్థితి సశరీరంగా కైలాస దర్శనం మరలా మరలా సాధ్యపడేవేనా! తాను గ్రంధస్థం చేసుకొన్నదంతా వృధాగా పోయిందా! ఈ కలికాల మానవుల ఉద్ధరణకు రాచబాటగా చేద్దామనుకున్న "సౌందర్యలహరి" లో అటులలితా సహస్ర నామపారాయణ ఫలితాన్ని, త్రి శతి పారాయణ ఫలితాన్ని, సర్వశక్తి స్వరూపిణి పూజా, స్తోత్రవ్రత ఫలితాన్ని పొందు పరచాలనుకున్న తన ఈ అద్భుత ప్రయోగం ఆశయం ఇంతటితో ఆగిపోయాయా! ఈశ్వరా! జగన్మాతా! ఏమిటీ! ఈ విపరీతం ?

భవానీ భవులు హృదయాకాశంలో సాక్షాత్కరించారు.

"బాధపడకు నాయనా! ఒక్కసారి నీ దివ్యదృష్టితో ఆ అక్షరాలను వీక్షించు సర్వం కరతలా మలక మవుతుంది!" అన్నారు. ప్రణతులు అర్పించాడు ఆదిశంకరులు వారు ఆశీర్వదించి అదృశ్యామయ్యారు. శిష్యులు సిద్ధంగా వుంచిన తాళపత్రాలు అందుకున్నారు. తమ పరమగురువు మరొక గొప్ప రచన ప్రారంభించారని అర్ధం చేసుకొన్న శిష్యులు ఆనందించారు. ఘంటం పట్టారు ఆదిశంకరాచార్యులవారు.

ఒకవైపు "భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం" తానులో గడవ్రాసిందే గుర్తుకు వస్తోంది. మరొకవైపు "సౌందర్యలహరి" సాగిపోతోంది. సురగంగా ఝరిలా - - - -

జగద్గురువు మనందరినీ ఉద్ధరించటానికి ప్రసాదించిన 100 శ్లోకాలు గల ఆ సౌందర్యలహరి" లో మనమూ మునకలు వేసి తరిద్దాము. పదండి ముందుకు. - - - -

# "సౌందర్యలహరి"
# "జగన్మాత "శక్తి" యొక్క మహిమ"

సౌందర్యలహరి ప్రథమ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు 1వ శ్లోకం నుండి 8వ శ్లోకం వరకు గల 8 శ్లోకాలలో అమ్మవారి శిరసు మొదలు పాదరజం - అమ్మవారి శక్తి ప్రభావం. ఆ తల్లి కరుణతో సాధారణ వ్యక్తులకు కూడా లభ్యమయ్యే అపారశక్తిని వర్ణించి ఆ జగన్మాత నివాస స్థానమైన చింతామణి గృహాన్ని, ఆ తల్లి ఉనికినీ తెలియజేశారు. ఎంత హృద్యంగా మనకందరికీ అర్థమయ్యేలా తెలిపారో తెలుసుకుందాం.

ఇక పారాయణ ప్రారంభిద్దాం పదండి ముందుకు.

**1 శ్లో॥ శివః శక్త్యా యుక్తో యదిభవతి శక్తః ప్రభవితుమ్.**
**నచే దేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి**
**అతస్త్వామారాధ్యాం హరిహర విరించాదిభిరపి**
**ప్రణంతుం స్తోతుంవాకథ మకృత పుణ్యః ప్రభవతి.**

**అర్థము:** తల్లీ! జగన్మాతా! సర్వమంగళ సహితుడగు శివుడు సర్వశక్తి సమన్వితురాలవైన నీతో కూడినపుడే ఈ జగములను సృష్టించుటకు సమర్థుడగుచున్నాడు. నీతో కలిసి లేకపోతే ఈశ్వరుడు కదలుటకు కూడా అశక్తుడౌతాడు. కావున హరిహర బ్రహ్మాదులచేత పూజింపదగిన నిన్ను స్తోత్రము చేయుటకు గాని, పొగడుటకుగాని పురాకృత పుణ్యం చేయనివాడు ఎట్లా సమర్థుడౌతాడు ? జగన్మాత యొక్క సంపూర్ణ శక్తి మహిమను ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు తెలియజేస్తున్నారు.

ఎన్నోజన్మల పూర్వ పుణ్య విశేషం వలన మానవజన్మ లభ్యమవుతుంది. అజ్ఞానము, అవకరాలు, దారిద్ర్య బాధలు మొదలైనవి వున్నా, లేకున్నా సంపూర్ణ మానవునిగా జన్మించటం గొప్పవరం! ఆ మానవజన్మలో కించిత్తు ఆధ్యాత్మిక జిజ్ఞాస, గురుసేవ, గురుబోధల్లాంటివి లభ్యం కావటం గొప్ప అదృష్టం. అవి లభ్యమయినా, కాకపోయినా ఆ జగన్మాత అపారకరుణవల్ల, ఆ తల్లి చరణాలపై భక్తి కుదరటం గొప్ప జన్మ సాఫల్యతకు మార్గం. అట్లా జగన్మాతను ఆరాధించగలగటం ఎన్నిజన్మల పూర్వ పుణ్య విశేషమో గదా.

ఈ లోకం ఎందరో భక్తులుంటారు. ఒక్కొక్క మారు తాత్కాలికంగా భక్తులైనప్పటికి ఆయా దేవతల కరుణను కోల్పోతారు. అలాంటపుడు వారు నిస్తేజులు, నిర్వీర్యులు. నిరాశా పూరితులౌతారు. అలాంటి వారిని చూచి వీరు "బ్రహ్మహీనులు" "విష్ణుహీనులు" అనరు.

కాని "శక్తిహీనులు" అంటారు. మరి ఆ శక్తి ఎవరు ? ఆ శక్తియే "ఆదిపరాశక్తి ఆ తల్లి కటాక్ష వీక్షణాలే ఈ సర్వసృష్టికి మూలం. ఆ జగన్మాత తమతో కలిసివున్నపుడు బ్రహ్మవిష్ణు, మహేశ్వర, రుద్ర సదాశివులనే వారు పంచబ్రహ్మలుగా కీర్తింపబడతారు. శక్తి - వారిని విడచినపుడు, తొలగినపుడు వారు కాలు, వేలు కూడా కదల్చటానికి కూడా అశక్తులై, అ చేతనులై నడవటం, తినటం, మాట్లాడటం చివరకు శ్వాస పీల్చటం వంటి ప్రక్రియలు కూడా ఏమీ చేయలేని జడ స్వరూపాలుగా మారి "పంచప్రేతలుగా" మారిపోతారు.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, రుద్ర, సదాశివుల పరిస్థితే అది అయినపుడు, ఇక సామాన్య మానవులమైన మన పరిస్థితి ఏమిటి ? ఆ జగన్మాత అపారకరుణ కొరకు మనందరం ఆ తల్లిని స్తోత్రం చేయాలి. పూజించాలి. ఇది మానవ జన్మ కర్తవ్యం. అదే ఈ శ్లోకంలో బోధించారు. శ్రీ శంకర భగవత్పాదులవారు.

"సౌందర్యలహరి" లోని ప్రతి శ్లోకానికీ ఒక యంత్రరూపం, ఆయంత్రపూజావిధానం. దానివలన వచ్చే ఫలం అనగా సిద్ధి, వ్రాసివున్నాయి తాంత్రిక పూజావిధానం ఆధారంగా వ్రాసిన గ్రంధాలలో కానీ, ఆ సిద్ధులపై ఆశతో, దురాశతో స్తోత్రంచేస్తూ, అవి రాలేదని బాధపడ్తూ, అమ్మవారి పూజమానుకొనే నిరాశకు లోనై, అధోగతి పాలుగాకూడదు మనం. ఆది శంకరాచార్య యంత్రపూజ- సిద్ధులు గురించి ఆలోచించలేదు వ్రాయలేదు. కాబట్టి యంత్రాలతో మనకుపనిలేదు. తంత్రాలతో పనిలేదు. ఈ ఒక్క శ్లోకాన్ని భక్తి శ్రద్ధలతో జపించగలిగితే, రోజూ, వీలైనన్ని మార్లు మనమనుసులో మనం, మననం "పునశ్చరణ" చేసుకోగలిగితే, "సర్వకార్య జయం" పొందగలము. ఆధ్యాత్మికంగా మనకున్న అవరోధాలూ, కుటుంబ పరంగా, సమాజ పరంగా మనం ఎదుర్కొంటున్న అవరోధాలూ తొలగిపోవటమే "సర్వకార్యజయము" అని భావించాలి. అంతకంటే ఏం కావాలి ? ఆ జగన్మాతను ఏమికోరాలి మనం ? మననం చేద్దాం. పదండి ముందుకు.

## 2వ శ్లోకము

## "జగన్మాత యొక్క పాద ధూళిమహిమ"

**2 శ్లో॥ తనీయాంసం, పాంసుం, తవచరణ పఙ్కేరుహభవం,**
**విరిఞ్చి స్సఞ్చిన్వన్, విరచయతి లోకానవికలన్,**
**వహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసాం,**
**హరః సంక్షుద్యైనం భజతి భస్మోద్ధూళనవిధిమ్ ॥**

రెండవశ్లోకంలో "జగన్మాతయొక్క పాదధూళి మహిమ" గూర్చి శ్రీ శంకర భగవత్పాదుల వారు బోధించారు.

**అర్థం** : ఓ జగన్మాతా! తల్లీ! నీ చరణ కమలములయందలి ఇసుమంత పాదరజము, పాదధూళి తాను గ్రహించి బ్రహ్మదేవుడు, ఈ సృష్టినంతటినీ ఎట్టి తారుమారు, వికలత్వం లేకుండా సృష్టి చేస్తున్నాడు. ఆ ఇసుమంత పరాగ కణమునే శ్రీ మహావిష్ణువు తన వేయిపడగలతో వేయి శిరస్సులతో, ఆదిశేషుని అనంతుని అవతారమై శిరసున దాల్చి ఆ బలంతోనే ఈ భూమిని, భూమిపై గల లోకాలన్నిటిని మోయుచున్నాడు. ఆ ఇసుమంత పరాగమునే తన శరీరమునకు విభూతిగా అద్దుకొని పరమశివుడు సంహార కార్యము నిర్వహిస్తున్నాడు.

శ్రీ దేవీ భాగవతంలో ఒక చక్కని కథ ఉన్నది :-

ఒకమారు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు తామే ఈ సర్వసృష్టి, స్థితిలయలు చేస్తున్నామనే గొప్ప అహంకారం వచ్చేసింది. తమకంటే వేరే శక్తిమంతులైన దైవాలు మరెవరూ ఉండరనే గర్వం వారిని నిలువ నివ్వటంలేదు. అది గ్రహించిన ఆదిపరాశక్తి అయిన జగన్మాత వారి అహంకారాన్ని అణచ దలచింది. వారికా అహంకారం వదిలించకపోతే సృష్టి క్రమం మారిపోయే ప్రమాదముంది మరి!

హఠాత్తుగా ఏమి జరిగిందో తెలియదు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల లోకాలు కంపించాయి. ఇదేమిటా అని వారు సంభ్రమంతో పరికించే లోగా, వారు ముప్వురు మూడు వేరు వేరు విమానాలలో గగనమండలంలో పరిభ్రమిస్తున్నారు. ఆ విమానాలు వారి ప్రమేయం లేకుండానే ఊర్థ్వలోకాలలోనికి పైకి పైకి పోసాగాయి. వెళ్తున్న కొద్దీ వారికి ప్రతి లోకంలోనూ, సరిగ్గా తమ రూపురేఖలు, గుణ గణాలు, కర్తవ్యాలు గలిగిన వేలాది బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కన్పించసాగారు. వారి వారి లోకాలూవున్నాయి తమ లోకాలకు ప్రతిబింబాలు లాగానే.

"ఈ వింత ఏమిటా"? అని వారు ముగ్గురూ విభ్రాంతిలో ఉండగానే వారి విమానాలు సుధా సముద్ర మధ్యంలోనికి వచ్చి నిల్చాయి. అక్కడ కల్పవృక్ష వనాల నడుమ నవావరణల మధ్య చింతామణి ద్వీపంవున్నది. కోట్లాది యోగినీ గణాలు, శక్తి గణాలు, అణిమాద్యష్ట సిద్ధులు, సప్తమాతృకలు, అష్టలక్ష్ములు, సర్వాలంకార భూషితులైనవారు ఆ వరణల్లో తిరుగాడుతున్నారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను వారిలో కొందరు స్త్రీలు తమవెంట ఆ నవావరణ ద్వీపంలోనికి తీసుకువెళ్ళారు. అంతే! వీరు ముగ్గురూ స్త్రీలుగా మారిపోయారు! తాము స్త్రీలుగా మారిన సంగతి వారికి అర్థమై వారికి ఆశ్చర్యం, భయము కలిగాయి.

ఆ దేవతా స్త్రీలవెంట వీరు ముప్వురూ అమ్మవారు కొలువై ఉన్న "చింతామణి" ద్వీపం చేరుకున్నారు.

కోటి సూర్య ప్రభలతో ఆ జగన్మాత విరాట్‌రూపం ఏ కొలతలకూ ఏ పరిధులకు, ఏ ఉపమానాలకు అందనంతటి మహాద్భుతంగా ఉంది. వీరు ముగ్గురూ ఆ తల్లికి మ్రొక్కారు. తమ ఈ పరిస్థితి ఏమిటని ఆ వేదనలతో ప్రశ్నించారు. జగన్మాత చిరునవ్వు నవ్వింది. కోటి వెన్నెలలు కురిసినట్లుంది ఆ చిరునవ్వు. ఆ దేవి కర్పూరపు తాంబూలపు వాసన ఆ ప్రదేశమంతా అలుముకొని ఉంది. ఆ తల్లి సిగలోని, మెడలోని, పాదాలపైన వున్న సురపుష్పాల సౌరభం - ఆ ద్వీపమంతా ఆవరించి ఉన్నది.

"నాయనలారా! మీరు నేను సృష్టించిన దేవతలు! ఈ సృష్టి పాలనకు అవసరమైన అధికారులుగా వేలాది దేవతలను సృష్టించాను. మీరు వారందరిలో ఒకరు. మీరే సర్వం అనీ సర్వసృష్టి మీ చేతిలో ఉన్నట్లు అహంకరించటం తగునా! చూశారుగా మీలాంటివారు, మీ లోకాల వంటి లోకాలు కోట్లాది వున్నాయి ఈ సర్వప్రపంచంలో! ఇక అహంకారం వదలండి. నా అంశలుగా, మీ భార్యలుగా సరస్వతి, లక్ష్మి, పార్వతి అనే వారిని అనుగ్రహిస్తున్నాను. వారితో కలిసి 'శక్తియుక్తులై' వారి సహకారం, ప్రోత్సాహం, అనుకూలత, అనుగ్రహంలతో మీమీ కర్తవ్యాలను పరిపూర్ణంగా నిర్వహించండి. "అని మృదు మధుర వాక్కులతో ఆ నతిచ్చింది. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల గర్వం తొలగింది.

పరాశక్తి యొక్క శక్తి మహిమతో బాటు ఆ తల్లి 'పాదరజము' ఒక్క కణము తమపై ప్రసరించుటయే తమశక్తికి కారణమని గ్రహించారు. తమ తమ గృహిణులైన సరస్వతి, లక్ష్మి, పార్వతులతో తమ తమ విమానాల వద్దకు వచ్చారు. శ్రీదేవీ అనుగ్రహంతో వారికి మరలా పురుష రూపాలు వచ్చాయి. దేవీ పాదరజ మహిమ, శ్రీదేవీ శక్తి మహిమ గ్రహించిన వారు వినమ్రతతో దేవిని స్తోత్రం చేసి తమ తమ దివ్య విమానాలు అధి రోహించి మేరు పర్వతంపై దిగారు. అక్కడ బ్రహ్మ ఒకవైపు తన లోకాన్ని సృష్టించుకున్నాడు. క్రొత్తగా విష్ణువు మరోవైపు తన వైకుంఠాన్ని, ఈశ్వరుడు ఇంకోవైపు కైలాసాన్ని సృషించుకొని తమ దేవేరులతో అక్కడ చేరటంతో ఇంద్రాది దేవతలంతా వచ్చి తలోవైపు కొలువయ్యారు పరిపాలనా సౌలభ్యం కోసం దేవతలందరికీ ఆవాసమైంది మేరుగిరి. ఆయా దేవతల తపో బలంతో శ్రీదేవీ శక్తి మహిమతో కాంతి పుంజమై మెరవసాగింది మేరుగిరి. ఇదీ ఆ కథ.

"శృతి సీమంత సింధూరీ కృత పాదాబ్జధూళికా" అనే శ్రీ లలితా సహస్ర నామస్తోత్రంలోని నామంలోని అర్థంలా, వేదములకు, వేద మాత పాపిటలైన ఉపనిషత్తులకు సింధూరం అయిన ఆ జగన్మాత పాదధూళిని వేద స్వరూపుడైన బ్రహ్మ, స్థితి నిర్వాహకుడైన విష్ణువు, లయకారకుడైన ఈశ్వరుడు శిరసున ధరించి ఈ లోకాలను కాపాడుతుండగా మనబోటి సామాన్య మానవులం

ఆ తల్లి పాదరజం కోసం ఈ ఒక్కశ్లోకాన్ని మననం చేసుకొని కంఠస్థం చేయలేమా! రోజుకు ఒక్కశ్లోకం ప్రకారం, నియమంగా కంఠస్థం చేయగలిగితే, "సౌందర్యలహరి" లోని 100 శ్లోక్లాలూ 100 రోజులలో ఇంచుమించు కంఠస్థం అవుతాయి. మూడునెలలా పదిరోజులలో "సౌందర్యలహరి" లోని శ్లోకాలలోని భావం- ఆలోచనల రూపంలో మన హృదయాలలో ముద్ర వేసుకుంటుంది. ఈ రెండవ శ్లోకాన్ని ప్రతిరోజూ మనకు ఓపిక ఉన్నంత వరకూ మననం చేసుకుంటే, "సర్వలోక వశ్యము" జరుగుతుందని మంత్రశాస్త్ర వేత్తలు అనుభవజ్ఞులైన దేవీ ఉపాసనాపరులూ శలవిచ్చారు. "సర్వలోక వశ్యము" అనగా సర్వలోకాలు మనకు వశమైపోయి మనం దేవుళ్లకంటే పైస్థాయికి వెళ్లిపోతామని భ్రమపడకూడదు. దురాశపడకూడదు సుమండీ!

మన మనస్సే ఒక "మహాలోకం" దానిలో నిరంతరం విజృంభించే మంచి,చెడు భావనా పరంపరలు, కాంతివేగంకంటే, మనోవేగం కంటే - వాయువేగం కంటే- త్వరితంగా సర్వలోకాలనూ చుట్టి రాగలవు. ఆమనస్సునూ, మన ఆలోచనలనూ, మంచివైపు, జగన్మాత పాదరజంవైపు మరలించగలగటమూ, అందుకోసం మనం చేసేసాధనే, సాధనలో కొంతవరకూ సఫలీకృతులము కావటమే "సర్వలోక వశ్యము. ప్రకృతి జయము" అని తెలుసుకోవాలి. ప్రకృతిజయం" అనగా, మన ఇంద్రియాలు వూరక వుండవు. భోగాలవైపు, సుఖాలవైపు మనల్ని నిరంతరం లాగుతుంటాయి. అందుకు ఏ అకృత్యాలైనా చేయమని ప్రోత్సహిస్తుంటాయి. ఈ శ్లోకపునశ్చరణ వలన. ఆ ఇంద్రియాల దౌర్జన్యం తగ్గి, ప్రకృతి సహజంగా, మానవులం, ఏ దివ్యశక్తి నుండి విడివడి మానవజన్మ ఎత్తామోతెలుసుకుని, మరల ఆ దివ్యశక్తి పాదాలను శరణువేడటమే. ఇదే ప్రకృతిని జయించటం అంటే అవునా ?

## 3వ శ్లోకం

## "జగజ్జనని పాదరజం మహిమ" మరొక్కమారు"

**3 శ్లో ॥ అవిద్యానా మన్తస్తిమిర, మిహిరద్వీప నగరీ**
**జడానాం చైతన్యస్త బక మకరన్ద స్రుతి ఝరీ**
**దరిద్రాణాం "చిన్తామణిగుణనికా, జన్మజలధౌ**
**నిమగ్నానాం, దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి.**

ఈ శ్లోకంలో మరొక్కమారు జగజ్జనని పాదరజం మహిమ శ్రీ శంకర భగవత్పాదులవారు కీర్తించారు.

**అర్థము** : తల్లీ! జగన్మాతా! నీ పాదరేణువు, అజ్ఞానుల అజ్ఞానాన్ని పారద్రోలే, సూర్యుడు ఉదయించే ద్వీపం వంటిది అంటే ఏమిటి ? మనకంటికి భూమ్యాకాశాలు కలుసుకొనే చోటులా కన్పిస్తుంది. సముద్రపు ఆవలి తీరం - ముఖ్యంగా సూర్యోదయం వేళలో, సూర్యాస్తమయం వేళల్లో! మానవుల దృష్టికి అదొక వింతదృశ్యం! 'కన్యాకుమారి' లో మూడు సముద్రములు కలిసే చోట సూర్యోదయమూ. సూర్యాస్తమయమూ, ఒక అద్భుత దృశ్యం! వేలాది మంది యాత్రికులు, ఆ దృశ్యాన్ని తిలకిస్తూంటారు. తమ తమ కెమెరాలలో బంధిస్తూంటారు.

తెల్లవారు ఝామున చీకటి గాఢంగా ఉంటుంది. ఉషోదయానికి ముందుడే తమస్సు అది. మానవ జీవితంలోను జ్ఞానోదయానికి ముందు అజ్ఞానపు తమస్సు వారి వారి హృదయాలను ఇట్లాగే ఆవరించుకొని ఉంటుంది. ఉషోదయానికి ముందుగా తూర్పుదిక్కున ఆకాశం ఎర్రని నారింజ రంగులో కాంతి వస్తుంది. అరుణవర్ణం అది. ఆ కాంతి ప్రారంభమయ్యే ప్రదేశమే సూర్య ద్వీపం. "మిహిర ద్వీపం" అంటారు మహర్షులు. అక్కడినుండే వెలుగురేఖలు మెల్లగా ప్రసారం కావటం ప్రారంభిస్తాయి. ఆ వెలుగు రేఖల వెనకాలే సూర్యబింబం దర్శన మౌతుంది. సూర్యుని చుట్టూరా కాంతి రేఖలు అగ్ని రేఖలులా విస్తరిల్లి దుర్ని రీక్షంగా మారి పగటి వెలుగు - వెల్లువ ఎండ తీక్షణత వచ్చేస్తాయి. ఇక చీకటికి ఆ స్కారమేలేదు.

సరిగ్గా ఇలాగే అవిద్యతో, కుతర్కాలతో, శ్రీదేవీ పూజాదులు మరిచిన వారికి ఆ తల్లి పాదరజం "మిహిర ద్వీపనగరం" జ్ఞానప్రకాశం ప్రారంభం అయ్యాక ఇక అవిద్య. అజ్ఞానం పారిపోతాయి. బద్ధకము మూర్ఖత్వము, మొండితనము ఒకదానిలో ఒకటి కలసిపోతే దున్నపోతు లాంటి జడత్వపు స్థితి మానవులకు వస్తుంది. మహిషా సురతత్వం ఇదే. మనుష్యులలో ఇలాంటి వారు సాటివారిని హింసిస్తూ ఆగడాలు చేస్తూంటారు. అలాంటి అ సురీ గుణాలు గలవారిని జగన్మాత చండిలా మహిషా సురమర్దినిలా సరిదిద్దుతుంది.

కేవలం పూర్వ జన్మపాపం వలన, ఇతరుల దుర్బోధల వలనా, నాస్తిక వాద ప్రభావం వలనా జడులైనవారు కొందరుంటారు. జగన్మాత పాదరజం వారిపై ఇసుమంత ప్రసరించిన క్షణంలో జ్ఞానమనే మకరందమును జాలు వార్చే ప్రవాహముగా మారుతుందది. చైతన్యం పరివర్తనకు మూలమౌతుంది. జడత్వం వదిలి జ్ఞానంవైపు అడుగులు వేస్తారు వారు ఆ తల్లి అపార కరుణతో! ఇక దరిద్రులుంటారు! దారిద్ర్యాలు అనేక రకాలు. డబ్బు లేకపోవటం ఒక్కటే దారిద్ర్యంకాదు. బుద్ధిహీనత, దుష్ఠ సంతానం, దుష్ఠ భార్య, వ్యసనపరుడైన భర్త, శాడిస్ట్ భర్త, శాంతి, సుఖంలేని సంసారాలు, ఎడతెగని వ్యాధులు, అవయవలోపాలు, యాక్సిడెంటల్లో అవయవాలు పోవటం, అజ్ఞానంతో మొండివాదన, మితిమీరిన మాటల ధోరణి, ఇవన్నీ ఇలాంటివే! మరెన్నో మరెన్నో దారిద్ర్యాలున్నాయి మానవలోకంలో! అవి అనుభవించే వారికే తెలుస్తాయి. నిరంతరం యుద్ధ వాతావరణంలో ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి వలసపోయే

ప్రజల జీవితాలు గమనించండి. మత ద్వేషాలతో నిరంతరం హత్యలు చేసుకొనే ప్రజల జీవితాలలోని అస్థిరత గమనించండి. ఇవన్నీ జన్మ జన్మాంతరాల పాపం వలన ఏర్పడిన పైకి కనిపించని దారిద్ర్యాలు! మరివీరందరికి విముక్తి ఎపుడు ? ఎలా ?

శ్రీ మాత పాదాలను శరణువేడిన క్షణంలో ఆ పాదరజం ఒక్కక్షణం వారి మీదపడిన క్షణంలో, ఆ శ్రీ పాదరేణువు ఒక్కటీ చింతామణి హారంలా మారి వారి వారి దారిద్ర్యాలను పోగొడ్తుంది. 'చింతామణి' అనేది మణులలో విలువలకు అందని మణి. మహాచక్రవర్తుల కిరీటాలలో, దేవతల కిరీటాలలో ప్రత్యేకించి పొదిగే విలువైన మణి అది. చింతామణి ఉన్నచోట చింతలుండవని ప్రతీతి. అమ్మవారి నివాసం చింతామణి ద్వీపం అందుకే మరి! ఒక్క చింతామణే విలువైనది కదా! చింతామణుల వరుసతో కూర్చిన హారం లభ్యమయిన వారికి ఇక దారిద్ర్యం ఎక్కడ ఉంటుంది ?

ఇక సంసారం సాగరం దు:ఖం అంటారు. ఒక అలపోతే మరో అల వచ్చినట్లు ఒక సమస్యపోతే మరోసమస్య వచ్చేదే సంసారసాగరం. ఇలా ఎడతెగని సమస్యల బంధాలతో సంసారసాగరంలో దారితెన్నూ తెలియక ఆవేదనపడే భక్తుల పాలిటి, ఆ తల్లి పాదరజం - శ్రీ మహావిష్ణువు వరాహ అవతారంతో, తనవాడి కోరలతో, జలధిలో మునిగిపోతున్న "భూమి" ని ఉద్ధరించినట్లు ఉద్ధరిస్తుంది. రక్షిస్తుంది, "దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి" అన్నారు ఆది శంకరాచార్యులవారు అందుకే!

ఈ ఒక్కశ్లోకాన్ని మనకు ఓపిక ఉన్నన్ని మార్లు ప్రతిరోజూ మననం చేసుకోగలిగినా చాలు. సకలైశ్వర్యములు. సర్వవిద్యలు సిద్ధిస్తాయంటారు జగన్మాత ఉపాసనా పరులైన మహాభక్తులు. ఆసాధకులు "వేదవేత్తలు" అవుతారనీ ఆశీర్వదించారు ఆ మహర్షులు. ఆది శంకరాచార్యులవారి ఆశీశ్శులతో, జగన్మాత కరుణకు అర్హులమై, మనలోని అజ్ఞానాంధకారాన్ని మనచుట్టూరావున్న సమస్యల పెనుచీకట్లనూ, తప్పించుకుందాం. మనలో జ్ఞాన సూర్యోదయం కోసం ఆ తల్లి పాదములను శరణు వేడుదాం. చింతామణి మన చెంతవుండగా, గులకరాళ్ల కోసం పరుగులెందుకు! మరి పదండి ముందుకు.

## 4వ శ్లోకం

## "శ్రీమాత పాదపద్మముల మహిమ"

**4 శ్లో ॥ త్వదన్యః పాణిభ్యా మభయవరదో దైవత గణః**
**త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా**
**భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాఞ్ఛ సమధికం**
**శరణ్యే లోకానాం తవహిచరణా వేవ నిపుణౌ.**

**అర్థము** :- జగన్మాతా! తల్లీ! నీవుగాక ఇతరదైవత గణము అంతా తమ హస్తములతో అభయ, వరద ముద్రలను ప్రదర్శించి, తమ హస్తములు అభయమును, వరమును ప్రసాదించ గలవని చాటి చెప్పుచున్నారు. కానీ ఓ జగన్మాతా! నీవు అట్లు అభినయించటంలేదు. ఒకచేత పాశము మరొకచేత అంకుశము, ఇంకొకచేత చెఱకువిల్లు! మరొకహస్తంతో పంచభూతముల తన్మాత్రలనే శబ్ద, స్పర్శ, రూప రసగంధములనెడి పంచబాణములనే పూలగుత్తిగా చేసిధరించి వుండటం వల్ల, ప్రత్యేకించి అభయ, వరముద్రలు ప్రదర్శించదలచినచో మరొకరెండుచేతులు అదనంగా సృష్టించుకొనవచ్చు. కానీ జగన్మాతకు ఆ అవసరం లేదు. చిత్తశుద్ధితో తనపాదములు శరణు వేడిన భక్తులకు వారుకోరిన దానికంటే వందరెట్లు అధికంగా వరములు ప్రసాదించే దివ్యపాదములు ఆ తల్లివివుండగా, ఆమె ప్రత్యేకించి అభయ, వరముద్రలు ఆమెహస్తములతో ప్రదర్శించనవసరంలేదు.

శంకర భగవత్పాదుల వారు జగన్మాత యొక్క పాదముల యొక్క మహిమను ఎంత గొప్పగా కీర్తించారో గమనించండి ఈ ఒక్కశ్లోకంలో ప్రతిరోజూ భక్తిశ్రద్ధలతో ఈ శ్లోకాన్ని మననం చేసుకున్న భక్తులకు "సామ్రాజ్యసిద్ధి" కలుగుతుందంటారు దేవీభక్తులు. "సామ్రాజ్యసిద్ధి" అనగానే, మంత్రిగానో, ముఖ్యమంత్రిగానో, ఈ దేశానికి ప్రధాన మంత్రిగానో- అన్నిదేశాలకూ చక్రవర్తిగానో - అయిపోతామని పగటికలలు కంటే - అదివారికి ఆయాసాన్నీ- అపారమైన నిరాశనూ కలిగించి తీరుతుంది. చిత్తశుద్ధితో జపిస్తే - ఆ తల్లిపాద దర్శనం మనహృదయానికి అనుభూతి కలుగుతుంది. అంతకు మించిన సామ్రాజ్యసిద్ధి - మోక్షసామ్రాజ్య సిద్ధి ఏమున్నదంటారు ? అదే బోధించారు ఆది శంకరాచార్యుల వారు పరోక్షబోధగా ఈ శ్లోకంలో! అవునా ?

### 5వ శ్లోకం

## శ్రీ మాత శక్తివలన, మన్మథుడు జితేంద్రియులను కూడా మోహ పెట్టగలుగుతున్నాడు.

5 శ్లో ॥ హరిస్త్వామారాధ్య ప్రణత జన సౌభాగ్య జననీం
పురానారీ భూత్వా పురరిపు మపి క్షోభమనయత్
స్మరో పి త్వాం నత్వా, రతినయన లేహ్యేన వపుషా
మునీ నా మప్యన్తః ప్రభవతి మోహాయ మహతామ్ ॥

అర్థము :- ప్రణత జన సౌభాగ్య జననీ! అంటే మనసా, వాచా, కర్మణా శరణాగతి భావంతో నమస్కరించే భక్తులకు ఎనలేని సౌభాగ్యాలను పంచిపెట్టే తల్లీ! పూర్వం నిన్ను ఆరాధించి శ్రీ మహావిష్ణువు మోహినీరూప వేషధారియై, కామారి అయిన ఈశ్వరునే మోహపెట్టగలిగాడు అట్లాగే ఈశ్వరుని ముక్కంటి మంటలకు దగ్ధమైపోయిన మన్మధుడు నీ కరుణతో, అతడి భార్య అయిన రతీ దేవికి మాత్రం దృగ్గోచరుడయ్యే వరంపొంది, మిగతా సర్వప్రాణికోటికీ అదృశ్యుడుగా వున్నాడు. అయినా దేహం లేని మన్మధుడు జితేంద్రియులైన మహర్షుల హృదయాలను కూడా ఒక్కొక్కప్పుడు మోహింప జేయగలుగుతున్నాడు. ఇది నీ అపార కరుణాశక్తి మహిమ గదా తల్లీ!

ఈ శ్లోకంలో శ్రీ శంకరభగవత్పాదులవారు, క్షీరసాగర మధనం కథలోని అందరికీ తెలిసిన శ్రీ మహవిష్ణువు మోహినీరూపుడై అసురులకు మోహంకల్గించిన ఘట్టంతోబాటు, మరొక కధనూ. గుర్తుకు తెస్తున్నారు. ఆ మోహినీ అవతారాన్ని గురించి వినిన ఈశ్వరుడు విష్ణుమూర్తిని "ఏదీ నాకు నీ మోహినీ అవతారం చూపించు చూడాలని కూతూహలంగా ఉంది!" అంటాడు. అందుకు విష్ణువు నవ్వి "ఒద్దులే అది అసురుల కోసం ఎత్తిన తామస గుణమైన అతి కామప్రదర్శన, ఆ అవతార లక్షణం, ఆ తామస అవతారం,, యోగీశ్వరుడవైన నీకు చూపటం ఎందుకు ?" అనిసర్ది చెప్పబోతాడు. ఈశ్వరుడు వినకుండా "కామారిని నేను! నాకు ఏ వికారము కలుగదు. ఆ మోహినీ రూపంచూపించు!" అంటాడు "సరే! మరో మారు చూపిస్తాను!" అంటాడు విష్ణువు. ఇది జరిగిన కొద్ది కాలానికి ఒకరోజు కైలాస పర్వత సానువులలో విహరిస్తున్న ఈశ్వరునికి హఠాత్తుగా ఒక అతి లోక సౌందర్యవతి కన్పిస్తుంది. ఆమె అద్భుత సౌందర్యానికి ముగ్ధుడైన శివుడు మోహ పరవశుడై ఆమె వెంట పడతాడు! తాను కామారి నన్న విషయం విస్మరించి పామరునిలా ప్రవర్తిస్తాడు. చివరిగా ఆ సుందరినిచే జిక్కించుకుంటాడు. కానీ ఆ సుందరి విష్ణుమూర్తిగా మారి "చెబితే విన్నావు కావు!" అంటాడు నవ్వి. ఈశ్వరుడు సిగ్గుపడతాడు. మరి ఇంతటి సమ్మోహన శక్తి ఎక్కడనుండి వచ్చింది విష్ణుమూర్తికి? కేవలం యోగమాయ అయిన జగన్మాతను ఆరాధించి పొందిన శక్తి అది.

శ్రీ విద్యలో "త్రిపుర సుందరీ ప్రస్తార బేధము" అనే విద్యలోని ఒక ప్రస్తారమునకు విష్ణువు ఋషి. ఋషి అనగా మంత్ర ద్రష్ట! మంత్ర స్వరూపాన్ని ఆ మూలాగ్రం దర్శించిన మహాత్ముడే ఋషి. త్రిపుర సుందరీ కరుణా కటాక్షం పరిపూర్ణంగా పొందినవాడు గనుక మోహినీ అవతారంలో తామసికులైన రాక్షసులను మోహపెట్టడంతో బాటు మహాయోగీశ్వరుడైన ఈశ్వరుని కూడా మోహపెట్టగలిగాడాయన. ఇక మన్మధుడు శ్రీదేవిని ఉపాసించి శ్రీ విద్యను తమదైన ప్రత్యేక పద్ధతిలో ఆవిష్కరించిన పన్నెండు మందిలో (1) మనువు (2) చంద్రుడు (3) కుబేరుడు (4)

అగస్త్యుడు (5) లోపాముద్ర (6) అగ్ని (7) సూర్యుడు (8) ఇంద్రుడు (9) స్కందుడు (10) శివుడు (11) క్రోధ భట్టారకుడు (దుర్వాసుడు) (12) మన్మధుడు ఒకడు.

మన్మధుడు దేహం లేకపోయినా కేవలం రతీ దేవికి మాత్రం గోచరుడైనా తన హృదయంతో అమ్మవారిని ఆకుంఠిత భక్తితో అర్చించి "మన్మధ విద్యగా" శ్రీ విద్యకు ఒక రూపం కల్పించినవాడయ్యాడు. ఆ అమ్మవారి కటాక్షంతో జితేంద్రియులైన మునులను సైతం మోహపెట్టగల శక్తివంతుడయ్యాడు. మన్మధుని ఆ శక్తీ లేకపోతే ఈ సృష్టిలో ఇన్నికోట్ల జీవరాసులుండవు గదా!

ఈ శ్లోకాన్ని జపిస్తే పురుషవశ్యము కలుగుతుంది. మరి పురుష వశ్యం అంటే ఏమిటి ? ప్రతి మానవ శరీరంలో స్త్రీ పురుష - శక్తులు సమంగా వున్నాయి అంతర్లీనంగా! ఇదే సూక్ష్మంగా అర్ధ నారీశ్వర తత్వంఅంటే! చాల సున్నితంగా కన్పించే స్త్రీలు ఒక్కొక్క మారు సింహంలా ప్రవర్తిస్తారు. కలి కాలంలో ఉద్యోగాలు చేస్తూ బయట సమాజంలో తిరగవలసిన స్త్రీ తనని తాను రక్షించుకోవాలి. ఈ శ్లోకం మననం చేయటం వలన ఆమెలోని నిక్షిప్తమై ఉన్న పురుష తత్వం మేల్కొని ధైర్యం- సమస్యలను ఎదుర్కొనే స్థైర్యం, అవసరమైతే సమాజానికి ఎదురు తిరిగి నిలబడగల ఆత్మ విశ్వాసం, పోరాటపటిమ, ఆ పురుషతత్వాన్ని వశ్యం చేసుకొని జటిలమైన సమస్యలను తానే పరిష్కరించుకుంటుంది. ఈ నాటి స్త్రీలకు ఇది అవసరం. వరకట్న వేధింపులు మొదలుకొని ఉద్యోగాల వేధింపుల వరకు స్త్రీ - స్త్రీ గాను, పురుషునిగాను కూడా మారాలి. ఇదే పురుష వశ్యం అంటే. అంతేగానీ, దారినపోయే మగవారంతా, ఈ శ్లోక జప మహిమతో! వశ్యులై పోతారని భ్రమపడితే అంతకుమించిన అజ్ఞానం మరొకటిలేదు. అలాగే "సౌందర్యలహరి" లోని ఈ శ్లోకాన్నిజపించి తనభార్య ఏ పరపురుషుడినో వశ్యం చేసుకొంటుందోనని కొందరు భర్తలు అనుమాన పడటం మొదలెడితే సంసారాలు నరకాలవుతాయి.

ప్రతి పని, ప్రతిపూజ, ప్రతిస్తోత్రానికీ సదర్ధమూ, సదాశయమూ వుంటాయేగాని పెడర్థాలు తీసుకోకూడదు సుమండీ! ప్రతిమహర్షి, ప్రతి మహానుభావుడు తమయొక్క అనుభవ, అనుభూతి సారవంతమైన మంత్రాలు, శ్లోకాలలో బీజాక్షరాలుగా, అక్షరాలు ఒదిగిపోతాయి. ఆదిశంకరాచార్యులవారి కవిత్వానికి ఆదివ్యత్యమూ, మహిమ, వున్నాయి. ఆశ్లోకాలలో నిక్షిప్తమై వున్న బీజాక్షర సమాన అక్షర సమామ్నాయ మననం వలన మనలోనూ అజ్ఞానం నశించి, సుజ్ఞానపు కాంతులు వెల్లివిరుస్తాయి. ఆ "జ్ఞాన తేజస్సు" ఎదుటివారిలోని ఆధ్యాత్మిక తేజస్సును ఆకర్షిస్తుంది. ఇది - "పురుష వశ్యం" అంటే అర్థం. అంతేగానీ మన శరీరాకర్షణ కానేకాదు సుమా!

## 6వ శ్లోకం

# జగన్మాత అపార దయామహిమ.

6 శ్లో ॥ ధనుః పౌష్పం, మౌర్వీ మధుకరమయీ, పంచవి శిఖాః

వసన్త స్యామన్తో మలయమరు దాయోధన రథః

తథాప్యేక స్యర్వం, హిమగిరి సుతే! కామపి కృపామ్

అపాఙ్గాత్తే లబ్ధ్వా జగదిద మనఙ్గో విజయతే!

అర్థం :- ఓ హిమగిరి సుతా! తల్లీ! జగన్మాతా! మన్మధుని విల్లు పుష్పములతో చేయబడినది. తుమ్మెదల బారు అల్లెత్రాడు. ఆ తుమ్మెదలు స్థిరంగా ఉంటాయా ? ఉండవు. బాణములు ఐదు మాత్రమే! మలయ పర్వతము నందు పుట్టిన కొండగాలి అదీ ఎపుడూ వుండదు. ఎపుడో తప్ప గాలి రిక్కవేసి రాదు. వచ్చినా స్థిరంగా తాపం పోగొట్టెలా నిలచివీచదు! ఇదీ ఆకాముని రథం. వసంతుడు అనగా ఒక ఋతువు కాల స్వరూపుడు! ఆరు ఋతువులలో వసంత ఋతువు ఒకటి. సంవత్సరంలో ఒక్క మారే వస్తుంది ఈ ఋతువు! ఈ వసంతుడు మన్మధుని మంత్రి (చెలికాడు)! ఈ పనికి మాలిన సామగ్రితో శరీరం లేని మన్మధుడు జగత్తులోని సర్వమానవుల హృదయాలను, ప్రాణి కోటిని, క్షోభపెట్టగల శక్తివంతుడెలా అయ్యాడు? అంటే, అది కేవలం నీ "అపాంగ వీక్షణం" (కడగంటి చూపు) యొక్క దయారసంతో కూడిన శక్తియే సుమా. నీ దయా దృష్టి మహిమే సుమా!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి యొక్క అపాంగ వీక్షణం (కడగంటి చూపు) యొక్క మహిమ అద్భుతంగా వర్ణించారు. 'అర్చిత' అనేది మన్మధుని లోకము. "పౌండ్రము" అనేది మన్మధుని విల్లుపేరు "ఉన్మాదము, తాపనము, శోషణము, స్తంభనము, సమ్మోహనము" అనే ఐదు మన్మధుని పంచబాణాలు.

పుష్ప భాణాలు ఐదు - "అరవిందం, అశోకం, చూతము, నవమల్లిక, నీలోత్పలం" ఈ పుష్ప భాణాలనేపైన చెప్పిన భావనలతో మంత్ర పూరితంగా ప్రయోగించినపుడు అవి ఉన్మాదము, తాపన, క్షోభము, స్తంభము, సమ్మోహనము కలుగజేస్తాయి అని అర్థం చేసుకోవాలి. తన ఈ పంచబాణాలు పని చేయనపుడు చివరిగా ఆరవ బాణం అయిన స్త్రీ కడగంటి చూపు అనేదాన్ని ప్రయోగిస్తాడు. మన్మధుని ధాటి - "భావ విజయము - ప్రభోధికా" అంటారు. జితేంద్రియులైనవారు కూడా మన్మధుని ధాటికి ఓర్వలేరు. ఒక్కొక్కమారు పతనమవుతుంటారు. అదే మన్మధుడాశించే భావ విజయము. మన్మధుని కలువ "సువతంసకము" మన్మధునిశంఖము 'విలాసము'

శరీరం శివుని కంటి మంటలకు దగ్ధమై పోగా అనంగునిగా మిగిలిన మన్మధుడు శ్రీ విద్యను ఉపాసించి అతి శక్తివంతుడై ఆ జగన్మాత యొక్క

"కడగంటి చూపు" అనే దయామృత వర్షానికి పాత్రుడై తన పూలబాణాలతోనే - సర్వజగత్తునూ జయించేశక్తి సాధించగా -

సశరీరులమైన మనము- ఆ తల్లిని భక్తితో ఆరాధించి, ఆ తల్లి దయకుపాత్రులమైతే- ప్రపంచాలను సుభిక్షము, శాంతియుతముగా మారే శక్తి సంపన్నులం కాలేమా ? మంచి కోర్కెకు తల్లి దీవెన ఎప్పుడు ఉంటుంది సుమా ? అందుకు మనం చేయవలసిందేమిటి ?

ఈ శ్లోకాన్ని పునశ్చరణ చేయటమే ! ఈ శ్లోకాన్ని రోజూ పునశ్చరణ (భక్తిశ్రద్ధలతో) నిష్కామంగా చేయగలిగితే - సాధకునికి నపుంస కత్వము పోయి - పుత్ర ప్రాప్తికలుగును అని తాంత్రిక శాస్త్రం చెబుతోంది.

నపుంసకత్వం అంటే- సంతోనోత్పత్తి శక్తిహీనత అనికాదు ఇక్కడ అర్థం.

కొందరు స్త్రీ పురుషులలో - వూరికే నిరాశ, నిస్పృహ తాము ఏమిచేయలేమన్న ఆత్మన్యూనతా భావం వుంటుంది. వారు పుట్టిపెరిగిన వాతావరణం ప్రభావమో, వారు ఎదుర్కొన్న జీవితపుచేదు అనుభవాలు, వారు చవిచూచిన ఓటములో, వారుపొందిన అవమానాలు, కారణాలేమైనా - వారి హృదయంలో- తాము ఎందుకూ పనికి రానివారమనీ - ఏ పనీచేయలేమనీ, ఒకానొక "ఇన్‌ఫిరియారిటీ కాంప్లెక్స్" ఏర్పడుతుంది. అతి భార్యా విధేయులూ - అతిగా భర్తకు భయపడేస్త్రీలూ, అత్తగార్లు, ఆడబడచుల ధాష్టికానికి గురయ్యే స్త్రీలూ, తల్లిలేని పిల్లలూ - అనాధలూ ఇలాకొందరు ఆభావనకు గురి అవుతుంటారు. అలాటి వారికి ఈ శ్లోక పునశ్చరణవలన ఆత్మ విశ్వాసం కలిగి, తాము ఏ పని అయినా చేయగలమన్న ధైర్యం వస్తుంది. విజయం సాధిస్తారు. తాము మంచిపనులు చేయగలగటమన్నదే పుత్రప్రాప్తి అవునా ?

## 7వ శ్లోకం

# దేవీ స్వరూపవర్ణన

7 శ్లో॥ క్వణత్కాందాఞ్చీమా కరికల భ కుంభ స్తననతా,
పరిక్షీణామధ్యే పరిణత శరశ్చంద్ర వదనా.
ధనుర్బాణాన్ పాశం, సృణిమపి దధానాకరతలైః
పురస్తా దాస్తాం, నః పురమథితురాహో(! పురుషికా!"

**అర్థము :-** క్వణ క్వణమంటూ లయబద్ధంగా ధ్వనిచేయు చిరుమువ్వల గజ్జెల మొలనూలు కలిగి, గున్నఏనుగు కుంభస్థలమువంటి కుచముల భారముచే కొద్దిగా ముందుకు వంగియున్న సన్నని నడుము కలిగి (పరిక్షీణామధ్యే), శరత్కాల పూర్ణచంద్ర బింబమువంటి ముఖము కలిగి, చెఱకు విల్లును, పుష్పబాణములను, పాశమును, అంకుశమును వరుసగా నాలుగు చేతులతో ధరించియున్న, త్రిపురములను మట్టుబెట్టిన త్రిపురాంతకుడైన పరమశివుని యొక్క అహంకార రూపిణియైన (అహో!పురుషికా!), భగవతీదేవి మాఎదుట సాక్షాత్కరించునుగాక!

మనందరి భావనలో ఆజగన్మాత భవానియై -త్రిపుర సుందరియై- సర్వ విజయములకు వెనకవున్న అహంకారరూప శక్తి (పురుషికా) అయి లలితయై సాక్షాత్కరింపజేయటానికి శ్రీ శంకరభగవత్పాదుల వారు తాను దర్శించిన ఆ జగన్మాత రూపాన్ని- మనహృదయంలో సాక్షాత్కరింపజేయటానికి ఈ శ్లోకం చెప్పారనిపిస్తున్నది కాదా ?

వారే- తమ భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలో

(4వ శ్లోకం)

"**క్వణత్కింకిణీ, నూపురోద్భాసి రత్న**
**ప్రభాలీఢ లాక్షార్ద్ర పాదాబ్జయుగ్మాం !**
**అజేశాచ్యుతాద్యై సురై సేవ్యమానం !**
**మహాదేవి! మన్మూర్ధ్ని, తే, భావయామి !"**

అంటూస్తోత్రం చేశారు.

ఈ శ్లోకాన్ని (సౌందర్యలహరిలోని 7వ శ్లోకాన్ని "క్వణత్కాం చీదామా "అనేది, రోజు భక్తి శ్రద్ధలతో పునశ్చరణ చేయగలిగితే, "శత్రుజయము" లభిస్తుందని దేవీఉపాసకులు సాధనలో తెలియజేసారు. శత్రువులంటే ఎవరోకాదు. మనలోని కామ, క్రోధలోభ, మోహమదమాత్సర్యములనే ఆరు! "అరిషడ్వర్గము" అంటారు వీటినే! మనలోని సర్వచెడు భావనలకూ- చెడుకర్మలకు మూలమైన ఈ ఆరు శత్రువులనూ - ఒక్కొక్కటిగా అమ్మవారి స్తోత్రం, పూజ, నామజపం - ఈ శ్లోకపునశ్చరణలతో- జయించగలిగితే- ఇకప్రపంచంలో శత్రువులనేవారు మనకు వుండరు అనిదీనిభావం! అంతః శ్రత్రువులతోబాటు - మనంమంచిగావున్నా, అనవసరంగా మనల్ని బాధిస్తున్న సమాజంలోని కొందరు దుష్టుల - దుష్టప్రవర్తన, బాధిస్తున్న సమస్యలు- ఈ శ్లోక పునశ్చరణతో- నాశనమైపోతాయి. అమ్మవారి దయకలగాలేగానీ- ఏది అసాధ్యం ? ఏదీ కాదు అసాధ్యం.

# అమ్మవారి నివాసము.

# చింతామణి గృహము.

8 శ్లో ॥ సుధాసింధోర్మధ్యే సురవిటపి వాటీ పరివృతే,
మణిద్వీపే, నీ పోపవనవతి, చింతామణి గృహే ;
శివాకారే మంచ్చే పరమశివ పర్యంక నిలయామ్
భజంతిత్వాం, ధన్యాః కతిచన చిదానన్దలహరీమ్!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు ఆ తల్లి సాక్షాత్కారాన్ని సంపూర్ణంగా పొంది - మానవులందరిపై గల అపారదయతో- తాను దర్శించిన జగన్మాత దివ్యమంగళ స్వరూపాన్ని మనందరి చేతా దర్శింప జేసే ప్రయత్నంచేశారు. మనమూ ఆ అర్హత సాధించాలి మరి.

ఈ శ్లోకార్థం :- తల్లీ! జగన్మాతా! సుధాసముద్ర మధ్యమున కల్పవృక్షములచే పరివేష్టితమై, కదంబ వృక్షములుగలిగిన ఉద్యానవనమందు, చింతామణి గృహంలో, శివాకార మంచమున - అనగా, బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, రుద్రులు- నాలుగు కోళ్లుగా అమరగా, సదాశివుడు మంచముపై దుప్పటము (పలక-) కాగా, పంచబ్రహ్మ సింహాసనా సీనవై, నిరతిశయానంద తరంగరూపమున (చిదానందలహరిగా) నున్న నిన్ను కొందరు ధన్యులు మాత్రమే సేవింపగలుగుతున్నారు.

ఆ కొందరు ఎవరు ?

అంతర్ముఖులైన మహాత్ములు : చిత్తశుద్ధితో- దాంబికం లేకుండా పూజించే భక్తులు. మాత్రమే దర్శించగలగుతారు అని భావము. లలితా సహస్రనామస్తోత్రంలో.

"అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా" అనే నామంవున్నది. ప్రపంచంలో వుంటున్నా తామరాకు మీదినీటి బొట్టులాగా వుండగలిగినవారే అంతర్ముఖులు! వారే ఆతల్లిని నవావరణలతో కూడిన శ్రీ చక్రమధ్యస్థగానూ, శ్రీ చక్ర స్వరూపిణిగానూ, కదంబ వృక్షముల వనం - కల్పవృక్షముల వనం - మధ్య - చింతామణి ద్వీప గృహంలో- పంచబ్రహ్మ సింహాసనాసీనయై లలితాత్రిపుర సుందరిగా- దర్శించగలుగుతారు. కుతర్కాలతో, లౌకిక వాదాలతో, భోగాపేక్షతో, స్వార్థపరత్వంతో, కపటపూజతో లౌకిక జీవనానికి అమ్మవారిపూజ సాధనంగా ఎంచుకునేవారే బహిర్ముఖులు! వారు ఆ చిదానంద స్వరూపిణి రూపాన్ని దర్శించలేరు- అని ఘంటాపథంగా చెప్పారు భగవత్పాదులవారు. శ్రీ ఆదిశంకరాచార్యులవారు సౌందర్యలహరిని - "ఆంనదలహరి" -"సౌందర్యలహరి" అని రెండు భాగములుగా రచనచేశారు. ఆనందలహరిలో- (చిదానందలహరి)లో అమ్మవారి శక్తి, మహిమ- స్వరూపం వర్ణించి -

సమయాచారం ప్రకారం చేసే సహస్రార చక్రపూజకు అనువుగా నిర్గుణోపాసన చెప్పారు. శ్రీ చక్రస్వరూపిణి నిర్గుణస్వరూపిణి అయిన అమ్మవారు ఆమె! ఆ తర్వాత అమ్మవారి కిరీటం మొదలు పాదాలవరకూ వర్ణించి "సౌందర్యలహరి" ఆ తల్లి సౌందర్యం అనే ఉధృత ప్రవాహంలోతాను మునకలు వేసి- శిశువులా ఈదులాడి- మానవ లోకానికి ఆ ఆనందాన్ని పంచిపెట్టారు తరించమని, ఇంతవరకూ- ఆతల్లి దివ్యరూపాన్ని కొంతవరకూ దర్శించాముగదా భగవత్పాదుల వారి మార్గదర్శకత్వంలో! ఇంతటితో ఈ ప్రధమ (మొదటి) అధ్యాయం సమాప్తం ఈ అధ్యాయంలో, ఆ జగన్మాత శక్తి, పాదరజం యొక్క ప్రభావము, ఆ తల్లి చరణ కమలాలకు మ్రొక్కితే- సర్వకోరికలూ- ఆతల్లి పాదాలే తీరుస్తాయన్న విశ్వాసము, ఆ తల్లి అపార కరుణ వలన అనంగుడైన మన్మధుడు పొందిన శక్తి, ఈశ్వరుని అహంకార రూపిణి అయిన ఆ తల్లి స్వరూపము, నవావరణలతో కూడిన మణిద్వీపంలో మంగళకరమైన శివాకారమంచెపై కొలువై వున్న ఆ తల్లి వైభవము- శిఖరిణీ వృత్తంలో సాగిన శ్లోకాలలో- బోధించారు జగద్గురువు శ్రీ ఆది శంకరాచార్యుల వారు.

ఆ తల్లి సాక్షాత్కారం జరిగింది కదా ?

ఇక ఆ తల్లి నిర్గుణరూపాన్ని గాక- సగుణరూపాన్ని ముందుగా దర్శిద్దాము. ఎందువల్లనంటే - అందరికీ నిర్గుణరూపాన్ని ఉపాసించగల శక్తి- ఏకాగ్రత ధ్యానసమాధి మొదటే అలవడవు. కారణజన్ములకే అవిసాధ్యం.

మనబోటి సాధారణ భక్తులమంతా ఒకానొక దివ్యరూపాన్ని మననం చేసుకుంటూ ముందుకు సాగితే - సాధనచేయగా, చేయగా నిర్గుణ రూపంలోనికి మనసును నిశ్చలంచేయగలము అవునా?

శ్రీ శంకర భగవత్పాదుల వారు తాను శిశువుగా మారి వర్ణించిన ఆ జగన్మాత సౌందర్యం- ఈ అధ్యాయము భక్తిశ్రద్ధలతో పారాయణచేసిన వారికి జగన్మాత అపారకరుణతో- సకల కార్యజయము. అనగా మనం చేయతలపెట్టిన సత్కార్యాలు జయప్రదంగా నెరవేర్చుకోగలగటమూ, సర్వజనవశ్యత అనగా, మన చంచలమైన అతి కోర్కెలతో నిండిన ఇంద్రియములను అదుపులో పెట్టుకొనగలగటం., వేదజ్ఞానము, మోక్షసామ్రాజ్య సిద్ధి, సకల జన సమ్మోహనము అనగా, దైవీ తేజస్సు మనలో ముప్పిరిగొనగా, అధ్యాత్మికంగా, మరికొందరికి మార్గ దర్శనం చేయగలశక్తి, సద్భావనలు, సదాలోచనలు, సదాశయములు - సన్మార్గము, (అనే పుత్రప్రాప్తి) మానసిక ఆలోచనల సత్‌సృష్టి, ఆత్మన్యూనతా భావంలో నుండి, నైరాశ్యంలో నుండి, నిస్పృహనుండి బయటపడి, ఆత్మ విశ్వాసంతో ముందుకు సాగగలగుటము, మన అనేకానేక సమస్యల బంధాలనుండి విముక్తి- అంతః శత్రువులనుండి రక్షణ - మొదలైనవి ఒనగూడుతాయి. అయితే - ప్రతి శ్లోకానికీ ఒకయంత్రము - యంత్రపూజా విధానము - సిద్ధి

వున్నాయి తాంత్రిక గ్రంధాలలో. అవి ఎవరు చేసి ఫలంపొందారో లేదో ఎవరికీ తెలియదు. సిద్ధులపై ఆశతోనూ జగద్గురువుగారు భోధించలేదు. ఇవితాంత్రిక వాదులు- వామాచారులు ఎక్కువగాప్రచారంలోనికి తెచ్చినవిగా తోస్తున్నది. అందువల్ల సిద్ధులపై ఆశతో పూజలు చేయటం స్వార్ధం వ్యాపారధోరణి అది తగదు సుమా!

భవరోగానికి ఔషధంగా మార్చి ఇచ్చిన శ్లోకాలు - ఒక భిషగ్వరునిగా ఆ పరమగురువు ప్రసాదించిన అమృత ధారలలో మునకలు వేయటానికి- మనము మానసికంగా ఆజగన్మాత బిడ్డలుగా మారి- నిష్కల్మషమైన బాల్యంలోనికీ, బోసినవ్వులలోనికీ (మానసికంగా) వెళ్లి, ఆ తల్లి ఒడిలో సేదదీరుదాం. ఎన్ని జన్మలకు అలాటి అవకాశం లభిస్తుందో అనిగాక - ఈ జన్మలోనే మన భావనలోనే భవాని నిదర్శించే సాధన ప్రయత్నం చేద్దాం.

ముందు ఎనిమిది శ్లోకాలు పూర్తయ్యాయి.

మరలా 42 వ శ్లోకం వద్దనుండీ - అమ్మవారి సగుణ రూపాన్ని దర్శిద్దాము - పదండి - ముందుకు. నలభై రెండవశ్లోకం వద్దకు వస్తున్నాం. గమనించండి.

## అమ్మవారి సగుణరూప వర్ణన.

## 2వ అధ్యాయము

ఈ ద్వితీయ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదులవారు జగన్మాత శిరసుపైనున్న కిరీటం మొదలు ఆమె నేత్ర సౌందర్యం దృష్టివైభవం వరకూ 42 వ శ్లోకం మొదలు 49వ శ్లోకం వరకూ గల 8 శ్లోకాలలో మహాద్భుత వర్ణన చేసి - ఆతల్లి విరాట్ రూప దర్శనం తానుపొందినదీ అనుభూతి చెందినదీ- మనందరికీ అమృత కవితాఝురిలో పంచిపెడుతున్నారు.

పదండి - పారాయణం. చేద్దాం.!

## జగన్మాత కిరీటము.

**42. శ్లో॥ గతైర్మాణిక్యత్వం, గగనమణిభి స్సాంద్రఘటితం**
**కిరీటం,తే, హైమం, హిమగిరిసుతే! కీర్తయతి యః**
**సనీడే యచ్ఛాయా చ్ఛురణ శబలం, చంద్రశకలం!**
**ధనుశ్శౌనాసీరం కిమితి న బధ్నాతి ధిషణామ్ ॥**

**అర్థం** :- తల్లీ! హిమగిరి పుత్రీ! హైమవతీ! జగన్మాతా! నీ శిరసు పై నున్న బంగారు కిరీటంలో పొదగబడినమణులు.

అవి నిజానికి మణులా ? కాదు కాదు. వారు ద్వాదశాదిత్యులు.

1. ఇంద్రుడు 2. ధాత 3. పర్జన్యుడు 4. త్వష్ట 5. పూష 6. ఆర్యముడు 7. భగుడు 8. వివస్వంతుడు 9. విష్ణువు 10. అంశుమంతడు 11. వరుణుడు 12. మిత్రుడు. అనువారలు

వారు. పన్నెండు నెలలు గల సంవత్సరంలో- ఒక్కొక్క నెలకు ఒక్కొక్క ఆదిత్యుడు అధిపతిగా వుంటాడు. ఆయామాసములలో ఆ ఆదిత్యుని పూజించినవారికి ఆయా శుభ ఫలములను ఇస్తారువారు. మాసముల, ఋతువుల కాలమార్పుకు వారే కారకులౌతుంటారు.

జగన్మాతా! నీ కిరీటమహిమచే- ఈ ద్వాద శాదిత్యులూ అత్యంత శక్తివంతులై. నీ కిరీటంలో మణులవలె ఒదిగిపోయి, వింతరంగులు వెదజల్లుతూ ప్రకాశిస్తున్నారు. తల్లీ! నీ పాపిట బొట్టుగా భాసిస్తున్న చంద్రరేఖ ఈ ద్వాదశాదిత్యులప్రకాశము ప్రసరింపగా, ఆ చంద్రరేఖ - ఇంద్రధనస్సు వలె వింతరంగులు వెదజల్లుతూ - నీ కిరీటమును దర్శించిన కవీంద్రులకు (నాకు) గోచరమౌతున్నది.

శ్రీ శంకర భగవత్పాదుల వారు - ఈ శ్లోకంలో, సత్యలోకంలో వున్న జగన్మాత కిరీటం - శిగ భూషణంగా వున్న చంద్రవంకపై ద్వాదశాదిత్యులనే మణుల కాంతి పడగా ఇంద్రధనస్సులా వుందనటంలో జలానికి అధిష్ఠాన దేవత అయిన చంద్రుడు- (ఈతడే "మనస్సు"కు చిహ్నం.) అమ్మవారి రూపం అద్భుతంగా వుందని వర్ణించారు. ఈ శ్లోకాన్ని రోజు ఓపిక వున్నన్ని మార్లు జపించినవారికి మహోదరవ్యాధి. (ఉదరసంబంధమైన వ్యాధి) నశిస్తుందని- మంత్ర తంత్ర శాస్త్రవేత్తలు శలవిచ్చారు.

కేవలం ఆధ్యాత్మికంగానే గాక- శారీరకంగా కూడా- భవరోగానికి దివ్యౌషధంగా ఈ శ్లోకాన్ని- అమ్మవారి "సౌందర్యలహరి" లోని 42వ శ్లోకంగా ప్రసాదించారు శంకరభగవత్పాదులవారు.

ప్రయత్నిస్తే తప్పులేదుగా ? ఎన్నో టెస్ట్లలూ- మందులూ- డబ్బూ ఖర్చుచేసినా- నిస్పృహచెందినవారికిది - దివ్యౌషధంకాదా ?

## జగన్మాత కేశపాశ సౌందర్యం.

**43 శ్లో॥ ధునోతు ధ్వాన్తం నస్తులిత దళితేందీవర వనం,**
**ఘనస్నిగ్ధ శ్లక్ష్ణం, చికుర నికురుంబం, తవ, శివే!**
**యదీయం, సౌరభ్యం, సహజముపలబ్ధుం సుమనసో,**
**వసన్త్యస్మి న్మన్యే, వలమథన వాటీ విటపినామ్ ॥**

ఈ శ్లోకంలో జగన్మాత కురుల సౌందర్యాన్ని వర్ణిస్తున్నారు ఆచార్యులవారు.

**అర్థము :-** ఓ శివా! భవానీ! జగన్మాతా! వికసించిన నల్లకలువ పలవనమును (దళితేందీవరవనం) గుర్తుకు తెస్తూ, నల్లని మేఘముల వలె స్నిగ్ధములై, మృదుతరములగు నీ నిడుపాటి (అలల వంటి నొక్కుల నొక్కుల) కేశపాశము మా అజ్ఞానమును పోగొట్టుగాక. ఇకనీ కేశపాశము యొక్క సహజ సౌరభమును తాము అనుభవించి తరించుటకుగాను,

"బలడు" అనే రాక్షసుని సంహరించి, "బలవైరి" (వలమధనుడు) అనే బిరుదు పొందిన మహేంద్రుని నందనవనంలోని కల్పవృక్షముల యొక్క పుష్పములు- నీ కేశపాశాన్ని ఆశ్రయించాయి! నీ శిగలో పూల చెండుగా అమరి ధన్యత చెందాయి!)

జగన్మాత కేశములు సుగంధ భరితమైనవి. "సుగంధకుంతలాంబ" అనే దేవి- శక్తి పీఠాలలో వున్నది. ఇక్కడ శంకర భగవత్పాదులు రచించిన భవానీ భుజంగా ప్రయాత స్తోత్రంలోని 9 వ శ్లోకం - గమనించండి.

(భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం - 9 వ శ్లోకం)

**శ్లో ॥ చలత్కుంతలాంత ర్భ్రమ ద్భృంగ బృందం,**
**ఘనస్నిగ్ధ ధమ్మిల్ల భూషోజ్జ్వలంతే!**
**స్ఫురన్మౌళి మాణిక్య బద్ధేందురేఖా**
**విలాసోల్ల సద్దివ్య మూర్ధాన మీడే ॥**

**అర్థం :-** (తల్లీ! నల్లని తుమ్మెద బారులనుగుర్తుకు తెస్తూ - న్లని మేఘముల - మృదుత్వాన్ని పుణికిపుచ్చుకున్నట్లున్న నీ కేశపాశాన్ని నుదుటిపై పడకుండా పట్టివుంచే చంద్రరేఖ - (మాణిక్యములతో చేసిన చంద్రరేఖఆభరణంగా నీ శిరసుపై అమరిపోగా- నమస్కరిస్తున్నాను.)

ఆ పూలవలె మనం కూడా జగన్మాత కేశపాశాన్ని హృదయంలో సాక్షాత్కరింపజేసుకుని తరిద్దాము రండి!

ఈ శ్లోకాన్ని భక్తిశ్రద్ధలతో ప్రతిరోజూ జపించిన వారికి- సకల జనవశ్యత కలుగుతుందని - తాంత్రిక శాస్త్రం చెబుతోంది. "సకలజనవశ్యత" అనేది లౌకికమైనదికాదు.

మనహృదయంలో - మనతలవెంట్రుకలకు మించినన్ని లెక్కకు మించిన కోర్కెలు నిరంతరం పుడుతూనే వుంటాయి. ఒకటి తీరితే మరొకటి తయారౌతుంటుంది. తలవెంట్రుకలను ఎన్నిమార్లు కత్తిరించినా - మరలా మరలా పెరిగినట్లే, ఈ కోర్కెలను ఎంతగా తీర్చుకున్నా - అవి పెరుగుతుంటాయేగానీ తరగవు. కారు మబ్బులతో- నల్లకలువలతో - తుమ్మెదలబారుతో కేశములు పోల్చినపుడు - కారుమబ్బులవలె చీకటి అజ్ఞానం. తుమ్మెదల వలె అతిచంచలము. నల్ల కలువల వలె - పగటి వెలుగును చూడలేక ముకుళించుకు పోవటం అనే లక్షణాలు గుర్తుకు వస్తాయి. మన మనస్సు ఈ మూడిటికీ ఆలవాలము. "తల్లీ! నీ కేశములు మాకు క్షేమం కలుగ జేయుగాక!" అని భగవత్పాదులవారు అర్థించటంలో అర్థం - మనలోని అజ్ఞానపు కోరికలనూ, అత్యాశ అనే తమస్సునూ - పోగొట్టి - సత్సంస్కారం అనే జ్ఞాన జ్యోతిని ఆ తల్లి కేశపాశం - మనందరికీ ప్రసాదించుగాక - అనే దీవెన అంతర్గతంగా వున్నది. అవునా ? ఆ కోర్కెల కారు చీకటిని తరమగలిగితే- అంతావెలుగు వెల్లువే సుమా!

# జగన్మాత సీమంతము (పాపిట వైభవము)

44 శ్లో॥ తనోతుక్షేమం నస్తవ వదన సౌందర్యలహరీ
పరీవాహస్రోతస్సరణి రివ సీమన్త సరణీః
వహంతీ సిన్దూరం ప్రబల కబరీ భారతిమిర
ద్విషాం బృన్దై ర్బన్దీకృత మివ! నవీనార్క కిరణమ్! ॥

అర్థం :- ఓ జగన్మాతా! నీ వదన సౌందర్య ప్రవాహము ప్రవహించు మార్గమువలె నున్న నీ సీమంతరేఖ (పాపిట)

బాలభానుని కేశపాశములచే బలముగా బంధించినట్లు, సింధూరపు బొట్టును ధరించినదై (పాపిట) మాకు క్షేమము కలుగజేయునుగాక.

శంకర భగవత్పాదులవారు - అమ్మవారి ముఖసౌందర్యాన్ని - ఒక మహాద్భుత సౌందర్య ప్రవాహంలా దర్శించారు. ఆ మహాద్భుత సౌందర్య ప్రవాహం జాలువారే "దారి" వలె ఆమెపాపిట దృగ్గోచరమైంది." పాపిట పొడుగూతా సింధూరం వున్నది. ముత్తైదువలు నుదుట కుకుంమబొట్టు పెట్టుకుని - పాపిటలోనూ పెట్టుకుంటూరు. కొన్నిరాష్ట్రాలలో వివాహ సమయంలో వధువు పాపిటపై - వరుడు సింధూరం పెట్టడమే వివాహ తంతులో ముఖ్యమైన ఘట్టంగా ఆచారంగానూ వున్నది. అట్లా పాపిటలో సిందూరం దాల్చిన స్త్రీకి భర్త - బిడ్డలు సకల సౌభాగ్యాలు స్థిరంగా వుంటాయని విశ్వసిస్తారు.

పాపిటలో సింధూరపు కాంతితో - బాలభానునిలా వుంది. ఆ తల్లి పాపిట. పాపిటకు ఇరువైపులా వున్న నల్లని కురుల వలన - బాలభానుడు - అట్లాబందీ అయివున్నాడా? నల్లని మబ్బుల చేత (కురుల చేత) బందీ అయిన బాలభానునిలా ఆ తల్లి పాపిట భాసిస్తోంది.

ఆమెను ఆరాధించేవారి అజ్ఞానాన్ని తొలగించే ఉదయభానుని సాక్షాత్కారంలా వుందా తల్లిపాపిట సింధూరాంకి తమై,! ఆచార్యులవారు దర్శించారు. మనల్నీ దర్శించమని ఉద్బోధించారు. నమ్మటం నమ్మక పోవటమన్నది మనభక్తి సాంద్రతను బట్టి - మనపూర్వజన్మ పరిపాకాన్నిబట్టీ వుంటుంది. అవునా ? ఈ శ్లోకం రోజూ జపిస్తే- వశ్యత్వము - బాధానివృత్తి కలుగుతాయని తంత్రశాస్త్రం చెబుతోంది. మనకు ఓపిక వున్నన్ని మార్లుజపించాలి.

మనమనసును కట్టడిచేసుకోగలగటమే వశ్యత్వం అది అయిన మరుక్షణం సమస్యల బాధానివృత్తి క్షణాలమీద జరుగుతుంది. అవునా ? మరి ఆలస్యమెందుకు ? రోజుకు చాలా మార్లు చేయలేనివారు - ఒక్కమారు భక్తిశ్రద్ధలతో పఠించినాచాలు. దానిఫలితం - దానికుంటుంది.

# ముఖసౌందర్యము - ముఖ లావణ్యం

45 శ్లో॥ ॥అరాళై స్స్వాభావ్యా దళికలభస శ్రీభిరలకైః
పరీతంతే వక్త్రం, పరిహసతి పఙ్కేరుహ రుచిమ్.
దరస్మేరే యస్మిన్ దశనరుచి కింజల్క రుచిరే
సుగన్ధౌ మాద్యన్తి స్మరదహన చక్షుర్మ ధులిహః ॥

అర్థము :- తల్లీ! జగన్మాతా! సహజముగా వక్రములై (వంకీలుతిరిగి) కొదమ తుమ్మెదలవలె నల్లనివైన నీ ముంగురులచే, ఆ వృతమై (చుట్టబడి) వున్న నీవదనము - తల్లీ! పద్మము యొక్క సౌందర్యమును పరిహసించు చున్నది. వికసితపద్మం చుట్టూరా తుమ్మెదలు మూగివున్నట్లే - నీ ముఖపద్మం చుట్టూరా - ముంగురులు పరచుకొని వున్నాయి.

ఇక నీ పలువరుస ? తల్లీ! పద్మకింజల్కములు అనగా పద్మం మధ్యవుండే అందమైన కేసరములు వలె తెల్లగానూ, హెచ్చుతగ్గులులేక ఒకే విధంగానూ వున్నాయి.

అంతటి ముఖ సౌందర్యమును చూస్తూ - కామదహనుడై - కామారి అనిపేరుగాంచిన పరమశివుడు కూడా, పరవశుడై - మత్తుగొన్న చూపులతో- కొదమ (మగ) తుమ్మెదలను గుర్తుకు తెస్తున్నాడు (పరమ శివుని చూపులు - జగన్మాత వదన సౌందర్యం చుట్టూరా పరిభ్రమిస్తున్నాయి అనే భావన.)

శ్రీ శంకర భగవత్పాదులవారు - తమ భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలో అమ్మవారి ముఖ సౌందర్యాన్ని వర్ణిస్తూ 7వ శ్లోకంలో ఇలా అంటారు.

(భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం. 7వ శ్లోకం)

శ్లో ॥ శరత్పూర్ణ చంద్ర ప్రభాపూర్ణ బింబా
ధర స్మేర వక్త్రారవిందాం - సుశాంతాం!
సురత్నా వళీ హార తాటంక శోభాం
మహాసు ప్రసన్నాం, భజే శ్రీ భవానీం ॥

అంటూ కీర్తించారు హృద్యంగమంగా.

శరదృతువులోని పౌర్ణమినాటి చంద్రబింబంలా ఆ తల్లి ముఖార విందం, చల్లని చిరునవ్వుతో - శాంత స్వరూపంగా వుండగా, మంచిరత్న హారములతో కూడిన తాటంకములు (చెవి మాటీలతో కూడిన తాటంకములు) ధరించిన ఆ తల్లి.

"మహా సుప్రసన్నాం!" నిజభక్తులపాలిటి సుప్రసన్నమూర్తి!

భవానీ! తల్లీ! నీకు మనసారా మ్రొక్కుతున్నాను."

ఆ భావల హరిలోనే- ఈ సౌందర్యలహరి శ్లోకం కూడా రూపు దిద్దుకున్నట్లున్నది కదా ?

ఈ శ్లోకాన్ని రోజూ శక్తికొలదీ 40 రోజులపాటు (మండలం) జపించగలిగితే - "వాక్సిద్ధి వస్తుందని - తంత్రశాస్త్రం చెబుతోంది.

"పక్కింటివారు పాతాళానికి క్రుంగిపోయి - మనం ఆకాశమంత ఎత్తుకు ఎదిగిపోవాలి అనో!

ఎదురింటివారు భూకంపంలోకి జారిపోయి - మనం మాత్రం క్షేమంగావుండాలనో - కోర్కెలతో చేస్తే వాక్సిద్ధి రాదుకదా! ఆయసం, అలా జరగదు కాబట్టి హై.బి.పి. మనకీ అనారోగ్యం వస్తాయి తప్పకుండా! నిరంతరం సర్వులూక్షేమంగా ఉండాలని వారందరితో బాటు మనమూ సుఖశాంతులతో వుండాలనీ చేస్తే అమ్మవారు ఆలకిస్తుంది అనుగ్రహిస్తుంది.

"వాక్సిద్ధి" ప్రళయాలకోసంకాదు. ప్రశాంతతకోసం. సిద్ధిమాట ఎలావున్నా 45వ శ్లోకం " "అరాళైస్స్వాభావ్యా," అనేది కంఠస్థంచేస్తూ - ఆ జగన్మాత వదనార వింద సౌందర్యంలో పసిపాపల్లా - ఆచార్యుల వారితో బాటు మనము మునకలువేసి ఎనలేని వాగాతీతమైన మానసిక ఆనందాన్ని పొందుదాము పదండి. జగద్గురువులే మార్గదర్శకులై వుండగా మనకిక కొరవఏమిటి?

## 46. అమ్మవారి లలాట లావణ్యము.

**46. శ్లో॥లలాటం లావణ్యద్యుతి విమల మాభాతి తవయత్,**
**ద్వితీయం తన్మన్యే, మకుటఘటితం చన్ద్ర శకలమ్.**
**విపర్యా సన్యాసా దుభయ మపి, సమ్భూయచ మిద**
**సుధాలేప స్యూతి: పరిణమతి రాకా హిమకరః ॥**

**అర్థము :-** ఓ జగన్మాతా! తల్లీ! అద్దంలా నిగనిగలాడుతూన్న నీ లలాటం (నుదురు) పై నీ కిరీటపు (క్రింది అంచు) అర్ధ చంద్రాకృతిలో వున్నది ( మంత్రశాస్త్రంలో శ్రీ చక్రంలో ఇదే త్రికోణంగా భావించవచ్చును.

"అష్టమీ చంద్ర విభ్రాజ దళిక స్థలశోభితా!" అనే శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలోని శ్లోకార్థంలా, నీ లలాటము అష్టమినాటి చంద్రబింబంలా, సరిగ్గా మధ్యకు కొలతపెట్టినట్లుగా "( ‿ ") వుంటుంది హెచ్చుతగ్గులు లేకుండా! శిరసుపై నున్న కిరీటపు క్రిందికి వంగిన అర్ధ చంద్రకారపు అంచూ, ఈ నీ నుదురు అర్ధచంద్రాకారమూ కలిసి - పూర్ణచంద్రబింబాన్ని గుర్తుకుతెస్తున్నాయి ( ◯ ) పౌర్ణమినాటి చంద్రబింబమును స్మరణకు తేవటమేగాక, నీ భక్తులకు - నీ సాధకులకు, ప్రతిక్షణం, ప్రతిరోజూ నీ అపార కరుణ అనే అమృతధారలను (వెన్నెల వెల్లువలను) కురిపిస్తున్నాయి. పౌర్ణమినాటి చంద్రుడు - తన అమృత ధారలతో సర్వజీవ కోటినీ ముంచెత్తుతాడు.

దేవీ ఉపాసకులు - ఉపాసనాఫలంగా, తమలలాట (ఫాలభాగంలోని ఆజ్ఞా చక్రంలో) మునందు పూర్ణ చంద్ర బింబదర్శనం పొంది అమృతధారలను పొందుతారు. అపార శాంతి సముద్రంలో ఓలలాడుతారు. సాధనలోని చివరి మెట్టుకు చేరుకోగలుగుతారు. అయితే, పౌర్ణమినాటి పూర్ణబింబం రోజూరాదు కదా ? అలాటప్పుడు రోజూ అమృత వర్షం ఎలా సాధ్యమౌతుంది ? అదే - ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, ఆ తల్లి కిరీటం యొక్క క్రింది ఒంపునూ, ఆ తల్లి నుదురుయొక్క పై ఒంపూ కలిపి- ఊహిస్తే - భవానీ దేవి యొక్క నెన్నుదురే - పూర్ణచంద్ర బింబంగా భాసిస్తుంది సాధకుల హృదయాకాశంలో. ఇక్కడ ఒక్కమారు ఆగి వివరణ గమనిద్దాము. అమ్మవారి శిరస్సుపై నున్న కిరీటంలో ద్వాదశ ఆదిత్యులు మణులుగా ఒదిగిపోయి- సర్వజగత్తులకు అమ్మవారి కృపతో, జీవనాధారమైన వెలుగునూ, ప్రకాశాన్ని - వేడిమినీ - ప్రసాదించి అజ్ఞానాంధకారాన్ని పారద్రోలుతుండగా, ఆతల్లి పాపిట - సీమంతరేఖ ఉదయిస్తున్న భానుని కిరణాల్లా భక్తుల పాపాలనీ, తమస్సునూ పారద్రోలుతుండగా, ఇక ఆతల్లి కేశపాశపు సహజసౌరభంలో - సర్వదేవతావృక్షాల పుష్పాలు పూల చెండుగా ఒదిగిపోయి - తమ పుష్ప జన్మను సార్థకం చేసుకుంటున్నాయి. ఆ తల్లి వదనారవిందము, పలువరస, వికసిస్తున్న పద్మముల, పద్మ కేసరముల సౌందర్యాన్ని పరిహసిస్తుండగా, ఆ తల్లినుదుటి పై ఒంపూ, ఆ తల్లి కిరీటం యొక్క క్రింది ఒంపూ కలిసి - పౌర్ణమినాటి పూర్ణచంద్ర బింబంగా భాసిస్తూ, భక్తులకు అమృతవర్షం కురిపిస్తున్నాయి.

అహో (! ఏమి సౌందర్యలహరి! ఏమి దర్శన సౌభాగ్యము ? ఏమి సాక్షాత్కారం! ఆచార్యులవారు మార్గదర్శనం చేస్తుండగా మనబోటి వారము మనకు "గురువు ఎవరు ? ఎక్కడ లభ్యమౌతారు ?" అనే అన్వేషణతోవృధాగా కాలయాపన చేయక, ఈశ్వరుడు - ఈశ్వరి ఈదేశానికి ప్రసాదించిన పరమగురువుకు మ్రొక్కి, వారి అడుగు జాడలలో, ఆలోచనా పథంలో - ఆ తల్లి సాక్షాత్కారాన్ని పొందుదాము. పదండి మరీ! ఈ శ్లోకాన్ని రోజుకు 1000 మార్లు (వెయ్యిమార్లు) పునశ్చరణ చేసినవారికి (స్త్రీలకు) భర్తృ సమాగమము- గర్భధారణ జరుగును - అని తంత్ర శాస్త్రంలో యంత్ర పూజావిధితో బాటుగా చెప్పారు తాంత్రిక శాస్త్రవేత్తలు.

ఆనాడు - దేశాంతరం వెళ్లిన భర్త తిరిగి - ఎన్నేళ్లకో రావటమన్నది గొప్ప అదృష్టం స్త్రీలకు. రాక్షస చెరలో వున్న సీతాదేవి. అడవులపాలైన దమయంతి యముని చేత భర్త ప్రాణాలు కొనిపోబడిన సావిత్రిలాటి మహాపతివ్రతా శిరోమణులందరూ భవానిని పూజించి- వ్రతాలుచేసి- భర్తృసమాగమాన్ని పొందగలిగారు.

ఈనాడు- ఎందరిస్త్రీలభర్తలో- అమెరికా, దుబాయ్-- ఆస్ట్రేలియా- లండన్ - ఇలా వివిధ దేశాలలో ఉద్యోగార్థమూ, దనాపేక్షతోనో, సంవత్సరాలతరబడి వుంటున్నారు. వారి భార్యలు

అక్కడికి వెళ్లగలిగి - వారితో వుండగలిగితే వుంటున్నారు. లేకపోతే స్వదేశంలోనే - తమ తమ భాద్యతలతో వుండి పోవలసి వస్తోంది. ఇలాటి వారందరికీ - ఆ జగన్మాత అపారదయవుంటే భర్త సమాగమము (కలిసి జీవించే అదృష్టము, అవకాశము వస్తాయి. ఇకగర్భధారణ అన్నది ఈరోజులో ఎవరి ఇష్టానుసారం వారు సాధిస్తున్నది గనుక, తమతమ అనుకూలములను బట్టి సంతానప్రాప్తి పొందగలరు. దుష్టసంతానం- కలుగకుండా వుండేందుకు అమ్మవారి అపార కరుణ అత్యావశ్యకం సుమా! "మాకు సత్సంతానం" ప్రసాదించమని కోరటమే పుణ్యస్త్రీ మంచి కోర్కె అవునా!

## అమ్మవారి "( భ్రూయుగ్మము," అనగా కనుబొమల సౌందర్యము.

**47 శ్లో॥ భ్రువౌ భగ్నేకించి ద్భువన భయభఙ్గ వ్యసనిని**
**త్వదీయే నేత్రాభ్యాం, మధుకరరుచిభ్యాం, ధృతగుణమ్.**
**ధనుర్మన్యే, సవ్యేతరకర గృహీతం రతిపతేః**
**ప్ర కోష్ఠేముష్టేచ స్థగయతి, ని గూఢాన్తర-ముమే!**

**అర్థము** :- ఓ ఉమా! కాత్యాయనీ! భవానీ! జగన్మాతా! నీ నేత్రములు కదిలే తుమ్మెదల బారు (కంటిరెప్పలు తుమ్మెదరెక్కలవలె నల్లగా వుండటం వలన) అదే మన్మధుని వింటినారి కూడాను: నీ కనుబోమలే మన్మధునివిల్లు, అయితే కనుబొమల మధ్యప్రదేశం - సరిగ్గా విల్లుయొక్క మధ్య ప్రదేశంలా వుండి - మన్మధుడు తన కుడిచేతితో విల్లు పట్టుకుని వున్నట్లుగా నీ రెండు కనుబొమల మధ్యప్రదేశం అతడిముంజేయి, పిడికిలి మూసివేయగా, (అడ్డురాగా,) ని గూఢంగా వున్నది. అర్జునుడు సవ్యసాచి అంటారు. ఎడమచేతితోనూ బాణాలు సంధించగల వీరుడు అని అర్థం. బహుశా మన్మధుడు కూడా సవ్యసాచి అయివుండాలి. సాధారణంగా విలుకాండ్రు ఎడమచేతిలో విల్లుపట్టుకుని కుడిచేతితో బాణం సంధిస్తారు.

ఈ శ్లోకంలో "సవ్యేతర" అనటంలో- కుడిచేతితో విల్లుపట్టుకున్నట్లుగా వున్నది మన్మధుడి సవ్యసాచిత్వము.

ఆభ్రుకుటిని అట్లా దర్శించారు శ్రీ శంకర భగవత్పాదుల వారు మనమూ ఆ ఊహా సౌందర్య ప్రవాహంలో మునకలు వేద్దామురండి!

తమ "భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలో" శ్రీ శంకర భగవత్పాదులవారు 8వ శ్లోకంలో అమ్మవారి లలాటం- కనుబొమలు- లలాటంపై నున్న కస్తూరితిలకము, నాసిక, పెదవులు (ఓష్ఠములు) తో అమ్మవారి వదనారవిందాన్ని ఇలావర్ణించారు గమనించండి.

## (భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం. 8వ శ్లోకం)

(8) శ్లో ॥ సునాసాపుటం- సుందర భ్రూ,లలాటం
తవౌష్ఠశ్రయం, దాన దక్షం, కటాక్షం
లలాటోల్ల సద్గంధ కస్తూరి భూషం-
స్ఫురచ్ఛ్రీ ముఖాంభోజ, మీడేహమంబ!

(చక్కని నీ నాసిక, సుందరమైన కనుబొమలు, లలాట లావణ్యద్యుతి, భక్తులకు వరదానం చేసే - తియ్యని పదముల పెదవులు- కరుణా కటాక్షములు, లలాటంపై కస్తూరి సువాసనలు వెదజల్లే తిలకం(బొట్టు) - నీ శ్రీ ముఖారవిందాన్ని తనివిదీరా దర్శిస్తున్నాను జగదంబా!"

అంటూ అద్భుతంగా కీర్తించారు గమనించండి.

ఈ శ్లోకాన్ని రోజూ 7 వేలమార్లు (7000) పునశ్చరణ చేసి - ఈ శ్లోకానికి సంబంధించిన బీజాక్షర యంత్రాన్ని బంగారురేకుపై లిఖించి- 25 రోజులు పూజించినచో- దేవత వశము అవుతుంది అని తాంత్రిక శాస్త్రవేత్తలు చెప్పారు. - దీనినే భస్మముతో అభిమంత్రించి- అదేపూజావిధానంతో - నుదుట ధరిస్తే - సకలవశ్యము అని - వారే శలవిచ్చారు. కానీ - ఒకవిషయం గుర్తుంచుకోవాలిమనం అందరం. సాధారణ సంసారాలలో, ఎన్నో బాధ్యతలతో పరుగులు తీసే మనందరం రోజుకు 7 వేలమార్లు ఈ శ్లోక జపం చేయగలగటం అసాధ్యం. కారణం మన కర్తవ్యపాలనే ముందుగా మనం చేయవలసిన ధర్మంగనుక. స్వధర్మాచారణను మించిన పూజ జపం- ధ్యానం-సమాధి మరొకటి లేవు గనుక. జితేంద్రియులై బాధ్యతలు లేనివారూ, ఆధ్యాత్మిక బాటలో మాత్రమే పయనించేవారు-మరే ఇతర కర్తవ్యాలు లేనివారు సన్యాసులు మాత్రం ఇలాటి సాధన చేయగలరు. గృహిణీ గృహస్థులకు ఇది అసాధ్యం. మానసికంగా చేసుకుంటున్నా సాధ్యపడదు. బి.పి. పెరుగుతుంది. కొత్తజబ్బులు వస్తాయి.

అందువలన, ఈశ్లోకపునశ్చరణ- తమకు సాధ్యపడినన్ని మార్ల చేసుకొనవచ్చును. ఇక సర్వవశ్యము- అనగా- ఇంద్రియ నిగ్రహము భోగములపై - మనకులేని- రాని వాటిపై మితిమీరిన కోరిక అవిరాలేదని చింతల్లాటివి జయించటమే. దేవతావశ్యము అనగా- మన ఇష్టదైవం - లేక - అమ్మవారు - మనకు వశవర్తులౌతారనిగాక, ఆ దేవతల అనుగ్రహానికి మనం పాత్రులం కాగలమనే వినయంతో కూడిన భావన - వినతి. అవునా! ఏది ఏమైనా శ్లోకం ఏదైనా పునశ్చరణ, మనశక్తి, మనవీలు, మనబాధ్యతలనుబట్టి చేసుకోవాలేగానీ, మొండిగా అతిగా చేసి ఆరోగ్యం చెడగొట్టుకోకూడదు సుమా!

# జగన్మాత నేత్ర సౌందర్యం

48. శ్లో ॥ అహస్సూతే సవ్యంతవనయన మర్కాత్మకతయా
త్రియామాం వామంతే సృజతి రజనీ నాయకతయా,
తృతీయాతే, దృష్టిర్దర దళిత హేమామ్బు రుచి
స్సమాధత్తే సన్ధ్యాం, దివసనిశయో స్తరచరీమ్॥

అర్థము :- ఓ జగన్మాతా! భగవతి! నీ కుడికన్ను సూర్యాత్మకమయి పగలునూ, నీ ఎడమకన్ను చంద్రాత్మకమై రాత్రినీ ఏర్పరచుచున్నది. కొద్దిగా వికసించిన (అరవిరిసిన) బంగారు కమలము వంటి నీ మూడవనేత్రము (ఫాలనేత్రము) పగలూ, రాత్రికీ మధ్యకాలం అయిన "సంధ్యా" సమయాన్ని సూచిస్తున్నది.

శ్రీ శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో సోమసూర్యాగ్నిలోచన అయిన శ్రీ మాత మూడు కన్నులనూ, మానవులకూ - ప్రాణి కోటికంతటికీ- సర్వప్రపంచానికీ- ఆయు: పరిమితి - జీవన విధానము నిర్దేశించే "కాల" సంకేతాలుగా అభివర్ణించారు. ఆ పరమగురువు అట్లా దర్శించారు ఆ తల్లి త్రినేత్రాలను! త్రయంబకుని ఇల్లాలు త్రయంబకదేవి. "అంబక" మనగాకన్ను సోమ సూర్యాగ్ని నేత్రాలు ఈశ్వరునికే వున్నాయి- అర్ధ నారీశ్వరి అయిన ఆ తల్లికే వున్నాయి. శిరసుపై చంద్రరేఖ, జటాజూటము కూడా ఇరువురికే వున్నాయి. అందుకే వారిరువూ - శివశక్తులు పంచవిధసామ్యము కలిగిన ఆదర్శదంపతులు. జగన్మాత- జగత్పితలు! అధిష్ఠాన - అనుష్ఠాన - అవస్థాన, రూప, నామసామ్యములే - పంచవిధసామ్యములు.

జగన్మాత మూడుకన్నులే - త్రికాలాలకు ప్రతిబింబాలుగా వున్నాయన్నారు పరమగురువు! పగలు- రాత్రి- మధ్యన వుండే సంధ్య.

ఒకరోజు - ఒకవారం, ఒక పక్షం, ఒకమాసం - ఒక ఋతువు, ఒక అయనం- ఒకసంవత్సరం - ఒకయుగం- ఒకకల్పం - ఒక మహాకల్పం - ఒకబ్రహ్మ కల్పం- ఇలా కాలం. అవిభాజ్యంగా సాగిపోతూనే వుంటుంది నిరంతరం, ఆకాల స్వరూపాన్ని రోజూచూస్తున్నా మనంగుర్తించలేము. కారణం మన అజ్ఞానం- మన జీవితపరుగులు-లో మనం వుండిపోతున్నాం. పగలు సూర్యునిలో - పగటివెలుగులో - రాత్రిచంద్రునిలో - చల్లని వెన్నెలలో - సంధ్యా సమయంలోని అరుణిమలో - అమ్మవారి నేత్రత్రయాన్ని దర్శించగలిగేమన: స్థితికి మనం ఎదగ గలిగితే - ఆ తల్లి నిర్గుణరూపం ఈ పంచభూతాలతోనూ ఎట్లా విరాట్‌రూపం ధరించి - నిండివున్నదో కొంత భోధపడ్తుంది మనకు. కేవలం సౌందర్యమే కాదు, సర్వప్రాణి కోటికి కాల నిర్ణయాన్ని, కాలకర్తవ్యాలనూ, కాలపు విలువలనూ, అత్యుత్తమమైన మానవజన్మ సార్థకతనూ, దర్శించగలగుతాము.

"ఆ ( ! ఏమిటో! మూడు కళ్లేమిటో, కళ్లకూ కాలానికీ లంకె ఏమిటో, వెర్రి వెయ్యివిధాలంటారు. ఎంతటి వారికీ వేపకాయంత వెర్రివుంటుంది కాబోలు!" అని కుతర్కాలు చేసే ప్రబుద్ధులకు, సోమ సూర్యాగ్ని నేత్రాలతో కూడివున్న ఆ తల్లి విరాట్‌రూపం కాదు సరికదా, తమ కళ్ల ఎదుట కరిగిపోతున్న కాలం విలువ కూడా తెలియదు. కాలం కరిగిపోయాక, ఒక అత్యద్భుత జన్మ వృధా అయిపోయాక, ఇక పశ్చాత్తాపపడటానికి కూడా టైముండదు సుమా! "జన్మ జలధౌ-నిమగ్నానాం" అన్నట్లుగా- జన్మ పరంపరలలో చిక్కుకు పోవటమే వీరివంతు అవుతుంది.

ఆ ప్రమాదం మనం ఎదుర్కొనకుందుము గాక!

ఆ విషయాన్నే పరోక్షంగా భోధించారు ఆచార్యుల వారు అమ్మవారి నేత్ర సౌందర్య దర్శనంతో!

ఈ శ్లోకాన్ని రోజుకు వేయిమార్లు చొప్పున 19 (పంధొమ్మిదిరోజులు) పునశ్చరణ చేయగలిగితే- "నవగ్రహదోషశాంతి" కలుగుతుందని వక్కాణించారు తాంత్రిక శాస్త్రవేత్తలు, ఓపికతీరిక వున్నవారు తప్పక చేయవచ్చు- నవగ్రహములూ- బయటి ప్రపంచంలోనూ- మనలోని ఆలోచనల రూపంలోను కూడా వున్నాయి. ఆ గ్రహశాంతి - మన గృహశాంతి- మనశ్శాంతి కూడా ఇస్తుంది.

హై.బి.పి. తెచ్చుకోకుండా, మన ఆరోగ్యాలు దెబ్బతిని - మనప్రక్క వారికి మనంసమస్యకాకుండా వుండేంతవరకూ - పూజ అంటే - విసుగు-కోపం - అసహ్యం - కలిగేవరకూ కాకుండా - ఏ మంత్రం జపించగలిగినా మంచిదే! అవునా! వెయ్యిమార్లు అనిగాక రోజూ మనం విసుగురాకుండా చేయగలిగినన్ని మార్లు మననం చేసుకోవచ్చును. 19రోజులలో కాకపోతే, 40రోజులకు సంఖ్య పూర్తయినా ఫర్వాలేదు సరా ?

## అమ్మవారి "దృష్టి" వైభవము.

**49 శ్లో॥ విశాలా, కల్యాణీ, స్ఫుటరుచి రయోధ్యా, కువలయైః,**
**కృపాధారా ౽౽ ధారా, కిమపి మధురా౽ భోగవతికా**
**అవన్తీ దృష్టిస్తే, బహునగర విస్తార, విజయా,**
**ధ్రువం తత్తన్నామ వ్యవహరణయోగ్యా, విజయతే!**

ఈ శ్లోకంలో శ్రీ జగద్గురువులవారు - అమ్మవారి వివిద దృష్టి వైభవాలను వర్ణిస్తున్నారు అద్భుతంగా- దృష్టి ప్రభావం కూడా భోధిస్తున్నారు గమనించండి.

అర్థం :- తల్లీ భగవతీ! జగన్మాతా! భవానీ! నీ దృష్టి విశాలయై కల్యాణియై, వికసించిన పద్మముల కాంతికలిగి ( కువలయై ః ) అయోధ్యయై, కృపాధారల కాధారమగుచు, ధారయై,

అవ్యక్త మధురమగుచు మధురయై, అవంతియై, జయోజ్వలయగుచు విజయమై, ఆయానగర నామములతో వ్యవహరింపదగినదై యున్నది - అనిమాత్రం అర్థం వస్తుంది.

కానీ శంకరభగవత్పాదులవారు- ఇంతమాత్రం అర్థాన్ని సూచించలేదీ శ్లోకంలో! మరేంచెప్పారు? కాస్తంత పరిశీలిద్దామా ? రండి- భగవత్పాదులవారి ఆలోచనలను పంచుకుని తరిద్దాము. విశాలా, కల్యాణీ, అయోధ్యా, ధారా, మధురా, భోగవతీ, అవంతీ, విజయా, అనేవి మోక్షపురములైన ఎనిమిది ( అష్ట ) పురములపేర్లు. ప్రాత: కాలంలో- సాయంసంధ్యలో - ఒక్కమారు ఈ పురముల పేర్లు మననం చేసుకున్నాచాలు, మోక్షం ప్రాప్తిస్తుందంటారు పెద్దలు. మహర్షులు- మహాత్ములూ!

ఇవి అమ్మవారిదృష్టులు గా భగవత్పాదులవారు అభివర్ణించారు. ఈ ఎనిమిది రకాల దృష్టులతో అమ్మవారు సకలచరా చరాలనూ వీక్షిస్తుంది. ముఖ్యంగా మానవులపై ఆదృష్టుల ప్రభావం ఎలా వుంటుందో తెలుసు కుందాము.

ఈ చూపులన్నీ ప్రతిస్త్రీకీ వుంటాయి.

జగన్మాతదృష్టులలో దైవీ వైభవం వుంటుంది. మానవదృష్టిలో మానవశక్తి మాత్రమే నిక్షిప్తమై వుంటుంది అదీతేడా!

1. సంక్షోభణ. 2. ఆకర్షణ. 3. ద్రావణ. 4. ఉన్మాదన. 5. వశ్యము. 6. ఉచ్చాటనము. 7. విద్వేషణము. 8. మారణము అనే ఎనిమిది భావాలనూ, ఎనిమిది కార్యములనూ చేస్తాయి ఈ ఎనిమిది దృష్టులు. దృష్టికి వుండే శక్తి మహాగొప్పది సుమా!

1. అంతర్వికాసము - అనగా, లోపలి వికాసముతో- ( లోతైన ఆలోచనతో ) కూడిన రూపము గల దృష్టి - "విశాల" అనేదృష్టి. సాధకులు - భక్తులు అంతర్ముఖులైనపుడు, వారి ఆలోచనలు సర్వప్రపంచాలనూ చుట్టిరాగలవు. ఆత్మదర్శనానికి ఇదేమార్గదర్శకమౌతుందికొంత కాలానికి. ఇదే సంక్షోభ దృష్టి. మనసును జిజ్ఞానవైపు మరలించే లోతైన ఆలోచనలు కలిగించే దృష్టి ఇదే!

2. ఆశ్చర్యము, విస్మయముతో కూడిన చిరునగవు గలిగిన దృష్టి "కల్యాణి" ఇది అత్యంతా కర్షణీయమైన దృష్టి. ఈ దృష్టితో స్త్రీ చూచేటప్పుడు ఆమె నేత్రాలు అప్రయత్నంగా ఆశ్చర్యంతో విప్పారుతాయి! విస్మయంతో కూడి - కనుబొమలు పైకి వెళ్తాయి. ( లాస్యనాట్యంలో - ఇదొక అద్భుతమైన అభినయప్రక్రియకూడాను. ఒక్కొక్క మారు అప్రయత్నంగా "ఆహ ( అలాగా!' ' అన్నట్లుగా కుడిచేయి వ్రేళ్లు - ఆ స్త్రీ గడ్డంక్రిందపెట్టుకుని విస్మయభావం ప్రకటిస్తుంది కూడాను! ఇవన్నీ అసంకల్ప ప్రతీకార చర్య లేసుమండీ! ఈ దృష్టిలో వుండగా ఆస్త్రీని చూచేవారికి - ఒకానొక వింత ఆకర్షణ - సౌందర్యం గోచరిస్తాయి కూడాను. ఇదే "ఆకర్షణ" దృష్టి.

3. మొలక నవ్వుతో కూడినదీ, విరిసీ విరియనిపెదవులతో సన్నని చిరునవ్వు పెదవులపై లాస్యంచేసి, తటిల్లతలా ( మెరుపులా ) మెరిసి మాయమౌతుంది "అయోధ్యా" దృష్టిలో! ఈ దృష్టిలో నల్లగ్రుడ్డు మెరుపులా మెరుస్తుంది కాంతి వంతంగా! ఎదుటివారిని కింకర్త వ్యత్యామూఢులలానూ, నీరుకార్చేలా - వారిప్రయత్నాలకు గండి కొట్టేదిగా - బలహీనపడేలా చేసేదే ఈ దృష్టి. ఇదే "ద్రావణము."

4. అలసభావము, నిర్లిప్తత - మాంద్యభావము కలది "ధారా" దృష్టి. ఇది ఎదుటి వారిలో "ఉన్మాదము" - వెర్రి, భ్రాంతి కలిగిస్తుంది. ఒకస్త్రీ నిదానంగా, నిర్లిప్తంగా చూచే కొద్దీ, ఆస్త్రీని గురించి వివరాలు తెలుసుకోవాలనే, బుద్ధి బలమౌతుంది. "పోతేపోనీ - వస్తేరానీ!" అనే నిర్లిప్తధోరణిని ఈ దృష్టి ప్రతి బింబిస్తుంది. ఇదే "ఉన్మాదన" దృష్టి అంటారు.

5. కళ్లు చంచలముగా అటు ఇటు వక్ర ప్రసారములతో, వక్ర దృష్టితో చక్రల్లా కళ్లు త్రిప్పుతూ, కనురెప్పలు మాటి మాటికీ ఆర్పుతూ, ఎదుటివారికి అంతుచిక్కనీయకుండా, ఆటపట్టిస్తూ వుండే దృష్టి- చూచేచూపు "మధురాదృష్టి!" ఇది "వశ్యము" నకు ఉపయోగించే చూపు - ఈ చూపుతో "వశీకరణ" కు తావుఏర్పడుతుంది తాత్కాలికంగా మనసులో కొండంత కపటం దాచుకుని, పైకి అది తెలియనివ్వకుండా చూచే చూపు ఇది.

6. స్నిగ్ధమైన నవ్వు కళ్లలో మెరుస్తుండగా, కళ్లు నవ్వుతున్నట్లుగా, కళ్లలోనే స్నేహభావము, అపారప్రేమ ( "ఈ ప్రేమ అనేది తల్లిప్రేమ మొదలు - ప్రియుడు - ప్రియురాలివరకూ-దంపతులవరకూ - అన్నిటికీ వర్తిస్తూ ) కురిపించే దృష్టి "భోగవతి"! ఈ దృష్టితో "ఉచ్చాటనము' ' జరుగుతుంది. "ఉచ్చాటనము" అంటే ఇదేదో క్షుద్ర మంత్రోచ్చాటనమో, "చేతబడి" ప్రయోగముల్లాటివో కావు సుమా! కళ్లతోనే మాటలు - భావాలు- స్నేహము - వాత్సల్యము - ప్రేమ - కామము - కోర్కె - స్వాంతన - సానుభూతి, సహాయమూ, సహకారము - సర్వం - అన్నీభావాలు - మాటలాడినంత స్పష్టంగా కళ్లు మాటలాడినట్లుగా భావ పరివర్తన చేయగలిగే దృష్టి ఇది.

మరింత వివరంగా తెలుసుకోవాలంటే.

ఒకస్త్రీ - ఉమ్మడి కుటుంబంలో వుందనుకుందాము. ఆమె బిడ్డకు పాలిస్తూ కూర్చునివుంటుందనుకుందాం. బిడ్డపై - వాత్సల్య దృష్టిప్రసరిస్తుంది. అదే సమయంలో అటుగావచ్చి అత్తగారిని - "ఆ పనినేను చేస్తానులెండి. మీరు స్థిమితంగా కూర్చోండి!" అనే వినయపూర్వకమైన మాటచెప్పినట్లుగానూ చూడగలదు. ఇంతలో అక్కడికివచ్చిన మామగారినో, బావగారినో చూచి గౌరవపురస్సరంగా కనురెప్పలు అల్లార్చి - వారిపెద్దరికాన్ని గౌరవించనూగలదు. ఈలోగా వచ్చిన భర్త - చుట్టూరా అందరూవున్నా - తనకొక్కరైకే అర్థమయ్యేలా

చిరునవ్వునవ్వటమో- చిలిపిగా చూడటమో చేస్తే - అతడికే సమాధానంగా- విరిసీవిరియని మొలకనవ్వు నవ్వి - క్షణకాలం - పెద్దలున్నారని సూచిస్తూ హెచ్చరించి - బిడ్డకు పాలిచ్చి వచ్చి "మీపని చూస్తాను" అని సమాధానపరచి - అతడిని ఆ కట్టుకొనే చూపు చూడగలదు. ఇవన్నీ గాక - అదే సమయంలో ఏ స్నేహితురాలో - ఆంతర్యం మాట్లాడటానికి వస్తే - "ఇప్పుడు సమయంకాదు - మరోమారు నీతో రహస్యంగా మాట్లాడగలను నీ సమస్యవింటాను" అని సూచించగలదు కళ్లతోనే! ఇవన్నీ - కళ్లవిన్యాసాలే - దృష్టివిన్యాసాలే సుమండీ! ఒక్కమాట పెదవులతో ఉచ్ఛరించకుండానే - కనులతో - దృష్టి భేధాలతో చేసే "ఉచ్చాటనలే" సుమండీ!

ఇంతటి అభినయ కౌశలము - భావవ్యక్తీకరణ - భావప్రకటన - లకు కళ్లు - చూపులు దోహదం చేస్తాయిగనుకే, కళ్లు - చూపులు - "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం అన్నారు పెద్దలు - కళ్లు లేకపోవటం-చూపు "దృష్టి" లేకపోవటం అన్నది ఒకపెద్ద దురదృష్టంగా- మహాపాపానికి ప్రతిఫలంగా అభివర్ణించారు పెద్దలు!

కళ్లు మాట్లాడతాయి. కళ్లునవ్వుతాయి. కళ్లు - హెచ్చరిస్తాయి కళ్లు భయపెడతాయి. కళ్లు జయిస్తాయి - కళ్లు - నీరుగారుస్తాయి. కళ్లు. సానుభూతి స్వాంతన కురిపిస్తాయి. కళ్లు కరుణ వర్షిస్తాయి. కళ్లు దుఃఖిస్తాయి. ఇంకాఇంకాఎన్నోభావాలు పలికిస్తాయి కళ్లు - కళ్లలోని దృష్టులూ! అవునా! ఇవే ఉచ్చాటనలు ..

7. అతిముగ్ధమై, కోమలమై, నిష్కపటమై వుండేదృష్టి "అవంతీ!" యవ్వనప్రారంభదశలో వున్న కన్యదృష్టి ఇది. "స్వీట్‌సిక్స్టీన్" ("Sweet Sixteen") 16 సం॥లో ( షోడశ వర్ష కన్య ) అడుగెట్టిన ముగ్ధ అయిన కన్యదృష్టిఇది. ఇదే "విద్వేషణము" దృష్టి.

నిజానికి - బాల్యచాపల్యంవదలని చంచలత -

ప్రపంచంలో అన్నీ తెలుసుకోవాలనే ఆరాటం. ఆత్రుత.

ఎదుటివారు మోసంచేస్తున్నారో - నిజంగా ప్రేమిస్తున్నారో

తెలియని - తెలుసుకోలేని అమాయకత.

యవ్వనారంభంలో ప్రకృతి సహజంగా "తోడు" కోసం హృదయంలో కలిగించే ఒకానొక వింత భావాలస్పందన, వ్యక్తంచేయటం చేతరాని అమాయకత.

తనకు అన్నీ తెలుసుననే - యవ్వనంతాలూకు కించిత్తు గర్వం - అహంకారం.

ఇవన్నీ కలగా పులగమైన నిర్మలమైన నిష్కపటమైన దృష్టిఇది. కానీ ఆ కన్యకు తెలియదు - తనదృష్టిలో ఇన్నిభావాలు దోబూచులాడుతున్నాయని! ఇదే, "విద్వేషణము" అనేదృష్టి.

ఈ దృష్టికోసం - ఎందరో పడిగాపులుపడతారు. రాజ్యాలు తలక్రిందులౌతాయి. యుద్ధాలు జరుగుతుంటాయి.

కానీ ఆ కన్య ముగ్ధ - ఆ దృష్టి స్నిగ్ధమైనది. సుందర సుకుమార స్నిగ్ధ దృష్టిఇది.

8. "ప్రాంతకనీకము" అనీ, ఆ"కే కరమనీ" సంస్కృత పేర్లుగలిగిన ఈ దృష్టిని "విజయా' ' అంటారు.

కళ్ల చివరివరకూ నల్లగ్రుడ్డు వచ్చేలా - తలత్రిప్పకుండానే, మనిషిప్రక్కకు తిరగకుండానే - కళ్ల చివరలతో చూచేచూపుఇది. ఈ చూపు "మారణహోమాలు" చేయించగలదు.

ఆలోచనా పూరితమైనది. వ్యూహాత్మకమైనది. ఎదుటివారిలోని శక్తియుక్తులనూ, బలహీనతలనూకూడా ఒక్కచూపుతో ( క్రీగంటి చూపుతో ) అంచనా వేయగల అమోఘ శక్తిగల దృష్టి ఇది!

ఈ చూపులన్నీ - అమ్మవారివి. ఇవి దైవీదృష్టులు

ఇవన్నీ స్త్రీలందరికీ సహజం.

అయితే ఈ చూపులే ఆయుధాలుగా పెట్టుకొని ఏస్త్రీ అదే పనిగా ఈ దృష్టులుసారిస్తూ కూర్చోదు తీరికూర్చుని, ఒక్కొక్క సమయంలో ఆయామనస్సును, సన్నివేశాన్ని బట్టి ఆస్త్రీ కళ్లు - అప్రయత్నంగా ఆదృష్టులుప్రసారం చేస్తాయి. సకలచరాచరప్రాణికోటినీ- కోట్లాది బ్రహ్మాండాలనూ ఒకే నిమిషంలో - చూడవలసిన జగన్మాత - ఎవరెవరి విషయంలో ఏయే దృష్టి అవసరమో అదిప్రసరింపజేసి - వారి వారిని ఉద్ధరిస్తుంది.

"తల్లీ! ఎప్పుడు ఏ నీదృష్టి అవసరమో, ఆ నీదైవీదృష్టిని ప్రసరింపజేసి- మాలోని చెడ్డదృష్టులను (అనగా ఎవరివస్తువులో చూడగానే కాజేయాలనో, అవిమనకు లేవేనని బాధపడటమో - పచ్చగా వున్న వాళ్లని చూస్తూ ఓర్వలేకపోవటమో, ఎదుటివారు ఒక మంచిచీరె కట్టుకున్న, నగపెట్టుకున్నా, ఓర్వలేక కళ్లు పేలిపోయేలా "దృష్టి" పెట్టడమో- నిరంతరం - ఎదుటివారు నాశనంకావాలని అంతరాంతరాలలో ఆలోచిస్తూ చూడటమో, - ఇలాటి రకరకాలకు దృష్టులు, దొంగదృష్టులు కపటదృష్టులూ- మాలోలేకుండా, మాలో అవితలెత్తకుండా- నీ దృష్టితో మమ్మల్ని చక్కదిద్దుతూ- దుష్టులను శిక్షించి- శిష్టులను రక్షించే నీ గొప్పదృష్టిని ప్రసరింపజేస్తూ మమ్మల్నీ - సకలచరాచరములను రక్షిస్తుండు తల్లీ! జగదంబా!

ఇలా మనందరం ప్రార్థించటానికి, ఆలోచించటానికీ అవకాశం కల్పిస్తూ- ఈశ్లోకంలో - కొండంత అర్థాన్ని పొదిగారు ఆదిశంకరాచార్యులవారు : అహో ( ! జగద్గురువుల పరిశీలనా శక్తిముందు - మన తెలివితేటలు ఏపాటివో గ్రహించుకోవచ్చు -ఈ ఒక్క శ్లోకంతో!

ఈ శ్లోకాన్ని 1000 మార్లు (వేయిమార్లు, రోజూ జపిస్తే తంత్రములో చెప్పిన విధానంతో యంత్రపూజ 25 దినములు చేసి - పూజావిధానంలో చెప్పినవిదంగా- చేస్తే "నిధి" దర్శనం

అవుతుందని తంత్రశాస్త్రజ్ఞులు చెప్పారు. ఇలాటి ప్రయోగాలు- అత్యాశకు - నిరాశకూ దారితీస్తాయి. అంచేత "నిధి" కోసం వేటవద్దు. ఆ వామాచారతాంత్రిక అత్యాశలకు మనవిలువైన కాలాన్ని ఖర్చు చేసుకొనవద్దు. ఆ గ్రంథాల జోలకిపోవద్దు.

కేవలం - శ్లోకంజపించి - భక్తి శ్రద్ధలతో అమ్మవారి పాదాలను ఆశ్రయిస్తే - ఆతల్లి - మనకు తన చరణ సన్నిధి అనే "మహానిధి" ప్రసాదిస్తుంది. అదిచాలు. రోజూ భోజనానికి వెతుక్కోనవసరం లేని జీవితం, సమస్యలున్నా అవి పరిష్కరించుకోగలిగిన అవకాశము (ఒకమోస్తరు కష్టాలు - కన్నీరు. ఇవి - మనవిజయాలకూ సోపానాలు అవుతాయి - ఆధ్యాత్మిక పురోభివృద్ధికి మార్గదర్శకాలు అవుతాయి-) అన్యోన్యానురాగాలు గలిగిన దాంపత్యము, పరిమిత కుటుంబమూ - సమాజంలో మంచిపేరు - మనకిమనం మంచిచేస్తున్నామన్న, మంచి బాటలో నడుస్తున్నామన్న ఆత్మతృప్తి- ఇలాటివాటిని మించిన నిధులు ఏమున్నాయి చెప్పండి ? మానవజన్మ ఒక మహానిధి. అందునా ఈ పవిత్రభారత దేశంలో జన్మించటమే మహానిధి. ఇంకా నిధులనీ, మణులనీ- మాణిక్యాలనీ - బంగారుగనులనీ - నిధుల వేటలో గోతులుత్రవ్వుకుంటూ- ఆయాసం తెచ్చుకోవటం- అవివేకం- జన్మవృథా.

శ్రీశైలం - కాశీ - వంటి పుణ్యక్షేత్రాలలో వుంటూ - సాధువులుగా మారి - ఈలాటి నిధుల వేటలో జీవితాంతం జన్మవృథా చేసుకొనే కొందరు తాంత్రిక యోగులూ - ఆ నిధుల కోసం పశుబలులూ శిశుబలులు - కన్యాబలులు - యువక బలులూ నిర్వహించే - స్వార్థపరులైన - సన్యాస నామానికే కళంకం తెచ్చే అమానుషులు వున్నారు. వీరి కెవరికీ నిధి దొరకదు సరికదా - తిర్యగ్యోనులలో జన్మిస్తారు మానవజన్మ వృథాచేసుకొని - క్రిమికీటకదశకు చేరుకుంటారు.

మనమా దురదృష్టాన్ని వెదుక్కొనవద్దు.

ఆదిశంకరులవారు - సౌందర్యలహరి "సమయాచారంగా శరణాగతిగా బోధించారేతప్ప - వామాచారంగానూ, తాంత్రిక పూజలకోసమూ, స్వార్థానికీ- బోధించలేదు సుమా.

ఇది రెండవ అధ్యాయం సమాప్తం.

ఇందులో శ్రీభగవత్పాదులవారు ఒక గొప్పకవి - ఒకగొప్ప పరిశోధకుడు ప్రకృతిలో తాదాత్మ్యత చెందినట్లుగా - ప్రకృతిని ఆరాధనాభావంతో పరిశీలించి, అనుభూతిచెంది, ఆ అనుభూతిని, తన అనుభవసారాన్ని - తన తర్వాతి తరాలవారమైన మనందరికీ దోసిళ్లతోపంచిపెట్టారు అపారకరుణతో.

ఏ ఒక్క వివరమూ, ప్రక్షిప్తమూ, నిక్షిప్తమూ చేయలేదా మహద్గురువు. జగన్మాత రూపంలోని విశేషాలను అద్భుతంగా వర్ణించారు. 42వ శ్లోకంనుండి 49వ శ్లోకంవరకూ గల 8 శ్లోకాలలో ఈ

అధ్యాయము. భక్తిశ్రద్ధలతో పారాయణచేసినవారికి, మహా ఉదరరోగములు ("మహోదర" మనే ఉదరరోగము కూడా ఉపశమించటం) సాధుసత్పురుషుల నుండి మంచి ఆశీశ్శులు, వాక్సిద్ధి, వాక్శుద్ధీ, కారణాంతరాల వలన భార్యాభర్తలు విడిపోయినవారు. తిరిగి ప్రేమతో అన్యోన్యానురాగాలతో కలుసుకుని శేషజీవితం సంతోషంగా జీవించటం, ఇష్టదేవతా కరుణప్రాప్తి, నవగ్రహదోషశాంతి, మోక్ష నిధిదర్శనము ( మోక్షమార్గ దర్శనము, ఆధ్యాత్మిక మార్గ దర్శనము చేయించే సద్గురువే పెన్నిధి - ఆ గురువు లభ్యం కావటమే నిధిదర్శనము, "విషసర్పి" రోగములవంటి రోగములు ఉపశమనము, మొదలైనవి - జగన్మాత అపారకరుణతో భక్తులకు సిద్ధిస్తాయి. శారీరకమైనఆరోగ్యము, మానసిక ఆరోగ్యము రెండూ సాధించుకొనగలిగినపుడు ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధాలు వుండవు సుమా!

అయితే ఇది అర్ధం చేసుకోలేక

"ఆ ( ! తలకాయ, జుట్టు- నుదురు - కనుబొమలు, కళ్లతో ఆపక, ఆ కళ్ల చూపులు కూడా వర్ణించాలా ? దండగ - అక్షరాల దండగ! అది మనం పారాయణం చేసేందుకే ముందిగనుక ? " అనుకునేవారినీ, అనేవారినీ, తర్కంతో మార్చాలని ప్రయత్నించక - మనవిలువైన కాలాన్ని మాటలరూప శ్వాసనూ, ఖర్చు చేసుకోక - వారిని వారి ఖర్మానికి వదిలి - మనం ముందుకు వెళ్లటమే మంచిపని ! ఆధ్యాత్మిక ప్రస్థానంలో, ఎవరికి వారుగా ముందుకు వెళ్లటమే మంచిపని. ఎవరో కలసిరాలేదనుకోవటమో - ఎవరిసహకారమో లేదనుకోవటమో, - ఎవరో మనల్ని హేళనచేస్తున్నారనుకోవటమో అవివేకం! మనమనస్సు మహాసముద్రం- అది ఎవరికీ కనిపించదు - వినిపించదు. అదొక్కటే మనకు తోడునీడ. మనసులో మనజపం - మనస్తోత్రం - మనం చేసుకోవటానికి ఎవరి అనుమతి అవహేళనలతో మనకు పనిలేదు.

ఎవరికి వారంగా ఈ జన్మ పరంపరలోనికి- ఈ తలితండ్రుల గర్భవాసాలలోనికీ - ఈ పశు - పుత్ర - సుతాలయాలలోనికి వచ్చినవారం.

ఎవరి హృదయాలలో వారం ఆజగన్మాత సాక్షాత్కారం చేసుకొనాలి .. ఆ తల్లి దయారసదృష్టులకి - అర్హులమౌదాము. కలిసిన వచ్చిన అదృష్టవంతుల్ని కలుపుకుపోదాం.

లేని వారిని వదిలేద్దాం.

పదండి ముందుకు.

2వ అధ్యాయం సమాప్తం.



# 3వ అధ్యాయము ప్రారంభము

ఈ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదులవారు

శ్రీ జగన్మాత నేత్రములను, నేత్రరసదృష్టినీ- నేత్రముల - కనురెప్పల సౌందర్యాన్ని, నేత్రత్రయం సౌందర్యము, నేత్రత్రయ సంభేదము - కనురెప్పపాటు ( ఉన్మేష నిమిషోత్పన్నములు ) ఆకర్ణాంత నేత్రములు, దృష్టిలో గల చమత్కారములు - భక్తుల హృదయాలనే కాన్వాసుపై - అద్భుత చిత్రాలుగా చిత్రించి చూపినట్లు - అక్షర విన్యాసాల కవిత్వ ఝురితో వర్ణించారు తాను దర్శించిన ఆతల్లి నేత్రాలు - (అవే ఈ జగత్తుకు వెలుగునూ జీవనాన్ని - కరుణను ప్రసాదించేవి) - మనందరి చేతా దర్శింపజేసి - మనలనందరినీ తరింపజేయాలని ఆ పరివ్రాజకాచార్యుల వారు 50వ శ్లోకంనుండి 57 శ్లోకంవరకు గల 8 శ్లోకాలలో ఎంతగా ఆశించారో అర్ధమౌతుంది. ఆలస్యం ఎందుకు ? పదండి పారాయణ ప్రారంభిద్దాము.

## తృతీయ అధ్యాయము

**50. శ్లో॥కవీనాం సందర్భస్తబక మకరన్దైక రసికం!**
**కటాక్ష వ్యాక్షేప భ్రమరకలభౌ కర్ణయుగళమ్.**
**అముంఞ్చన్తౌ దృష్ట్వా, తవ, నవరసాస్వాదతరళౌ**
**అసూయా సంసర్గా దలికనయనం, కిఞ్చిదరుణమ్ ॥**

**అర్ధము** :- మహాకవులూ- దేవీభక్తులైన మహాకవులు - తమతమ కావ్యాలు అమ్మవారికి, వినిపిస్తుండగా, ఆ కవిత్వఝురిలోని నవరసాలనూ అత్యంత శ్రద్ధాసక్తులతో ఆలకిస్తున్న జగన్మాత కర్ణాలను- (చెవులను)

తుమ్మెదల బారు వంటి నల్లని చూపులతో, ఆ కర్ణాంతంసాగిన ప్రక్కచూపులతో, ఆమెకళ్లు, ఆమెకర్ణాలను (చెవులను) వదిలి రాలేకుండావున్నాయి!

కళ్లకు వినికిడి శక్తిలేదు కదా ? కానీ - ఆనవరసకావ్యాలు వినాలని కుతూహలమాయె! మరిఎలా ?

అందుకే ఆతల్లి ఆకర్ణాంత విశాలనేత్రాల చూపులు - ఆమె చెవులవరకూసాగి - ఆ కావ్యాలలోని నవరసాస్వాదన చేస్తున్నాయి! ఇదంతా చూస్తున్న ఆ తల్లి ఫాలనేత్రానికి అసూయ కలిగింది. ఫాల భాగంలోవున్న ఆ కన్ను-ప్రక్కల వరకూ కనురెప్పలు త్రిప్పలేదు - నేరుచూపే ఆ కన్ను లక్షణం పైగా అది అగ్నినేత్రం. సాధారణంగా మూసుకొనే వుండాలి! అదాటుగా కోపంతో

తెరిస్తే ప్రళయాలు సంభవించే ప్రమాదం వున్నది కదా ? ఆ కర్ణాంతం చూపు ప్రసరింపలేదు ఈ నేత్రం.

ఫాలనేత్రం అగ్ని గుణం కలిగినది గనుక కించిత్ అరుణవర్ణంలోనే వుంటుంది సహజంగా. ఆ అరుణిమనే - "అసూయ" యొక్క "ఎరుపు వర్ణంగా" మనోజ్ఞంగా వర్ణించారు జగద్గురువులు! మిగతారెండు నేత్రాలనూచూస్తూ, తనకా అవకాశం లేకపోయినందుకు జగన్మాత ఫాలనేత్రం అసూయచెంది - ఎర్రవారింది - అని చమత్కరించారు సుమండీ!

ఈ శ్లోకమును ( యంత్రపూజ వివరాలు వేరే వున్నాయి ) రోజూ 1000 మార్లు ( వెయ్యిమార్లు) జపించినచో, "మసూరిక" ( విసర్పిరోగము ) రాదు అని తంత్ర శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. శరీర సంబంధమైన జబ్బులు అనేకం వున్నాయి. "సర్పి" అనేదురదతో కూడిన దద్దుర్లు - కురుపులు - మంటతోవచ్చే చర్మవ్యాధి ఒకటుంది. పల్లెటూళ్లలో ఈ నాటికీ ఈ జబ్బుకు కొందరుమాత్రమే "మంత్రం" వేస్తారు. డాక్టర్లు, మందులు - వుండనే వున్నాయి ఈ రోజులలో - ఏది ఏమైనా, శారీరక సంబంధమైన రుగ్మతలు దరిచేర నివ్వదీ శ్లోక పారాయణ మహిమ అని పరోక్ష బోధచేస్తున్నారు తాంత్రిక శాస్త్రవేత్తలు. చిత్తశుద్ధితో చేయగలిగితే ఏ మంత్రమయినా, స్తోత్రమయినా సత్ఫలితాలను తప్పక ఇస్తుంది సుమండీ! నిష్కామంగా ఈ శ్లోకం జపించేవారు - విసర్పిరోగులను స్పృశిస్తే చాలు వారికి ఆ జబ్బు తగ్గుతుంది. పూర్వం ఇలాటి మంత్రవేత్తలు పల్లెటూళ్లలో వుండేవారు సుమండీ!

## 51. జగన్మాత నేత్రముల రసదృష్టి

**51 శ్లో॥ శివే! శృఙ్గారార్ద్రా తదితరజనే, కుత్సనపరా**
**సరోషా గఙ్గాయాం, గిరిశచరితే (నయనే) విస్మయవతీ,**
**హరాహిభ్యో భీతా, సరసిరుహ సౌభాగ్యజననీ!**
**సఖీషుస్మేరా తే మయి, జనని! దృష్టి స స్కరుణా ॥**

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు అమ్మవారు కైలాసంలో - తన కుటుంబంలో నివారి పట్లా, భక్తుల పట్లా దానవగుణములు కలిగినవారి పట్లా, భర్తపట్లా, భక్తుల పట్లా - భర్తమెడలోని సర్ప భూషణముల పట్లా, పరిచారికలపట్లా, ఇట్లా నవరసభరితమైన దృక్కులు ఎలా ప్రసరిస్తూ వుంటుందో - వివరిస్తున్నారు.

**అర్థము** :- ఓ జగన్మాతా! శివా! భవానీ! నీ పతి అయిన కైలాసపతి యందు నీ నేత్రదృష్టి - శృంగార రసప్రపూర్ణమై వుంటుంది. ఇది సహజం. ఇతరులెడ, అనగా దానవగుణంతో, నిన్నుజగన్మాత వని మరచి నీ పట్ల అసభ్యంగా చూచేవారూ - నిన్ను గురించి అట్లా ఆలోచించేవారూ, మాట్లాడేవారూ అయిన రాక్షసాధముల పట్ల, నీ చూపు కుత్సితంగానూ, క్రూరంగానూ మారిపోతుంది.

( శ్రీదేవీ భాగవతంలో శుంభని శుంభులనే రాక్షసులు- అమ్మవారిని అట్లాగేకు సంస్కార భావంతో చూచి- ఆమెను తమ ఇల్లాలిగా పొందాలని వాంఛించి - ఆ జగన్మాతతో యుద్ధంలో వారి వారి రాక్షస గణాల నందరినీ ఆ తల్లి కోపాగ్నికి బలిఇచ్చి, మరీ మరణించారు. ఇలాటి దానవుల పట్ల ఆ తల్లి దృష్టి క్రూరంగా మారిపోతుంది. )

నీ సవతి అయిన గంగాదేవి విషయంలో - నీ భర్త అయిన సదాశివుడు ఆమెను (గంగను) తలపై దాల్చి - ఆమెకు గౌరవం అనురాగం పంచి ఇస్తున్నాడని తెలిసి, స్త్రీ సహజమైన అసూయా పూరితమైన రోషంతో నిండిపోతుంది నీ చూపు!

( కానీ- ఆ భావంనీలో ఎంతోసేపు వుండదు! నీపతి అయిన పరమశివుని కోసం- తీవ్రమైన తపస్సు చేసి మరీ ఆయన ఇల్లాలిగా మారినదానవు గనుక - ఆయనపై నీకు అపరిమితమైన ప్రేమ గౌరవం - అభిమానం, భక్తి ప్రపత్తులు వున్నాయి. అందువలన ఆ స్వామి యొక్క అద్భుత చరిత్ర ( శివపురాణం ) వింటున్నపుడల్లా, శివసంబంధమైన కావ్యాలు - వింటున్నపుడల్లా, కామదహనానికి కారణభూతమైన శివునిఫాలాగ్నినేత్రం నీవు చూచినపుడల్లా, "ఈ కన్నేనా? ఎల్లలోకాలనూ చల్లగాకాపాడుతున్నదీ ?" అనే విస్మయము కలిగి, విస్ఫారిత నేత్రాలతో, విస్మయ ప్రదర్శన, చేస్తున్నది నీ ఆ చూపు! నీ భర్త అయిన పరమశివుని జటాజూటం చుట్టూరా, కంఠం చుట్టూరా, ఆభరణాలవలె పెనవేసుకునివున్న సర్పాలను చూచినపుడు - క్షణకాలం నీ కళ్లలో కొంతభయం ద్యోతక మౌతున్నది. సర్పాలను అదాటుగా చూడగానే ఎవరికైనా గగుర్పాటు, భయం కలుగుతాయి కదామరి! ఈ భయానక దృష్టిమూలంగా వికసిస్తున్న ఎర్రతామర పూవుల వలె మారిన నీ కళ్లు, కంటిచూపులు- వెనువెంటనేఆ భయాన్ని దిగమ్రింగి - "ఆ (! ఈ సర్పాలు నన్నేమి చేయగలవు ?" అనే వీరరస భావాన్ని కూడా ప్రదర్శిస్తున్నాయి.

ఇకనిరంతరం భక్తి పురస్సరంగా నీ పాదసేవయే తమపరమావధిగా భావిస్తూ, నీకు సేవలుచేస్తూ మెప్పిస్తున్న నీ చెలి కత్తెలతో (పరిచారికలతో) హాస్యరసం నిండిన మాటలు పలుకుతూ, వారిని నవ్విస్తూ- వారిలో "జగన్మాత మాతల్లి!" అనే చనువును ఆత్మీయతాభావంతో

నిండిన భక్తినీ ప్రోదిచేస్తున్నాయి. ( శ్రీ కృష్ణునితో గోపబాలకులు, గోపికలూ ఇలాటి హాస్యరస ప్రధాన ఆత్మీయతను - దృష్టులనూ పంచుకుని ధన్యులైనారు కదా ? ) ఇక నావంటి (నీపాదములకు శరణాగతి చెందిన) భక్తులపట్ల, నీ నేత్రములు అపార కరుణా రసవృష్టి కురుపిస్తున్నాయి. నీ కరుణ కిరణములనే నీ దృష్టి నాపై ప్రసరింపనిచో, ఈ కవిత్వపటిమ, నిన్ను - నీ చూపులనూ - దర్శించగల, వర్ణించగలశక్తి నాకు వస్తాయా ? ఎన్ని జన్మల పుణ్యఫలమో, నీపాదాలు మొదలు శిరసువరకూ దర్శించి, వర్ణించే భాగ్యం కలిగింది! నీ కరుణా రసదృష్టి - వృష్టి ఒక్కటే అందుకు కారణం!" అన్నారు భగవత్పాదులవారు. ( "శాంతం పరమానంద స్వరూపం" అంటారు పెద్దలు. శ్రీ మాత సహజ శాంత స్వరూపిణి, అందువలన నవరసాలలో ఒకటైన శాంతం ప్రత్యేకంగా ప్రదర్శించనవసరంలేదు. )

అలాటి నవరస భరితమైన ఆ జగన్మాత కరుణారస దృష్టి ఒక్కక్షణం. ఒక్కక్షణం మనమీద ప్రసరింపగలిగితే - అందుకుగాను ఆ తల్లి స్తోత్రం, నామజపం - "సౌందర్యలహరి" పారాయణల్లాటివి ఏదోఒకటి చిత్తశుద్ధితో, భక్తి శ్రద్ధలతో చేసి - మనం అర్హత సాధించుకోగలిగితే- అదే ఈ మానవజన్మకుసార్థకత! కొండంత అర్థాన్ని ఒక్క శ్లోకంలో పొదిగి ప్రసాదించారు జగద్గురువు!

ఈ శ్లోకాన్ని రోజుకు 1000 మార్లు ( వెయ్యిమార్లు ) జపించినవారికి (యంత్ర పూజావిధానంలో చెప్పిన ప్రకారం) సర్వజన వశ్యత్వము - సిద్ధిస్తుందని తాంత్రిక శాస్త్రజ్ఞులు చెప్పారు.

దోవనపోయేవారందరూ మనకు వశ్యులౌతారనో, అస్తమానం ఆఫీసులో మనపై మండిపడే బాస్ - ఐస్ అయిపోయి పాదాక్రాంతుడౌతాడనో కలలుగంటూ ఈ శ్లోకం పఠిస్తే - అలా జరగాలని ఆశిస్తే - అది అత్యాశ - పగటి కల అవుతుంది.

"సర్వజనవశ్యము" అనేది - పారాయణం వలన - మనలో వినయం, వివేకం - జ్ఞానం, స్థిత ప్రజ్ఞత్వం లాటి లక్షణాలు వస్తాయి- ఆ గుణాల తేజస్సు - ఆ భక్తుల ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. దైవీ తేజస్సు ముందు సర్వులూ - శిరసువంచుతారు భక్తి గౌరవ పురస్సరంగా. ముందుగా ఆ లక్షణాలు సాధించాలి మానం - అవునా ? ఒక్కశ్లోకం - వెయ్యిమార్లు ఏదోసిద్ధి ఆశించి, ఆయాసపడ్తూ జపిస్తూ బి.పి పెంచుకోకుండా, నియమయంగా రోజూ "సౌందర్యలహరి' 'లోకాన్ని శ్లోకాలు ఒక్కమారు మననం చేసుకుందాము" అని పారాయణంచేస్తే దేవీ అనుగ్రహానికి తప్పక పాత్రులమౌతాము సుమండీ!

# అమ్మవారి నేత్రములు- కనురెప్పలు సౌందర్యం.

52. శ్లో॥గతే కర్ణా భ్యర్ణం గరుత ఇవ పక్ష్మాణి దధతీ
పురాం భేత్తుశ్చిత్త ప్రశమరస విద్రావణ ఫలే!
ఇమే నేత్రే, గోత్రాధరపతి కులోత్తంస కలికే!
తవా కర్ణా కృష్ట, స్మర శర విలాసం కలయతః ॥

**అర్థము** :- భూమిని ధరించిన పర్వతముల రాజైన హిమవంతుని వంశమునకు శిగపూవు మొగ్గ అయిన పార్వతీ! ( గోత్రాధరపతి కులోత్తంస కలికే !)

ఓ జగన్మాతా! ఆ కర్ణాంతం విశాలములైన నీ కడగంటి చూపులు. మన్మథుని విల్లుకు ఎక్కుపెట్టబడిన అతని 6వ బాణం - (చివరిబాణం - అస్త్రంతో సమానం అయినది) లా కనిపిస్తూ, మన్మథుని దహించి- కామమును జయించానని భావించిన, త్రిపురములను మట్టుబెట్టగలిగిన - నీ పతి అయిన పరమశివునిలో సైతమూ, శృంగార భావరసా విష్కరణను చేయుచున్నది! ఈ శ్లోకంలో శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు - అమ్మవారి నేత్రముల కనురెప్పలతో కూడి సౌందర్యాన్ని వర్ణిస్తున్నారు.

మన్మథుని బాణాలు 5. (ఐదు.)

1. ఉన్మాదన 2. తాపన 3. శోషణ (క్షోభణ) 4. స్తంభన 5. సమ్మో హనములు అనేవి :

ఈ బాణములనే పుష్పబాణములుగా మలచుకుంటాడు మన్మథుడు.

అవి 1. అరవిందం. 2. అశోకం 3. చూతం. (మామిడి) 4. నవమల్లికా. 5. నీలోత్పలం, అనేపూలు. ఈ పూలవనంలో విహరించే సమయంలో యవ్వనంలో వున్న యువతీ యువకులకు ఆ పూల సౌందర్యం - సౌరభ్యం - శృంగారరస ఆవిష్కరణ చేస్తాయి సహజంగా. అందువలననే అవి మన్మథుని పూలబాణాలు అంటారు. సౌందర్యానికీ సౌరభానికీ - సౌకు మార్యానికీ - వసంతఋతువు ఆగమనానికీ ఈ పూలు ప్రతిబింబాలు!

అయితే జితేంద్రియులూ, మహర్షులు - మహాత్ములైన వారిపట్ల పై ఐదుబాణాలూ పనిచేయవు. మన్మథుడు తన బాణాలు అట్లా వృధా అయినందుకు క్షణకాలం నిస్పృహ చెందుతాడు. అట్లా అని వూరుకోడు. తన చివరిబాణం - అమోఘమైన బాణం - అస్త్రంతో సమానమైనది. ( బాణములు శస్త్రములు, మంత్రపూతమైనవి అస్త్రములు )

అయిన స్త్రీ కడగంటి చూపు" అనేది ప్రయోగిస్తాడట!

దీనికిక తిరుగులేదనీ - ఎంతటి జితేంద్రియుడినీ ఈ చివరి (6వ) బాణం మోహంలో పడవేస్తుందనీ భావం. అందుకే ఈ శ్లోకంలో - భగవత్పాదులవారు. జగన్మాత కనురెప్పలు - గరుత్మంతుని రెక్కల ఈకలవలె అతి మృదుతములై వున్నాయంటున్నారు.

బాణానికి "వేగం" అనేశక్తి రావటానికీ, బాణం సంధించేటప్పుడు చేతివ్రేళ్లు ఒరుసుకోకుండానూ వుండటానికీ, బాణములకు ఇరువైపులా కట్టే (ఇది ఒకకళ. ఆ కాలంలో శస్త్రవిద్యా నిపుణులు. శస్త్రాలను తయారు చేసేవారు చేసేప్రక్రియ ఇది.) కంక పత్రములు" ( గ్రద్ద ఈకలు ) గురుత్మంతుని రెక్కల ఈకలు. ఆ ఈకలు చేతికి మెత్తగావుండి, ఒరిపిడి కలగనివ్వవు. బాణం మొదలులో మెత్తగా చేతికి తగిలేందుకు కడతారు.

అమ్మవారి నేత్రాల (కనురెప్పలు) ఆ కంక పత్రములవలె వున్నాయి. శ్లోకంలోని "ఫల" అనే శబ్దానికి (పదానికి) ఉక్కుతో చేయబడిన బాణం యొక్క చివరిభాగము (ములుకు) అని అర్థం వస్తుంది. ఆ కర్ణాంతం విస్తరించిన అమ్మవారి కడగంటి క్రీగంటి చూపు- మన్మథుని ఆరవబాణం వలె భాసిస్తోంది అని చమత్కరించారు జగద్గురువులు! కొందరు స్త్రీల కనురెప్పలు గమనించండి. నల్లగా మృదువుగా, దట్టంగా వంకర తిరిగి - మృదువైన లేతపక్షి ఈకలవలె వుంటాయి. (ఈనాడు సినిమాతారలకూ - నటులకూ- (సాధారణ స్త్రీలుకూడా కొందరు) ఆర్టిఫిషియల్ కనురెప్పలు అతికించు కొంటున్నారు! అలాగాక - సహజంగా సౌందర్యం ఉట్టిపడే కనురెప్పలు- కొందరుస్త్రీలకు సహజంగా వుంటాయి. వారి కనులూ, కనురెప్పలే వారి ముఖానికి ప్రత్యేక ఆకర్షణగానూ, ఎంత చూచినా మరీ మరీ చూడాలనిపించే విధంగానూవుంటాయి:)

జగన్మాత నేత్ర సౌందర్యం హృదయంలో సాక్షాత్కరింపజేసుకోగలిగిన భక్తులు ధన్యులు కదా ?

ఈ శ్లోకమును ప్రతిరోజూ 1000 మార్లు జపించినవారికి - కర్ణ రోగశ మనము, (చెవికి సంబంధించిన జబ్బులు తగ్గటం) నేత్రరోగని వృత్తి (కంటి సంబంధమైన జబ్బులు తగ్గటం) జరుగుతుందని చెప్పారు తాంత్రిక శాస్త్రవేత్తలు దీనికి వారు చెప్పిన యంత్ర పూజావిధానం వున్నది. కానీ రోజూ వెయ్యిమార్లు జపించగలిగితే - ఆ తల్లి ఆకర్ణాంత విశాల నేత్ర సౌందర్యం హృదయంలో ప్రతిష్ఠించుకోగలిగితే - జ్ఞాననాదాన్ని హృదయంలో వినవచ్చు - జ్ఞాన నేత్రం (అంతర్నేత్రం) తెరుచుకొని ఆధ్యాత్మిక బాట సుస్పష్టంగా కనిపించవచ్చు. రోజూ ఒకమారైన పారాయణం చేసి తరిద్దామా ? ఆలస్యం ఎందుకు మరి - ఉపక్రమిద్దాం పారాయణకు. డాక్టర్లు చేతకాదని వదిలేసిన రోగముల విషయంలో, అమ్మవారి ఆరాధన శక్తివంతమై పనిచేస్తుందని - పూర్వం మంత్ర శాస్త్రవేత్తలైన వైద్యులు నిరూపించారు. అదే తంత్రశాస్త్రం యంత్ర శాస్త్రంగా రూపుదిద్దుకొన్నది. రోజూ 1000 మార్లు సాధ్యంకాధు గనుక - 10 మార్లు చేసుకోవచ్చు అలాటి రోగి! సంఖ్యకాదు ముఖ్యం. భక్తి ప్రధానం.

# 53. శ్లోకం. జగదంబ నేత్రత్రయ సౌందర్యం.

53. శ్లో॥ విభక్త త్రైవర్ణ్యం వ్యతికరిత లీలాం ఇజనతయా,
విభాతి త్వన్నేత్ర త్రి తయమిద, మీశానదయితే!
పునస్స్రష్టుం దేవాన్, ద్రుహిణ హరి రుద్రాను పరతాన్
రజస్సత్వం బిభ్రత్తమ, ఇతి గుణానాం త్రయమివ!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు శ్రీదేవి త్రినేత్రాలు- కాటుకరేఖతో - త్రిగుణాలను స్ఫురణకు తెస్తున్నాయనే భావాన్ని అద్భుతంగా ఆవిష్కరించారు తమకవితా ఝురిలో.

**అర్థము :-** ఓ జగన్మాతా! నీ నేత్రములు - నీవు కనులకు పెట్టుకున్న కాటుకతో విశాలములై అందముగా వున్నవి.

సూర్యాత్మకమైన నీ కుడికన్ను - నల్లని కాటుకరేఖతో - మరింత తెల్లగామెరిసిపోతూ సత్వ గుణానికి సంకేతంగానూ, చంద్రాత్మకమైన నీ ఎడమకన్ను (జలతత్వంగల చంద్రుడు - మనస్సునకు సంకేతం గనుక) కాటుకరేఖతో - లేత ఎరుపు రంగుగామారి, రజో గుణానికి సంకేతంగానూ, అనలాత్మకమైన (అగ్ని సంబంధమైన) నీ ఫాలనేత్రం. కాటుకరేఖతో మరింత నల్లగా మారి తమోగుణానికి ప్రతి బింబంగానూ వున్నట్లుతో పింపజేస్తున్నాయి.

ప్రళయంలో మునిగిపోయిన బ్రహ్మవిష్ణు మహేశ్వరులను మరల సృష్టించటానికి ఏర్పడిన సత్వ, రజస్తమో గుణముల వలె నీ కాటుక కళ్లు కనపడుతున్నాయి.

ఈ త్రిగుణాల ఆధారమే ఇచ్ఛ, జ్ఞాన, క్రియాశక్తులు. జ్ఞానశక్తి సత్వగుణానికీ, ఇచ్ఛాశక్తి రజో గుణానికీ, అర్థశక్తి అనగా, క్రియాశక్తి తమోగుణానికీ ప్రతీకలు. కాబట్టి తల్లి కాటుక కళ్లలో - ఆ దివ్యనేత్రాలలో- సర్వ సృష్టి - స్థితిలయాల దివ్యదర్శనం పొందిన శ్రీ జగద్గురువు - మనందరినీ - ఆ దివ్య దర్శనం చేసుకోమని పరోక్షంగా భోధిస్తున్నారు. మనలోనే వున్న సత్వరజస్తమోగుణాలలో - సత్వగుణాన్ని పెంపొందించుకొనే సాధన చేసుకోగలిగితే ఆ జగన్మాత దివ్యనేత్ర సందర్శనం కలుగుతుంది.

అమ్మవారిని నిష్కపటంగానూ నిస్వార్థంగానూ పూజించటమే కర్తవ్యం సుమా!

# 54. నేత్రత్రయము - దివ్యగంగా, యమునా, సరస్వతీ (శోణ) నదులనెడి - పుణ్యతీర్థములు.

54. శ్లో॥ పవిత్రీ కర్తుం నః, పశుపతి పరాధీనహృదయే!
దయామిత్రై ర్నేత్రై, రరుణ, ధవళ, శ్యామరుచిభిః
నదశ్శోణో గఙ్గా తపనతనయేతి ధ్రువమయమ్!
త్రయాణాం తీర్థానాముపనయసి సంభేదమనఘమ్ ॥

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు జగన్మాత యొక్క త్రినేత్రములూ- మూడు పుణ్యనదులైన గంగా, యమున (తపన = సూర్యుని - తనయ = కుమార్తె = యమున) శోణ నదుల ప్రవాహంలో దర్శించారు.

**అర్థము** :- తల్లీ! పశుపతి పరాధీన హృదయా! జగన్మాతా! నీ మూడు నేత్రముల కరుణారసదృష్టులే - పవిత్రములూ, పాపహరములూ అయిన త్రివేణీ సంగమమైన గంగా, యమునా, సరస్వతి (శోణ) నదుల ప్రవాహమే సుమా!

తెల్లని - నల్లని - ఎర్రని నీటి రంగులు గల ఆ పుణ్యనదుల ప్రవాహమే ఆతల్లి త్రినేత్రముల కరుణారస ప్రవాహము.

ఆ తల్లి ఉపాసనతో, ధ్యానంతో, కనీసం ఈ ఒక్కశ్లోకం మరల మరలా మననం చేసుకున్నా చాలు. మనందరం ఆ మూడు పవిత్ర తీర్థాలలో మునకలు వేసిన పుణ్యం సాధించుకోగలము. ఇంతటి మహదవకాశాన్ని మనకు ప్రసాదించిన జగద్గురువు - శ్రీ ఆదిశంకరాచార్యకు మ్రొక్కుతూ - పారాయణం చేసుకుందాం. పదండి - ముందుకు!

## 55. శ్లో ॥ జగన్మాత నేత్రముల నిమేషోన్మేషములు - కనురెప్పలు తెరచుటలలో గల సౌందర్యము - పరమార్థము.

**55 శ్లో॥ నిమేషోన్మేషాభ్యాం, ప్రళయముదయం, యాతి జగతీ**
**తవే త్యాహుస్సన్తో ధరణీ ధరరాజన్య తనయే!**
**త్వదున్మేషా జ్జాతం, జగదిదమ శేషం ప్రళయతః**
**పరిత్రాతుంశఙ్కే పరిహృత నిమేషాస్తవ దృశః ॥**

**అర్థము** :- "పర్వతరాజపుత్రీ! పార్వాతీ! జగదంబా! నీవు కన్నులుమూయుట - తెరచుట (ఉన్మేషము, నిముషము) వలననే ఈ సకల చరాచర జగత్తుకు ప్రళయము, మరలసృష్టి కలుగుచున్నవని సత్పురుషులు చెప్పుచున్నారు. నీవు కన్నులు తెరచుటవలన పుట్టిన సర్వజగత్తును. ప్రళయమున నశింపకుండా వుండేందుకుగానూ, నీవు కనురెప్పలు మూయనే - మూయవని నేను భావించుచున్నాను!" అన్నారు శ్రీ వంకర భగవత్పాదులు ఈ శ్లోకంలో!

"ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళి:" అని లలితా సహస్రనామస్తోత్రంలో వశిన్యాది వాగ్దేవతలు కీర్తించారు లలితా పరమేశ్వరిని. రెప్పలు తెరిస్తే సృష్టి- రెప్పలు మూస్తే లయము - ప్రళయము అని చెప్పారా వాగ్దేవతలు!

జగన్మాత- కు అందరు దేవతలకు వలెనే రెప్పపాటులేదు. కానీ ఎప్పుడో ప్రళయ కాలంలోనో, ఒక మరణము- భూకంపం- పెను తుఫాను - దావాగ్ని ఇలా జరగవలసిన విధి వున్నపుడు క్షణకాలం ఆ తల్లి రెప్పపాటుతో - "విశ్వసాక్షిణి" అయిన ఆ తల్లి - "సాక్షివర్జిత" గా మారుతుంది. ఆయా జీవుల కర్మఫలాన్ని బట్టి - ఆ సంఘటనలు జరిగి తీరాలి కాబట్టి. అసలీ నిమిషము- ఉన్మేషము - ఏమిటి ? రెప్పపాటుకు "నిమేషము అని పేరెలావచ్చింది ? దీనికి ఒక కథ వున్నది శ్రీదేవీ భాగవతంలో.

"నిభోద నృపతి" పుత్రుడు "నిమి".

"నిమి" అనే ఆ రాజు, గొప్ప యాగం చేయదలచి - తమ కుల గురువు అయిన వశిష్టుని పురోహితునిగా కోరుకుంటాడు. యాగానికి కావలసిన సంభారాలన్నీ సిద్ధంచేసుకుంటాడు.

కానీ వశిష్టుడు - తాను ఇంద్రుని యాగం (5వేలఏళ్లు) పూర్తిచేసివచ్చి- అప్పుడు "నిమి" చేత యాగం చేయిస్తాననీ - అందాకా ఆగమనీ, చెప్పి వెళ్లిపోతాడు.

అట్లాయాగం ఆపేందుకు లేదనీ - సంభారాలన్నీ వృధా అయిపోతాయనీ. ఎంతగా నిమి బ్రతిమాలినా, వినకుండా వెళ్లిపోతాడు వశిష్టుడు. ఇంద్రుడు, "నిమి" కంటే ఎక్కువగా కట్న కానుకలు - ఇస్తాడనే దురాశతో - తాను "నిమి" వంశీయులకు పురోహితుడనే మాటకూడా మరచి (వసిష్టులవారు- ఒక పీఠంగురువు - వంశపారంపర్యంగా ఒక్కో వంశానికి ఒక్కొక్క పౌరాహితుడు - వారిగురుపీఠం వుంటుంది. వారంతా గురుపీఠ నామంతో వ్యవహరింపబడుతుంటారు) వెళ్లిపోతాడు వశిష్టుడు.

అదిగ్రహించిన "నిమి", యాగం ఆలస్యం చేయకూడదని, "గౌతముడనే" మహర్షిని పురోహితునిగా ప్రార్థించి, పౌరోహిత్యం చేయించుకుని, ఆ తనయాగం పూర్తి చేస్తాడు నిర్విఘ్నంగా. వశిష్టుడు తిరిగివస్తాడు. ఆ సరికి నిమియాగం పూర్తయి. (కొన్ని నెలలపాటు జరిగే యాగం గనుక) అలసిపోయి నిద్రిస్తుంటాడు విశ్రాంతిగా! వశిష్టుడు - తన పౌరోహిత్యం లేకుండానే "నిమి" గౌతమునిద్వారా యాగం పూర్తి చేయించాడని తెలుసుకొని - తామసం తన్నుకురాగా, నిమిని "నీ శరీరం పతనమై పోవుగాక" అని శపిస్తాడు. నిద్రలేచిన "నిమి వశిష్టుని అనాలోచిత కోపానికి బాధపడి - తానూ కోపంతో" బ్రాహ్మణుడవూ, పురోహితునివై వుండి - ధనాశతో ఇంద్రుని యాగానికి వెళ్లి, నా యాగం ఆపాలని చూచినది చాలక- నేను నిర్దోషినని తెలిసీ- నన్ను శపించావుగనుక- నీవూ శరీరం పతనమై - ద్విజన్మగా పుట్టమని" శపిస్తాడు.

ఒకరినొకరు శపించుకోగా.

బ్రహ్మమానస పుత్రుడైన వశిష్టుడు - తాను ఏ స్త్రీగర్భవాసంలోనూ వుండలేనని ఆగర్భ వాస శోకాన్ని భరించలేననీ, వేడుకొనగా, బ్రహ్మదయతలచి, "వరుణాలయం వెళ్లి, మిత్రావరుణుల దేహంలో (వీరిద్దరూ సూర్యునికి ప్రతిబింబాలు. ద్వాదశాదిత్యులలోని ఇద్దరు) తేజోరూపంగా వుండమనీ, సమయం వచ్చినపుడు ద్విజన్మవస్తుందనీ ఓదార్చి పంపిస్తాడు. ఆవిధంగా, వశిష్టుడు - మిత్రావరుణల దేహంలో తేజోరూపంగా వుంటాడు. ఒకరోజు - దేవవేశ్య అయిన ఊర్వశి, వరుణాలయం రాగా, మిత్రావరుణులిద్దరూ, ఆమెసౌందర్యాన్ని చూచి మోహిస్తారు. వారికివీర్యస్కలనమై - ఒక మూతలేని కుండలో పడ్తుందావీర్యం.

కుంభ సంభవునిగా - అగస్త్యుడు పుట్టాడు ఆ కుండలోనుంచి ప్రధముడుగా పుట్టగానే - జ్ఞానరూపుడై - తపస్సు చేసుకోవటానికి అరణ్యాలకు వెళ్లాడు మరుగుజ్జు రూపుడు అయిన అగస్త్యుడు - అగస్త్యునికి "కుంభసంభవుడనే" పేరు ఇట్లా వచ్చింది. వింధ్యపర్వతం యొక్క గర్వం అణచి (అగము = కొండ) "అగస్త్యుడు" అని పేరుపొందాడు ఈ కుంభ సంభవుడే!

ఇక రెండవ వీర్యకణం "వశిష్టుని" గా జన్మించాడు. ఇక్ష్వాకు వంశానికి మరల పురోహితునిగా వెళ్లిపోయాడు వశిష్టుడు. సూర్యోపాసన ఆతని ప్రాణం, ఇది వశిష్టుని చరిత్ర.

ఇకలోగా వశిష్టుని శాప కారణంగా, ప్రాణం పోయిన "నిమి" శరీరం వున్నది. జరిగినదానికి యాగానికి వచ్చిన ఋషులంతా బాధపడ్డారు. నిమి నిర్దోషి గనుక - అతడిని కాపాడాలని నిర్ణయించుకున్నారు. ఇదుగో - ఇక్కడే "ఉత్క్రాంతి" (మరణం) లోని చమత్కారం చూపారు మహర్షులంతా. ప్రాణం పోయినా, నిమిదేహం చెడిపోకుండావుంచటమేగాక- వారు తమ తపోబలంతో నిమిప్రాణాన్నీ - శరీరాన్ని కాపాడసాగారు. నిమి సూక్ష్మరూపం (ప్రాణం) జగన్మాతను శరణు వేడింది. తదేకంగా జగదంబను ధ్యానించింది. జగన్మాత ఆతని (ప్రాణ) ఉపాసనకు మెచ్చి సాక్షాత్కరించింది. వరం కోరుకొమ్మని అపారదయతో వాక్కు ఇచ్చింది.

"తల్లీ! ఒకమారు పతనమైపోయిన దేహంలో నేను మరల నిలవటానికి ఇష్టపడను. కానీ నేను వాయురూపంలో- సర్వమానవ కోటికను రెప్పలలో జీవించివుండేట్లు అనుగ్రహించు!" అన్నాడు నిమి సూక్ష్మప్రాణి.

అంబ ఆ వరం ప్రసాదించింది.

కనురెప్పలమాటున అతి సూక్ష్మమైన వాయురూపంలో వుండిపోయాడు నిమి, ఆ వాయు చలనం కలిగినపుడల్లా, కనురెప్పలు మూతపడటం - తెరుచుకోవటం అనేప్రక్రియ కలుగుతున్నది.

ఉన్మేషము అనగా తెరుచుకోవటం నిమేషము అనగా మూసుకోవటం. అప్పటిపరకూ అ నిమిషులుగా వున్న మానవులంతా "నిమి" వరం కారణంగా "నిమిషము" కనురెప్పపాటు

(మూయటం) గా మారిపోయారు. దేవతలకు నిమేషము (రెప్పవాల్చటము)లేదు. చేపలకూ లేదు. కనురెప్పలున్న ప్రాణులన్నిటికీ నిమేషము వున్నది. నిమినుండి "నిమేషము" పుట్టింది. "నిమిషము" అన్నది కాలానికి కొలమానంగానూ మారింది. కనురెప్పలు తెరవటం - మూతపడటం అనే ఈప్రక్రియ ఒక కాలపుకొలమానంగా నిలిచింది. ఉదాహరణకు - కాష్ఠ = అనగా 18 రెప్పపాటుల కాలం, శ్వాస - అనే గాలికీ - కనురెప్పపాటుకూ గల సంబంధమే కాలపుయొక్క లెక్కగామారింది. ఆ సూక్ష్మ వాయుచలనమే "నిమి" యొక్కఉనికి.

ఇక నిమి నిర్జీవ శరీరం మిగిలివున్నది. ఆ సరికి సంతానం లేదు నిమికి! ఆతని వంశం అంతరించి పోయేప్రమాదం వున్నది. దుర్గుణుడైతే ఆ వంశం అంతరించిపోయినా ఫర్వాలేదు. సకల సద్గుణ సంపన్నుడు తపోబల సంపన్నుడు - ధార్మికుడు అయిన రాజు - సాక్షాత్తు విష్ణువుతో సమానుడు, విష్ణుస్వరూపుడు.

అట్లా భావించిన మహర్షులు. నిమి నిర్జీవ శరీరాన్ని "ఆరణి"తో మధించారు.

మధించగా పుట్టినవాడు "మిథి"

ఇతడే జనకుని (నిమి) యొక్క సర్వసద్గుణాలు - తపస్సు వారసత్వంగా పొంది జన్మించాడు గనుక, "జనకుడు" గా కీర్తింపబడ్డాడు.

విదేహం (ప్రాణంలేని శరీరం) నుండి పుట్టినవాడు గనుక "విదేహుడు" అని కీర్తించారు మునులు, విదేహాన్ని మధించినది గంగా తీర ప్రదేశంలో గనుక గంగా తీరప్రదేశంలో సర్వాంగ సుందరంగా ఒక దివ్యనగరం నిర్మించాడు "మిథి" అదే "మిథిలానగరం"!

ఆ వంశంవారంతా మిథిలాధిపతులుగానూ, విదేహులుగానూ, జనకులుగానూ, మహాజ్ఞాన సంపన్నులుగానూ కీర్తి సాధించారు. వీరంతా నిమి వారసులు.

ఆ మిథిలా పధిపతులలో ఒకరైన "జనకమహారాజుకే - ఇతనికి వేరేపేరు వున్నది - రామాయణంలో జనకుడుగా - విదేహుడుగా కీర్తించారు జనం! వారసత్వ పేరుతో యాగసమయంలో - భూమినిదున్ను తుండగా ఆయనకు నాగలి చాలులో లభ్యమయిన అయోనిజ - సీతాదేవి! "వైదేహి" (విదేహుని కుమార్తె!) జానకి (జనకుని కుమార్తె! మైధిలి (మిథిలా నగర రాజకుమార్తె) గా వివిధ పేర్లతో వ్యవహరింపబడింది. శ్రీ విద్యా స్వరూపిణిగా, జగన్మాతగా, పతివ్రతా మతల్లిగా, రామాయణ మహాకావ్యానికి - కధానాయకిగా మారి - ఒక శివతపోబల సంపన్నుడూ చిరకాలజీవి, దుష్టత్వానికి ప్రతిబింబమూ అయిన రావణాసురవధకూ-లోక కల్యాణానికీ కారణ భూతురాలైంది! అశేషరాక్షస సంహారానికి పరోక్ష శక్తిస్వరూపిణి అయ్యింది.

●

నిమి - వంశం - వంశాంకురాల చరిత్ర - అంత మహాద్భుతంగా సాగింది. ఎక్కడి నిమి ? ఎక్కడి వైదేహి! కొన్నితరాల ముందు - "నిమి" అనే నిమిత్త మాత్రునితో ఒక యుగారంభం - ఒక యుగ చరిత్ర ముడివేసుకున్నా యిగమనించండి! ఇదే కార్యకారణాల సంబంధం అంటే అవునా! ఆనిమి - అమ్మవారు అనిమేషురాలైనప్పటికీ - ఆ తల్లి కనురెప్పలు తెరుచుకునే వుంటాయి కాబట్టి- ఎప్పుడోప్రళయం రాబోతుండగా ఆ సూక్ష్మ వాయురూపుడా మెకనురెప్పలమాటున చేరి - ఆ ప్రళయాన్ని - లయస్థితిని జరిపించేస్తాడు.

అట్లా తాను సృష్టించిన జగత్తులు- తాను కనురెప్పలు మూస్తే ప్రళయంలో మునిగి పోతాయేమోననే - అపారకరుణతో ఆ తల్లి రెప్పపాటు లేకుండా చూస్తోందని మహాద్భుత వర్ణనచేసి శ్రీ శంకరభగవత్పాదులవారు "నిమి అనే జ్ఞాని కధనూ - రామాయణ మహాకావ్యాన్ని కూడా స్ఫురణకు తెచ్చారు. అవునా ?

ఒక్క శ్లోకంతో మనభావనా పరిధిని ఎంతైనా విస్తృతం చేసుకొనవచ్చునని పరోక్ష బోధచేసారు. మరో శ్లోకంలోనికి - పదండి - ముందుకు.

## 56 శ్లో॥ జగదంబ నేత్రసౌందర్యాన్ని చూచి కలువలు- ఆడచేపలు (శఫరికలు) భయపడటం.

**56 శ్లో॥ తవాపర్ణే (తవ + అపర్ణే!) కర్ణే, జపనయన పైశున్య చకితాః**
**నిలీయంతే, తోయే, నియత మనిమేషా "శ్మఫరికాః"**
**ఇయంచ శ్రీర్బద్ధచ్ఛద పుటకవాటం, కువలయం**
**జహాతి ప్రత్యూషే నిశిచ విఘటయ్య ప్రవిశతి!**

**అర్థము** :- ఓ అపర్ణా! జగదంబా! నీ ఆకర్ణాంత విశాల నేత్రాల చూపులు- నీ చెవులతో (కర్ణములతో) తమ పై చాడీలు, (ప్రితూరీలు) చెప్పుతున్నాయి కాబోలుననే శంకతో, భయంతో శఫరికలు (ఆడచేపలు) నీటిలో దాక్కుంటున్నాయి.

ఆ తల్లి కళ్లు తమపై చెప్పగల చాడీలు ఏమిటి ?.

చేపలకూ రెప్పపాటు లేదు.

జగాన్మాత కళ్లు - మీన నేత్రములు- ఆమె మీనాక్షి! చేపలను బోలినవంపు దిరిగిన విశాలనేత్రాలు ఆ తల్లివి! తాము, ఆ తల్లినుండి - రెప్పపాటు లేని గుణాన్ని దొంగిలించామని - చాడీలు చెబుతున్న యేమో - ఆమె కర్ణాలతో - అవి విని ఆ తల్లి తమని దొంగతనం చేశామని భావించి శిక్షిస్తుందేమోననే భయంతో - ఆడచేపలు - నీటి లోలోపలే దాక్కుంటున్నాయట!

"మీనదృష్టి"- వరం చేపలకు.

ఆ రెప్పపాటు లేని దృష్టితోనే అవి తమగ్రుడ్లను పొదిగి పిల్లలను చేస్తాయి. కానీ చిన్న నీటిప్రాణులు - ఆ తల్లిశక్తి ఎరిగినవి గనుక - వృథాగా భయపడిపోయాయని అందమైన భావన ఇది.

అలాగే, రాత్రి వికసించే కువలయములు (కలువలు) లో నీ నేత్ర లక్ష్మి దాగివుండి - ఉషోదయంలో - ఆ కలువల దళములు (తలుపులు) మూసి, పగలంతా నీ నేత్రలక్ష్మి నీ కన్నులలో చేరి - మరలా రాత్రివేళా కలువలలో చేరుతున్నది.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు - శ్రీమాతనేత్ర సౌందర్యాన్ని - భావనాకౌశలంతో అత్యంత మనోహరంగా చిత్రించి చూపారు.

రాత్రివేళల్లో వికసిస్తాయి కలువలు! ఆ కలువలలో దేవీనేత్ర లక్ష్మి కొలువై వుందంటున్నారు జగద్గురువు! ఎలా ?

దేవతాస్త్రీలు - అప్సరసలు - దివినుండి భువికి - విహారార్థం వెన్నెల రాత్రులలో వస్తారు. సుందర సరస్సులను వారు తమ జలకాలాటకు వినియోగిస్తారు. రాత్రివేళా వెన్నెలలో విరగబూసివున్న కలువల సౌందర్యం వారిని ముగ్ధులను చేస్తుంది. దేవతాస్త్రీలకు - దేవతలకు దేవీ నేత్రలక్ష్మి ఆ కలువలలో లభ్యమౌతుంది! వారు స్నానంచేసి, ఆకలువలతో - ఈశ్వరార్చన చేస్తారు. దేవీ నేత్ర సౌందర్యం అట్లా ఈశ్వరాంకితం అవుతుంది.

ఉషోదయానికి పూర్వమే - వారుమరల స్వర్గం చేరుతారు. మానవుల కంటపడకుండా - పురాణాలోనూ, కొన్ని క్షేత్ర పురాణాలలోనూ ఇలాటి కథలూ - దేవతాస్త్రీలు జలకాలాడిన సరస్సుల కథలూ చాలావున్నాయి మనదేశంలో ఉషోదయంతో కలువలు - ముకుళించి - తామరపూలు వికసిస్తాయి సూర్యకాంతితో!

అట్లా ముకుళించటం - ఆ సౌందర్య ఖనులూ - దేవతా పుష్పాలూ - ఈశ్వరార్చనకు ఉపయోగించే పూలూ - మన్మథుని పూవు అయిన కలువల దళములు (తలుపులు) జాగ్రత్తగా మూయటం (ఆలయం తలుపులు తెరవటం - మూయటంలా) లాటి దివ్యభావన, మన హృదయానికి - మరో దివ్యదృష్టి - మనం సాధించుకోగలిగితే జగద్గురువులు దర్శించిన ఆ అద్భుత సౌందర్యలహరి అయిన ఆజగన్మాత కనుల సౌందర్యలహరిలో - మనమూ మునకలువేసి తరించగలము.

అందుకు - మనపారాయణం - ఒక్కటే దారి.

పదండి - ముందుకు.

## 57. శ్లో ॥ జగన్మాత అపారదయారసనేత్రదృష్టి కరుణా రసవృష్టి.

**57 శ్లో॥ దృశాద్రాఘీయస్యా దరదళిత నీలోత్పలరుచా**
**దవీ యాంసం, దీనం స్నపయకృపయా, మామపి, శివే!**
**అనేనాయాం, ధన్యోభవతి, నచ, తే, హాని, రియతా!**
**వనేవా, హర్మ్యేవా, సమకరనిపాతో హిమకరః ॥**

**అర్థము :-** తల్లీ! శివా! భవానీ! కల్యాణీ! జగదంబా! ఇంచు కవికసించిన నల్ల కలువ వంటి కాంతి గలిగిన, నీ కడగంటి చూపు (కటాక్ష దృష్టి) - కరుణారసదృష్టి- నీ కుకడుదూరంలో (నీవో - సత్యలోకంలో వున్నావు. నీ శిరసు సత్యలోకంలో వున్నది. - నేనో - భూమిపై వున్నాను- ఆరు లోకాలదూరం - మనమధ్య వున్నది! నీపాదాలు ఈ భూమి - అవే నమ్ముకున్నాను!) వున్న - దీనుడనగు (నీ సాక్షాత్కారం కోసం - నీ కరుణా కటాక్షం కోసం దీనాతి దీనుడనై వేడుకుంటున్ననేను) నాపై ప్రసరింపజేయుము తల్లీ! అంతమాత్రం నీ దయాదృష్టి ప్రసరింపజేసినంత మాత్రాన - నీకు ఏ కొరతారాదు. ఎందువలననంటే చల్లని వెన్నెల కురిపించే చంద్రకిరణాలు - చిక్కని అడవిపైన అయినా, భవ్యహర్మ్యాలు గల నగరాల పైనా ఒకవిధంగా ప్రసరించినా, - చంద్రునికీ - వెన్నెలకూ తరుగువుండదు కదా ?

నా జన్మధన్యమౌత్తుంది - "అంటున్నారు జగద్గురువు! ఎందరిపై ప్రసరింపజేసినా- తరగని అపారదయారస సముద్రం జగన్మాత దృష్టి! ఎంత తోడినా సముద్రంలో నీరు ఇంకిపోనట్లు - చరాచర జగత్తులోని సర్వప్రాణికోటికీ వారివారి అర్హతల ప్రకారం ఆమె దయావృష్టి కురిపించినా - ఆమె నేత్రాలలో దయారసం ఎప్పటికప్పుడు నిండుగా ఉత్పత్తి అవుతూనే వుంటుంది.

తృతీయ (మూడవ) అధ్యాయం సమాప్తం.

ఈ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదులవారు జగన్మాత నేత్రసౌందర్యాన్ని - నవరసదృష్టిని - నేత్రముల రెప్పల సౌందర్యాన్ని రెప్పపాటు లేని జగన్మాత నేత్రదృష్టి యొక్క శుభభావననూ, నేత్రములలోని త్రిగుణముల వర్ణన - గంగాయమునా శోణ నదులనే పవిత్ర తీర్థములుగా తల్లి నేత్ర త్రయాన్ని వర్ణించటం చివరగా - తనవంటి దీనునిపై - ఆదయావృష్టి కురిపించమని శరణాగతిచెందటం అద్భుత కవితారీతిలో వర్ణించారు. జగద్గురువులంతటి వారే - తానుదీనుడనని శరణాగతి చెందారు ఆతల్లి పాదాలచెంత! మనం - సాధారణమానవులం - నిరంతరం రజోగుణం- తమోగుణ సంపన్నులం - సమస్యల వలయాలలో చిక్కి వున్నవారము నిరంతర తపోధ్యాన సమాధి - పూజల్లాటి వాటికి ఎక్కువ అవకాశాలు లేనివారము- అయిన మనందరం - మరెంతటి దీనులమో - మనమే ఆలోచించుకొనే అవకాశము - ఆత్మవిమర్శ చేసుకొనే అవకాశము ప్రసాదించారు జగద్గురువు.

50 వ శ్లోకంనుండి 58 వ శ్లోకం వరకూ (అంతక్రితం 2వ అధ్యాయంలో చివరిరెండు శ్లోకాలూ (48, 49) అమ్మవారి నేత్ర సౌందర్యం వర్ణించారు. సుమారు పదిశ్లోకాలలో అమ్మవారి నేత్రసౌందర్యలహరిని ప్రవహింపజేసారు మనందరి హృదయాలలో.

"ఆ (! ఎంత అమ్మవారి కళ్లైతేమాత్రం ? ఇంతగా వర్ణించాలా! సింపుల్‌గా ఒకటిరెండు శ్లోకాలు చాలవా ?" అనే కుతర్కీ పండితులూ వున్నారు.

"సర్వేంద్రియాణాం, నయనంప్రధానం" అన్నారు పెద్దలు. చక్షు ర్నేత్రాలు, (పైకి కనిపించే కళ్లతో - దృష్టితో) సర్వప్రపంచంలోని దృశ్యాలన్నీ చూడగలుగుతున్నాం మనమందరం. పశుపక్షులకు - మృగాలకూ - కళ్లు - కంటి చూపూ కనురెప్పలూ - రెప్పలార్పడంలాటి లక్షణాలన్నీ మానవులకు లానేవున్నప్పటికీ - భావ వ్యక్తీకరణను స్పష్టంగా చేయలేవు అవన్నీ. అబద్ధాలు చెప్పటానికీ - కళ్లు మూస్తాం మనం! అవి అలా చేయలేవు! మనహృదయంలో ప్రతి భావాన్నీ, నవరసాలనూ కళ్లలో ప్రతి ఫలింప జేయగల అద్భుత శక్తి ఒక్క మానవులకే దైవం ఇచ్చినవరం! అధ్యాత్మికపాఠాలు నేర్పేదేదృష్టి. ఆత్మవిమర్శ ఆత్మవ లోకనం. ఈ మనచూపులలోనే ప్రారంభమై - అవి అంతర్‌దృష్టిగామారుతాయి.

ఆదృష్టి - ద్వేషమూ, (కోధపూరితమూ, మితిమించిన కామమూ, మోహము ఈర్ష్య - అసూయలతో నిండిపోతే, వారే దానవులుగా, మృగతుల్యులుగా - పక్షులలోని క్రూరపక్షుల జాతికీ దిగజారిపోతారు. స్త్రీలలో ఈ దృష్టులన్నీ నిండి వున్నప్పటికీ, అన్నీ బహిర్గతం కానివ్వని సంయమనం - శాంతం స్త్రీలకు ఆ జగన్మాత ఇచ్చిన వరం. తమ భావాలని రెప్పలూ మూస్తూ, తెరుస్తూ నియంత్రించుకోగల శక్తి స్త్రీలకున్నది! చరాచర విరాట్ స్వరూపిణి అయిన జగన్మాత నేత్రాలు - ఈ సర్వజగత్తునూ అనుక్షణం పరిశీలిస్తుంటాయి. అంచేత ఆమె కన్నులలో నిరంతరం సాత్విక, రాజస, తామస భావాలూ, గంగ, యమున శోణనదులల్లాటి పవిత్రతా (దీనులను దరిద్రులనూ, బాధాతప్త హృదయులను కూడా ఉద్ధరించే కరుణారస దృష్టి) నిండివుంటాయి.

ఇలాటి కొండంత భావాన్ని కేవలం 10 శ్లోకాలలో - ఒక్కొ శ్లోకంలో ఒక్కొక్క నేత్రసౌందర్యాన్ని దృష్టి భేధాన్ని పొందుపరచి మనసు కళ్లు తెరిపించే ప్రయత్నం చేశారు ఆచార్యులవారు - అవునా ?

ఈ మూడవ అధ్యాయం సమాప్తం ఈ అధ్యాయం పారాయణం వలన, శరీర సంబంధమైన చర్మ వ్యాధులూ, నేత్రవ్యాధులు కర్ణవ్యాధులూ, పైకి చెప్పుకోలేని యోనివ్యాధులూ, అంద వ్యాధులూ మొదలైనవన్నీ ఉపశమించి మంచిఆరోగ్యమూ, దేవీ కరుణ కలుగుతాయి సాధకులకు. మందులకు మళ్లబడిన వ్యాధులు కొన్నివుంటాయి. మానవప్రయత్నం పనిచేయని చోట దైవం తోడ్పాటు తప్పక వుంటుంది భక్తులకు ప్రయత్నించటంలో తప్పు లేదుగా!

మరి పదండి ముందుకు పారాయణానికి.

# 4వ అధ్యాయము

## ( చతుర్థ అధ్యాయము )

ఈ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి కణతలు, ముఖము, కుండలములు, నాసిక, అధరము, దరహాసము, జిహ్వా, తాంబూలకబళమాహాత్మ్యము, వాగ్మాధుర్యము, చుబుకము (గడ్డము,) కంఠము, కంఠంపై గల భాగ్యరేఖలు - మొదలైన సౌందర్యములు 58 వ శ్లోకంనుండి 69 వ శ్లోకంవరకూ, 12 శ్లోకాలలో వర్ణించారు. నిజానికి అమ్మవారి శిరస్సుమొదలు, కంఠంవరకూ గల ఈ వర్ణన అంతా (ఒకటి, రెండు, మూడు, నాలుగు అధ్యాయాలు) అమ్మవారి మంత్రరూప శరీరము, విరాట్‌రూపము యొక్క స్వరూపం.

"క ఏ ఈ లహ్రీం హస కహలహ్రీం, సకలహ్రీం"

అనేది అమ్మవారి పంచదశీమంత్రము

"క ఏ ఈ లహ్రీం, హసకహలహ్రీం, సకలహ్రీం శ్రీం"

అనే "షోడ శాక్షరీ మంత్రము.

క ఏ ఈ లహ్రీం - అనే మంత్రభాగము.

అమ్మవారి "వాగ్భవకూటం" యొక్క మంత్రం.

శ్లో ॥ "శ్రీ మద్వాగ్భవ కూటైక స్వరూప ముఖ పంక,
కంఠాధః కటి పర్యంత మధ్య కూట స్వరూపిణీ
శక్తి కూటైక తాపన్న కట్యధో భాగధారిణీ ॥

అనేది లలితా సహస్రనామస్తోత్రంలో అమ్మవారి మంత్రరూప శరీరాన్ని వశిన్యాది వాగ్దేవతలు వర్ణించారు. వాగ్భవ కూటము- అమ్మవారి ముఖంనుండి కంఠంవరకూ అది "క ఏ ఈ ల హ్రీం" అనేమంత్ర విభాగము ఇక రెండవది అయిన "కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ!" కంఠం మొదలు. కటి - (నడుము) వరకూగల అమ్మవారి శరీరం. మధ్యకూట స్వరూపం -అనగా పంచదశ మంత్రంలోని 2వ భాగం అయిన

"హస కహలహ్రీం" అనే విభాగమునకు సంబంధించిన వివరణ.

ఇక "శక్తి కూటైక తాపన్న కట్యధోభాగ ధారిణీ!"

అనే మూడవ కూటము. కటి (నడుము) వద్దనుండి- పాదాలవరకూ గల భాగము. ఇదే "సకలహ్రీం" అనే నాలుగు అక్షరాల మంత్ర విభాగము.

ఆదిశంకరులు- ఒకటి రెండు, మూడు, నాలుగు అధ్యాయాలలో అమ్మవారి విరాట్‌రూప స్థూలరూప వర్ణనలోనే వాగ్భవకూట మంత్ర వర్ణనగా - మంత్రవిభాగాన్ని పరోక్షంగా దర్శింపజేస్తున్నారు.

మనం ఈ 4వ అధ్యాయంలో అమ్మవారి కంఠం వరకూ గల వర్ణనను పారాయణంచేసి ఆ తల్లి మంత్ర కూట స్వరూపంలోని మొదటిభాగాన్ని పరిపూర్ణంగా దర్శిద్దాము.

పదండి - ముందుకు.

## 58. శ్లో ॥ అమ్మవారి "కణతలు సౌందర్యం.

**58 శ్లో॥ అరాళం తే, పాళీయుగళ, మగరాజన్య తనయే!**
**నకేషా మాధత్తే, కుసుమ శర కోదణ్డ కుతుకమ్**
**తిరశ్చీనో, యత్ర శ్రవణ పదముల్యంఘ్య విలసన్**
**అపాఙ్గ వ్యాసఙ్గో, దిశతి శర సన్ధాన ధిషణామ్ ॥**

అర్థము :- ఓ పర్వతరాజపుత్రీ! (అగరాజన్యతనయే!) నీ కణతలు (పాళీయుగళం) వంకరతిరిగి మన్మధుని విల్లువలె నున్నది. నీ కర్ణములు దాటిపోవుచున్నట్లున్న నీ కడగంటి చూపులు (ఆకర్ణాంత విశాల నయనాల దృక్కులు) ఆ విల్లులో అడ్డముగా అమర్చిన (ఎక్కుపెట్టబడిన) మన్మధబాణముల వలె వున్నది.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు అమ్మవారి కణతల సౌందర్యం వర్ణించారు. కనుబొమల చివరల వంపుతిరిగిన కణతలు మన్మధుని విల్లువలెను. ఆ కర్ణాంత విశాల నయనాల చూపులు మన్మధుని ఆరవబాణం - (ఆఖరుబాణం అయిన స్త్రీకడగంటిచూపు) వలెనూ వున్నదని అద్భుతమైన వర్ణనచేశారు. ఆ తల్లి వదనా రవింద సౌందర్యలహరిలో ప్రత్యణువూ ఒక సౌందర్య ప్రభానకిరణం. దానిని అత్యంత భావుకత కలిగిన హృదయంతో భావనలో భవానిని దర్శించేందుకు భక్తిభావనతో, అర్థంచేసుకోవాలి. అవునా ?

## 59 శ్లో ॥ గండస్థలము సౌందర్యము.

### (చెక్కిలి సౌకుమార్యము.)

**59 శ్లో॥ స్ఫురద్గండాభోగ ప్రతి ఫలిత, తాటకయుగళం,**
**చతుశ్చక్రం మన్యే, తవ ముఖమిదం, మన్మధరథమ్!**
**య మార్యుహ్య ద్రుహ్య, త్యవని, రథమర్కేన్దు చరణం**
**మహావీరో, మారః, ప్రమథపతయే సజ్జితవతే ॥**

**అర్థము :-** ఓ జగన్మాతా! భగవతీ! నిగనిగ అద్దమువలె మెరయుచున్న నీ చెక్కిళుల విశాల ప్రదేశమునందుమేలిమి బంగారుతో చేసి - రతనాలుపొదిగిన నీ తాటంకములు (పెద్ద పెద్ద చక్రములవంటి కుండలములను బోలిన కమ్మలు కర్ణా భరణములు - తాటంకములు అంటారు) ప్రతిఫలించి, అవి మన్మధుని నాలుగు రధచక్రాలుగా భాసిస్తున్నాయి. అనగాచెవుల తాటంకములు (చక్రములవంటి కమ్మలు) రెండు + చెక్కిళులలో ప్రతిఫలించిన చక్రములు (కమ్మలనీడ) రెండు కలిపి - మన్మధుని రధానికి నాలుగు చక్రాలుగా అమరిపోయాయి. లోగా శ్లోకాలలో కనుబొమలు మన్మధుని విల్లుగానూ, కనురెప్పలు మన్మధుని బాణములకు కట్టిన కంక పత్రములు ( గ్రద్దఈకలు )గానూ, కణతలు మన్మధుని విల్లులో - ఆ కర్ణాంత విశాల నేత్రములచూపు (కడగంటి చూపు మన్మధుని ఆరవ బాణంగానూ వర్ణించి, ఇప్పుడు. ఆ తల్లి అద్దముల వంటి చెక్కిళ్ళు, ఆ చెక్కిళ్లలో ప్రతిఫలిస్తున్న తాటంకములనే కమ్మలు - ఏకంగా మన్మధుని రధచక్రాలుగానూ మారిపోయాయి! అస్త్ర శస్త్రాలతో సుసజ్జితుడై - బయాల్దేరిన ఆ మన్మధుడు జగన్మాత "ముఖము" అనే తేరునధి రోహించి, సూర్యచంద్రులు రధచక్రములు కాగా, భూమినే రధంగా చేసుకుని అధిరోహించి త్రిపురములపైకి యుద్ధసన్నద్ధుడై యున్న "కామారి" అయిన మహాదేవునికి - ద్రోహం చేయుచున్నాడు. అనగా ఆ మహాదేవునే ఓడించటానికి సిద్ధపడుతున్నాడు! ఈ శ్లోకంలో - శ్రీ శంకర భగవత్పాదులవారు. జగన్మాత చెక్కిళుల సౌందర్యం మహాద్భుతంగా వర్ణించారు. కొందరు స్త్రీలను గమనించండి. ఎంత వయసువచ్చినా - వారి చెక్కిళ్లు పాలుగారుతున్నట్లు వుంటాయి. చెక్కిళులలో - శరీరంలోపలి ధమనులు, సిరలు (ఆకుపచ్చదారాల్లా) ప్రతిఫలిస్తుంటాయి. పసిబిడ్డలకు ఇలా ప్రతిఫలిస్తాయి.

కాస్తంత ఎండ అయినా, వేడిమి అయినా, ఇలాటిస్త్రీల ముఖం వెంటనే ఎర్రవారి కంది, కమిలినట్లౌవుతుంది - వాడిన ఎర్ర తామరపూవులా! ఇలాటి సౌందర్యం కొందరుస్త్రీలలోనే వుంటుంది. పదినెలల లోపు పసిపాపలకు కూడా ఇలాగేవుంటాయి చెక్కిళ్లు! స్వచ్ఛమైన పాలరాతి శిలపై వెన్నెల ప్రతిఫలించినట్లు - వెన్నెలలో "ఆగ్రా"లోని తాజ్‌మహల్ - ప్రతిబింబం యమునా నదిలో ప్రతిబింబిం చినట్లు - శిక్కుల స్వర్ణ దేవాలయం - ప్రతిబింబం - సరస్సులో ప్రతిబింబించినట్లు - జై పూర్‌లోని పాలరాతి అంతః పురహర్మ్యాలలో - కదలాడే మనుష్యుల నీడలు- నేల మీదా, గోడల మీదాప్రతి ఫలించినట్లు - ఒకానొక గొప్పసౌందర్యం - విశ్వవ్యాప్తంగా చూడగలిగితే - అదే అమ్మవారి చెక్కిళ్ల సౌందర్యంగా దర్శించవచ్చు మనం.

ప్రకృతిలో సన్నిహిత సంబంధమూ, ప్రకృతి సౌందర్యలో తాధ్యాత్మ్యత చెందగల హృదయమూ వుండాలేగానీ - ఆ జగన్మాత విరాట్‌రూప సౌందర్యం - ఈ జగత్తులోని అణువణువులో నిక్షిప్తమైవుంది.

భక్తితో, సాధనతో, మనహృదయపు కళ్లు తెరుచుకోవాలి ఆ సౌందర్యాన్ని తనివితీరా దర్శించటానికి అవునా ?

# 60 శ్లో॥ కుండలముల ఝుణత్కార నాద సౌందర్యము.

60 శ్లో॥ సరస్వత్యా సూక్తీః అమృతలహరీ, కౌశలహరీః
పిబన్త్యా శ్శర్వాణీ శ్రవణ చుళుకాభ్యామవిరళమ్!
చమత్కార శ్లాఘాచలిత శిరసః కుండలగణో
ఝుణత్కారై, స్తారైః, ప్రతివచన మాచష్ట ఇవతే ॥

అర్థము :- తల్లీ! జగన్మాతా! వాగ్దేవి అయిన సరస్వతీదేవి (నీ కుడివైపు కూర్చుని) నీ స్తోత్రమును చేయుచుండగా, నీవు ఆ స్తోత్రమునకు సంతోషిస్తూ, ఆమెను మెచ్చుకుంటున్నట్లుగా, నీ శిరసును ఇంచుక కదలించు చున్నావు. ఆనీ శిరః కంపనమువలన, నీ కర్ణాభరణములైన రత్నకుండలములు (రత్న తాటంకములు) సన్నని ధ్వనితో "ఝుణత్కారము" చేయుచూ, నీయొక్క సరస్వతీదేవి యొక్కస్తోత్రములలోని అమృత వచనములకు, ప్రతివచనము (జవాబులు) ఇస్తున్నట్లుగా వున్నది ఆ ధ్వని.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు మహాద్భుత వర్ణనచేశారు గమనించండి. నోటితో మాటలాడ కుండానే, అమ్మవారు మెచ్చుకోలుగా తల వూగించటంతో, ఆమె కుండలాల కువేళ్లాడుతున్న రతనాలు, ఒకదానితో ఒకటి కలిసి ధ్వనిరాగా, అది - ఆ తల్లి మౌనాంగీకారము, ఆనందాలకు ప్రతిధ్వనిలా వుందన్నారు.

లలితా సహస్రనామ స్తోత్రంలో

శ్లో ॥ సచామర రమావాణీ, సవ్యదక్షిణ సేవితా!" అంటూ, కుడి, ఎడమల యందు సరస్వతీ - లక్ష్మీ దేవులిద్దరూ - జగన్మాతకు వింజామరలువీస్తున్నట్లుగా - వశిన్యాది వాగ్దేవతలు స్తోత్రం చేశారు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు మనకు కనిపించని సరస్వతీదేవి - శ్రీ మాత వాక్కుగా పరోక్ష దర్శనం చేయిస్తున్నారు. శ్రీ వాక్కే సరస్వతీ స్వరూపం! ఎవరూ చల్లగా, మెల్లగా, శాంతంగా, మృదువుగా,. మితంగా, సుస్వరంతో మాట్లాడగలరో, వారి జిహ్వే సరస్వతీ నిలయం అంటారు పెద్దలు! ఇక జగన్మాత వాక్కుగురించి వేరే చెప్పాలా ? ఈ శ్లోకంలో జగన్మాత మాటలుకూడా పరోక్షధ్వనిగానే సూచించారు జగద్గురువు! "మాకరంద సారవర్ష భాషిణే నమశ్శివాయ!" అంటూ శ్రీ శంకర భగవత్పాదుల వారే - శివపంచాక్షరీ నక్షత్ర మాలాస్తోత్రంలో- ఈశ్వరుని వాక్కునుగురించి శలవిచ్చారు.

ఆ తల్లి అర్ధనారీశ్వరి! ఆమెవాక్కు మకరంద సారం వంటిదే! జగన్మాత శిరః కంపనలోని పరోక్ష వాక్కునూ, అవిశ్రాంతంగా సరస్వతీదేవి జగన్మాతస్తోత్రాన్ని చేస్తున్న వాక్కునూ - అదీ

పరోక్షంగా- జగన్మాత కుండలముల ఝుణత్కారంలో "నాద బిందు కళాత్మికగా" తాము దర్శించిన జగద్గురువులు- మనల్నీ ఆ నాదం విని తరించమంటూ పరోక్ష భోద చేస్తున్నారు. మన మనసుకు చెవులు కలిగి, మన పరుషవాక్కును పరిహరించుకొనే ప్రయత్నమూ మనం చేసుకోగలిగితే ఆ సున్నితమైన ఝుణత్కారనాదాన్ని మనందరం వినితరించగలము. ఈనాడు మనం వుంటున్న సమాజంలో శబ్ద కాలుష్యం వెయ్యి బాంబుల పెట్టుగా వున్నది. వాహనాల శబ్దాలు- బాంబులను తలపింప జేసే బాణా సంచాలు - అటు పెళ్లికీ - ఇటు చావుకీ - రాజకీయ గెలుపుకూ, ఓటమికీ - నామినేషన్లకీ- ఒకటేమిటి ? బాణాసంచా కాల్చటమన్నది దీపావళి నాడుగాక - పిడుగుకూ - బియ్యానికీ కూడా ఒక మంత్రం అన్నట్లుగా - మారిపోయింది - అదిగాక వినాయక చవితి, శ్రీ రామనవమి, దసరా దేవీ నవరాత్రులు. (దీపావళి సరేసరి) ఇట్లా ఏపండుగ వచ్చినా భక్తి మాటదేవుడెరుగు - పోటాపోటీలుగా పందిళ్లు, షామియానాలూ, మైకులూ - భక్తిపాటలతో విసుగెత్తినట్లుగా అన్నిరకాల సినిమాపాటలతో - పెళ్లిళ్లకు బ్యాండుతో బాటు మైకుల్లో సినిమాపాటలూ - డ్యాన్సులకు మైకులలో సినిమాపాటగాక, సాధారణ జనాలంతా ఈ శబ్ద కాలుష్యంతో బెంబేలు పడిపోతున్న పరిస్థితినెలకొని వున్నది. ఇదిచాలక, రాజకీయ నాయకుల వాగ్దానాలు, పరస్పర విమర్శలు పార్టీలపై బురదజల్లుకొంటూ చేసే - కీచు- బొంగురు - భయంకర గొంతుకల ఉపన్యాస హింసాకాండలు మరొకవైపు చుట్టుముట్టి వున్నాయి. ఈ శబ్ద కాలుష్యపువాతావరణంలో - జగన్మాత కుండలాల సున్నిత ఝుణత్కారనాదం ఎవరికి పట్టింది? . ఎవరి వూహకందుతోంది ? వున్న చెవులు చిల్లులు పడ్తుంటే! వీటన్నిటినుండీ మనందరినీ ఆ శ్రీమాత రక్షించాలి మరి, అవునా! పదండి - ముందుకు - పారాయణంలోకి -

## అమ్మవారి నాసిక (ముక్కు) సౌందర్యం.

**61 శ్లో॥ అసౌనాసావంశస్తుహినగిరి వంశధ్వజ పటీ!**
**త్వదీయో నేదీయః ఫలతుమస్మాకముచితం!**
**వహంత్యన్తర్ముక్తా శ్శిశిరకర నిశ్వాస గళితం**
**సమృద్ధ్యా, యత్తాసాం, బహిరపి నముక్తామణిధరః**

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు, జగన్మాత యొక్క నాసాదండము, అనగా "ముక్కు" (నాసిక) సౌందర్యము, ముక్కుకొసన ఆభరణంగా వుండే ముక్తాభరణం (ముత్యపు ముక్కెర యొక్క సౌందర్యాన్ని వర్ణిస్తున్నారు.

**అర్థము** :- హిమవంతుని వంశమునకు పతాకము వంటి తల్లీ! (తుహినగిరి వంశధ్వజ పటీ!) పర్వతరాజ పుత్రీ! పార్వతీ! జగదంబా! నీ వంశమునందు (వంశదండము = అనగా

వెదురుగడ అనికూడా అర్థము వున్నది. లేతవెదురు మొక్కయొక్క- గట్టిపడిన భాగము అమ్మవారి నాసికగా మలిస్తే ఎట్లా వుంటుందో ఆవిధంగా, ముత్యములు వుండితీరాలి. లేకపోతే నీవు శ్వాస వదిలినపుడు నిశ్వాసములో - ముత్యమెట్లు రాలిపడ్తుంది ? ఆ ముత్యములు మా ఆధ్యాత్మిక కోర్కెలను ఈడేర్చుగాక. ఈ అర్థం కొంచెం జటిలంగానూ, గందరగోళంగానూ వున్నట్లు అనిపిస్తుంది త్వరత్వరగా చదివితే! కానీ వివరంగా లోతుగా పరిశీలిస్తే కొండంత అర్థం గోచరమౌతుంది గమనించండి.

ముత్యములు ఆరు విధములుగా లభిస్తాయి.

1. గజముల కుంభస్థలములందు.

2. వెదురు చెట్లయందు.

3. సర్పముల ఫణములు (పడగల)యందు

4. మేఘముల యందు.

5. శుక్తిక (ముత్యపు చిప్పలు సముద్రంలో స్వాతి చినుకులు పడి ముత్యపు చిప్ప మూసుకుపోగా ఏర్పడేముత్యం) యందు.

6. ఇక్షుదండమునందు - అనగా చెఱకు గడయందు.

గజముల కుంభస్థలములయందు ముత్యములెలా జనిస్తాయి ? అక్కడ చర్మం మొద్దుగానూ, ముడతలు పడ్డట్లు చారలు చారలుగానూవుంటుంది. చెమట ఎక్కువగా పడ్తుంది. ఏనుగులు దురదతో, ఏ చెట్టు మొదళ్లకో, కొండలకో, వేసిరుద్దుకుంటాయి.

చెమటబిందువులు - కుంభస్థలం చర్మంలో ఇరుక్కుని ఘనీభవించి ముత్యములుగా మారుతాయి. అవి ఏ చెట్లబోదెలకో దురదకు రుద్దుకున్నపుడు రాలిపడతాయి.

ఇవి కర్పూరకాంతి గలిగినవి. అనగా, చిత్ర విచిత్ర వర్ణములు గల ముత్యములు - మట్టి (మెరూన్) రంగు- లేత గోధుమరంగు మొదలైన చిత్ర వర్ణములు కలగలిపి వుంటాయి.

2. వెదురు చెట్లయందు - బోలుగా వుంటుంది లోపల- వెదురు దండం - కొస వరకూ లోపల సన్నని రంధ్రం బోలుగా వుంటుంది. ఇదే - శ్రీ కృష్ణుని మురళి, (వంశీనాదం) వెదురు మొక్కలుగా వున్నపుడు వర్షం పడినపుడు- వెదురు ఆకులు సన్నగా పొడవుగా క్రిందికి వంపు తిరిగివుంటాయి గనుక ఆ నీటి బిందువులు - వెదురులోని "బోలు" రంధ్రం ప్రదేశంలో పడి- ఘనీభవించి ముత్యాలుగా మారుతాయి. వెదురుగడలు, కొన్ని గలగల లాడుతాయి అందుకే. ఇవి తెలుపు కలిసిన ఎరుపు వర్ణపు, ముత్యాలు.

3. "వాసుకి" అను సర్పరాజు ఫణములు పడగలయందు- ఉద్భవించిన ముత్యాలు- "వాసుకి" జాతికి చెందిన పాములు- సౌరభం ఎక్కడ వుంటే అక్కడ - ఉదాహరణకు మల్లెపొదలు, మొగలి పొదలలో పాములు తప్పకుండా వుంటాయంటారు), మంచి జాతి మణులున్న గనులు - వద్ద వుంటాయి. ఆ సౌరభానికి ఆకర్షితమై తమ పడగలు ఆ పొదలలో, ఆ మట్టిలో దూర్చి పడుకుంటాయి. అక్కడి ముత్యాలు - మణులు ఆపాముల పడగలలో చిక్కుకుంటాయి. అట్లా, పడగల ఒరిపిడిలో చిక్కిన నీటిబిందువులూ - ఘనీభవించి ముత్యాలు అవుతాయి. ఇవి నీలవర్ణము గలవి.

4. ఇక మేఘములయందు ముత్యాలు ఉత్పన్నమౌతాయి. కారుమబ్బులలో చిక్కుకున్న నీరు- అక్కడకూడా ఘనీభవించి "వడగండ్లు" (మంచుముక్కలు) గా పడటం మనం చూస్తూనే వున్నాము - "వడగళ్ల వాన" అంటారు ఒక్కొక్కసారి ఒక కిలో బరువుగల వడగళ్లు కూడా పడి పంటలను నాశనం చేస్తాయి పశులపై పడితే - గాయపడతాయి.

అట్లాగే - ఆ నీటి బిందువులు ఘనీభవించి ముత్యములుగా మారి - వర్షంతో బాటు అక్కడక్కడా రాలిపడతాయి. "ముత్యాలవాన" అనే చమత్కారం ఎక్కడో ఒక ముత్యం రాలిపడగా ఏర్పడినదే సుమా! ఈ ముత్యములు జ్యోతిర్వర్ణము - అనగా మెరుపు కాంతి కలిగి వుంటాయి. అవునుమరి మబ్బులకూ, మెరుపులకూ అవినాభావసంబంధం వున్నదికదా ?

5. శుక్తిక - (అనగా ముత్యపుచిప్ప) యందు జనించే ముత్యాలు - స్వాతికార్తె వర్షపు చినుకులు - సముద్రప్రాంతంలో పడగా, సముద్రంలోని ముత్యపుచిప్పలు (ఇవి ఒకానొక సముద్రపు పురుగు యొక్క డొల్లలు)లోపడి - అవి మెల్లిగామూసుకుపోగా, ఆ నీటి బిందువు ఘనీభవించి ముత్యంగా మారుతుంది. మత్స్యకారులు - సముద్రపు గజ ఈతగాళ్లు - ఈ ముత్యపు చిప్పలకోసం సాహసంతో సముద్రంలో మునకలు వేసి అన్వేషిస్తుండటం - సముద్రతీర వాసులందరికీ తెలుసు, ఇవి శ్వేతవర్ణము, అనగా స్వచ్ఛమైన తెలుపు వర్ణం గలిగినవి.

6. ఇక - ఇక్షుదండం అనగా చెఱకు గడలో జనించే ముత్యాలు. వంశీ దండం (వెదురుగడలానే) చెఱకుగడలో కూడా ఒక్కొక్క గడలో బోలు ప్రదేశం వుంటుంది (ఇది తీపిగా వుండదు) దీనిలో చిక్కుకున్న వర్షపునీటి బిందువులు - ఘనీభవించి ముత్యములుగా మారిపోతాయి. ఇవి పసుపువన్నె కలిగినవి. ముడిగా లభ్యమైన ముత్యాలను శుద్ధిచేసి - ఆ తర్వాత వాటికి సన్నని సూదులతో రంధ్రాలుచేసి - ఆ తర్వాత హారాలుగా, ఆభరణాలుగా గ్రుచ్చుతారు. (ఇంతటి చరిత్రవుంది ముత్యాలకు.)

శ్లో ॥ నవచంపక పుష్పాభానాసాదండవిరాజితా!" అనీ,

శ్లో ॥ సకలాగమ సందోహశుక్తి సంపుటి మౌక్తికా!" అనీ లలితాసహస్రనామ స్తోత్రంలో అమ్మవారినాసిక - నవవికసిత - సంపెంగలా (మంచి సువాసనగల గడ్డిసంపెంగ - లిల్లీపూవువలె, తీర్చిదిద్దినట్లు) వుంటుందని వశిన్యాది వాగ్దేవతలు వర్ణించారు. అట్లాగే - సకల ఆగమములు- వేదములే, ముత్యములుగా గల ముక్తా భరణాన్ని అమ్మవారు నాసా భరణంగా ధరించిందనీ వర్ణించారు వశిన్యాది వాగ్దేవతలు.

శంకర భగవత్పాదులవారు. అమ్మవారి నాసికను వంశీ దండంగానూ వర్ణించి - అందులోనుంచి ముత్యాలు రాలుతున్నట్లు వర్ణించారు. ఆ జగన్మాత ఉచ్ఛ్వాస నిశ్వాసలలో సకల ఆగమములూ (వేదములూ, ఉపనిషత్తులూ వున్నాయి. నిశ్వాసం అప్పుడు ఆ చిరుగాలికి ఆమె ముత్యాల ముక్కెరలో క్రిందకు వ్రేళ్లాడుతున్న (ముక్కక్రిందుగా - రెండుముక్కుల మధ్యగా ధరించేది. ముక్కెర ముక్కు ప్రక్కగా పై పెదవి వరకూవుండేది "బులాకి") బులాకి ముత్యాలు కదలటంతో- అవిజారి క్రింద పడ్తున్నట్లుగా అనిపిస్తూండటంతో! "తల్లీ నీ నాసాదండంలో నుండి, ముత్యములు రాలుతున్నాయి "అన్నారు జగద్గురువు! ముక్కులోనికి వెళ్లేగాలిని - వడబోసి (ఫిల్టర్) పరిశుద్ధమైన శ్వాసక్రియకు దోహదంచేస్తాయి ముత్యాలు. అందుకే మన నాన్నమ్మలూ, అమ్మమ్మలూ అంతా ముత్యాల ముక్కెరలు ధరించేవారు.

శ్వాస పరిశుభ్రంగావుంటే- మనిషి ఆరోగ్యం బావుంటుంది. నిరంతరం తేమ, పొగ - వేడిమి- చిన్నపిల్లల సేవ - పెద్దలందరికీ వంటావార్పులలో నిమగ్నమై వుండే స్త్రీలకు మంచిగాలి లభ్యం కావాలిఅంటే - తాజాగా శ్వాసవుండాలి అంటే - ముత్యాల ఆభరణాలూ- ముత్యాల ముక్కెరలూ - ఒకానొక అలంకారంగానూ, ఆరోగ్య సాధనాలుగానూ రూపొందించారు మనపూర్వీకులు! అవి ఔటాఫ్ ఫ్యాషన్ అయిపోయి- "ఆ ముక్కుపుడకలేమిటి ? అమ్మ శక్తిలా!" అనే అతి నాగరీకం ముంచుకు వచ్చింది. జాతి వజ్రాలు (డైమండ్స్ - రవ్వలు అని అంటారు) జాతి కెంపులు - జాతి ముత్యాలు (సహజ ముత్యాలు) ఇవన్నీ శ్వాసను శుభ్రపరచే ఆభరణాలు. అందుకే తాటంకాలు (చెవి కమ్మలలో - ఉంగరాలలో - హారాలలో - ముక్కెరలలో ముత్యం, పగడం - కెంపు - పుష్యరాగం - నీలం - గోమేధికం - పచ్చ (ఆకుపచ్చ), వజ్రం, వైఢూర్యం. మొదలైన నవరత్నాలను వారివారి ఆర్థిక స్థితినిబట్టి - కాలుష్య హరములుగా ధరిస్తారు స్త్రీ పురుషులు. ఇవే నవరత్నాలు అంటారు. నవగ్రహాలసంకేతాలూ అంటారు పెద్దలు కేతువు - వైఢూర్యం, గురువు - పుష్యరాగము బుధుడు - పచ్చ, శని - నీలము రవి - కెంపు, శుక్రుడు

- వజ్రము, రాహువు - గోమేధికం, కుజుడు - పగడము, చంద్రుడు - ముత్యము. ఎవరెవరి జన్మనక్షత్రాన్నిబట్టి వారి వారికి ఆ నవరత్నాలలో ఏది సరిపోతుందో అది ధరిస్తేమంచిదని సూచిస్తుంటారు. ఆరోగ్యం వుంటే - ఆనందం, ఆనందంవుంటే ఆధ్యాత్మిక జిజ్ఞాస - ఆధ్యాత్మిక జిజ్ఞాస కలిగితే శ్రీ మాత చరణాల పై భక్తిభావం వరుస క్రమంలో వస్తాయి. అందుకే పరమగురువులవారు "నీ నాసాదండము - తల్లీ! మా అందరికీ క్షేమం ఆధ్యాత్మిక కోర్కెలు తీరునట్లు - కలుగజేయును గాక!" అని ప్రార్థించారు. తన ఒక్కరి క్షేమం కోరుకోలేదు ఆ జగద్గురువు. కాబట్టి ఒక్కమారు మన మనో నేత్రాలతో ఆ తల్లి తీరైన నాసికను - ఆ తల్లి ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో కదులాడే నాసికా భరణపు ముత్యాలనూ - మనో నేత్రాలతో దర్శించటానికి ప్రయత్నిద్దాం! కొండంత మన సద్గురువు తానుదర్శించి, సాధికారికంగా మనకు భోధిస్తుండగా, ఈ మాత్రపు ఊహ అయినా మనం సాదించలేమా ? భావదారిద్ర్యమా ? బద్ధకామా ? నిర్లక్ష్యమా? ఒద్దు ఒద్దు అవేవీ దరిజేరనీయవద్దు. పదండి - పారాయణక్రమంలోనికి.

## 62 శ్లో ॥ అమ్మవారి అధరము. సౌందర్యము. (పెదవుల అందము)

**62. శ్లో॥ ప్రకృత్యా ऽ రక్తాయా, స్తవ సుదతి దన్తచ్ఛదరుచేః**
**ప్రవక్ష్యే సాదృశ్యం, జనయతుఫలం విద్రుమలతా**
**న బింబ్బం తద్బింబ ప్రతి ఫలనరాగా దరుణిమం**
**తులా మధ్యారోఢుం, కథమివ నలజ్జేత కలయా ॥**

**అర్థము** :- ఓ జగన్మాతా! తల్లీ! చక్కని పలువరుసగల ఓ దేవీ! సహజముగా కెంపులు దేలుతున్న నీపెదవుల సౌందర్యానికి.. పగడపు తీగెకు పండు పండితే, ఆ విద్రుమఫలము యొక్క ఎరుపుదనము, నీ పెదవులకాంతికి సరితూగుతుంది. అంతేగానీ కేవలం పగడపు తీగెమాత్రం నీ అధరాల ఎరుపుకు సాటికాజాలదు (పగడపు తీగెకు పండుపండదు. పండితే- అనే భావన ఎరుపువర్ణంకోసం చేసినది)

ఇక బింబఫలమన్నచో- దొండపండు. నీ పెదవుల అరుణ వర్ణము అరువుతెచ్చుకున్నట్లున్నదే గానీ - సహజముగా దొండపండు నీ అధరముల ఎరుపుదనానికి సాటిరాదు. అది తెలుసుకొని - బింబఫలము (దొండపండు) సిగ్గుపడుతున్నది.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు, అమ్మవారి అధరముల సౌందర్యమును వర్ణిస్తున్నారు అద్భుతంగా, విద్రుమఫలం పండటం అరుదు. సముద్రాలలో - సముద్రగర్భంలో

పగడపు దీవులు వుంటాయంటారు. సముద్రయానం చేసేవారూ - పగడాల వర్తకులూ ఈ దీవులలోని పగడాలను సేకరిస్తారు. నవరత్నాలలో ఒకటైన "పగడము" నీటి కాలుష్యాన్ని, వాయు కాలుష్యాన్ని మట్టి కాలుష్యాన్ని, హరిస్తుంది. అందుకే పగడాల తావళాలు (దండలు) బంగారు తీగెతో చుట్టి - ధరించేవారు పూర్వకాలం మహిళలు - (అవి కొంతకాలం ఔటాఫ్ ఫ్యాషన్ అయిపోయి - మరలా ఇప్పుడు - పగడపు ఉంగరాలు, పగడాలు, హారాలలో చుట్టించు కోవటం ఫ్యాషన్ అయ్యింది.)

పగడపు తీవెలు గుత్తులు గుత్తులుగా కాయలు కాచి - ఎండి పగిలి - పగడాలు వస్తాయి. భూమిపై పగడపు వృక్షాలు (తీగెలు చెట్లు) కీ కారణ్యాలలో (దండ కారణ్యం- వింధ్యా రణ్యం, నల్లమల అడవులు, లో వుంటాయి. గిరిజనులకు వీటి విలువ తెలియదుపాపం!

విద్రుమఫలం వుండి వుంటే- అమ్మవారి పెదవులకు ఎరుపుదనానికి సాటివచ్చేది - అదిలేదు గనుక, అమ్మవారి పెదవుల సౌందర్యం సాటిలేనిది అని వర్ణించారు ఆది శంకరాచార్యులవారు. "అయ్యోరామా! పెదవులనింతగా వర్ణించాలా ? చాదస్తం కాకపోతే!" అని హేళన చేసేవారూ వున్నారు కొందరు. వారందరికీ - కొన్ని సాధారణ విషయాల అవగాహన లేదనుకొని నమస్కరించి తప్పుకోవాలి మనం - తర్కించి లాభంలేదు.

రామాయణ మహాకావ్యంలోని "సుందరకాండ"లో లంకలోని రాక్షస స్త్రీలను (సీతాదేవికి కాపలావున్న వారిని) వర్ణిస్తూ - "వ్రేళ్లాడే పెదవులు గలది ఒకర్తె, క్రింది పెదవి వ్రేళ్లాడుతూ పై పెదవి కురుచైపోయిన రాక్షసిఒక్కర్తె- పెదవులు పగిలి పళ్లు పొడుచుకు వచ్చిన రాక్షసి ఒకర్తె - పై పెదవి చీలి - పన్ను పైకి పొడుచుకు వచ్చిన దొకర్తె - వంకర తిరిగిన పెదవులు కలిగినది ఒకర్తె. పైకి తిరిగిన పెదవులు (పెదవిపై మరోపెదవి వున్నట్లు) గలది ఒకరాక్షసి .." ఇలా వర్ణిస్తారు వాల్మీకి మహర్షి! తీరికూర్చుని - తిన్నది అరగక చేసిన వర్ణన కాదు అది. మానవుల ముఖంలో - కళ్లు, చెవులు, ముక్కు, కనుబొమలు, నోరు - లలాటం - గడ్డం - ఇలాదేనికదే అందాన్నిచ్చే అవయవాలు, చూపు, వినికిడి - శ్వాస - వాక్కు - ఇవన్నీ వీటి ద్వారానే జరుగుతాయి. నోరుకు తలుపులవంటివి పెదవులు! అనవసరపు వాక్కును అరికట్టటానికి - నోటికి తాళం వేసేవి పెదవులు. స్వచ్ఛమైన ఉచ్చారణకు సహకరించేవి పెదవులు- ఒకరు మాట్లాడుతుంటే - వారిపెదవుల కదలిక అందంగా వుంటుంది. మరొకరు మాట్లాడుతుంటే వారి పెదవుల కదలిక పరమ ఘోరంగా వుంటుంది.

"లిప్ మూవ్‌మెంట్" అనేది ప్రత్యేకాకర్షణ మాటకూ, ఉచ్చారణకూ - భాషకూ, భావానికీ - కవిత్వానికీ - సకల వాఙ్మయానికీ! నోటియొక్క అందం తీరైన పెదవులను బట్టివున్నది. కొందరి

నోరు "సున్నా" చుట్టినట్లు వుంటుంది. కొందరి నోరు ఒకప్రక్కకు రవ్వంతవాలి - ఒకానొక కొత్త ఆకర్షణగా వుంటుంది. పెదవి విరుపుతో నిరసన, తిరస్కారం - కోపం, హేళన - ఈర్ష్యల్లాటి భావాలన్నీ ప్రదర్శిస్తారు మనుషులు - ముఖ్యంగాస్త్రీలు. బుంగమూతితో ముడుచుకున్న పెదవులతో తమ అసంతృప్తినీ - అలకనూ మాటలు లేకుండానే ప్రదర్శించగలరు చిన్నపిల్లలూ - స్త్రీలూ! పిల్లల బుంగమూతి - పెద్దలకు ముద్దు. ఈనాడు సినిమాలలో "ప్లే బ్యాక్" పేరుతో-మాట, పాట అన్నీ "లిప్‌మూవ్‌మెంటుతో" తెరపైన జరుగుతుంటే, తెరవెనకాల ఎవరో మాట - పాట చెబుతుండగా మనం చూస్తున్నాం. ఆ మాటకూ, పాటకూ - పెదవుల కదలికకూ పొంతనకు దరనపుడు (పరభాషాచిత్రాలు డబ్బింగ్ చేసినపుడు) "ఏడ్చినట్లుంది" అనుకుంటుంటాం - ఆపెదవుల కలయికా - భాషా, భావమూ కలవకపోవటంతో! మానవశరీరంలో- ముఖ్యంగా జ్ఞానేంద్రియాలకు నిలయమైన శిరస్సు - ముఖంలో- వాక్కుకు స్థానమైన నోరుకు - తలుపులు లాటి పెదవులను - శంకర భగవత్పాదుల వారు - అమ్మవారి పెదవుల ఔన్నత్యాన్ని వర్ణించగా, అది కనీసం జీర్ణించుకోలేని వారిని వదిలివేద్దాం!

ఆ తల్లి పెదవులు - మనకు సద్వాక్కునూ ప్రసాదించాలని కోరుకుందాము .

## 63. శ్లో॥ జగన్మాత దరహాసము.
## వెన్నెల వెల్లువ వంటి చిరునగవు.

**63 శ్లో॥ స్మిత జ్యోత్స్నా జాలం, తవవదన చన్ద్రస్య పిబతాం,**
**చకోరాణా మాసీ దతిరసతయా, చంచుజడిమా**
**అతస్తే శీతాం శోరమృతల హరీ రామ్ల రుచయః**
**పిబన్తి స్వచ్ఛందం నిశినిశి భృశం, కాంచికధియా ॥**

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి ముఖవర్చస్సనే వెన్నెలనూ - అందులోని దరహాస చంద్రికల వైభవాన్నీ అద్భుతంగా వర్ణిస్తున్నారు.

**అర్థము** :- హిమగిరి శిఖరంపై నుండే చకోర పక్షులు, అమ్మవారి ముఖ వర్చస్సును - వెన్నెల అనే భ్రాంతితో త్రావి త్రావి, ఆ తీపికి మొద్దుబారిపోయాయి వాటి ముక్కులూ, చిన్నినాలుకలూనూ! అవి మార్పుకోసం, పులుపురసంకోసం, అర్రులు చాచి, చంద్రునివెన్నెలను అన్నపుగంజి (పులిసిన (అన్నపుగంజి పుల్లగావుంటుంది. దీనినే "పుల్లనీళ్లు" అని పల్లెప్రజలు మజ్జిగకు బదులుగానూ, బలంకోసమున్నూ అన్నంలో కలుపుకుని తింటారు. పోషక ఆహారం ఆరోగ్యం కూడాను)

అనేభ్రాంతిలో ప్రతిరాత్రీ తెగతాగున్నాయట! అమ్మవారి ముఖవర్చస్సు - దరహాసచంద్రికలు- కోటి చంద్రకాంతులకు సమానం, అమాయకపు చకోరపక్షులు - ఆతల్లి ముఖవర్చస్సునే వెన్నెల అనుకుని, త్రాగి త్రాగి, నాలుకలు ఆ అమృత వెల్లువతో (తీపి తిని తిని ముఖం మొత్తినట్లు, వెగటు కలిగినట్లు) నాలుకచవిచెడి, మొద్దుబారిపోయి రుచిలేనిదికాగా, పులుపు రుచికోరి, చంద్రుని వెన్నెలను అన్నపుగంజి అనే భ్రాంతితో తెగతాగుతున్నాయి. అమ్మవారి ముఖ వర్చస్సు వెన్నెల వెల్లువలైవుండగా, నిజమైన వెన్నెల - అన్నపుగంజిలా- వెలవెలబోతూవున్నదని అంతరార్థం.

నిజానికి చకోరపక్షులు (అన్ని పర్వత శిఖరాల చెట్లమీదావుంటా యంటారు మహర్షుల కావ్యాలలో - రామాయణంలో మహేంద్ర గిరి - (కిష్కింధ వద్ద వున్నది) పై చకోరపక్షులను వర్ణించారు వాల్మీకి మహర్షి) వెన్నెలను త్రాగవు. శరత్కాలపు వెన్నెల రాత్రులలో, చెట్ల ఆకులపై నుండి ఒక్కొ బొట్టుగా రాలే హిమబిందువులను (మంచు బిందువులను) ఆఆకులక్రిందుగా ముక్కులు పెట్టి త్రాగుతుంటాయి. వెన్నెలలో మంచుబిందువులు - వెన్నెల ప్రతిబింబించటంవలన - వెన్నెలలానే కనిపిస్తాయి. అందువలన చకోరపక్షులు వెన్నెలను త్రాగుతాయనే భావం బలపడిపోయింది. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - పరోక్షంగా భక్తులనే చకోరపక్షులు - అమ్మవారి సామీప్య - ముక్తిలో తరించినవారు - ఆ ప్రశాంత వాతావరణంలో వుండివుండి, (వీరు ముక్తులు- మహాముక్తులు) ఆ జగన్మాత, ముఖ సౌందర్యమనే వెన్నెలను యుగాల పర్యంతం వారి పుణ్య విశేషం వలనా, తపః ఫలంవలనా గ్రోలి గ్రోలి - ఆ అమృతపానంతో నాలుక మొద్దుబారి (విసుగురాగా) కాస్తంతమార్పుగా - వెన్నెలను అన్నపుగంజిగా భావించి - అనగా మరల భూలోకంలో పుడదామనే కోర్కె కలుగగా, - అన్నపుగంజిలాటి భూలోక జన్మను కోరుకుంటున్నారు. వారే భూమిపై - మహాభక్తులుగా, అవతారపురుషులుగా, అవధూతలుగా, దేవీ ఉపాసకులుగా, మహాకావ్యరచనా కవులుగా, భాష్యకారులుగా, పరివ్రాజకా చార్యులుగా జన్మిస్తారు. సాధారణ సంసారలం పటాలలో చిక్కుకొనకుండా, తమ జన్మ సంస్కారపుణ్యంతో - కోట్లాది మానవులను తమ భోధలతో, రచనలతో, కీర్తనలతో, అభంగాలతో, భక్తి భజనలతో తరింపజేస్తారు. తమవలెనే సాధారణ మానవులంతా ముక్తి మార్గంలోనికి రావటానికి నిస్వార్థంగా దోహదం చేస్తారు - వారు భక్త చకోరాలు, అట్లా అవతరించిన వారే శ్రీ జగద్గురు శంకర భగవత్పాదులు! వారి "సౌందర్యలహరి"ని సవ్యంగా అర్థం చేసుకోగలిగితే దేవీ తత్వాన్ని ఆకళింపుచేసుకోగలిగినట్లే,

# 64 శ్లో॥ అమ్మవారి జిహ్వా సౌందర్యం మహిమ.

64 శ్లో॥ అవి శ్రాస్త్రం పత్యుర్గుణ గణకథామ్రేడన జపా
జపా పుష్పచ్ఛాయా, తవజనని! జిహ్వా జయతిసా,
యదాగ్రా సీనాయాః స్ఫటికదృష దచ్ఛచ్ఛవి మయీ
సరస్వత్యా మూర్తిః పరిణమతి మాణిక్యవ పుషా !

**అర్థము** :- జగదంబా! అవి శ్రాంతంగా నీ పతియైన పశుపతి గుణగాన కథాను రక్తతతో నీ నాలుక, ఆస్వామి గాథలు గానం చేయుచున్నందువలన, నీ నాలుక జపాపుష్పచ్ఛాయ గలిగి - మందార పువ్వు (దాసానిపువ్వు, వర్ణంలో వున్నది. మహాదేవుని యొక్క (శివపురాణం) శాంత, గంభీర, వీర, రౌద్ర, భయానక, హాస్య, కరుణ, శృంగార, అద్భుత (భీభత్స) నవరసభరిత గాథలను గానం చేసి చేసి అమ్మవారి నాలుక మరింత ఎరుపుగా మారింది, అసలే తాంబూల చర్వణంతో ఎరుపెక్కి వున్న ఆ తల్లి నోరు - నాలుక - ఈ అవిశ్రాంత కథా గానంతో ఎర్ర మందారకు సుమము ఛాయలోనికి వచ్చింది. ఆ తల్లి నాలుకపై సుఖాసీనురాలైవున్న శుద్ధ స్ఫటిక సంకాశ వర్ణం కలిగివున్న సరస్వతీదేవిలో - అమ్మవారి నాలుక ఎరుపురంగు ప్రతి ఫలించి, సరస్వతీ దేవి మూర్తి కూడా ఎరుపు - తెలుపు కలగలిపిన పద్మరాగ మణి వర్ణంలోనికి మారుతున్నది.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులు - జగన్మాత జిహ్వాచివర - వాగ్దేవి అయిన - సకల కళా మతల్లి అయిన, సకల వాఙ్మయ స్వరూపిణి అయిన సరస్వతీ దేవి (శుద్ధస్ఫటిక సంకాశ వర్ణంలో) ఆసీనురాలై వుంటుందనీ, ఆ స్ఫటికం వద్ద ఏ రంగుపూవుపెడితే ఆ రంగు అందులో ప్రతి ఫలిస్తుంది గనుక (స్ఫటికానికి పారదర్శకత - (ట్రాన్స్పరెంట్) వున్న దిగనుక.) జగన్మాత నాలుక ఎరుపుదనం ఆ స్ఫటికం ప్రతిబింబించగా సరస్వతీదేవి కూడా ఎర్రగా మారిందనీ అద్భుతవర్ణన చేశారు. లోతుగా ఆలోచిస్తే - "సత్సంగత్వే, నిస్సంగత్వం, నిస్సంగత్వే - నిర్మోహత్వం. నిర్మోహత్వే నిశ్చలతత్త్వం. నిశ్చలతత్వే జీవన్ముక్తి - భజగోవిందం - భజగోవిందం. గోవిందం భజ - మూఢమతే! "అంటూ ఆది శంకరులే రచించిన ద్వాదశ మంజరికాస్తోత్రం (భజగోవింద శ్లోకాలు)లో వలె - జగన్మాత - నిరంతరం శివపురాణం పలుకుతుంటుంది. అనగా సద్వాక్కులు, సచ్చరిత్రలే చెబుతుంటుంది. ఆ సత్సంగం వినగా వినగా, (శ్రోతల హృదయాలు కూడా ఆ మంగళకరమైన దైవకథలు, దైవ నామజపం, స్తోత్రాల పట్ల ఆసక్తి, అనురక్తితో నిండిపోతాయి. అట్లా జరిగాక, జగన్మాతలానే ఈ భక్తులూ, శ్రోతలూ మారిపోతారు. ఇది భ్రమర కీటకన్యాయంలా జరుగుతుంది.

అందుకే నిరంతరం మంచిమాట్లాడు, మంచివిను, మంచిగా ఆలోచించు అంటారుపెద్దలు.

రెండు రామచిలకలను పట్టుకున్న బోయవాడొకడు ఒకదానిని ఒక కసాయివాడికి అమ్మాడు. రెండవదానిని ఒక సద్గురువుకు ఇచ్చాడు. రెండూ ఆయా గృహాల్లో పెరిగాయి. కసాయివాడింట పెరిగిన చిలుక - ఎవరు ఇంట్లో అడుగెట్టినా "చంపండి! నరకండి, కోయ్యండి!" అనటం ప్రారంభించింది. సద్గురువు ఆశ్రమంలో పెరిగిన చిలుక ఎవరైనా ఆశ్రమానికి రాగానే "రండి! కూర్చొండి సేదతీరండి" అనటం ప్రారంభించింది.

చిలుకలు వినగా వినగా మానవ మాటలను అనుకరిస్తాయనే ఈ చిన్నకథలో అవిపెరిగిన వాతావరణ ప్రభావం వాటిపై ఎలా ముద్రవేసిందో చెబుతున్నది కాదా ? అలాగే ఈనాడు సగటు యువతీ యువకులు - సరస్వతీ స్వరూపం అయిన వాక్కును కేవలం ఊ కదంపుడు కబుర్లు, చెత్త సినిమాలను గురించిన విశ్లేషణ - సగటు పత్రికలలో వస్తున్న హింసాత్మక (టెర్రర్) అతి జుగుప్సాకరమైన శృంగారపు కథలు, నవలలు (సెక్స్) చదివి చదివి, వినివిని ఇవిచాలక - యువత మెదళ్లను - పిల్లల మెదళ్లను నిర్వీర్యం చేస్తున్న టి. వి ల పుణ్యమా అని - టి.విలలో వివిధ ఛానళ్లలోని హింసాత్మకమైన సీరియల్స్ - చూచి చూచి - ఆప్రభావంతో, చెడుత్రోవ పట్టే అవకాశం ఎంతైనా వున్నది. వినగా, వినగా, చూడగా చూడగా శుద్ధ స్ఫటికంవంటి వారి హృదయాలపై ఈ భయానక, భీభత్స - మలినమైన అతి శృంగారపు భావాలే ముద్రింపబడతాయి. నీతికీ, అవినీతికీ తేడా తెలియని స్థితి వస్తున్నది.

పెద్దలలోనూ అంతే! వూరికే ఇతరులతో అనవసరమైన చాడీలు, ఈర్ష్యాపూరితమైన చర్చలు - చేసి చేసి - కాలక్షేపంగా ఈ టి.విలు చూచిచూచి వీరి మెదళ్లు ఎప్పుడూ ఒకానొక ఆందోళన (టెంక్షన్)కు లోనౌతున్నాయి.

అందుకే - ప్రతిరోజూ సత్యంగ కార్యక్రమాలు - సౌందర్యలహరి - లలితా సహస్రనామ స్తోత్రపారాయణం, విష్ణు సహస్రనామస్తోత్ర పారాయణంలాటివి పదుగురు కలుసుకుని చేసుకోమనీ - అట్లా చేయుగా చేయుగా, మన హృదయాలు (స్ఫటికం వంటిదే మనహృదయంకూడా) ఆ మంచి తనంతో నిండిపోతాయనీ భోధిస్తుంటారు - పరమగురువులు - మనందరం శివ స్వరూపులమూ - జగన్మాత స్వరూపులము అయ్యేందుకు అవకాశం కలిగిస్తుందీ సత్సంగం,

అమ్మవారి జిహ్వను ఆది శంకరులు వర్ణించారేమిటా అనిగాక, ఆ జిహ్వా వర్ణనతో సత్సంగ ప్రభావాన్ని - అంతర్గతంగా భోధించారు ఆ పరమగురువు అని అర్థం చేసుకొనగలిగితే - మనజిహ్వానూ, వాక్కునూ మనం నియంత్రణ చేసుకుని - మంచిగా మాట్లాడగలం - ఆలోచించగలం - అవునా ? ప్రతి మనిషి జిహ్వాపై వాగ్రూపిణిగా వున్న శక్తి సరస్వతీ దేవి వుంటుంది. ఆ వాక్కు స్పష్టంగా రానివారూ, మూగవారూ దురదృష్ట వంతులు సుమా!

# 65 శ్లో ॥ అమ్మవారి తాంబూలక బళము.

# గురుఉచ్ఛిష్టము - గురురూపిణి ఉచ్ఛిష్టము.

**65 శ్లో॥ రణే జిత్వా దైత్యానప హృత శిరస్త్రైః, కవచిభి,**
**ర్నివృత్తై శ్చండాం శత్రిపుర హర నిర్మాల్య విముఖైః**
**విశా ఖేన్ద్రో పేన్ద్రై శ్శశివిశద కర్పూర శకలాః**
**విలీయన్తే, మాత! స్తవ, వదన తాంబూలకబళాః ॥**

**అర్థము** :- జగన్మాతా! దైత్యులను సంహరించి, తారకాసురుని జయించి, అభయంకర యుద్ధములో విజయము సాధించి వచ్చిన, కుమారస్వామి, ఇంద్రుడు, విష్ణువు - ఈ ముగ్గురునూ, నీకు నమస్కరించటానికి (నీవు పరోక్షంగా వారికి ఆ శక్తి ప్రసాదించిన జగదంబవు కనుక - నీకు కృతజ్ఞతతో భక్తితో అంజలిఘటించి - నీ ఆశీర్వాదం పొందటానికి) వస్తూ, వినమ్రతతో తమ శిరస్త్రాణములు (తలగుడ్డలు) తీసివేసి (పెద్దలను దర్శించేటప్పుడు - తలపై నున్న కిరీటాలూ, తలపాగాలూ, టోపీలు తీసి శిరసా నమస్కరించటం ఆచారం) కవచములు మాత్రం ధరించి వస్తుండగా, చండీశ్వరునిచే అనుభవింప దగిన శివుని నిర్మాల్యములు అక్కడ వుండగా, (శివుని అర్చించిన గంధ పుష్పతాంబూల ఫలములతో వివిధదేవతలు- జగన్మాత శివుని అర్చించగా - ఆ నిర్మాల్యము "చండీశ్వరుడనే" ఈశ్వరుని ప్రమధగణము ప్రప్రధమంగా తీసుకొంటాడు. ఆ తర్వాత మిగతావారికి పంచుతాడు. చండీశ్వరునికి ఈశ్వరుడు ఇచ్చిన వరం అది. శివపురాణగాధలో) ఆ శివ నిర్మాల్యమును గ్రహింపక, నీ నోటినుండి, చంద్ర శకలముల వంటి పచ్చ కర్పూరపు తునకలతో కూడిన తాంబూలక బళమును (ఉచ్ఛిష్టమును) మహా ప్రసాదంగా స్వీకరించటానికి ఇష్టపడుచున్నారు. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు శివనిర్మాల్యపు గొప్పదనము - అమ్మవారి తాంబూలక బళము (ఉచ్ఛిష్టము) యొక్క మహాత్మ్యము - గొప్పదనము వర్ణిస్తున్నారు.

శివ నిర్మాల్యము మహిమను గురించి కథ ఒకటి "స్కంద పురాణంలో వున్నది.

"చిత్రవీర్యుడు" అనే గంధర్వుడు, ప్రతిరోజూ, ఈశ్వర పూజకోసం ఇద్రుని నందన వనంలోని దేవతావృక్షాల పూలు అన్నీకోసుకొని వెళ్లి, భక్తి శ్రద్ధలతో ఈశ్వరుని పూజించేవాడు. ఆపూలు - ఇంద్రుడు - ఇంద్రుడు భటులకు తెలిస్తే కోసుకోనివ్వరని, అర్ధరాత్రి దొంగతనంగా వెళ్లి, కోసుకుని వచ్చేవాడు, అతడు అతి శివపూజా దురంధరుడు. చిత్రవీర్యుడిని అడ్డుకొని, ఆతడి దొంగతనాన్ని

అరికట్టాలనుకున్నాడు ఇంద్రుడు. కానీ చిత్రవీర్యుడు" శివునికి ప్రీతిపాత్రుడు. అతడిని నిరోధిస్తే ఈశ్వర కోపానికి గురికావలసి వస్తుంది. మరి తమ పూజకు నందన వనంలో ఒక్క పూవు వుండకపోయె! దారిఏది ? దేవఋషి అయిన నారదుడు - స్వర్గానికి రాగా, ఇంద్రుడు ఈ తన - తనదేవతల యొక్క (పూల) సమస్యను విన్నవిస్తాడు. నారదుడు త్రికాలవేది గనుక, క్షణకాలం ఆలోచించి, శివ నిర్మాల్యమును (శివుని పూజించిన పవిత్ర పూజాద్రవ్యాలను - పూజ పూర్తయిన తర్వాత - శివ భక్తులకు ప్రసాదంగా పంచే పూలు - (పూలహారాలూ - గంధాక్షతలు ఇవన్నీ నిర్మాల్యాలు అంటారు) నిర్మాల్యాలు - చిత్రవీర్యుడు వచ్చేదారిలో వెదజల్లి వుంచమని సలహా ఇస్తాడు. ఇంద్రుడు ఆప్రకారం శివనిర్మాల్యములను చిత్ర వీర్యుడు - నందన వనంలోనికి దొంగచాటుగా చొరబడే మార్గంలో వేయిస్తాడు. రోజూలానే అర్ధరాత్రి నంద నోద్యానవనం పూలకోసం దొంగతనంగా వచ్చిన చిత్రవీర్యుడు - శివ నిర్మాల్యములను చీకటిలో గమనించక - వాటిపై అడుగులు వేస్తాడు. అంతే మహాపాపం అతడిని చుట్టుకుని, అతడి దైవీ శక్తులన్నీ మాయమైపోతాయి. ఇంద్రుడు వచ్చి - అతడిని మందలిస్తాడు. పశ్చాత్తాపపడిన చిత్రవీర్యుడు - నారదుని వేడుకొనగా, ఆపాప ప్రక్షాళనకు మరల ఈశ్వరుని గురించి తపస్సు చేసి, ఈశ్వరానుగ్రహం పొందటమొక్కటే మార్గమని భోధిస్తాడు నారదుడు. తప్పు తనది గనుక, చిత్రవీర్యుడు - తపస్సుకు వెళతాడు. అ చిరకాలంలోనే శివానుగ్రహం పొందుతాడు. శివ నిర్మాల్యాలను కాళ్లక్రింద త్రొక్కటం - శివపీఠాన్ని (శివలింగం పెట్టే పీఠాన్ని - శివలింగాన్ని - మీదుగా దాటిపోవటం లాటివి మహాపాపాలు అనీ - అవి - ఆ పనులు చేసినవారి దివ్య శక్తులను హరించి వేస్తాయనీ స్కంద పురాణంలో గాధలున్నాయి. అంతటి మహిమాన్వితమైన శివనిర్మాల్యాన్ని - కుమారస్వామి - ఇంద్రుడు - విష్ణువు - తారకాసురవధ తర్వాత - కైలాసం వచ్చి - అమ్మవారిని దర్శించటానికి వెళ్తూ - ప్రత్యేకంగా ఆగి తీసుకోలేదు. పైగా - అమ్మవారి తాంబూలక బళంకోసమే పరుగులుతీశారు. ఎందువలన ? ఇక్కడ గూఢార్థము పరిశీలించాలి.

శ్లో ॥ శుద్ధ విద్యాంకురాకారా ద్విజపంక్తి ద్వయోజ్వలా!" అని అమ్మవారి లలితా సహస్ర నామస్తోత్రంలో వశిన్యాది వాగ్దేవతలుస్తోత్రం చేశారు జగన్మాత దంతపంక్తిని వర్ణిస్తూ, "శుద్ధ విద్యకు - బ్రహ్మ విద్యకు - శ్రీ విద్యకు అంకురాలు (బీజాలు) అయిన అక్షర సముదాయమే - (32) అమ్మవారి దంతములుగా వున్నాయని భావము!

జగన్మాత దంతములు శుద్ధవిద్యా బీజాక్షరాల సంపుటి!

"కర్పూర వీటికా మోద సమాకర్ష-దిగంతరా!" అనేది ఆతల్లి తాంబూలపు సువాసనలు - (తాంబూల చర్వణం చేస్తుండగా) దిగంతరాలకు వ్యాపిస్తున్నాయి" అని వర్ణించారు వశిన్యాది వాగ్దేవతలు లలితా సహస్రనామస్తోత్రంలో! ఎందువలన ? ఆమె ఉదరము - హృదయము - నోరు - నాలుక సద్వాసనలకు - సత్సంస్కారములకు - సద్భావనలకు, సద్వాక్కులకు నిలయం కాబట్టి, ఆసద్వాసనలు ప్రపంచానికి మనుగడను ప్రసాదించే ఆధ్యాత్మిక సువాసనలు గనుక - అవి సకల దేవతా ఋషిగణ- ముక్త యోగిగణాలందరికీ అందేలా - ఆ తాంబూలపు వాసనలు దిగంతరాలకు వ్యాపించాయి అనిభావము.

ఇక ఆ తాంబూలములోని చంద్ర శకలములను పోలిన కర్పూరపు తునకలు ఏమిటి ? అవి "మనువిద్యా చంద్ర విద్యా - చంద్ర మండలమధ్యగా!" అని అమ్మవారిని లలితా సహస్రనామస్తోత్రంలో స్తోత్రంచేశారు వశిన్యాది వాగ్దేవతలు.

ఆ చంద్ర శకలాల వంటి కర్పూర పలుకులు - చంద్రుడు అమ్మవారికి ఆవిష్కరించిన "చంద్ర విద్య"లోని అతి ముఖ్యమైన మంత్రములు. బీజాక్షరములు, పద్ధతులు. శుద్ధ విద్యాంకురాలైన దంత పంక్తితో, చక్కగా (నమిలి) - సద్వాసనల గుబాళింపులలో - జన్మ జన్మాంతరాల పుణ్యంపు (పోవై - చంద్రవిద్యా మంత్రరూపిణి గా- తాంబూలక బళాన్ని- గురూచ్ఛిష్టంగా - గురురూపిణి అయిన శ్రీమాత - తన అనన్యభక్తులకు పంచిపెడుతోంది. అందుకే శివ నిర్మాల్యాన్ని కూడా త్రోసిరాజని- అమ్మవారి శ్రీ విద్యా గురూచ్ఛిష్టమైన - తాంబూలక బళంకోసం అర్రులు చాస్తూ వచ్చారు కుమారస్వామి - ఇంద్రుడు - విష్ణువు. గురువుకు ఎంతో కాలం సేవచేసి - ఆ పరమగురువును మెప్పించి - ఆయన అనుగ్రహించగా, ఆ స్వామి తిని వదిలిన విస్తరిలోని ఒక్క మెతుకు - రవ్వంత ఎంగిలి - పరమ ప్రసాదంగా తిని - కవులుగా మారినవారూ- పరమ గురువులుగా మారినవారూ - పరమ పథం చేరుకున్నవారూ ఎందరో వున్నారు సచ్ఛిష్యులు. అదీ గురూచ్ఛిష్ట మహిమ. ఈనాడు మనం బఫే డిన్నర్ల పేరుతో - ఎవరికివారు అన్నంతింటున్న చేతులతోనే - స్పూన్లతోనే అన్ని పదార్థాలూ - తమ ప్లేటుకు తాకించుకుంటూ - దేవుతూ - కలియబెడుతూ తింటున్న నాగరీకులను చూస్తున్నాం. ఆ బఫేలలో విధిలేక పాల్గొంటున్నాం.

"చెడ్డవారి - (చెడు గుణాలు కలవారి) ఎంగిలి తింటే చెడుగుణాలు - జబ్బులూ వస్తాయి కాబట్టి తినకండర్రా!" అని పెద్దలు మొత్తుకుంటుంటారు.

అలాగే కాలేజి విద్యార్థినీ, విద్యార్థులు పిక్నిక్‌లకూ - విహార యాత్రలకూ బస్సుల్లో రైళ్లలో బయల్దేరి వేళ్తూ కొందరు రైలు పీకి - పందిరేసే రకంగా చేస్తుంటారు అల్లరి - అందులో

ఎంగిలి తినటం ఆత్మీయతకు స్నేహానికి చిహ్నంగా భావిస్తూ - ఒకరి ఐస్క్రీములు మరొకర నాక్కోవటం ఒకరి టీ - మరొకరు త్రాగటం - పదిమంది కలిసి ఒక ప్లేటులో టిఫిను అన్నంలాటిది పెట్టుకుని ఎగబడి తినటం, కూల్డ్రింకులు ఒకేసీసాలో రెండు మూడు "స్ట్రాలు ' వేసుకుని త్రాగం లాటివన్నీ - గొప్పఫ్యాషన్గా చేస్తుంటారు. ఇలా ఎంగిళ్లు కలబోసుకోవట - అందరి నోళ్లలోని లాలాజలం - సిగరెట్ అలవాటున్నవారు - నోటి పుళ్లు వున్నవారూ ఉబ్బసం లాటి జబ్బులున్నవారూ - ఆజబ్బులు - ఆ చెడుగుణాలు ఒకరినుంచి మరొకరి బట్వాడా చేసుకోవటమే!

గురుచ్ఛిష్టం - వేరు - ఈ ఎంగిలి వేరు. తేడా తెలుసుకోలేకపోతే, ఏ పరమగురువూ విడమరి చెప్పలేరుమరి, అవునా ?

# 66. శ్లో ॥ అమ్మవారి వాఙ్మాధుర్యము

**66. శ్లో॥విపంచ్యా గాయంతీ వివిధ మ పదానం, పశుపతే !**
**స్త్వయారబ్ధే వక్తుం, చలిత శిరసా, సాధువచనే**
**తదీయై ర్మాధుర్యై రపలపిత తన్త్రీకలరవాం,**
**నిజాం వీణాం, వాణీని చుళయతి చోళేన నిభృతమ్ ॥**

**అర్థము** :- తల్లీ! జగన్మాతా! సరస్వతీదేవి - తన 'కచ్ఛపి" అనే వీణను శృతిచేసి, నీ ఎదుట కూర్చుని, నీ భర్తయైన పశుపతి వీరగాధలను, మహాత్మ్యాలనూ గానం చేయుచుండగా, నీవు గొప్ప ఆనందము నొంది, మెచ్చుకుంటున్నట్లుగా శిరసు వూపుతూ, నీ మృదు మధుర వాక్కులతో "సాదు! సాధు!" (బాగు!బాగు!) అనుచూ ప్రశంశా వాక్యములు చెప్పబోయావు.

సరస్వతీ దేవి, నీ వాఙ్మధుర్యము ముందు, తన వీణా నాద మాధుర్యము వెల వెలబోయినదని తెలుసుకొని తన "కచ్ఛపి" వీణను "క్రింద" పెట్టి - వీణను కప్పే వస్త్రం (కూర్పాసనం)తో కప్పి వేసింది.

ఈ శ్లోకంలో ఆది శంకరాచార్యులవారు జగన్మాత యొక్క వాగ్మాధుర్యాన్ని అద్భుతంగా వర్ణించారు. శ్రీలలితా సహస్రనామ స్తోత్రంలో "నిజ సల్లాప మాధుర్య వినిర్భర్శిత కచ్ఛపీ!" అంటూ స్తోత్రంచేశారు అమ్మవారిని వశిన్యాది వాగ్దేవతలు. "సాధు సాధు" అనే రెండు ప్రశంశా మాటల మాధుర్యం ముందు తన వీణా వాదనం మధురంగాలేదని తెలుసుకున్న సరస్వతీ దేవి తన వీణను కూర్పాసనంతో (వీణ పై కప్పే బట్ట) తో కప్పివేసిందని స్తోత్రం చేశారు వశిన్యాది

వాగ్దేవతలు సరస్వతీదేవి అట్లా వీణను ఎందుకు కప్పివేసింది ? తమ విద్యకంటే - ఎదుటివారి విద్యలో గొప్పదనమూ - పదుగురికీ అర్ధమయ్యే రీతిలో భోధవున్నదని గ్రహించినపుడు - సంస్కార హృదయులైనవారు - ఎదుటివారికి, వినమ్రంగా నమస్కరించి - వారి విద్యముందు తమవిద్య తక్కువేనని మనసారా ఒప్పుకుంటారు.

(కు సంస్కారులైతే కుతర్కానికి దిగుతారు)

సరస్వతీ దేవి - జగన్మాత వాక్కుముందు - తన వీణా నాదం - వాదనం - సప్తస్వర స్వరార్ణవమైన వీణా వాదన పటిమ వెలాతెలా పోతున్నదని గ్రహించి - గురురూపిణి అయిన శ్రీ మాత ముందు - తన విద్యాప్రదర్శన ఇంకాచేయకూడదనే - మహోన్నత గురు భక్తి భావంతో తనవీణను గుడ్డతో కప్పివేసింది.

ఎదుటివారిలో ఏ విద్యఅయినా గొప్ప అనిపిస్తే - అది గొప్పకాదని నిరూపించేందుకు తెగ గింజుకుంటూ వాదిస్తుంటారు కొందరు ఆ ఎదుటివారిలోని బలహీనతలు వెతికి పట్టుకుని ప్రచారం చేసి వారి కీర్తికి అడ్డుపడాలని చూస్తుంటారు! ఇది మానవులమైన మనం చేసే పనులు! కానీ - వాక్స్వ రూపిణి అయిన సరస్వతీదేవి - జగన్మాత జిహ్వాగ్రాన నివసించే సరస్వతీ దేవి - సర్వవాఙ్మయ రూపిణి అయిన సరస్వతీదేవి.

జగన్మాత గొప్పదనానికి శిరసావ్రొక్కింది, అదీ ఆదిశంకరులు చెప్పినది, అంతేగాదు. ఏ స్త్రీ మాట్లాడుతుంటే ఆమె సద్వాక్కులు - చక్కని కంఠస్వరం మరీ మరీ వినాలని పిస్తాయో - ఆస్త్రీ జిహ్వా సరస్వతీని లయం. ఆమె వాక్కు సరస్వతీ స్వరూపం. ఆస్త్రీ మాట్లాడే తీరు, జగన్మాత యొక్క పరా, పశ్యంతి, మధ్యమా - వైఖరీ రూపాలకు ప్రతిబింబం. ఇది గ్రహించి - వాక్కును మధురంగానూ, మృదువుగానూ మలచుకోమని పరోక్ష భోధచేస్తున్నారు పరమ గురువు ఈ శ్లోకంతో! అవునా ?

## 67. శ్లో ॥ అమ్మవారి చుబుకం. సౌందర్యం.

**67 శ్లో॥ కరాగ్రేణ స్పృష్టం, తుహినగిరిణా వత్సలతయా,**
**గిరీశేనో దస్తం, ముహురధర పానాకులతయా,**
**కరగ్రాహ్యం శమ్భోర్ముఖ ముకుర వృంతం, గిరిసుతే!**
**కధంకారం (బ్రూమ స్తవ చుబుక మౌపమ్య రహితమ్! ॥**

**అర్థము** :- ఓ హిమగిరి తనయా! తల్లీ! నీ తండ్రి హిమవంతుడు, వాత్సల్యముతో, తన మునివ్రేళ్లతో పుణికిన నీ చుబుకము. కైలాసపతీ - నీ పతీ అయిన శివునిచేత - ప్రేమతో

అధరపానం పై ఆసక్తితో మాటిమాటికీ, తొట్రు పడుతూ పైకి ఎత్తబడిన ఆనీ చుబుకము, నీ ముఖము అనే అద్దమునకు "పిడి" వలె అమరి శివునిచేతితో పట్టుకొనటానికి అనువుగా వున్నదియు అయిన నీ చుబుకమునకు సాటియైనది ఏమున్నది ? ఎందున్నది ?

ఈ శ్లోకంలో శ్రీ ఆది శంకరాచార్యుల వారు అమ్మవారి చుబుకంయొక్క సౌందర్యం వర్ణించారు. శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలో అమ్మవారి చుబుకంగురించి స్తోత్రం చేస్తూ "అనాకలితసాదృశ్య చుబుకశ్రీ విరాజితా!" అంటారు వశిన్యాది వాగ్దేవతలు. అమ్మవారి చుబుకానికి సాదృశ్యమైన ఉపమానం - మరొకటి లేదని చెబుతూ, సాధారణంగా మనకు ఎదుటివారిపై ప్రేమ, వాత్సల్యం, ప్రీతి, స్నేహం లాటి భావాలు కలిగినపుడు - వారిపట్ల మనకు ఎంతోకాలంగా వున్న చనువును పురస్కరించుకుని, వారి గడ్డం పట్టుకుని (చుబుకం) మనలోని భావాన్ని వ్యక్తం చేస్తాము. అలిగిన పిల్లలను - బ్రతిమాలటానికీ "గడ్డం పట్టుకు బ్రతిమాలుతున్నాను కదా ? ఇక అలక మానవే తల్లీ!" అంటాము.

బిడ్డలయందు వాత్సల్యం,

భార్యా భర్తలకు ఒకరియందు ఒకరికి కలిగేదిప్రేమ.

గురువుకు శిష్యులయందు కలిగేది "అనుగ్రహం." పెదతండ్రి. పినతండ్రి, అన్న, వదిన - అత్తా, మామ - బావగార్లు, తోటి కోడండ్రు - ఇలా మనకంటే - పెద్దవారియందు కలిగేది "భక్తి! గౌరవం!"

సోదర సోదరిల యందు కలిగేది "ప్రీతి"!

స్నేహితులయందు కలిగేభావం, "స్నేహం"!

ఇట్లా ప్రీతి, ప్రేమ - అనే భావాలు - ఆయ వ్యక్తులు - వరుసలను బట్టి వేరు వేరుగా వుంటాయి. వేరువేరు అనుభూతులు కలిగిస్తాయి.

పరస్పరం అప్రేమ - వాత్సల్యం - అనుగ్రహం - ప్రీతి, స్నేహం - ఇలాటి భావాలు కలిగినపుడు చనువు వున్నవారిని - గడ్డం పట్టుకుని ఆప్యాయతగా మాట్లాడుతూ - మనలోని ప్రేమను వాత్సల్యాన్ని వ్యక్తపరుస్తాము, అవునా ?

అమ్మవారి - ఉపమానాలకందని - సౌందర్యం గల గడ్డాన్ని చుబుకాన్ని - వాత్సల్యంతో పుణికిన హిమవంతుడు - పర్వత వంశాలకే కీర్తిసాధించి ధన్యుడైనాడు. ప్రేమతో అమ్మవారి చుబుకం స్పృశించిన ఈశ్వరుడు - ఈశ్వరితో కలిసి ఈ చరాచర సుందర సృష్టికి "జగత్పిత" అయ్యాడు. ముఖబింబం (అద్దానికి) పిడివంటిది అయిన జగన్మాత చుబుకం - తీరుగా వుండి ఒకానొక గొప్ప శిల్పి చెక్కిన శిల్పానికి - ఏ కొరతాలేనట్లు ఆతల్లి ముఖ సౌందర్యాన్ని ఇనుమిడింప జేస్తోంది. మానసికంగా, ఆ తల్లి చుబుకాన్ని దర్శించి ధన్యుల మౌదాము, పదండి, ముందుకు.

## 68 శ్లో ॥ జగన్మాత కంఠం యొక్క సౌందర్యము.

68. శ్లో॥భూజా శ్లేషాన్నిత్యం, పురదమయితుః కణ్ట కవతీ
తవ గ్రీవాధత్తే ముఖ కమలనాళ శ్రియ మియమ్
స్వత శ్వేతా కాలాగరు బహుళ జమ్బా మలినా,
మృణాళీ లాలిత్యం వహతి, యదధోహారలతికా ॥

అర్థము :- ఓ తల్లి! జగన్మాతా! నీ ఈ కంఠ సీమను - త్రిపురాంతకుడైన శివుడు తన బాహువులచే ఆలింగనము చేసుకొనగా, నీలో కలిగిన గగుర్పాటు వలన చర్మముపై పులకలు ఏర్పడగా (మనసు పులకరించినపడు - చర్మంపై నూగు వలె వస్తుంది అందరకూ) నీ ఈ కంఠము, నీ ముఖ కమలమునకు "నాళము" (కాడ)గా మారినట్లు తోస్తున్నది.

నీ కంఠమునకు కాస్త క్రిందుగా నీవు ధరించివున్న ముత్యాలపేరు, నీవు నీ మెడకు అలదుకొన్న నల్ల అగరుగంధము సోకి - ఆ ముత్యములు నీలిరంగు కుమారగా,.నీ కంఠము తామరతూడు చక్కదనమును తోపింప జేస్తున్నది.

ఈ శ్లోకంలో శంకర భగవత్పాదుల వారు జగన్మాత కంఠ సీమ సౌందర్యాన్ని వర్ణిస్తున్నారు.

నల్ల అగరు చెక్క గంధం శరీర తాపం పాగొట్టి శీతలతను చేకూరుస్తుంది.

ఈశ్వరుడు ప్రేమతో, జగన్మాతను కౌగలించుకొనిన సమయంలో ఆ ఫాలాక్షుని ఫాలనేత్రం అగ్ని శెగలు ఆమె శరీరాన్ని బాధించకుండా, నల్ల అగరు చందనం చల్లగా వుంటుంది. ఆగరుచందనం - ఆమె తెల్లని ముత్యాల పేరులతో కలిసిపోగా, నీలకంఠుడు, గరళకంఠుడు అయిన ఈశ్వరుని - మెడవద్దగల నీలిరంగు కూడా అమ్మవారి తెల్లని ముత్యాల పేరులలో ప్రతిఫలించగా ఆ తెల్లని ముత్యాలు - నీలిరంగు - ఆకుపచ్చ - కలిసిన శ్యామవర్ణంలోనికి మారి - తామర తూడును గుర్తుకు తెస్తున్నాయి అమ్మవారి కంఠసీమను - ఆచార్యుల వారు దర్శించిన ఆమనోజ్ఞ రూపాన్ని - మనమూ దర్శించటానికి - సాధనచేద్దాము - రండి.

## 69. శ్లో ॥ జగన్మాత కంఠరేఖలు "భాగ్యరేఖలు"

69. శ్లో॥గళే రేఖా స్తిస్రో, గతిగమక గీతైక నిపుణే!
వివాహవ్యా నద్ధ ప్రగుణ, గుణసంఖ్యా ప్రతిభువః,
విరాజన్తే, నానావిధ మధుర రాగకర భువాం!
త్రయాణాం, గ్రామాణాం, స్థితినియమ సీమానఇవతే!

**అర్థము :-** ఓ సంగీత మార్ల, స్వరగాన నిపుణా! జగదంబా! నీ కంఠము నందుగల మూడు భాగ్యరేఖలునూ, నీ వివాహ సమయమున ఈశ్వరుడు నీ మెడలో కట్టిన బహుతంతు (దారములు) నిర్మిత సూత్రములనూ, నానావిధములై - మధురములైన రాగములకు నివాసములగు, షడ్జగ్రామ, మధ్యగ్రామ, గాంధార గ్రామముల ఉనికి యొక్క నియమము కొరకు ఏర్పరచిన సరిహద్దులా ? అనే విధముగా ప్రకాశించుచున్నవి.

సాధారణమైన అర్థముగా పైకి కనపడే ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి కంఠస్థానంలోని "వైఖరీ" రూపాన్నీ - గాన కళలోని వివిధ స్థాయీ బేధాలనూ - ఆయా స్థాయిలలోని ప్రత్యేకతలనూ పరోక్షంగా - అద్భుతంగా వివరించారు. నిగూఢంగా వున్న పరమార్థ భోధచేశారు.

కంఠస్థానంలో విశుద్ధి చక్రం వుంటుంది. ఇది 16 దళములుగలది. ఇందులో ప్రతి దళంలోనూ ఒక్కొక్క అక్షరంప్రకారం అచ్చులు వుంటాయి. ఇవి హల్లులతో కలిసి వాక్కుగా, గానంగా, ఉపన్యాసంగా- కవిత్వంగా - ఆయా వ్యక్తుల పూర్వజన్మ పుణ్య ఫలితంగా (శబ్ద తరంగాలుగా) రూపొందుతాయి భాషగా, భావంగా.

ఈ అమ్మవారి "వైఖరీ" రూప కరుణ పొందినవారు - మధురంగా గానం చేయగలరు. తమ వాక్పటిమతో ఉపన్యసించి ఎదుటివారిని ఆకట్టుకొనగలరు. కవిత్వంతో మెప్పించగలరు. అష్టావధాన, శతావధాన ప్రక్రియలతో అద్భుత ధారణశక్తి ప్రదర్శించగలరు. ఇదంతా అమ్మవారి "వైఖరీ"రూప కరుణ మహిమ. అది లేనివారే - మూగవారు, నత్తివారు - ముద్ద మాటలు - మాటలస్పష్టత లేనివారుగా వుంటారు.

మూలాధారంలో శ్వాసలా ప్రారంభమైన నాదం - నాభి స్థానం నుండి భావనగా (పశ్యంతి) గామారి - హృదయస్థానంలోని అనాహత చక్రంలో శ్వాసతో కలిసి "మధ్యమా" నాద రూపిణిగా - శబ్దాలలో వ్యక్తం చేయలేని నాదరూపిణిగా మారి - కంఠంలోని "విశుద్ధి చక్రంలో - (ఫిల్టర్) వడ బోతలకు తట్టుకుని - మాటలుగా వాక్యాలుగా, కవిత్వంగా, ఉపన్యాసంగా, గానంగా, వారి వారి పూర్వజన్మ సుకృత విశేషం వలన ఒకానొక వరంగా, కళగా రూపొందుతుంది. ఇదే "వైఖరీ" రూపిణి!

ఇక వివాహ విషయంలో ఒక్కొక్క ప్రాంతం వారికీ, ఒక్కొక్క మతంవారికీ - కులం వారికీ ఒక్కొక్క సాంప్రదాయం వుంటుంది - మంగళ సూత్రధారణ - నల్ల పూసల ధారణ ఇలాటి విషయాలలో! ఈ శ్లోకంలో - ఈశ్వరుడు - హిమవంతుని - వంశాచారాన్నను సరించీ, లేక -

సర్వ స్వరములు - మూడు విధములుగావుంటాయి.

1. షడ్జగ్రామము.
2. మధ్యగ్రామము.
3. గాంధారగ్రామము.

సప్త స్వరములైన " స, రి, గ, మ, ప, ద, ని,స," అనునవి ఆరోహక్రమము + అవరోహక్రమము = ఒక"మూర్చన" అనబడును.

గాంధార గ్రామము శిరఃస్థానంనుండి ఉత్పన్నమయ్యే దేవతా శృతి గానము, ఇది భూలోక వాసులకు సాధ్యంకాదు. గంధర్వులు ఈ శృతిలో గానంచేయగలరు గనుక వారి గానం "గాంధర్వగానం"గా ప్రసిద్ధి చెందింది. నారద మహర్షి "మహతి" వీణ, ఆ మహర్షి శృతి చేయకున్నా, మీటకున్నా, "నారాయణ" మంత్రాన్ని నాదంగా పలుకుతుంటుంది. ఆయన శిరసులోని భావానికీ, రాగానికీ, అను గుణంగా ఆ వీణ - నాద ప్రస్తారం చేస్తుంది. అంటే ఆయన శిరసులోని భావాన్ని చేతిలోని వీణ గ్రహిస్తుంది. నాదం పలుకుతుంది. తుంబురుని గాంధర్వగానం దేవతలను మెప్పిస్తుంది. చదువుల తల్లి సరస్వతి చేతి "రాజ వాద్యం" అయిన వీణ ("కచ్ఛపి") సరే సరి. అదిపలకని శృతి - ప్రస్తారం చేయని రాగం వుండనే వుండదు. "గంధర్వులన"బడే ఒకజాతి దేవతలందరూ గానకళాశాస్త్ర కోవిదులు, వారి వారి వాయిద్యాలూ, కంఠం గాత్రమూ- తారస్థాయిని మించి పాడగలరు! ఇది కేవలం దేవతలకే పరిమితము. అందువలన శిరః స్థానం అయిన "గాంధార గ్రామము" దేవలోకానికీ - దేవతలకే పరిమితము. మానవులకు సాధ్యంకాదు.

అయితే - తమగానంతో - తారస్థాయితో - గమ కములతో, స్వర సమ్మేళనంతో స్పష్టమైన ఉచ్ఛారణతో - మధురమైన కంఠ స్వరంతో - శ్రోతలను - అలౌకిక స్థితిలోనికి తీసుకు వెళ్లగలిగిన మానవ గాయనీ - గాయకులను మనం "గాన గంధర్వులనీ-" వారిగానం "గంధర్వ గానం" అనీ ప్రశంశిస్తుంటాము కదా ?

ఇక మిగతా రెండు గ్రామములు అనగా షడ్జమ గ్రామము, మధ్యమగ్రామము భూలోక వాసులకోసం ఏర్పడినవి.

"స, రి, గ, మ, ప, ద, ని, స" అనే సప్త స్వరములూ ఒక్కొక్క గ్రామంలో 7 + 7 = 14 గా వున్నవి.

షడ్జమ గ్రామంలో - ఆరోహణ, అవరోహణక్రమంలో

స రి గ మ ప ద ని

ఈశ్వర మతాన్ని అనుసరించి శైవ సాంప్రదాయాన్ని అనుసరించి) జగన్మాత మెడలో మూడు వరుసల బహుతంతువులుగల (దారపు పోగులు గల) పసుపు పచ్చని (పసుపు పూసిన) సూత్రములు కంఠం చుట్టూరా వచ్చేలా కట్టాడు. ఆ మూడు వరుసల సూత్రము - ఆ తల్లి కంఠ సీమకు గల మూడు రేఖలు (చర్మపుగీట్లు) - మూడు భాగ్యరేఖల వలె తోస్తున్నాయి.

ఈ భాగ్యరేఖలు అంటే ఏమిటి ?

స్త్రీ, పురుషులలో

1. లలాటము (నుదురు) యందు.
2. కంఠము నందు
3. నడుము నందు

మూడు ముడుతలు (మూడురేఖలు) కలిగి వుండటం మహా సౌభాగ్య సూచకమని సాముద్రిక శాస్త్రంలోని రేఖా విభాగం చెబుతున్నది.

అందువలన ఆ పసుసుపచ్చని సూత్రములు - అమ్మవారికి కంఠంలో సహజంగా వున్న భాగ్యరేఖల వలె వుండటమే గాక - సంగీత జ్ఞానరాశి అయిన ఆ తల్లి కంఠంలో దాగివున్న సంగీత శాస్త్రంలోని మూడు శృతుల - కాలముల, గ్రామముల, హద్దుల వలె వున్నవి.

ఈ గ్రామములంటే ఏమిటి ?

"గీతులు" లేక గతులు - 5 (ఐదు)

దాని వలన పుట్టిన గ్రామ రాగములు - 30

ఉపరాగములు - - - - - - 8

రాగములు మాత్రము - - - - - - 20

జనక రాగములు - - - - 15

భాషా రాగములు - - - - - - 96

విభాషా రాగములు - - - - - - 20

అంతరములు (భాషలు) 3

ఇవన్నీ "రాగాధ్యయనము" నందునూ.

గాన కళా బోధిని - మొదలైన గాన కళాశాస్త్రానికి సంబంధించిన గ్రంధాలలో "మేళకర్తల' ' వివరాలతో సహా వుంటాయి - మనం కొంతవరకే తెలుసుకుందాము - అందుకే ఈ వివరాలు.

గ్రామములు అంటే - సంగీతశాస్త్రములో

స ని ద ప మ గ రి ఒక మూర్ఛన.

మధ్యమగ్రామంలోనూ - పై స్వరములే ఆరోహణ, అవరోహణ క్రమంలో ఒక"మూర్ఛన" అవుతాయి.

ఈ "మూర్ఛన" లను "శుద్ధతానములు" అంటారు.

ఈ శ్లోకంలో - భగవతి యొక్క, కంఠ సీమయందున్న భాగ్యరేఖలు - ఈశ్వరునిచే అమ్మవారి కంఠ సీమయందు కట్టబడిన మూడువరుసల సూత్రములు పరిశీలించగా, గాంధారగ్రామము శిరఃస్థానము కావున దేవతలకు పరిమితం అయినది గనుక - అదీ, షడ్జమ - మధ్యమ గ్రామాలు భూలోక వాసుల కొరకై ఏర్పడినవి గనుక ఇవి రెండూ - కలిసిపోయి, సంకరం కాకుండా వుండేందుకుగానూ, వేటికవి విడివిడిగా వుండేలా హద్దులు నిర్ణయించినట్లుగా వున్నాయి ఆ సూత్రములు (దారములు) మరలా, మూడూ, గాన కళలోని భాగాలే కాబట్టి) భిన్నత్వంలోని ఏకత్వంలా - ఏకత్వంలోని భిన్నత్వంలానూ - అమ్మవారి కంఠసీమ "వైఖరీ" రూపంగా సాక్షాత్కరిస్తోంది. ఉదాహరణకు - ఒకపాట (ఒక కీర్తన) వివిధ గాయనీ గాయకులు - వివిధ రీతులలో పాడి మెప్పిస్తుంటారు. పాట ఒకటే. గాయనీ గాయకులు వేరు వేరు. ఎవరి పద్ధతి వారిది, ఎవరి కంఠ స్వర మాధుర్యం వారిది. సరిగ్గా ఇలాగే అమ్మవారి కంఠ భాగ్యరేఖలు - ఈశ్వరుడు కట్టిన మూడు సూత్రములూ - గాన కళలోని గ్రామములు హద్దులు నిర్ణయించే - విధంగా వున్నాయన్నారు ఆచార్యులవారు. మరి ఇంతటి జ్ఞానాన్ని ఒక శ్లోకంలో పొదిగి ప్రసాదించిన ఆచార్యుల వారి సౌందర్యలహరిని గురించి "ఏమిటో ఈ వర్ణనలు! ఎందాకా సాగుతుందో, ఎక్కడ ఆగుతుందో - అర్థం గావటంలేదు!" అని విమర్శించే వారిక్ - ఒక్క నమస్కారం పెట్టి - తప్పుకుని వెళదాం పదండి. వారితో తర్కిస్తూ కూర్చుంటే మనం వున్నచోటనే చతికిలబడి పోతాము. ఆధ్యాత్మిక మార్గంలో ముందుకు పోలేము పరమగురువు వెంట!

అందుకే కుతర్కాలకు దూరంగా, తర్కించే వారికి దూర దూరంగా తొలగిపోదాం పదండిముందుకు - పదండి. పదండి!

## 4వ అధ్యాయం (చతుర్ధ అధ్యాయం సమాప్తం)

ఈ అధ్యాయంలో - ఆచార్యుల వారు, పంచద శీమంత్రంలోని "క ఏ ఈ లహ్రీం" అనే మంత్రార్థమూ - అమ్మవారి "వాగ్భవకూటము" అయిన - శిరసునుండి - కంఠంవరకూ గల సౌందర్యాన్ని, వైభవాన్ని - మహాత్మ్యాన్నీ, వర్ణిస్తూ - జ్ఞానేంద్రియాల కూటమి అయిన శిరస్సు

మొదలు కంఠం వరకూ గల జ్ఞానాన్ని మనందరకూ - జగన్మాత విరాట్ రూపంగానూ, స్థూలరూపంగానూ - అమృతఝరిలా - దోసిళ్లతో పంచిఇచ్చారు ప్రసాదంగా! 58 వ శ్లోకంనుండి 69వ శ్లోకంవరకూ - 12 శ్లోకాలలో!

ఈ అధ్యాయం భక్తి శ్రద్ధలతో పారాయణ చేసిన వారికి వ్యాధుల ఉపశమనము, సకల జనవశ్యము నిద్రా హీనతతో బాధపడేవారికి ? (సమస్యలుంటే నిద్రపట్టదు - కొందరికి సమస్యలు లేకుంటే నిద్రపట్టదు - మొత్తం మీద నిద్ర పట్టక - ఎన్ని నిద్రమాత్రలు వేసుకున్నా - కొందరికి! మొద్దుబారిపోవటం తప్ప - నిద్ర రాని రానివారికి) ప్రశాంతమైన నిద్ర పట్టేలా, సమస్యల పరిష్కారం - హృదయశాంతి - ప్రశాంతత, సంగీత కళలో, గాత్రము వాద్య సంగీతంలో ప్రావీణ్యత, మొదలైన దివ్య శక్తులు జగన్మాత ప్రసాదిస్తుంది.

జగన్మాత పై భక్తి ప్రపత్తులు వృద్ధిపొంది - "వాగ్భవకూట" స్తోత్ర పారాయణం వలన జ్ఞానం వృద్ధిపొందుతుంది.

అమ్మవారు మనకు ఏమిస్తుందా ? అని ఎదురు చూడటం గాక - ఈ సర్వసృష్టి - సృష్టించి అందులో ఉత్తమమైన మానవ జన్మ మనకు ప్రసాదించి, కాస్తో, కూస్తో ఆధ్యాత్మిక జిజ్ఞాసకు మనకు ప్రసాదించిన ఆ తల్లికి - మనం ఏమివ్వగలం - ఎలా ఋణం తీర్చుకోగలం ? అని ఆలొచించుకోగలితే చాలు. అదే గొప్ప జ్ఞానానికి మేలు కొలుపు మనలో! అవునా ?

## 4వ అధ్యాయం సమాప్తం.

"శ్లో" కంఠాధః కటిపర్యంత

మధ్య కూట స్వరూపిణి"

అనే శ్లోకార్థం ప్రకారం - అమ్మవారి కంఠ సీమనుండి కటివరకూగల సౌందర్యలహరిలో - ఆచార్యులవారి వెంట - ఆ అమృతఝరిని చూచి ఆనందించటానికి 5వ అధ్యాయంలోనికి - పారాయణానికి పదండి - ముందుకు.



## 5వ అధ్యాయము. (పంచమోధ్యాయః)

# అమ్మవారి బాహువుల సౌందర్యం.

70. శ్లో॥మృణాళీ మృద్వీనాం, తవ భుజలతానాం చతసృణాం.
చతుర్భి స్సౌందర్యం, సరసిజ భవ స్స్తౌతి వదనైః
నఖేభ్య స్సన్త్రస్యన్ ప్రధమ మధ నాన్ధకరిపో
శ్చతుర్ణాం శీర్షాణాం సమ మభయ హస్తార్పణధియా ॥

**అర్థము :-** ఓ జగన్మాతా! భగవతీ! తామరతూడువలె మృదువైన నీ నాలుగు భుజముల యొక్క చక్కదనమును గాంచి, సరసిజ భవుడైన బ్రహ్మ, పూర్వము అంధకాసురుని శిరస్సును గోటితో గిల్లివేసిన ఈశ్వరుని (అంధకరిపు) నఖము వలన భయపడుచున్నవాడగుచూ, తన నాలుగుమోములతో (నాలుగు శిరస్సులతో) నీ నాలుగు హస్తములనుండి అభయదానము గోరుచు స్తుతించుచున్నాడు.

ఈ శ్లోకంలో శంకర భగవత్పాదులవారు జగన్మాత చతుర్భుజముల సౌందర్యమును, మహాత్మ్యమును, అభయ గుణమునూ వర్ణించుచున్నారు.

సృష్టికర్త ఐన బ్రహ్మదేవునికి ఐదు శిరస్సులుండేవి. వేదములునాలుగూ నాలుగు శిరస్సులు కాగా, ఐదవది. సృష్టి సౌందర్యాన్ని పర్యవేక్షించే శిరస్సు, తాను సృష్టించిన వాగ్దేవత అయిన సరస్వతీదేవిని కుమార్తె వరుస అని కూడా చూడక - మోహదృష్టితో చూచి, అమెనే పెండ్లాడి - తన నాలుకపై ధరించాడు బ్రహ్మదేవుడు. అందుకే "ఆడదాని జూడ, నర్థంబు జూడ బ్రహ్మకైన బుట్టురిమ్మ తెగులు" అనే సామెత వేమన కవి పద్యరూపంలో చమత్కరించాడు.

"స్కంద పురాణంలో" శివపార్వతుల వివాహ ఘట్టగాధ వున్నది. పర్వత రాజపుత్రి అయిన పార్వతీదేవి, శివునికై ఘూరతపస్సు చేసి, శివునిమెప్పించి, తమ వివాహానికి సుముఖుని చేసుకున్నది. ఆ వివాహ మేదో తానే త్వరగా జరిపించి కీర్తి సాధించాలని త్వరపడి, మన్మధుడు - భస్మమయ్యాడు ఈశ్వరుని ఫాలనేత్రాగ్నికి! పార్వతీదేవి - వివాహ పద్ధతి ప్రకారం - కన్య అయిన తన తండ్రిగారి అనుమతితో వివాహ మాడమని కోరింది ఈశ్వరుని. ఈశ్వరుడు సరేనన్నాడు. హిమవంతుడులోగా పార్వతికి స్వయంవరం ఏర్పాటు చేస్తానని శపధంచేసి వున్నాడు. ఇప్పుడె లాగూ ఈశ్వరుడు వివాహం చేసుకోబోతున్నాడు గనుకా, పార్వతి ఆస్వామినే వివాహ మాడబోతున్నది గనుకా - వివాహపు ఏర్పాట్లన్నీ ఘనంగా చేసి - లాంచనంగా స్వయంవరం ప్రకటించాడు హిమవంతుడు.

పార్వతీ పరమేశ్వరుల ప్రణయగాధ - పార్వతి తపస్సు - కామదహనం అన్నీ అందర వతలకూ తెలుసు. అయినా వారంతాకూడా పార్వతి స్వయంవరానికి (ఈశ్వరునితో వివాహానికి వ్యాలంకార భూషితులై విచ్చేశారు.

భోళాశంకరునికి వివాహ పద్ధతులేమీ తెలియదు. దక్షుని కుమార్తె "సతిగా" పార్వ న్మించినపుడు - దక్షుడామెను కన్యాదాన, వివాహ పద్ధతిలో ఈశ్వరునికి అర్పించలేదు. వివాహ రగలేదు - ఈశ్వరుని పతిగా కోరిన సతీదేవి ఆయన వెంట - కైలాసం వెళ్ళిపోయింది. ఆ ్వాత దక్షయజ్ఞం - సతీదేవి ఆత్మాహుతి. ఈశ్వరుడు వీరభద్ర సృష్టి - దక్షయజ్ఞ విధ్వంసం రల దయతో దక్షునికి "మే కతల" అతికించి బ్రతికించటం - సతీ వియోగంతో ఈశ్వరుడ రాకులుడు"గా (శక్తి స్వరూపిణి - తనని వదిలి పోయిన స్థితి శక్తిహీనత) మిగిలిపోయ మాధిస్థితిలో నిలిచిపోవటం లాటి సంఘటనలన్నీ జరిగిపోయాయి.

నేటి కాలానికి మరలా దాక్షాయణి. పార్వతిగా జన్మించి - మరల ఈశ్వరునే భర్తగ ందబోతున్నది. తారకా సుర సంహారం కోసం, పార్వతీ పరమేశ్వరులకు పుత్రుడు జన్మించా మక - దేవతలందరూ ఈ శుభకార్యానికి త్వరపడుతున్నారు. సంతోషిస్తున్నారు.

వివాహపద్ధతులు తనకు తెలియవనీ, వివాహానికి పెద్దరికం వహించమనీ విష్ణువును కోరాడ శ్వరుడు. విష్ణువు సంతోషంగా అంగీకరించి - వివాహ విధులు చక్కగా తెలిసినవాడవట ల్ల పార్వతీ పరమేశ్వరుల పెళ్ళికి పెద్దరికం వహించాడు. ఈశ్వరుని "వరునిగా" అలంకరిం సె - పెళ్ళికి అంతా తరలివచ్చారు.

కల్యాణవేదిక వద్దకు పార్వతి - చెలి కత్తెలు వెంటరాగా, తల్లి మైనాదేవితోడ్కొనిరాగ రాళ మందగమనం (ఆడహంస వలె నడుస్తూ) వచ్చింది.

ఇందాకా పార్వతి సౌందర్యాన్ని దేవతలు, ఋషులు - బ్రహ్మ మరెవరూ ఇంత దగ్గర వాడలేదు. ఆ అనుపమాన సౌందర్యరాశి సౌందర్యపు ప్రవాహ వెల్లువలా (సౌందర్యలహరిలా త్యక్ష్యమైంది. జగన్మాతలోని జగన్మాతృ భావాన్ని మరిచి - దేవతలంతా - ఋషుల లామంది - ఆ తల్లి సౌందర్యం ఆ బగా, మోహంగా చూడసాగారు. బ్రహ్మ సరేసరి!

బ్రహ్మతలలో వికారం వెర్రితలు వేయకముందే ఆ వికారాన్ని అణచివేయాలనే సూచనత ష్ణువు శివునికి సైగచేయగా, ఈశ్వరుడు తనకొన గోటితో బ్రహ్మ తలను (శిరస్సును పార్వతి మ దృష్టితో పరికిస్తున్న శిరస్సును) అలవో కగాత్రుంచ్చేశాడు! గిల్లివేశాడు. బ్రహ్మ తలెగి రాన పడిపోయింది - (అదే "బ్రహ్మ కపాలం" క్షేత్రం ఇప్పుడు.) మిగతా వేద స్వరూపాలై

నాలుగు తలలూ మిగిలాయి బ్రహ్మకు జ్ఞానంతో! తనతప్పు తెలిసి వచ్చింది. ఋషులకూ, దేవతలకూ కూడా జ్ఞానోదయమైంది. వారంతా తమ శిరసులు వంచి - జగన్మాతృ భావనతో అమ్మవారి పాదాలపై తమ దృష్టి నిలిపి నమస్కరించి శరణువేడారు.

ఇక ఈశ్వరుడు - అంధరిపుడు. అంధకాసుర సంహారి. ఈ అంధకుడెవరు ? ఒకసారి - సతీదేవి - దాక్షాయణిగా జన్మించినపుడు) ఈశ్వరునితో సరసాలాడుతూ - సరదాగా, ఆయన రెండుకళ్ళూ - తన చేతులతో వెనకాలనుంచి మూసివేసింది. ఆ క్షణంల-లో - ఈశ్వరుని కళ్ళ మూతపడటంతో సర్వచరా చర జగత్తూ చీకటిలో - తమస్సులో మునిగిపోయి, ఆతమస్సే ఆకారంగా మారి "పుట్టంధుడైన" అంధకుడు - అంధకాసురుడు" అనే రాక్షసాకారుడు జన్మించాడు.

ఈశ్వరుడు సతీదేవిని మందలించి, ఆ అంధకుడిని తమ బిడ్డగా - పరిచయంచేశాడు. వాడు కూడా మాతాపితలైన సతీ శివులకు మ్రొక్కి తపస్సుకు వెళ్లిపోయాడు. అజేయమైనవరాలు బ్రహ్మనుండి పొంది లోక పీడకుడుగా తయారయ్యాడు అంధకుడు. వాడు ఏ అస్త్ర శస్త్రాలకూ చావకుండా - ప్రాణం వున్న ఏ ప్రాణి చేతా చావకుండా బ్రహ్మవలన వరాలుపొందాడు. మరోమారు తపస్సుచేసి, శివానుగ్రహం పొంది - అంధత్వం పోగొట్టుకుని - కళ్ళు, దృష్టి పొందాడు. ఇక వాడి ఆగడాలకు హద్దు లేకుండా పోయింది.

పార్వతీ, పరమేశ్వరులు ఒకమారు ప్రణయ కలహంతో - ఒకరిపై ఒకరు అలిగారు. పార్వతీదేవి - ఈశ్వరుని వదిలి - హిమవత్పర్వత ప్రాంతం (కైలాసం) వదిలి - అరణ్యాలలో తిరుగాడ సాగింది. శక్తి స్వరూపిణి తనని వదిలిపోగా ఈశ్వరుడు మరలా నిరాకులు డయ్యాడు. (జడత్వము నిరాసక్తత. నిస్పృహ మొదలైన గుణాలే నిరాకులత) పార్వతి వంటరిగా వుండగా, అంధకుడు అటుగావచ్చి, ఆమె తన తల్లి పార్వతి అని తెలియక - అత్యాచారం చేయబోయాడు. పార్వతి దిక్కుతోచక - ఈశ్వరుని ఎలుగెత్తి పిలిచింది. ఆ పిలుపు సమాధిస్థితిలో వున్న ఈశ్వరుని హృదయంలో ప్రతి ధ్వనించింది. ఒక్కసారిగా ఆయన శక్తి ప్రేరితుడూ, శక్తి పూరితుడూ అయ్యాడు. పార్వతి - అంధకులున్న అరణ్యంలో ప్రత్యక్ష్యమయ్యాడు. "పాపాత్ముడా, నీ తల్లినే గుర్తించలేదా?' ' అని గర్జించాడు పరమశివుడు. పార్వతికి ఈ అంధకుడు తమ బిడ్డడనీ - ఈశ్వరుని కన్నులు తానుమూయగా - ఆ తమస్సులో నుండి పుట్టిన తామస శక్తి రూపుడనీ గుర్తొచ్చింది. వాడిని జాలిగా చూచింది.

కానీవాడో ? దృష్టిలేనపుడూ అంధుడు! దృష్టి వచ్చాక కూడా, వాడిలోని మానసిక అంధత్వం వదలలేదు - ఈశ్వరుడు హెచ్చరిస్తున్నా, తల్లి పార్వతిని వెంటాడటం మానలేదు. ఈశ్వరుడు జాలిపడి ప్రసాదించిన దృష్టిని దుర్వినియోగం చేసుకున్న ఆమూర్ఖునికి ఇకక్షమ అనవసరమనిపించింది ఈశ్వరునికి.

వాడు ఏ అస్త్ర శస్త్రాలతో మరణించడనీ తెలుసు. ప్రాణంవున్న ఏ ప్రాణివలనా వాడికి మరణం లేదు. మరి వీడిని హతమార్చటం ఎలా ? ఈశ్వరునికి - తాను యోగస్థితిలో వుండగా - విపరీతంగా పెరిగిపోయిన తన చేతివ్రేళ్ల గోళ్లు - కనిపించాయి. అవే ఆయుధాల్లా మెరిసిపోతున్నాయి - వాడిగా.

(ఈ నాడూ చాలామంది స్త్రీ - పురుషులు - ఒక అంగుళం మొదలు - గోళ్లు పెంచుతున్నారు ఫ్యాషన్‌గా, ఒకాయన అయితే గోళ్లు తెగబారెడు పెంచి ఏకంగా గిన్నిస్‌బుక్‌లోకే ఎక్కాడు. ఈశ్వరునికవి షోకుకోసం "షో" కోసం పెంచినగోళ్లు కాదు. ఒకానొక దుష్ట సంహారానికి కారణాలుగా పెరిగిన గోళ్లు., గోళ్లకు శరీరానికి అతుక్కుని వున్నంతవరకూ ప్రాణం వుంటుంది - అవి పెరుగుతుంటాయి. కత్తిరిస్తే ప్రాణంవుండదు - పెరగలేవు. (కేశములూ అంతే!) ఈశ్వరుడు తన చేతివ్రేళ్లు గోళ్లతో అంధకుడి శిరసు గిల్లివేసాడు - అంధకరిపునిగా, అంధకాంతకునిగా, అజ్ఞానమనే పెనుచీకటిని గోళ్లతో చీల్చివేసిన దేవదేవునిగా అంధకాంధకాతంకం, తమంతకాంతకం భజే!" తమంత కాంతకం భజే" అంటూ రావణకృత శివతాండవ స్తోత్రంలో కీర్తింపబడినట్లు - దేవతలందరిచేత స్తోత్రం చేయబడ్డాడు. పుట్టు గ్రుడ్డివాడు అంధకుడు! బ్రహ్మ వరాలతో అజేయబల సంపన్నుడైనాడు. ఈశ్వర కటాక్షంతో దృష్టిసాధించుకున్న ఆతడికి - సర్వలోకాలనూ పీడించటం - స్త్రీలని బాధించటం - వినోదం అయి కూర్చుంది. వాడు మరల అంధుడైనాడు మానసికంగా, అదేవాడి మరణానికి దారి తీసింది. బ్రహ్మకు ఈ కథలన్నీ గుర్తుకువచ్చాయి.

పార్వతీదేవి భుజసౌందర్యం - పసిపాపలా వర్ణించటం, ఆనందించటం వేరు - జగన్మాత సౌందర్య వీక్షణంలో మలినభావాలకు తావుండరాదు.

పార్వతీ పరమేశ్వరుల వివాహం అయ్యాక - తానుకైలాసం వెళ్లకా తప్పదు. "సరస్వతినే మోహించిన నీవు - నీ తల ఒకటి పోగొట్టుకున్నావు - మిగతా తలలు జాగ్రత్తసుమా!" అని ఈశ్వరుడు కోపిస్తే తన మిగతా శిరసుల గతేం కాను ?

అందుకే జగన్మాత చతుర్భుజాలకూ - తన మిగిలివున్న నాలుగు శిరసులతో మ్రొక్కి - అభయదానం కోరుకున్నాడు. జగన్మాత అపార కరుణాతరంగిణి కదా ? సకల చరాచర ప్రపంచమూ ఆమెకు బిడ్డలే! బ్రహ్మకు అభయప్రదానం చేసేసిందా తల్లి!

అంతటి మహిమాన్వితమూ, సౌందర్యంలో తామరతూడుల వలె అతి మృదులములూ అయిన అమ్మవారి బాహువులు. మనలనందరినీ రక్షించుగాక - మనందరకూ అభయప్రదాన మొనర్చుగాక అని వేడుకుందాము.

కలి కాలం మానవులమయిన మనం, అంధకునిలానే - బ్రహ్మలానే - తెలిసో, తెలియకో - ఈనాటి జీవన శైలి, వేగము - ఆందోళన, అస్థిరత - లలో - కొన్ని తప్పులు చేస్తూనే వుంటాము. వాటన్నిటినీ ఆ తల్లి స్తోత్రంతో - నామజపంతో - క్షమించమని మనసారా ప్రణమిల్లుతూ - ఆ తల్లి చతుర్భుజాలనూ శరణు వేడుదాం.

ఇన్ని కథలనూ - ఘట్టాలదృశ్య మాలికలనూ - తన అక్షరాల వెనక పొందుపరచి - ఈ శ్లోకంగా ప్రసాదించారు జగద్గురువులు! పరమ గురువుల బోధ ఇంతటి అద్భుతంగా వుంటుంది. అవునా ?

" క ఏఈలహ్రీం - హసక హలహ్రీం - సకలహ్రీం -" అనే పంచదశీ మంత్రంలోని రెండవ కూటమైన మధ్య కూటంలో - కంఠం క్రిందనున్న - బహువుల వద్దనుండి - కటివరకూగల అమ్మవారి మంత్రరూపశరీర దర్శనం చేయిస్తున్నారు జగద్గురువు గుర్తుంచుకోండి. పదండి - ముందుకు.

## 71 శ్లో ॥ హస్త సౌందర్యము.)

**71 శ్లో॥ నఖానాము ద్యోతై ర్నవ నళినరాగం విహసతాం**
**కరాణాం తే కాన్తిం, కథయు, కథయామః, కథముమే!**
**కయాచిద్వా సామ్యం, భజతు కలయా హంత కమలం**
**యది క్రీడల్లక్ష్మీ చరణతల లాక్షారస చణమ్ ॥**

**అర్థము** :- ఓ తల్లీ! ఉమా, భవానీ, కళ్యాణీ! కాత్యాయనీ! సూర్యోదయ కాలమున వికసించుచున్న క్రొత్తతామరపూవు కాంతిని పరిహసించు చున్న గోళ్ల యొక్క ప్రకాశముచేత విలసిల్లుచున్న నీ హస్తముల యొక్క సౌందర్యమును ఏప్రకారముగా, అలంకార శోభితముగా వర్ణింపగలను ?

ఒకవేళ - కమలములను తనపాదపీఠముగా చేసుకున్న లక్ష్మీ దేవి చరణముల లత్తుకరసము (పారాణి) అంటుట వలన లేత ఎరుపురంగుకు వచ్చిన కమలములు - కొంతవరకూ, నీ కరముల కాంతి లేశమునకు సాదృశము కాగలదేమో!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - జగన్మాత హస్తములు అరచేతుల అందాన్ని వర్ణిస్తున్నారు. (క్రితం శ్లోకంలో భుజములు మొదలుగా గల బాహువుల సౌందర్యాన్ని వర్ణించారు.)

భగవతి చేతివ్రేళ్ల గోళ్ల కాంతి సూర్య కిరణాలతో పోల్చారు. ఆమె అరచేతుల అరుణిమను (లేత ఎరుపురంగును) ఉషోదయంలో వికసించే కమలముల కాంతితో పోల్చారు. లక్ష్మీదేవి పాదాలలత్తు కరసం అంటడంవల్ల కమలాలకు ఆ ఎరుపుదనం వచ్చి వుండవచ్చుననీ చమత్కరించారు. కొందరు స్త్రీల చేతులు అరచేతులు చాలా మృదువుగా వుంటాయి. పాలుగారే చెక్కిళ్లలానే - అరచేతులూ అద్దాలులా వుంటాయి. అయితే - అంట్లుతోముకోవటం, బట్టలుతుక్కోవటం లాటిపనులూ, ఆఫీసులలో నిరంతరం టైపు కొట్టడం, ఫైల్స్‌రాయటం - బస్సు - కారు - స్కూటర్ ల్లాటివి డ్రైవ్ చేయటం లాటి పనులు తప్పనిసరి అయిన మహిళల అరచేతులు మృదువుగా వుండేందుకు ఆ స్కారంలేదు. ఆపనివత్తిడి వారి అరచేతులలోని మృదుత్వాన్ని మాయంచేస్తుంది. ఇంటిపని ఎక్కువ లేకుండా అన్నీ మిషన్ల మీద చేసుకొనగల సౌలభ్యం వున్నస్త్రీల అరచేతులు మృదువుగా వుంటాయి. జగన్మాత సహజ సౌందర్యలహరి. అది తరగదు చెరగదు. స్ఫటికముల వలె మెరిసే ఆమె వేలిగోళ్లకు ప్రత్యేకంగా ఏ "నెయిల్‌పాలిష్" అవసరంలేదు ప్రత్యేక శ్రద్ధతో పెంచనవసరంలేదు. ఆమె అభయహస్తం - అరచేయి - అప్పుడే వికసించిన అరవిందంలావుండటంలో ఆశ్చర్యంలేదు.

జగన్మాత అరచేయి అనే పద్మంలోనే లక్ష్మీ నివాసస్థానముందని పరోక్షంగా చెప్పారు జగద్గురువు.

శ్లో ॥ "కరాగ్రేవసతే లక్ష్మీ, కరమధ్యే సరస్వతీ!
కరమూలేతు గోవిందో, ప్రభాతే కరదర్శనమ్!"

అంటూ, స్తోత్రంచేస్తూ, నిద్ర లేవగానే అరచేతులు (ఎవరివి వారే) కళ్ల కద్దుకుని తర్వాతే కళ్లు తెరవమంటారు పెద్దలు. ఆ విధంగా "లక్ష్మీ సరస్వతి - విష్ణువు - ల్లాటి సర్వదేవతలూ నీ అరచేతులలోనే వున్నారు సుమా "ఉదయాన్నే ఎవరిముఖం చూశానో, ఈ చెడు జరిగింది నాకు!" అంటూ - మనకు జరిగిన చెడుకు వృథాగా ఎదుటి వారిపై అక్కసు వెళ్ల బోసు కోకుండా, ఉదయం నిద్రలేస్తుండగానే మన అరచేతులు మనం దర్శించి - ఆపై మిగతా ప్రపంచాన్ని చూస్తే - మనకు జరిగే మంచి చెడుల ఫలితాలు మన కర్మ ఫలితమే గానీ వేరెవరిదో ముఖ దర్శనం ఫలితం కానే కాదని దివ్యజ్ఞానం వస్తుంది. తద్వారా వృథానిందా రోపణలతో పాపం మూట గట్టు కోకుండా వుంటాము అవునా ? నీ చేతులతో దీనులకు చేసేదానం - నీ చేతులతో పదుగురికీ చేసే విద్యా, జ్ఞాన, స్వార్థరహిత దానాలతో - సర్వదేవతలు నీ అరచేతులలోనే కొలువై వుంటారు. నీ ఈ శరీరమే దేవతలు నివసించే ఆలయంగా, రథంగా మలచుకో!" అని భోధించారు మహర్షులు. పై శ్లోకంతో. ఆ భోధనే జగద్గురువు - తమ శ్లోకంలో పరోక్ష బోధ చేశారు.

## 72 శ్లో॥ అమ్మవారి గజకుంభముల వంటి స్తనయుగ సౌందర్యం.

72 శ్లో॥ సమందేవి స్కన్ద ద్విప వదన పీతం, స్తనయుగం
తవేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుతముఖమ్
యదాలోక్యా శంకా కులిత హృదయౌ, హాస జనకః
స్వకుంభౌ, హేరమ్బః, పరిమృ శతిహస్తేన, ఝుటితి ॥

**అర్థము** :- తల్లీ జగన్మాతా! నీ పుత్రులైన విఘ్నేశ్వర కుమార స్వాములచే, చనుబాలు ద్రావబడిన, నీకు చకుంభములు మా సర్వ క్లేశములను పోగొట్టుగాక! అమాయకుడైన బాల్యం చాపల్యంతో కూడిన - విఘ్నేశ్వరుడు. నీ చనుబాలు ద్రావుచూ, మధ్యలో - నీ స్తనములు తన చిట్టిచేతులతో తడివి - ఒకవేళ తన కుంభస్థలం అక్కడకు వచ్చిందేమోనని భయపడి - తన తలపై కుంభస్థలం వుందో లేదోనని అనుమానం వచ్చి, తొండముతో తన తలను తడవుకొనటమనే చేష్టతో, తలి తండ్రులైన నీకు - ఈశ్వరునికీ - సోదరుడైన కుమారస్వామికీ - నవ్వు తెప్పించుచున్నాడు.

ఈ శ్లోకంలో ఆచార్యులవారు శ్రీ మాత యొక్క గజ కుంభముల వంటి స్తనయుగాన్ని వర్ణించారు. ఆ తల్లి స్తనాలు, సూర్యచంద్రాత్మకమైనవని అందులో సర్వచరా చరప్రాణి కోటికీ ప్రాణాధారమైన ఆహారం - అమృతోప మానమైన జ్ఞాన క్షీరధార వున్నది. ఎన్నియుగాలకూ - ఎందరికి ప్రసాదించినా, తరగని గని ఆ తల్లి చనుబాల అమృతధార. ఆ తల్లి చనుబాల అమృతధారలను (మానసికంగా నైనా - భక్తితో సాధించి) పానం చేసిన ధన్యులకిక, జన్మపరం పర అంటూలేదు. నిత్యబాలురు - నిత్య యవ్వనులు - నిత్యముక్తులు - సిద్ధ పురుషులు అంటే వారే! సనక సనంద నాది మహర్షులు ఎప్పటికీ బాలురుగా - దిగంబరులుగా వుండిపోవటంలోని రహస్యం అదే! వారు దేవీ నామ అమృతపానంలో నిరంతరం నిమగ్నమైన వారు. అలాటి నీస్తనయుగం - మనందరికీ ఆధ్యాత్మిక అమృతధారలు ప్రసాదించి - సర్వక్లేశములూ - సంసార సాగర సమస్యలూ పరిష్కరించి - సర్వ కళలూ ప్రసాదించి, ఉద్ధరింపబడాలని శంకర భగవత్పాదుల వారు ఆ తల్లిని కోరుతున్నారు. ఆ తల్లి స్తనయుగ దర్శనంలో మనమూ, విఘ్నేశ్వర, స్కందుల వలెనూ - ఆచార్యులవారి వలెనూ - శిశు స్వరూపులుగా మారిపోదాము రండి. తల్లిగుండెలలో ఒదిగిపోయే శాంతి - ఏ లోకాలలోనూ - ఎందులోనూ లేదు సుమా!

# 73. శ్లో ॥ జగన్మాత వక్షోజ సౌందర్యం.

73 శ్లో॥ అ మూతే వక్షోజా వమృతర సమాణిక్యకుతుపౌ
న సన్దేహస్పందో, నగపతి పతాకే మనసినః
పిబన్తౌ యస్మా దవిదిత వధూ సజ్గరసికౌ
కుమారా వద్యాపి ద్విరద వదన క్రౌఞ్చ దళనౌ ॥

అర్థము :- హిమవంతుని వంశ ధ్వజమునకు పతాకమైన (వస్త్రమైన - జెండావస్త్రము) అయిన తల్లీ! జగన్మాతా! పార్వతీ! నీ స్తనములు అమృతరసముతో నిండిన కుతుపములు (సిద్దెలు) - అవి మాణిక్యములు తాపడము చేసిన బంగారు గిన్నెలు (సిద్దెలు) నీ చనుబాలు త్రావి త్రావి - తృప్తినొందక, విఘ్నేశ్వర - స్కందులిద్దరూ - ఎన్నటికీ ఆ అమృతధారలు వదులుకొన కూడదనే ఉద్దేశ్యంతో, బాలురుగా, బ్రహ్మచారులుగానే వుండిపోదలచారు. నవ వధులపైనా (యవ్వన కోర్కెలపైనా) ఆశ లేకుండా వున్నారు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు జగన్మాత వక్షోజ సౌందర్యాన్ని మరలా వర్ణిస్తున్నారు. లోగా అధ్యాయాలలో అమ్మవారి నేత్రసౌందర్యాన్ని పది శ్లోకాలలో వర్ణించి - నేత్రములూ నేత్రదృష్టిలోని మహాత్మ్యాన్ని క్షుణ్ణంగా మనందరకూ బోధించిన జగద్గురువులు. ఈ అధ్యాయంలో అమ్మవారి స్తనయుగ సౌందర్యాన్ని. మహాత్మ్యాన్ని అమృత ప్రసాదాన్ని మరల మరల వర్ణిస్తున్నారు ఐదారు శ్లోకాలలో!

ఈ ప్రక్రియకు కవిత్వంలో- "సమాస వ్యాసము" అంటారు. ఒక విషయాన్ని శ్రోతల లేక పాఠకుల హృదయాలకు హత్తుకొనేలా చెప్పటానికిగానూ, వివిధ ఉపమానాలతో, ఉదాహరణలతో బోధించే ఆచార్యులు వారు! మనమో! ఒక విషయాన్ని -! "బావుంది!" అనుకుని - ఇంటికి వచ్చాక - అవి ఏమిటో కూడా మర్చిపోయే మందమతులము! అంచేత "సమాస వ్యాస" పద్ధతిలో ఒక సద్గురువు - విద్యార్థులకు భోధించినంత ఓర్పుగా బోధిస్తున్నారు ఆచార్యులవారు. పూర్వం, నెయ్యి, నూనె - ల్లాటివి నిలవచేయటానికి, మహా చక్రవర్తులూ, రాజులూ, సంపన్నులు, - మాణిక్యములు తాపడం చేసిన కుతుపములు అనగా సిద్దెలు - (వెడల్పు మూతిగల పాత్రలు) ఉపయోగించేవారు. మాణిక్యములు - ఏ పదార్థాన్నీ చెడిపోనివ్వవు. కల్మషం అంటనివ్వవు. ముత్యముల వలెనే "ఫిల్టర్" (వడబోత) చేయగల గుణం కలవి.

అరణ్యాలలో నివసించే ఋషులు - నగరాలలోని - పల్లెలలోని సాధారణ జనాలూ, నెయ్యి, నూనెలు వగైరా నిల్వచేసుకోవటానికి చెడిపోకుండా చాలాకాలం వుండటానికీ - పశు, మృగ

చర్మములతో చేసిన ఘటమువలె (ఆకృతిలో కుండవలె) వుండే "సిద్దెలు" (కుతుపములు) ఉపయోగించేవారు. ఇవీ - నిల్వవుంచే గుణమూ - కల్మషము చేరకుండానూ వుంచుతాయి. ప్రకృతి సిద్ధంగా లభించే రాతిచిప్పలు - రాతి సిద్దెలు - (ఈనాడూ మహారాష్ట్రలోని పల్లెలలో- దీపారాధనకు - దీపాల ప్రమిదెలుగా రాతితో మలచిన సిద్దెలు చూడవచ్చు.) ఆలయాలలోనూ వున్నాయి. ఇవి.) శిరిడీసాయి మందిరంలోనూ అక్కడక్కడా వున్నాయి.) పులుసు, చారులాటి ద్రవపదార్థాలు రాతి చిప్పలలో చేయటం - గత రెండు దశాబ్దాల క్రితం వరకూ కూడా మధ్య తరగతి కుటుంబాలలో వుండేది, పచ్చళ్లు, వూరగాయలు ఈ రాతి చిప్పలు (పెద్దవి) ల్లో పెట్టేవారు. ఎంత శెగ అయినా తట్టుకుంటాయి ఇవి. ఎంత శీతలతైనా కాపాడుతాయి..(ఆ తర్వాత జాడీలు - తర్వాత - అల్యూమినియం - ఇప్పుడు స్టీలు - వాడుకలోనికి వచ్చాయి.)

అమ్మవారి స్తనయుగం - ఆమె అమృత క్షీరధారలను నిల్వచేసే మాణిక్య కుతుపములుగా వర్ణించారు ఆచార్యులవారు. యుగాల పర్యంతం ఆ అమృతం చెడిపోదు రుచి తరగదు. కల్మషం అంటదు, రోగ నిరోధకశక్తి కలిగివుంటుంది. అని! పర్వతాలలో మాణిక్యాలూ, పద్మరాగ మణులు, పుష్కలంగా లభిస్తాయి. వాటి గనులు వుండేది పర్వతసానువులలోనే గనుక! పర్వత రాజపుత్రి అయిన పార్వతి - దేహం సహజంగా మాణిక్య - పద్మరాగ మణులవంటి సౌందర్యము, కఠినత్వమూ, విలువా, మహాత్మ్యము కలిగినది కావటంలో ఆశ్చర్యం ఏమున్నది ? కొత్త కొత్త అర్థాలూ, గూఢార్థాలు ఆలోచింప జేయటానికే ఈ "సమాసవ్యాస" పద్ధతి ఎన్నుకుంటారు మహాకవులు మహర్షులు! అంతే కానీ తీరికూర్చుని తాటాకులు (తాళపత్రాలు) వున్నాయి కదా అని - తమని తామే కాపీ కొట్టుకోవటానిక్కాదు వారి శ్రమ అంతా! ఒకే విషయాన్ని ఎన్ని కోణాలలో పరిశీలించవచ్చో, (ఒకే లెక్కను గణితంలో - పజిల్‌ను - వివిధ సంఖ్యలతో ఒకే జవాబు వచ్చేలా చేసే ప్రక్రియలానే) తెలియజెప్పేదే ఈ "సమాసవ్యాస" పద్ధతి, అమూల్య భావనా అక్షరమాల అది.

"ఆ(! ఒక్కసారివర్ణిస్తే చాలదా! ఈ రిపిటిషన్‌తో తలబద్దలు కొట్టాలా?" అనే ప్రబుద్ధులు - మనం రోజూ మాట్లాడే ఆత్మస్తుతి - పరనిందలలో - ఎన్నివేల రిపిటిషన్లు వున్నాయో లెక్కపెట్టుకో గలిగితే- అవి ఎవరి కోసం మాట్లాడుతున్నాము ? ఎందుకు మాట్లాడుతున్నాము ? తాత్కాలిక స్వార్థ ప్రయోజనాలకు అంత రిపిటిషన్ అవసరమా! అని మనకి మనమే ఆత్మ విమర్శ చేసుకోగలము. వాల్మీకి, వ్యాస - కాళిదాసాది మహర్షులు - మహాకవులంతా కాండలకు కాండలు

- స్కందాలకు స్కందాలు - స్తోత్రాలకు స్తోత్రాలూ - ఈ సమాస వ్యాసపద్ధతిలో చెప్పి - ఆయా కావ్యాలలోని లోతులను పంచేప్రయత్నం చేశారు. ఆచార్యుల వారూ అదే చేస్తున్నారు.

విఘ్నేశ్వర, కుమార స్వాములిరువురూ బ్రహ్మచారులుగా, బాలురుగా వుండిపోయారుట - తల్లి చనుచాల అమృతధారల నుండి తొలగి పోవటం ఇష్టంలేక - అనగా ఏమిటి ? జ్ఞాన క్షీరధారలవి. ఒకమారు ఆత్మజ్ఞానం - ఆత్మదర్శనం అయ్యాక - ఏ జ్ఞానీ, వివాహము, సంసారలంపటంలాటి వాటిల్లో చిక్కుకొనవలెనని ఆకాంక్షించడు. ఆ సుధాధారలతో మునకలు వేస్తుంటాడు.

వివాహం కానంతవరకూ - మగపిల్లలు - తల్లి చుట్టూరా తిరుగుతూ - తల్లే సర్వస్వంగా భావిస్తుంటారు. వివాహం అయ్యాక, వారిలో "స్త్రీ"ని గురించిన కొత్త కోణం అనుభవానికి వస్తుంది. బాల్యం - నిష్కపటత్వం, నిర్మలత్వం - మెల్లిగా తగ్గుతాయి. యవ్వనంతాలూకు కోర్కెలలో - వారి భావనలు కొంత మలినమౌతాయి. మరో కోణంలో స్త్రీ నిదర్శించిన వారు - తల్లితో మునపటి అంతచనువుగా మెసలలేరు. (ఆడపిల్లలు తండ్రి - అన్నదమ్ముల విషయంలో ఇదే అనుభవాన్ని ఎదుర్కొంటారు వివాహం అయ్యాక, మన సినిమాలలో చూపినట్లు, వివాహిత కన్యలు - చటుక్కున అన్నను - తండ్రిని గాఢంగా కౌగలించుకోలేరు. వివాహానికి ముందు - వారికా అనుభూతి తేడా తెలియదు గనుక - చనువుగా వుంటారు) కొద్దిగా, అంతేగానీ మన సినిమాలలోలాగా కౌగలించుకోరు. పెద్దవారూ అవకాశం - చనువూఇవ్వరు.

శ్రీ విద్యా అమృతమనే తల్లి చనుబాలను సుధారసాన్ని ఎన్నటికీ వదులు కోవటానికి ఇష్టపడని - విఘ్నేశ్వర కుమారస్వాములిద్దరూ వివాహమే వద్దనుకున్నారు. పసిబాలురుగానే వుండి పోవాలనుకున్నారు.

ఆ జగన్మాత నామామృత పానానికి దూరం కాకుండా మనమూ శిశువుల్లా ఆ తల్లి గుండెలలో ఒదిగిపోయి శ్రీ విద్యా - సుధారస పానంచేద్దాము. పదండిముందుకు.

## 74. శ్లో ॥ జగదంబ వక్ష స్థలంపై ఆభరణంగా వున్న ముత్యాల పేరుల సౌందర్యం.

74 శ్లో॥ వహత్యమ్బ స్తమ్బేరమ దనుజ కుంభ ప్రకృతిభిః
సమారబ్ధాం, ముక్తామణి భిరమలాం, హారలతికాం,
కుచాభోగో విమ్బాధర రుచిభి రన్తశ్శబ(లి)తాం
ప్రతా పవ్యామిశ్రాం పురదమయితుః కీర్తి మివతే!

**అర్థము :-** ఓ జగన్మాతా! పుష్టిగానూ, విశాలమైనదిగానూ (విరి విదనము గలదిగానూ) వున్న నీ స్తనముల మధ్య ప్రదేశములో ఒక అందమైన ముత్యాల హారమున్నది :

ఆ ముత్యాలహారానికి ఒక కధ వున్నది!

పూర్వం గజాసురుడనే రాక్షసుడు - ఘోరతపస్సుచేసి - శివుని మెప్పించాడు. "వరం కోరుకొమ్మని" ఈశ్వరుడనగానే - వాడు అతిస్వార్థంతో - "నీవు - ఆత్మలింగం రూపంతో నా ఉదరంలో నిల్చిపో!" అని కోరాడు! భోళా శంకరుడు - భక్త జన వశంకరుడు కదా! గజాసురుని పొట్టలో ఆత్మలింగంగా మారి కొలువై వుండిపోయాడు. కైలాసంలో ఈశ్వరుని ఎడబాసిన పార్వతి "నిరాకుల" అయిపోయింది. పురుషుని అండలేని స్త్రీగా - నిరాసక్తగా మారిపోయింది. బాధ పడింది. సోదరుడు అయిన శ్రీ మహా విష్ణువును - ఈశ్వరుని, గజాసుర గర్భ నిర్బంధం నుండి విముక్తుడిని చేసి - మరలా కైలాసంలో - తాను ఈశ్వరుడు - ప్రకృతి - పురుషులై వుండేలా అనుగ్రహించమని కోరింది. శ్రీ మహా విష్ణువుకు గజాసురుని బలహీనతలు) తెలుసు. అత్యంత శివ భక్తుడైన అతడు - వృషభాలను (ఎద్దులను) నందులుగా పూజిస్తాడు. గౌరవిస్తాడు. శివుని తాండవ నృత్యాన్ని నేర్చుకుని - చక్కగా నాట్యంచేసే గంగిరెద్దుల నాట్యం అతడికి చాలా ఇష్టం. అందుకే - విష్ణువు గంగిరెద్దులను ఆడించేవానిగా, నంది - గంగిరెద్దుగా - బ్రహ్మాది దేవతలు వాద్యకారులుగా - గజాసురుని వద్దకు వెళ్లి - చిత్ర విచిత్రంగా "గంగిరెద్దు" నాట్యం చేయించారు. ఆ కళకు మెచ్చిన గజాసురుడు - ఆబృందాన్ని - ఏమి కోరుకున్నా ఇస్తానని వాగ్దానం చేశాడు. అవకాశం దొరకగానే - నిజస్వరూపులుగా మారిపోయి - శివుని ఆత్మలింగం కావాలని కోరారు విష్ణువు, నంది మొదలైనవారు. మాటతప్పని తపోనిధి అయిన గజాసురుడు - సరేనన్నాడు. నందీశ్వరుడు - తనవాడి అయిన కొమ్ములతో ఆతడి ఉదరం చీల్చగా, ఆత్మ లింగరూపుడైన ఈశ్వరుడు - విముక్తుడై బయటకు వచ్చాడు. గజాసురుని భక్తికి - మెచ్చి - చివరికోర్కె కోరుకోమన్నాడు శివుడు, తన శిరస్సు - ముల్లోకముల చేత పూజింపబడాలని - ఈశ్వరుని ఉనికికి ఆటపట్టైన తన ఈ శరీరపు చర్మం - ఈశ్వరుని వస్త్రం కావాలనీ కోరుకున్నాడు. ఆ గజాసురుని చర్మం - పచ్చి చర్మం - వస్త్రంగా ధరించి "కృత్తివాసునిగా" కీర్తింపబడ్డాడు శివుడు. గజాసుర శిరస్సును - తనచేతిలో మరణించిన, పార్వతి చేసిన నలుగు పిండిబొమ్మ అయిన బాలకుని మృతదేహానికి అతికించి - ఆ బాలుని విఘ్నేశ్వరునిగా దీవించి - ముల్లోకాలూ - గజాసుర శిరస్సును - విఘ్నేశ్వర రూపంలో పూజించేలాచేశాడు శివుడు. ఇక గజాసురుడు శిరసుపై (కుంభస్థలంపై, నిరంతరం శివనామం జపించే శిరస్సు అది!) ధరించిన మంచి ముత్యాల

పేరు - ముప్పేట ముత్యాలహారం - మిగిలిపోయివున్నది. ఒక మహాభక్తుని శిరస్సుపై నున్న ఆభరణం అది! శివనామంతో పునీతమైన ముత్యాలు అవి! "మచ్చలు లేనివి అమలినమైన స్వచ్ఛమైన ముత్యాలు (లోపల మచ్చలున్న ముత్యాలు, మణులు మంచివీ స్వచ్ఛమైనవీ కావు. అందుకే మంచి ముత్యాలు, మణులూ కొనేటప్పుడు ఎక్కడా మచ్చ. (అంత శ్మబలాం) లేకుండా చూచిమరీ తీసుకుంటారు ముత్యాలు-రత్నాలు - మణులు పరీక్ష చేసే - వ్యాపారులు. రత్న పరీక్షకులు)! శ్లో ॥ గజకుంభేషు, వంశేషు, ఫణాసు, జలదేషు చ

శుక్తికాయా, మిక్షుదండే, షోడా మౌక్తిక సంభవః.

(గజ కుంభముల యందు, వెదురు గడలయందు - సర్ప పడగలయందు, మేఘములయందు, ముత్యపు చిప్పలయందు, చెఱకు గడలయందు - ఇట్లా ఆరు విధములుగా మంచి ముత్యములు జనిస్తాయి)

శ్లో ॥ గజ కుంభే కర్పూరాభాః, వంశే రక్తసితాః ః స్మృతాః

ఫణాసు వాసుకే రేవ నీలవర్ణాః ప్ర కీర్తితాః ॥

(గజకుంభజ నితముత్యములు చిత్ర వర్ణములు గలవి, వెదురు గడలయందు జనించినవి, తెలుపు, ఎరుపు కలిసిన వర్ణము (లేత గులాబిరంగు) గలవి, వాసుకి అనే సర్పజాతి పడగయందు జనించిన ముత్యములు, నీలవర్ణము గలవి)

శ్లో ॥ జ్యోతిర్వర్ణాస్తు జలదే, శుక్తి కాయాం సితాస్మృతాః

ఇక్షుదండే పీతవర్ణాః, మణయో మౌక్తి కాస్మృతాః ॥

(మేఘములయందు జనించిన ముత్యములు, జ్యోతిర్వర్ణములు అనగా, మెరుపులయందు జనించిన ముత్యములు, జ్యోతిర్వర్ణములు అనగా, మెరుపు తీగెవంటి కాంతి గలిగినవి! ముత్యపు చిప్పలయందు జనించిన ముత్యములు - తెల్లని కాంతి గలిగినవి. చెఱకు గడలయందు జనించిన ముత్యములు (పీతవర్ణము) పసుపుపచని వర్ణము కలిగినవి.)

ఈ ముత్యముల వివరాలులోగా శ్లోకాలలో తెలుసుకున్నాము కదా ?

ఆహారాన్ని - తన భక్త జన వశ్యతకు - తన భోళా తనానికీ, గజాసురునిపై తన విజయానికీ - చిహ్నంగా - భార్య అయిన పార్వతి మెడలో వేశాడు పరమ శివుడు. ఆహారం ఆమె వక్ష స్థలమధ్య ప్రదేశంలో - అందంగా వున్నది.

ఆమె అనుక్షణం తన భర్త యొక్క వీరగాధలకు - భోళా తనానికి ఆనందిస్తూ, అంతటి యోగీశ్వరుని భర్తగా పొందిన తన అదృష్టానికి కించిత్ గర్వపడ్తూ, స్త్రీ సహజమైన అతిశయ

భావం కలుగగా, ఆమె కన్నులలో మెరసిన దరహాస రేఖ - పెదవులపైకి ప్రాకి, - ఆ ఎరుపుదనంతో కూడిన చిరునవ్వు - ఆ మంచిముత్యాల పేరులో ప్రతిఫలింపగా, అవీ లేత ఎరుపుగా కనపడుతున్నాయి. అమ్మవారి శృంగార భావాన్ని ఆ ముత్యాలు ప్రతి ఫలిస్తున్నట్లున్నాయి. పింక్ సిటీగా పేరొందిన జైపూర్‌లో అడుగుపెడుతూనే - వాతావరణమంతా - మనమూ లేత గులాబిరంగులో వున్న అనుభూతి కలుగుతుంది. సరిగ్గాఇలాగే - అమ్మవారి ఆనందం. శృంగారం - ఆమె పెదవుల ఎరుపు, ఈశ్వరుని కీర్తి - ఎఱ్ఱగా ఆ ముత్యాలలో ప్రతిఫలించాయి.

అహో ( ! ఎంతటి అద్భుత ఊహ! దర్శనం!

ఆచార్యుల వారు - తన్మయత్వంతో ఆహారాన్ని దర్శించి - మనందరికీ దర్శింప జేసారు!

భర్త విజయం - భర్త సాన్నిధ్యం - నిరంతరం కోరే ఆ జగన్మాత ఆ భర్త కీర్తిని - తన ముత్యాల హారంలోనూ ప్రతిబింబింప జేసింది.

## 75వ శ్లో ॥ స్తన్యము

## జగన్మాత అపార దయారస ప్రపూరిత స్తన్య ప్రభావము.

**75 శ్లో॥ తవ స్తన్యం మన్యే, ధరణీధర కన్యే (తుహినగిరి కన్యే!) హృదయతః**
**పయః పారావారః, పరివహతి సారస్వత మివ,**
**దయా వత్యా దత్తం ద్రవిడ శిశు రాస్వాద్య తవయత్,**
**కవీనాం ప్రౌఢానామ జని కమనీయః కవయితా**

**అర్థము** :- ఈ శ్లోకంలో శ్రీ ఆది శంకరాచార్యులవారు, జగన్మాతయొక్క స్తన్యపానం యొక్క మహాత్మ్యాన్ని, మహత్తత్వాన్నీ అద్భుతంగా వర్ణించారు.

**అర్థము** :- తల్లీ! జగన్మాతా! నీ స్తన్యమునందు పుట్టిన, నీ హృదయమునందలి క్షీర సముద్రము నుండి పెల్లుబికిన "దయ" అనే అమృతధారల యొక్క ప్రవాహము, సరస్వతీ నదివలె శుద్ధస్ఫటిక సంకాశ కాంతులతో (క్షీరము తెల్లగా వుంటాయి గనుక) వున్నవని తలుస్తాను. అవి త్రాగిన ద్రవిడ శిశువు ( నేను, తిరుజ్ఞాన సంబందర్‌ల వారూ - ఇద్దరమూ) ఆ అమృతధారలు త్రాగిన మహాత్మ్యము వలన, ఆనీ క్షీర మహిమవలన, అతిరమణీయమై, మృదుమధురమైన రచనా సామర్థ్యముగల కవిగా మారెనో కదా ?

ఆది శంకరాచార్యులవారు ఈ శ్లోకంలో తల్లి (జగన్మాత) స్తన్యపాన మాహాత్మ్యమును - స్వానుభవంతోనూ - తనకు తెలిసిన కథతోనూ కలగలపి గూఢంగా వర్ణించారు. మొదటిది

స్వానుభవం, అది శంకరాచార్యులవారు పసితనంలో ఐదు సంవత్సరాల బాలుడుగా వున్నపుడు - జరిగిన సంఘటన! - శంకరుల తండ్రి శివగురు - తల్లి ఆర్యాంబ. ఇద్దరూ పరమశివ - దేవీభక్తులు, రోజూ శివాభిషేకము - శివార్చన అమ్మవారిపూజ చేసేవారు, ఒకరోజు శివగురు, గ్రామాంతరం వెళ్తూ, ఆర్యాంబను దైవపూజా కార్యక్రమం నిర్వహించమని చెప్పివెళ్లాడు. దురదృష్టవశాత్తూ లేక శంకరుల అదృష్టవశాత్తూ ఆమె - బహిష్టు అయి పూజా కార్యక్రమం నిర్వహించటానికి వీలుపడనందువలన - బాలుడైన శంకరునికి ఆ పని అప్పగించింది. తల్లి చెప్పిన విధంగా, తండ్రిరోజూ చేసేపూజా విధానం చూస్తూన్నాడు గనుకా, శంకరులు - పూజ పూర్తిచేసి, అమ్మవారికి "పాలు" నైవేద్యంగా పెట్టాడు. అవి అమ్మవారు తాగుతుందనీ, ఆ తర్వాతరోజూ తండ్రి - తనకు మిగిలినపాలు అమ్మవారి ప్రసాదంగా ఇస్తాడనీ ఆ బాలుని భావన. అట్లాగే అమ్మవారిని పాలుత్రాగమని కోరాడు. జగన్మాత రాకపోయేసరికి - ఏడుస్తూ - తలబాదుకో సాగాడు. జగన్మాత ఆ బాలుని అమాయక భక్తికి మెచ్చి, దిగి వచ్చింది. పాలుతాగింది. ఖాళీ పాలచెంబు తిరిగిఇచ్చింది. కానీ - ఆకలితోవున్న శంకరులు - తనకు పాలుమిగిల్చి ఇవ్వలేదేమని మరల ఏడుపు ప్రారంభించాడు. ఏమీ చేయటానికి తోచని జగన్మాత తన స్తన్యము (చనుబాలు) ఆ పాల చెంబులోనికి పిండి ఇచ్చింది. అవిత్రాగిన శంకరులు - ఆ క్షణంనుండే - అపరిమిత మధుర కవితా ఝురి - లోనుండి పెల్లుబికి రాగా, స్తోత్రం చేశాడు అమ్మవారిని, అమ్మవారి దీవెనలందుకుని - ఆది శంకరులుగా, జగద్గురువుగా మారారు, అతి పిన్నవయములో, ఆ సేతు హిమాచలం పర్యటించి - కొన్ని వందల స్తోత్రములు ఆశువుగా చెప్పి - ఆ స్తోత్రములకు - వేద పఠన మహాత్మ్యాన్ని - సిద్ధులనూ, జ్ఞానాన్ని, ఆపాదించగలిగిన - మహోన్నత కవి - పరమగురువు అయ్యారు. శ్రీ చక్ర స్థాపనలు, అమ్మవార్ల ఉగ్రరూప ఉపసంహారణలూ చేయగలిగిన, అపర శంకరావతారం అయ్యారు. ఈయనే - ఆద్రవిడ శిశువు.

ఇక రెండవ ద్రవిడ శిశువు. సంబంధర్,

మూగవానిగా జన్మించిన సంబంధర్ - తల్లితండ్రులకు పెద్ద సమస్యగానూ, ఆవేదన గానూ మిగిలిపోయాడు. పరమ శివభక్తులూ, దేవీ భక్తులూ అయిన సంబంధర్ తల్లి తండ్రులు - తమకు ఇలా మూగ బిడ్డడిని ప్రసాదించాడేమిటా పరమశివుడు - జగన్మాత అని రాత్రింబగళ్లు ఆవేదన చెందసాగారు.

ఒకరోజు సంబంధర్ తండ్రి - 5 సం॥ వయసుగల తన కొడుకు సంబందర్‌ను వెంటబెట్టుకుని, అమ్మవారి దేవాలయానికి వెళ్లి, కోనేటి గట్టుపై -(మెట్లపై) బాలుణ్ణి కూర్చోబెట్టి - తాను కాస్సేపటిలో వస్తాననీ - అక్కడే కూర్చుని వుండమనీ చెప్పి - తనకు తెలిసిన వారికి ఒకరికి -

బాలుని చూస్తుండమని చెప్పి - వెళ్లాడు. ఆ తెలిసిన వ్యక్తి - పిల్లవాడు కూర్చునివున్నాడు లెమ్మని - కోనేరులో స్నానం చేయటానికి వెళ్లిపోయాడు.

తండ్రి అటువెళ్లగానే సంబందర్ - కోవెల వైపు నడిచాడు. పెద్ద ఉత్సవం జరుగుతోంది అమ్మవారికి,! భక్తులతో ఆలయం కిట కిటలాడిపోతోంది. ఆలయగర్భ గుడిలో ప్రవేశించిన ఈ బాలుడు - నడిచి - నడిచి అలసిపోయి - గర్భ గుడిలోనే ఒక మూలపడుకుని నిద్రపోయాడు. రాత్రి - పూజారులు గుడి తాళంవేస్తూ ఈ పిల్లవాడిని గమనించలేదు.

అర్ధరాత్రి మెలకువ అయిన ఆ బాలుడు - ఆకలివేసి - ఏడవసాగాడు. మూగపిల్లవాడు మాటలురావు - జగన్మాత విగ్రహం వద్ద ఆ తల్లే - తల్లిగా భావిస్తూ - ఆకలి అంటూ సైగలు చేస్తూ ఏడవసాగాడు. జగన్మాత మనసు కరిగిపోయింది. తల్లి హృదయం దయా పారావరంతో (దయ అనే క్షీరంతో) ఆర్ద్రమయిపోయింది. పసిడిగిన్నెలోకి - తనస్తన్యం - పిండి - పిల్లవాడి శిరసు నిమురుతూ - త్రాగమన్నది. అతడు త్రాగేశాడు.

అంతే! మరుక్షణంలో - ఆ బాలుని నోటివెంట మాట లేమిటి ? అద్భుతమైన కవిత్వం గంగాఝరిలా, క్షీర సముద్రంలా, తేనెల సోనల్లా పెల్లుబికింది.

తెల్లవారి ఆలయపూజారులూ - భక్తులూ వచ్చేశారు. అద్భుత కవిత్వంతో అమ్మవారిని స్తోత్రంచేస్తున్న బాలుని చూశారు. దిగ్భ్రాంతిపొందారు. ఈ లోగా సంబందర్ తండ్రి - బిడ్డడికోసం వూరు వూరంతా గాలించాడు. భయపడిపోయాడు, బాధపడ్డాడు తెల్లవారి జనమంతా వింతగా ఐదేండ్ల బాలుడు - అద్భుత స్తోత్రాలతో అమ్మవారిని కీర్తిస్తున్నాడని విని - ఆలయంకేసి పరుగుతీశాడు.

తాను చూస్తున్నది - తన మూగవాడైన కొడుకునేనా? నిన్నటివరకూ మాటలు రాని ఈ బాలుడు - తెల్లవారేసరికి, అద్భుత కవిత్వంతో స్తోత్రాలు చెబుతున్నాడు. "తిరుజ్ఞాన సంబందర్" అని జనమంతా జేజేలు కొడుతున్నారు!

సంబందర్ దగ్గరకు వెళ్లి - జరిగినదేమిటో తెలుసుకున్నాడు. కుమారుడి నోటిదగ్గరా, పెదవుల ప్రక్కగా ఇంకా ఆ జగన్మాత ఇచ్చిన పాలుత్రాగిన చార. పాలచార వుంది. ఆ బాలుని నోరు - ఆ జగన్మాత తాంబూలాన్ని గురించి - పురాణాలలో వర్ణించినట్లుగా అద్భుత. పరిమళము. పచ్చ కర్పూరము - ఏలకులు - మొదలైనవన్నీ కలగలపి జగన్మాత సేవించే తాంబూలపు దివ్య పరిమళము అనగా - ఆమె నోరు జిహ్వా - దంతములు - వేదములకు నిలయములు - సరస్వతికి నివాస స్థానములు అక్షర వాఙ్మయానికి - గానకళకూ - అష్టాదశపురాణాలకూ, దశ విద్యలకూ నిలయాలుగనుక, దిగంతరాలకు వ్యాపిస్తుందా తల్లి తాంబూల చర్వణ పరిమళము

- ఆపరిమళం - ఈ బాలుని నోటిలో నుండి వస్తున్నది ... ఆ జగన్మాత "దయ"అనే చనుబాలు త్రాగిన ధన్యుడు ఈ బిడ్డడు - "తిరుజ్ఞాన సంబందర్" ద్రవిడ శిశువు.

ఇలా - ఇద్దరు ద్రవిడ శిశువుల అమృత కవిత్వ ఝురికి, కారణభూతమైన జగన్మాత స్తన్యం - (దయాయః పారావారః) దయ అనెడి క్షీర సముద్రం - గ్రోలిన ఆది శంకరులు స్వానుభవంతో, సాధికారికంగా శలవిచ్చారు.

మనమూ - ఆ తల్లి స్తన్యాన్ని - మానసికంగా గ్రోలటానికి ప్రయత్నిద్దాము. అది ఆ తల్లి చరణములకు శరణా గతి చెందినపుడే సాధ్యము. అదీ ఎలా ? పసిబిడ్డల్లా! అవునా!

## 76. శ్లో ॥ జగన్మాత నాభిరోమావళి నూగారు - వైభవము.

**76 శ్లో॥ హరక్రోధ జ్వాలావళిభి రవలీఢేనవ పుషా**
**గభీరేతే నాభీసరసి కృతసఙ్గో మనసిజః**
**సముత్తస్థౌతస్మా, దచలతనయే! ధూమలతికా!**
**జనస్తాం జానీతే, తవజనని! రోమావళి రితి ॥**

**అర్థము :-** ఓ అచలపుత్రీ! (పర్వతరాజపుత్రీ!!) పార్వతీ! జగన్మాతా! హరునిక్రోధాగ్ని జ్వాలలచే చుట్టుముట్టబడిన మన్మధుడు - ,గంభీరమైన నీ నాభిసరస్సు, నందు దూకి, తన శరీరాన్ని - ఆ ముక్కంటి మంటల బాధచే - చల్లార్చుకొన్నాడు. అప్పుడు నీ నాభిసరస్సు నుండి జనించిన పొగనే (అనగా - మండుతున్న మన్మధుడు - అమ్మవారి నాభి అనే సరస్సులో దూకగానే - నిప్పు - నీటిలో పడగానే పైకి పొగలెగ జిమ్మినట్లుగా) జనులు నీ "నూగారు" (సన్నని రోమములుగా) భావిస్తున్నారు.

శ్రీ ఆది శంకరాచార్యులవారు ఈ శ్లోకంలో - అమ్మవారి నూగారు వైభవం వర్ణించారు. తల్లి నాభిని వర్ణించమేమిటి ? అనుకోవచ్చు.

ఇక్కడే - జగన్మాత విరాట్‌రూపం దర్శించమని జగద్గురువులు పరోక్ష బోధ చేస్తున్నారు.

॥ నాభీస్తన భర నాభీదేశం,
దృష్ట్వా మాగా, మోహావేశమ్!
ఏతన్మాంస వసాది వికారమ్.
మనసి వించిన్తయ వారమ్ వారమ్ ॥

భజ గోవిందం! భజ గోవిందం - గోవిందం భజ మూఢమతే! అనే మకుటంతో "ద్వాదశమంజరికాస్తోత్రమ్" "గా భజ గోవింద శ్లోకాలను అబాల గోపాలనికీ - అందించి,

కొండంత వేదాంతాన్ని ఆ చిన్ని శ్లోకాలలో పొందుపరచి - పాడుకుంటూ - వేదంతా సారాన్ని గ్రహించగలిగేటట్లు రచించిన పరమగురువు ఆది శంకరాచార్య, "స్త్రీ యొక్క స్తనములు - నాభి ప్రదేశములను చూచి మోహా వేశులై- సంసారలం పటములలో చిక్కుకొనే జితేంద్రియత్వంలేని - బ్రహ్మాచారులారా! (ఆధ్యాత్మిక బాటలో సాగిపోతూ పతనమయ్యే వారికి - (గృహిణీ గృహస్తులకు కాదు)

"ఏతన్మాంసవసాది వికారం ...

అవి - కేవలం - మాంసము - కండలు యొక్క ఆకారాలు.

"మనసి వించిన్తయ వారం వారం."

పదే పదే మననులో తర్కించుకొనండి - తొలగిపొండి!" అని హెచ్చరించిన మహానుభావుడాయన. మరి ఆయన - అమ్మవారి నాభిని - నూగారునూ వర్ణించటమేమిటి ? ఇదే మంత్ర శాస్త్ర రహస్యం. అమ్మవారి మంత్ర శరీరరూప నిగూఢ వర్ణన. మన్మధుడు - అంటేనే కోర్కెల పుట్ట. ఎడతెగని కోర్కెలే కామునిరూపం: "కామం" అనేవే కోర్కెలు. వాటికి అంతంలేదు, విచక్షణాజ్ఞానం లేదు - అగ్నితో సమానమై మనల్నీ - మన అసంతృప్తితో మన ప్రక్కనున్న వారినీ కూడా దహించివేస్తాయి!

ఆ మన్మధుని - ఈశ్వరుడు తన ముక్కంటి మంటలతో దహించివేశాడు! ఆ మంటలు శరీరానికి చుట్టుకోగా, బాదతో, శరీరం కాలిపోతుండగా, దిక్కుతోచక పరుగెత్తి జగన్మాత "నాబి" అనే సరస్సులో దూకేశాడు. ఆ నీటిలో పడటంవలన - నిప్పుచల్లారింది - కానీ పైకి లేచిన పొగ అమ్మవారి నాభి చుట్టూరాగల "నూగారు" అనే భ్రాంతి కలుగజేసింది.

"నాభి" లోతుగా వుంటే స్త్రీలకు సౌభాగ్యం అనీ - డబ్బు నిలవ వుంచగల పొదుపు కలిగి వుంటారనీ - పెద్దలు చెబుతుంటారు.

నాభిని సరస్సుతో పోల్చుతారు. ఎందువలన? ఇది - జలచక్రం అయిన "మణిపూరక" చక్రానికి చిహ్నం మనిషిలోని షట్చక్రాలలో, మణిపూరక చక్రం నాభిస్థానం. మన్మధుడు మండిపోతూ - అమ్మవారి నాభిలో - నాభి అనే సరస్సులో దూకటం అంటే గూఢార్థం ఏమిటంటే - అంతులేని కోర్కెలు దహించి వేస్తుండగా, అవి ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధంగా నిలువగా, సాధకుడు - భక్తుడు - దిక్కుతోచక - అమ్మవారి మంత్రజపంతో, స్తోత్రంతో, భగవన్నామంతో, సాధనతో మణిపూరక చక్రంలో శ్వాసను నిలిపి - ఆ కోర్కెల అగ్నిని చల్లార్చుకోవాలి. అప్పుడే దేవీ ఉపాసకులకు ఆ తల్లి కరుణతో అర్థంలేని అగ్నిలాంటి కోర్కెలను జయించే శక్తి వస్తుంది. ఆ తల్లి ప్రసాదిస్తుంది. ఈ చక్రంలోనే "మధ్యమా" రూపమైన "నాదం" జ్ఞాననాదానికి

అంకురార్పణ జరుగుతుంది. సాధకులు, ఉపాసకులు - దేవీభక్తులు - ఈ చక్రంలోనికి ప్రవేశించినపుడే - ఒకానొక వైరాగ్య స్థితికి - జ్ఞానస్థితికి చేరుకోగలుగుతారు. అంతేగానీ అమ్మవారి నాభిలోనికి - మన్మధుడు ఎలాదూకాడు ? ఎలా ఇమిడాడు ? అనే కుతర్కాలు చేయరాదు. ఆ కోర్కెల అగ్ని చల్లారాక - సాధకులు మరోమెట్టు పైకి పోగలుగుతారు. ఆధ్యాత్మిక సోపాన అధిరోహణలో! ఇక నూగారు. నాభి చుట్టూరా నూగారు (సన్నని రోమావళి) వుంటుంది. అది - ఆ అగ్నిచల్లారిన పొగలా కనిపించింది అంటే - ఎక్కడ జలతత్వం - (శరీరంలో) వుంటుందో అక్కడ నూగారు రోమాలు - వుంటాయి. అవీ కోట్లాది కోర్కెలకు ప్రతి రూపాలు మానవ శరీరంలో! అందుకే "అబ్బో! వారి కోర్కెలా! తల వెంట్రుకలన్ని వున్నాయండోయ్!" అంటుంటారు గమనించండి. అంతులేని కోర్కెలకూ - లెక్క తెలియని రోమాలకూ - సామ్యం ఇలా ఏర్పడింది.

అమ్మవారి మంత్ర శరీరం భావనచేస్తూ - ఆ తల్లిని శరణు వేడినవారిని - ఆ తల్లి కోర్కెల అగ్నిగుండాల నుండి బయట పడవేస్తుంది. ఆ అగ్నిని శీతలపరుస్తుంది. అవునా ?

## 77 శ్లో ॥ అమ్మవారి రోమావళి (నూగారు) వైభవం.

**77 శ్లో॥ యదే తత్కాళింద్రీ తనుతర తరఙ్గా కృతి, శివే!**
**కృశేమధ్యే కిఞ్చి, జ్జనని! తవ యద్భాతి సుధియామ్!**
**విమర్దా దన్యోన్యం కుచకలశయో, రంతర గతం,**
**తనూ భూతం వ్యోమ ప్రవి శదివ, నాభిం కు హరిణీమ్ ॥**

**అర్థము :-** ఓ జగన్మాతా! యమునా నదీ తీర తరంగముల వలె (నల్లనై) సన్ననిదై, నీ నడుము మధ్యము నందు (నాభి దగ్గర) అగపడు రోమావళి (నూగారు) యనుచిన్న వస్తువును చూచి ఆలోచింపగా, అది - నీ కుచముల (స్తనముల) మధ్య ప్రదేశము శూన్యము అగు (ఆకాశమువలె) - ఆ నీస్తనముల రెండు ఒకదాని కొకటి ఒరసుకొనుటచే, ఆ ఒరిపిడికి ఆగలేక, నలిగి నల్లనై సన్నగా క్రిందికి నాభి వరకూ లక్కజారినట్లు జారినది అనిపించుచున్నది.

ఆది శంకరాచార్యులవారు ఈ శ్లోకంలో - మరలా అమ్మవారి నూగారును వర్ణిస్తూ - మంత్రరూప శరీర విరాట్ రూపదర్శనం చేయిస్తున్నారు.

జల స్వభావమైన మణిపూర చక్రంనుండి - హృదయం (అనాహతచక్ర) వరకూ గల ప్రదేశం శూన్యం - ఆకాశముతో సమానమైనది. ఇదే "దహరాకాశము" అంటారు మానవులలో ఇక్కడే మనమంతా మన మనసులో రేగిన మంచి చెడు ఊహలన్నిటినీ దృశ్యాలుగా, "వీడియో" లో వలె చూడగలుగుతాము. దైవానికి ఒకఆకృతి ఏర్పరచుకుని, మన ఇష్టదైవాన్ని ఇక్కడే ప్రతిష్ఠించుకుంటాము.

శ్రీ రమణ మహర్షులవారు చెప్పినట్లు "నేను!" అని "అహం"తో చూపించే ప్రదేశమూ ఇదే! ఈ "నేను" అనే భావము బలపడేది కూడా ఇక్కడే. "నీ వెవరు ?" అని ఎవరైనా మనలని ప్రశ్నించినపుడో, లేక "ఎవరక్కడ ?" అని ఎవరైనా గద్దించి అడిగినపుడో అప్రయత్నంగా అరచేయి గుండె మధ్య పెట్టుకుని "నేను .. నేనే!" ఇలా సమాధానమిస్తాము. అవునా ? ఆ మనచేయి అసంకల్ప ప్రతీకార చర్యలా "నేను" అనే జీవాత్మను, నేను అనే పరమాత్మను కూడా స్ఫురణకు తెస్తూ, పరమాత్మ స్థానాన్ని "ఇదీ" అని తెలియచెబుతుంటుంది. ఇదే చెప్పారు - శ్రీ రమణ మహర్షి. ఈ నేను అనే భావము- జగన్మాత స్తనముల మధ్య ప్రదేశంలో "అహం "అహంభావం' ' రూపంలో వుంది. సకల జీవరాశికీ - ముఖ్యంగా మానవులకూ, దానవులకూ, దేవతలకూ (ఇంద్రాది దేవతలు - మిగతాయక్ష, గంధర్వ విద్యాధర, నాగ -ఉరగ పన్నగ, గుహ్యక - మొదలైన దేవతా గణాలు) అందరికీ తల్లి తన అహంకారాన్ని కూడా పంచి ఇచ్చి - వారి వారి వ్యక్తిత్వాలకు ఎవరికి తగిన రూపురేఖల్ని - విలువలను, సంస్కారాలనూ ఏర్పరుస్తుంది. ఆ "అహం" భావము - "సోహం" గా మార్చుకొనటానికే అన్ని రకాల సాధనలూ, పూజలూ, జపాలూ, వ్రతాలూ - ధ్యానాలూ, యోగాలున్నూ!

నాభి వద్దగల "మణిపూరక" చక్రం నుండి - "కురుకుల్లాదేవి" అనే దేవత, నల్లని శరీరచ్ఛాయ కలిగి, బలిసిన శరీరంతో, యవ్వన మదముతో, రత్నములు తాపడం చేసిన పడవలో, రత్నములు పొదిగిన "తెడ్డు" తో, పడవను నడుపుతూ - అనాహత చక్రమైన హృదయం స్థానంలోని వాయుచక్రం వరకూ - మరలా మణిపూర చక్రం వరకూ క్రిందికీ, పైకీ తిరుగుతూవుంటుంది. ఇలా ఈ వర్ణన, కశ్యప శిల్పశాస్త్రంలోని "కురుకుళ్లా దేవి" శిల్పమూ, మూర్తి ధ్యాన శ్లోకంలోనూ వర్ణించబడివున్నది "రూపధ్యాన రత్నావళి" అనే శిల్ప శాస్త్ర గ్రంథంలో, ఈ దేవి సాధకుని చిత్తాహంకారానికి ప్రతిబింబం. అయినా ఈ దేవి సాధకుని తనతో బాటు (పడవలో) పైకీ క్రిందకూ తీసుకవెళ్తుంటుంది - నదిలో పడవ ఈవలి వడ్డుకూ, ఆవలి వడ్డుకూ ప్రయాణించినట్లుగా, ఈ రెండు చక్రాల మధ్య సాధకులు, ఉపాసకులు కొంతకాలం (వారివారి ధ్యాన నిశ్చలతను బట్టి) నిరంతర సాధనచేస్తే తప్ప, కోర్కెల అగ్నిగుండాలు, అహంకారం, కర్తృత్వాహంకారం ("నేను చేస్తున్నాను!") అనే అవరోధాలు దాటి సాధనలో పైకి వెళ్లలేరు. దీనినే ఆచార్యుల వారు అమ్మవారి స్తనముల మధ్యప్రదేశం "ఆకాశం" గానూ, (శూన్యం) అది ఆ తల్లి స్తనముల ఒరిపిడికి (సాధనవలన) లక్కవలె కరిగి జారి - సన్నని తీగెలా క్రిందకు జారి కాళిందీ నది (నల్లని నీరు) తరంగం వలె రోమరాజి (నూగారు) రూపుదాల్చినదనీ వర్ణించారు.

ఇంతటి మంత్రశాస్త్రాన్ని, చక్రరహస్యాన్నీ, ఒక్క శ్లోకంలోని గూఢంగా వర్ణించారు జగద్గురువు, అది మనం అర్థం చేసుకోగలిగితే - 'ఏమిటా ఈ వర్ణన ?" అని భయపడలేము బాధపడలేము. అవునా ?

# 78. నాభి వైభవము.

78 శ్లో॥ స్థిరో గంగావర్తః ,స్తనము కుళరోమావళి లతా
కలావాలం (కులావాలం) కుణ్డం, కుసుమ శర తేజోహుత భుజః
ర తేర్లీ లాగారం కిమపి తవనాభి, ర్గిరిసుతే!
బిలద్వారం సిద్ధే ర్గిరిశన యునానాం, విజయతే ॥

**అర్థము** :- ఓ తల్లీ! హిమగిరి పుత్రీ! పార్వతీ! జగన్మాతా! నీ నాభి చలనములేని గంగానది నీటి సుడిగానూ, పాలిండ్లనే పూ మొగ్గలకు ఆధారమైన రోమరాజియను తీగెయొక్క పాదుగానూ, మన్మధుని తేజస్స నెడు అగ్నికి హోమగుండముగను, మన్మధుని భార్య అగురతీ దేవికి శృంగార భవనముగను, నీ పతియగు సదాశివుని నయనముల తమస్సిద్ధికి గుహాద్వారమును అయి, అనిర్వాచ్యమై, అతిసుందరమై, సర్వోత్కర్షతో ప్రకాశించు చున్నది.

ఈ శ్లోకంలో ఆది శంకరాచార్యుల వారు అమ్మవారి నాభీ ప్రాశస్త్యాన్ని - ఎవరెవరి దృష్టికి ఎలా కనిపిస్తున్నదో వర్ణించారు. ఆ వర్ణనలోనే అంతర్గతంగా మానవ శరీర నిర్మాణంలో "నాభి' ' స్థానానికి ఉన్న ప్రత్యేకతను ఒక భిషగ్వరుడు (డాక్టరు.) శరీర శాస్త్రం (అనాటమీ) తన విద్యార్థినీ విద్యార్థులకు భోధించినంత నిష్కపటంగానూ, నిర్మలంగానూ - విద్యే - భోధనేధ్యేయంగా చేసే గురువులానూ తెలియజెబుతున్నారు మనందరికీ గమనించండి. మానవశరీరంలో "నాభి" స్థానం శరీరంలోని ఊర్ధ్వలోకాలకూ - (నాభిపై నున్నవి ఊర్ధ్వలోకాలు అంటారు మహర్షులు) అధో లోకాలకూ (నాభి క్రిందనుండి పాదాల వరకూ శరీరం అధో లోకాలు అంటారు మహర్షులు మహాత్ములూ) సరిహద్దు రేఖలాటిది. నాభి, నడుమూ - ఒకదానికొకటి అతిసన్నిహితమైనవి. మానవుల పొట్ట (ఉదరము) ఆహారానికీ, జీర్ణప్రక్రియకూ, శిశువును ధరించటానికి (స్త్రీలకు) ఉపకరించే శరీర భాగం అయితే, పొత్తికడుపు మూత్రపిండాలకు, "పెల్విక్ బోన్స్" అనబడే తొడల ఎముకలకూ - ఆధారము - జననాంగములు, గుదస్థానము మూలాధార, త్రికోణ చక్రాలకు ప్రతిబింబములు. ఈ మూలాధారం వద్దే - కుండలిని శక్తి కేంద్రీకృతమై వుంటుంది. దీనిని చైతన్య వంతంచేసి జ్ఞాన పధంవైపు నడపటమే సాధన - ఇదే ధ్యానం - యోగం. పూజ - వగైరాలన్నిటికీ లక్ష్యం, ఈ మూలాధార శక్తే అమ్మవారి కుండలినీ రూపం.

అందువలననే, సృష్టికోర్కెలు సఫలీకృతమయ్యే నాభిని చలనంలేని - స్థిరంగా వున్న గంగానది నీటి "సుడి" గా వర్ణించారు జగద్గురువు. వర్తులా కారంలో, లోతుగా, సుడి తిరిగినట్లు, (నూగారుతో) వుండే "నాభి" ఇది.

ఇక స్తనాలు అనే పూ మొగ్గలకు ఆధారమైన రోమరాజి (నూగారు) అనే తీగె యొక్క పాదుగానూ వర్ణించటంలో హృదయస్థానంలోని పరమాత్మ స్వరూపాన్ని సాధనతో మణిపూరక చక్రం అయిన జలచక్రంలో (నాభి) పాదు కొలిపి - (తీగె మొక్కను చక్కగా నాటినట్లు - జాగ్రత్తగా పైకి అల్లించినట్లు) - మొక్క చక్కగా ఎదగటానికీ ఉపకరించే సాధనా "పాదు" గా ని గూఢంగా వివరించారు.

ఈ నాభిదేశమ్ - (స్త్రీ పురుషులకు - సృష్టి కోర్కెలను పెంపొందించేది గనుక - ఇది మన్మథుని "తేజస్సు" "గర్వం" అనే అగ్నికి హోమగుండంగానూ - మానవులపై మన్మథుడు విజయం సాధించినపుడు - ఆతని భార్య అయిన రతీదేవి భర్తతో బాటు విహరించే - విలాస భవనంగానూ ఈ నాభి వున్నది. పరమశివుని నయనములకు - శృంగార రస సిద్ధికి గుహద్వారం, బిలద్వారంగానూ వున్నదనంటంలో అర్థం ఒక కథ వున్నది. తారకాసుర సంహారానికి గానూ, పరమేశ్వరుడు వివాహితుడయ్యాడు. ఇక కుమారస్వామి జన్మించాలి - తారకుని వధించాలి. ఒక అసురుని అంతమొందించటానికి గానూ, ఒక దైవానికి జన్మ ఇవ్వవలసిన పార్వతీ పరమేశ్వరుల ప్రణయానికి - రహస్య విహారానికి - ఇది గుహాద్వారంగా, బిలద్వారంగా అమరినది, అనిర్వాచ్యము, అతి సుందరమూ అయి ఒప్పుచున్న అమ్మవారి "నాభి" - నూగారు ఇంతమంది దృష్టికి ఇన్ని విదాలుగా దృగ్గోచరమౌతూ, మనబోటి మానవులందరికీ, జగన్మాత విరాట్‌రూప దర్శనమూ, మంత్రరూప శరీర దర్శనమూ, చేయిస్తూ, ఆ తల్లిని శరణువేడమని బోధిస్తున్నది, మూలాధారం నుండి, మణిపూరక చక్రంవరకూ సాధన నిర్విఘ్నంగా సాగించిన సాధకులకు - ఎన్నో సిద్ధులు వస్తాయి. ఆ సిద్ధులను ప్రదర్శించటమూ, స్వార్థానికి ఉపయోగించుకోవటమూ చేస్తే - ఆ సాధకుని పతనం అంతత్వరగానూ జరుగుతుంది. అలాగాక, ఆ సిద్ధులను లక్ష్యపెట్టక - జగన్మాత "నాభి" అనే చల్లని గంగానదిలో మునకలు వేసి - ఆ తీగె ఆధారంగా పైకి పైకి అమ్మవారి - స్తనయుగ్మం వరకూ (అనాహతం - హృదయస్థానం) మెల్లిగా సాధనతో చేరుకోగలిగిన సాధకులు - ఆ తర్వాత - విశుద్ధి, ఆజ్ఞా చక్రాలను తేలికగా దాటగలరు.

నాభి ఒకహెచ్చరిక.

నాభి - సాధనాసరస్సు.

నాభి - కోర్కెలుఅనే అగ్నిని చల్లార్చే - అమృత సరస్సు.

కోర్కెల సుడిగుండాలు - అగ్నిగుండాలను ఏర్పరచే హోమగుండం కూడాను. ఇదే మన్మథుని గర్వం - తేజస్సు అనే అగ్ని. ఇన్ని భావాలు - "సమాసవ్యాసం" పద్ధతిలో భోధించారు ఆచార్యులవారు. ఒకే విషయాన్ని వివిధ ధృక్పధాలతో, వివిధ కోణాలతో చెప్పేదే "వ్యాసము' ' (వ్యాస పద్ధతి)

ఒకే విషయాన్ని - ఒకే విధంగా వర్ణిస్తూ - (శ్రోతల - పఠితల - తలకు బాగా ఎక్కేలా వివరించే పద్ధతే "సమాసము" (సమాసపద్ధతి.) మానవులమైన మనం - మన నిత్యజీవిత పరుగులలో చాలా విషయాలు త్వరత్వరగా మార్చిపోతుంటాము. ముఖ్యంగా మరిచిపోయేవి - మరపుకు వచ్చేవీ - వేదాంతవిషయాలే! అందువలననే - మహాత్ములు - మహర్షులూ - కొన్ని విషయాలు పదే పదే చెబుతారు. ఆ పనే చేశారు ఆచార్యులవారు - నాలుగు శ్లోకాలలో అమ్మవారి "నాభి" ని వర్ణించి! అవునా. ఇంకా మరిచిపోతే అది మన అవివేకమే గానీ - మరొకటికాదు. జగద్గురువుల తప్పుకాదు!

## 79 శ్లో ॥ అమ్మవారి నడుము.
## (మధ్యము) - వైభవము.

**79. శ్లో॥ ని సర్గ క్షీణస్య స్తనతట భరేణ క్లమ జుషో**
**నమన్మూర్తే, ర్నా రీతిలక శనకైస్త్రుట్యత, ఇవ,**
**చిరంతే మధ్యస్య త్రుటిత తటినీ తీర తరుణా**
**సమావస్థా స్థేమ్నో భవతు కుశలం, శైలతనయే!**

**అర్థము :-** ఓ తల్లీ! జగన్మాతా! శైలరాజపుత్రీ! ఓ నారీ తిలకమా! స్వభాముగనే (సహజముగనే) కృశించినదియు, పాలిండ్ల భారముచే బడలినదియు, వంగిన ఆకారము కలదియు, మెల్లగా తెగుచున్నదో (శనకైస్త్రుట్యత) యను నట్లున్నదియు, ఒడ్డు విరిగిన ఏటి గట్టునందలి చెట్టువలె - "తుల్యమైన ఉనికి" నందున్నది యునగు, నిలకడ గల నీ నడుమునకు, చిరకాలము కుశలము అగుగాక!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి నడుము (కటిప్రదేశం) యొక్క వైభవం, సౌందర్యం వర్ణించారు.

స్త్రీ నడుము స్త్రీకి గొప్ప అందం. సన్నగా (కృశమధ్య) వుండే స్త్రీ నడుము. అటు ఆమె పై శరీరానికీ, క్రింది శరీరానికీ, గరిమనాభి రేఖ వంటిది. స్త్రీ నడక తిన్నగా, స్థిమితంగా, అందంగా వుండాలంటే ఆమె నడుము ధృఢంగా వుండాలి. సన్నగానూ, అందంగానూ వుండే నడుము స్త్రీ సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తుంది. (అయితే కాన్పుల తర్వాతా, వయసు పెరిగే కొద్దీ నడుములా వెక్కి, చుట్టు కొలత తప్పని సరిగా పెరుగుతుంది. వ్యాయామాలు కొద్దిగా తగ్గిస్తాయేగానీ -

పూర్తిగా తగ్గించలేవు.) ఇలా త్వరగా నడుములా వెక్కి పోకుండా వుండటానికే పూర్వకాలం స్త్రీలు (మన అమ్మమ్మలూ బామ్మలూ - అమ్మలూ కూడా) ఆర్థిక స్థితి బాగున్నవారు బంగారు వడ్డాణాలూ - ఆర్థికస్థితి ఎక్కువగా లేని వారు వెండివడ్డాణాలూ ధరించేవారు. నడుముకు గట్టితనాన్ని, సపోర్టునూ, నడుము నొప్పి, వెన్నునొప్పి రాకుండా అవి నియంత్రించేవి. ఆభరణాలుగానూ, అలంకారాలుగానూ, అవసరమైన సమయంలో ఆర్థికంగా ఆదుకొనేవిగానూ వుండేవి ఆ ఆభరణాలు! అలాగే బాలింతలైన స్త్రీలకు నడుముకు గట్టిగా గుడ్డ బిగించి కట్టేవారు. రెండు మూడు నెలల వరకూ నడిచేటప్పుడు నడుము నొప్పి రాకుండా వుండటానికి! తద్వారా కాళ్లపై శరీర భారం ఎక్కువగా పడకుండా చూసేవారు. ఇప్పుడు సిజేరియన్ కాన్పులయుగం కనుక - ఒక్కొక్క కాన్పుకాగానే - ఆస్త్రీ నడుము బండి చక్రంలా పెరిగిపోతోంది - "నాకు నడుం నొప్పి- వెన్నునొప్పి" అనటం - ఆ లావు లావు భారీ కాయంగామారి. ఆ శరీరాన్ని మోసుకు పోవటమే భారమై - ఆలావు తగ్గటానికి వాకింగ్, జాగింగ్, వ్యాయామ సెంటర్లు, నడుమువద్ద చిన్న ఆపరేషన్‌తో "కొవ్వు" తీయించటం లాటి ఖరీదైన పద్ధతులూ వచ్చేశాయి. ఇదంతా ఏమిటీ అంటే - లావెక్కి పోతున్న నడుమును అదుపులో పెట్టేందుకు - వడ్డాణాలూ - అందని ధరలూ, జౌటాఫ్ ఫ్యాషన్లు, నడుము కట్టుగుడ్డ మోటు (పైగా ఆపరేషన్ అయికుట్లు దెబ్బతింటాయిగనుక) - ఏర్పడుతున్న అనర్థాలు. కలియుగ సమస్యలలో - ఇవీకొన్ని అయితే అమ్మవారి నడుము ఎలా వర్ణించారు ఆచార్యులవారు ? కోట్లాది బిడ్డలకు తల్లి అయిన ఆ జగన్మాత "కృశమధ్య." ఆమె పాలిండ్ల బరువుచేత (తన కోట్లాది బిడ్డలకు ఆహారం పంచిఇచ్చే అమృత (పయః పారావారః -) క్షీర సాగరాలు. గనుక ఆమె పాలిండ్లు - వాటి బరువు చేత - ఆమెసన్నని నడుము కొద్దిగా ముందుకు వంగింది. వర్షాకాలంలో ఉధృతంగా ప్రవహిస్తున్న నీరువలన - ఏటిగట్టు కొంత కొంతవిరిగి నీటిలో పడిపోగా, ఆ ఏటిగట్టున ఉన్న మహావృక్షం - కొద్దిగా ఒంగింది. అయినా, ఆ వృక్షం యొక్క గరిమనాభి నిలకడగా వున్నది గమక - ఆ వృక్షం అట్లా కాస్త ఒంగి వుంటుంది. అట్లా కనిపిస్తున్న ఆ తల్లి నడుముకు చిరకాలం కుశలం అగుగాక!" అని ఆచార్యులవారు ఆకాంక్షించటంలో - సకల చరాచరాల భారం వహిస్తున్న ఆ బ్రహ్మాండ కోటి జనని యొక్క నడుము - పైకి - ఏడులోకాలూ, క్రింద ఏడు లోకాల భారం సమంగా వహించాలి కదా! ఏమాత్రం అలసట చెందినా మరింతగా వంగినా, నడుము నిలబడ లేకపోయినా సర్వలోకాలూ అతలాకుతలం అయిపోతాయి మరి!

ఈ వర్ణన ప్రకృతిలో తాధ్యాత్మ్యం చెంది - ప్రకృతి రూపిణిగా జగన్మాతను దర్శించగలిగిన మహాత్ములకు - మానవోత్తములకూ మాత్రమే సాధ్యమౌతుంది! అలా దర్శించలేని వారికి, "బాబోయ్! అమ్మవారి వంగిన నడుమేమిటో, విరిగిపడే ఏటిగట్టు ఏమిటో - పాలిండ్ల భారంఏమిటో, వాటికీ - అమ్మవారి నడుముకు కుశలానికీ సంబంధం ఏమిటో - అంతా గందరగోళంగా వుంది సుమండీ!" అన్న ఒక్క ముక్కా అర్థం అవుతుంది, అవునా!

ఆ జగన్మాత ఒడిలో శిరసుంచి - పరవశించి పోయే పసిబాలుడిగా ఆచార్యులవారు వర్ణిస్తే - ఆ వర్ణన మార్గదర్శకంగా మనము - ఆతల్లి ఒడిలోనికి చేరితే - చాలు ఈ జన్మ ధన్యమైనట్లే, పదండి - ముందుకు.

## 80 శ్లో ॥ నడుము వద్దనున్న మూడు భాగ్యరేఖలు త్రివళి మధ్యము - వైభవము.

**80 శ్లో॥ కుచౌ సద్య స్స్విద్యత్తట ఘటిత కూర్పాస భిదురే**
**కషన్తౌ దోర్మూలే, కనక కల శాభౌ కలయతా.**
**తవత్రాతుం భఙ్గాదలమితివ లగ్నం "తనుభువా!"**
**త్రి ధానద్ధం దేవి! త్రివళిల వలీ వల్లిభి రివ!**

అర్థము :- ప్రకాశించుచున్న రూపముగల ఓదేవీ! జగన్మాతా! (తనుభువా!) ఎప్పటికప్పుడే చెమటలు పోయుచున్న ప్రక్కలయందు (నడుముకు - భుజములకు మధ్యనున్న ప్రక్కభాగములు) అంటుకొనియున్న రవికెను పిగుల్చుచున్నవియు, బాహుమూలముల సమీప ప్రదేశములను (చేతులక్రింద - చంకలభాగము) ఒరయుచున్నవి యును బంగారు కలశముల వలె ఒప్పుచున్నవియును అగు నీ కుచములను - నిర్మించిన మన్మధుడు ఈ నీస్తన భారము వలన, నీ నడుముకు భంగము కలుగరాదనియు, భారం పడరాదనియు, కాపాడుటకుగానూ, అడవి లత తీగె చేత మూడుచుట్లుగా కట్టిబడెనా! అన్నట్లుగా నీ పొట్ట భాగము (ఉదర భాగముపై మూడు ముడతలు తోచుచున్నవి.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు ఆమె నడుము ప్రదేశంలో గల మూడు భాగ్యరేఖలను గురించి వర్ణిస్తున్నారు. కంఠంపై, నుదుటపై - పొట్ట, నడుమువద్ద -) మూడు ముడుతలు లేక రేఖలు గల స్త్రీ పురుషులు అపరిమిత సౌభాగ్య వంతులౌతారని సాముద్రిక (శరీర రేఖా) శాస్త్రం చెబుతోందని లోగా తెలుసుకున్నాం కదా ?

(శ్లో ॥ లాలాటేచ, గళేచైవ మధ్యే చాపి వళి త్రయమ్,
స్త్రీ, పుంసయో రిదం జ్ఞేయం, మహాసౌభాగ్య సూచకమ్ ॥)

పూర్వం - తల్లులు - పిల్లలకు చనుబాలు ఇచ్చి పెంచే బంగారు కాలం వుండేది! మన అమ్మలు ఇచ్చారు. మనమూ ఇచ్చాము. ఇప్పుడది ఎక్కడో, నాగరికతకు దూరంగా వున్నారనిపించే కొందరు తల్లులలో మాత్రం వున్నది. నాగరికత చొరబడని - గిరిజన - వన దుర్గ ప్రాంతాల స్త్రీలలోనూ వున్నది. పల్లెటూళ్లలోని స్త్రీలలోనూ వున్నది. నాగరికతపెరిగిన ఈనాటి అ నాగరిక ప్రపంచంలో బిడ్డలకు పాలు చనుబాలు ఇవ్వటం - అ నాగరికం, నామోషీ - అందం తరిగిపోవటం, అనే భ్రమ ఏర్పడి పోయింది. దానికి తగినట్లు - ఈ తల్లుల్లోనూ పాలు వుండవు! బాలింతరాలికి పాలు విపరీతంగా పడి, ఆ స్త్రీ పాలిండ్లు పాలతో బరువెక్కి పాలతో క్రిక్కిరిసి - రవికె పిగిలిపోయేంతంగా విప్పారి పాలు అంతటా వ్యాపించి - నరాలు - బిర్రబిగిసి -, పాలు వాటంతట అవే చేపుకురావటం. పాలు ధారగా కారిపోవటం, లేదా పాలిండ్లు గడ్డకట్టి బాధపెట్టడం. ఒక్కొక్కసారి ఆ గడ్డ "రొమ్ముసుడి" అనే గట్టిగడ్డగా మారి, భరించలేనంత బాధ, జ్వరం రావటం లాటివీ జరిగేవి. అలా రాకుండా, ఆ తల్లులు ఇతర తల్లులు తమ పిల్లకు పాలుచాలక బాధ పడ్తుంటేనూ, తల్లిపాలు సరిగా పడక (ఉత్పత్తి కాకపోతేనూ, తల్లులు పొలంపన్లకు వెళితే - వారిబిడ్డలు ఆకలి అయి ఏడుస్తుంటేనూ, తమ బిడ్డలతో పాటుగా పాలు ఇచ్చేవారు అతి విశాలమైన తల్లి మనసుతో! వీరే - పరోక్షంగా జగన్మాతృ భావనను తమలో నింపుగో గలిగిన అమాయకపు తల్లులు. వీరిలో జగన్మాతృ రూపం దర్శించవచ్చు,

కొందరు జమీందార్లు, సంపన్నులూ తమ స్త్రీలకు పాలు లేకపోతే, భార్య మరణిస్తే, ఇలా పాలిచ్చే తల్లులను - తమ బిడ్డలకు ఆయాలుగా నియమించుకొని - డబ్బుఇచ్చి - వారి చనుబాలు బిడ్డలకు ఇప్పించేవారు. తల్లి పాలలో - తల్లి ప్రేమలో వున్న ఉత్కృష్టత మరి ఏ పాలలోనూ రాదని తెలిసిన వారు గనుక. అందుకే గర్భిణి స్త్రీలకు - పోషకాహారంతో బాటు - పాలు ఎక్కువగా పడటానికి ఆయుర్వేద ఔషధాలు - ప్రకృతి సహజమైన ఔషధాలూ వాడేవారు ఆనాటి ఆయుర్వేద వైద్యులు. అందువలన - పాలు విపరీతంగా పడిన బాలింతరాలికి - ఆమె పాలిండ్లు పాల సమృద్ధితో, పెద్దవై - భుజంవరకూ - వ్యాపించి రవికెను పిగుల్చుకొనే స్థాయికి, ప్రక్కలు ఒరుసుకొనే స్థాయికివచ్చేవి. ఆ పాలు ఏబిడ్డచేతనైనా త్రాగించక పోయినా, పిండిపారబోయక పోయినా, ఆ తల్లికి బాధతో ఒళ్లంతా చెమటలు పడతాయి కూడాను.

భాగవతంలో - "పూతన" అనేరాక్షసి - అందమైన బాలింతరాలిగా మారి - పాలుచేపు వచ్చిన పాలిండ్లతో - శ్రీకృష్ణునికి పాలు ఇస్తానని వచ్చినపుడు ఇలా పాలివ్వటం, స్తనభారం తీర్చుకోవటం - సహజమైన ఆ రోజులలో - ఆమె కృష్ణుని చంపటానికి వచ్చిన రాక్షసిగా ఎవరూ గుర్తించలేక పోయారు వ్రే పల్లెలో! అందుకే ఆమె కోరగానే, చిన్నికృష్ణుని ఆమెచేతికందించారు.

కృష్ణుడా మెక పటం గ్రహించి - ఆమెప్రాణాలు పీల్చివేసి - చంపటం - కృష్ణలీలలలో ఒకఘట్టం భాగవతంలో, ఇక్కడ ఈ శ్లోకంలో శంకర భగవత్పాదులు వారు ఆ తల్లి పాలతో బరువెక్కిన విస్తరించి - రవికెను పిగుల్చుతున్న పాలిండ్లను వర్ణిస్తూ, సకల జీవకోటికీ, ఆహారాన్ని - అయా ఆహారాన్ని పంచి ఇచ్చే తల్లి పాలిండ్లు - పాల సమృద్ధితో పిట పిట లాడిపోతున్నాయి. అలాటప్పుడే ఆ తల్లి. తన భక్తులైన బిడ్డలు - నాస్తికుల వలనా, ఇతరుల వలనా, కష్టాలూ, పరీక్షలూ ఎదుర్కొనటం గమనించి - వారి యందు అపార కరుణ పెల్లుబికిరాగా (పాలచేపువలె) వారికి తన అపారదయా అమృతాన్ని ప్రసాదించి, వారిని (తన భక్తులను) హేళనగా, చులకనగా చూసే వారినీ, సాధించేవారినీ, శిక్షిస్తుంది. కనువిప్పు కలిగిస్తుంది. తన క్షీరప్రసాదంతో, తన భక్తులు నిర్ధనులైనా వారిని సకల సౌభాగ్యవంతులుగానూ, మార్చి, ఆకాశమంత ఎత్తుగా ఎదిగించి కీర్తిని ప్రసాదిస్తుంది. ఇలా ఎందరో భక్తుల గాధలు మన పురాణాలలో తెలుసుకుంటుంటాముకదా ?

ఇక దేవి స్తనములను మన్మధుడు నిర్మించటం అంటే ఏమిటి ? దేవికి స్తనములు లేవా ? క్రొత్తగా మన్మధుడు నిర్మిస్తాడా ? కాదు - కాదు. మన్మధుడు ఆమె స్తన నైర్మాణంలో సౌందర్యం నింపుతాడు. బ్రహ్మచేసిన బొమ్మ స్త్రీ అయితే - సృష్టికి మూలమైన సౌందర్యాన్ని మన్మధుడు నింపుతాడు. స్థితికి అవసరమైన క్షీరాన్ని జగన్మాత నింపుతుంది.

కామారి అయిన ఈశ్వరుడు - కామేశ్వరుడైతే తప్ప - ఆయన వివాహమూ, పుత్రుడు జన్మించటం జరగదు గనుక - తారకా సుర సంహారం కోసం - వేయి కన్నులతో ఎదరుచూస్తున్న దేవతల కోర్కె ఫలించటానికి - కామాలకు రా రాజు అయిన మన్మధుడు బంగారు కలశముల వంటి ఆమె స్తనములలో సౌందర్యం ప్రోదిచేశాడు. ఈశ్వరునికికా మోద్దీపనం కలిగించాడు అనిభావము. ఇదే కామరాజ కూటము. అనే మన్మధుడు ఆరాధించిన కామరాజ బీజం అయిన శ్రీ విద్యలోని ఒక అంతర్వాహిని అయిన పూజా విధానము.

ఇక అమ్మవారి నడుము ఉదరభాగాన వున్న మూడు భాగ్యరేఖలు. ఆమె స్తనభారంతో నడుము పూర్తిగా వంగిపోకుండా లవలీ తీగెతో మూడుచుట్లుగా చుట్టబడిన బంధం అని వర్ణించారు ఆచార్యులవారు. లవలీ తీగె అనగా ఏలకి తీగె. పసుపురంగులో వుండే తీగెకలది ''లవలీ'' అనబడుతుంది. ధృఢంగానూ, తెల్లని పూవులతోనూ వుంటుందీ తీగె. (ఆయుర్వేదభిషగ్వరులకు తెలిసి వుండేవి పూర్వం ఇలాటి తీగెలు మొక్కలు వాటి గుణగణాలూ అన్నీ. ప్రస్తుతం ఆయుర్వేద పరిశోధకులకు కొందరికి సిద్ధాంతపరంగా తెలుసుగానీ - పూర్తిగా తెలియవు, ప్రకృతితో వారికి సన్నిహిత సంబంధం లేదుగనుకా, సిద్ధాంతాలు - టొన్లలో -

సిటీల్లో చదువుకుంటారు గనుకా (మేడల మీద గదుల్లో!) గిరిజనులకు తీగెలు మొక్కలు తెలుసు - కానీ వాటి విలువ పూర్తిగా తెలియదు. కాబట్టి - ఆ తల్లి ధృఢమైన నడుముకు జయమగుగాక! తద్వారా సర్వలోకముల భారాన్ని ఆ తల్లి నిలకడగా వహించుగాక, ఆమె పాలిండ్లలో సర్వ జీవరాశికీ - ప్రాణాధారమైన ఆహార సమృద్ధి గలిగి వుండుగాక!" అని ఆకాంక్షించారు - స్వార్థం ఎరుగని పరమార్ధమే పరమార్ధంగా గల పరమగురువు - శ్రీ ఆది శంకారాచార్యులవారు. ఇదొక్కటీ అర్థం చేసుకుంటే చాలు మనందరం - ఆ పరమ గురువు అడుగు జాడలలో ఈ శ్లోకార్థంలోని గూఢార్థాలను గ్రహించి - సదర్థాలను గ్రహించి, ఆ జగన్మాత చరణాలు శరణాగతి చెందటానికి అవునా ?

ఐదవ అధ్యాయం సమాప్తం.

ఈ అధ్యాయంలో 70 వ శ్లోకంనుండి 80 వ శ్లోకం వరకూగల పదకొండు (11) శ్లోకాలలో, శ్రీ శంకర భగవత్పాదులవారు. "కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ!" అనే లలితా సహస్రనామ స్తోత్రంలోని శ్లోకార్థం స్ఫురణకు వచ్చేలా - కంఠము నుండి - మధ్యము (నడుము - కటిప్రదేశం వరకూ) అమ్మవారి సౌందర్య వైభవం వర్ణించారు. పంచదశీ మంత్రంలోని "క ఏ ఈ ల హ్రీం, "హ స కహలహ్రీం", స కలహ్రీం అనే మంత్రంలోని మధ్య కూటము అయిన" హ, స క హ లహ్రీం" అనే ఆరు అక్షరాల మంత్రానికీ అమ్మవారి మంత్రరూప శరీర - విరాట్‌రూప వర్ణనచేసి - తాము దర్శించిన తల్లి సౌందర్యాన్ని మనందరి చేతా దర్శింపజేసే ప్రయత్నం చేశారు. ఈ అధ్యాయాన్ని భక్తి శ్రద్ధలతో పారాయణ చేసిన భక్తులకు శ్రీ మాత అపార కరుణ వలన, భయము తొలగుట (వంటరి భావము, అనవసరమైన భయాందోళనలు, పుట్టినే ఉలిక్కిపడటం - అపరిమితమైన దడ - ప్రతి విషయానికీ భయపడటం లాటి రుగ్మతలు తొలగిపోతాయి) స్త్రీలకు బాలింతలకు చను బాలుసమృద్ధిగా, పడతాయి. సత్కీర్తి, కవిత్వపటిమ, యక్షిణీ విద్యలు - అనగా ఇంద్రజాల విద్యలలో ప్రతిభ మొదలైన వన్నీ సమకూరుతాయి. జగన్మాత అపార కరుణ కిరణం ఒక్కటి మన మీద ప్రసరించినాచాలు - సర్వం వున్నట్లే - సర్వం సమకూరినట్లే : ఆ తల్లి కరుణ కోసం పారాయణం చేద్దాం. ఆ తల్లి పాదాలు శరణాగతి చెందుదాము - పదండి - ఆలస్యం చేయకండి - మరలా మరలా ఈ మానవజన్మ - ఈ అవకాశం అదృష్టం వస్తాయో, రావో ... ఈ రోజే సుదినం అమ్మవారి స్తోత్ర పారాయణకు - తల్లిపాదాలు శరణువేడటానికి ప్రతిరోజూ సుదినమే సుమా!

## 5వ అధ్యాయం సమాప్తం.

# 6వ అధ్యాయము ప్రారంభము

శ్లో॥ "శ్రీమద్వాగ్భవకూటైక స్వరూపముఖ పంకజా!"

శ్లో॥ కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ ।

శక్తికూటైక తాపన్న కట్యథో భాగధారిణీ॥

అనే లలితా సహస్ర నామస్తోత్రంలోని "వాగ్భవకూటమైన" అమ్మవారి ముఖ పంకజం - శిరస్సు మొదలు కంఠం వరకు - మంత్రరూప శరీరాన్ని వర్ణించారు జగద్గురు శ్రీ ఆదిశంకరాచార్యులవారు "క,ఏ, ఈ, ల, హ్రీం" అనే ఐదు అక్షరాలు మంత్రం - వాగ్భవకూటము. తమ సౌందర్యలహరి లోని రెండు, మూడు నాలుగు అధ్యాయాలలో ఐదవ అధ్యాయములో, కంఠం నుండి మధ్యము (నడుము - కటి ప్రదేశం వరకు గల మంత్రరూప శరీరాన్ని దర్శింపజేసారు. అదే కామరాజ కూటము - హ, స, క, హల, హ్రీం" అనే ఆరు అక్షరాల మంత్రరూపమే - మధ్యకూటము. ఇక ఈ ఆరవ అధ్యాయములో

"శక్తి కూటైకతాపన్న కట్యథో భాగధారిణీ!"

శక్తి కూటము కటి నుండి - క్రింది పాదాల వరకు గలిగిన జగన్మాత యొక్క "స, క, ల, హ్రీం" అనే నాలుగు అక్షరాల మంత్ర స్వరూపాన్ని దర్శింపజేస్తున్నారు.

జగద్గురువు మనముందు మార్గదర్శనం చేస్తూ, తాను దర్శించి, అనుభవం ద్వారానూ, అనుభూతి ద్వారాను పొందిన అపరిమిత ఆనందాన్ని, శాంతినీ, మనందరిపై గల అపారదయతో, అయాచిత కరుణతో మనందరికీ దర్శింపజేస్తున్నారు.

ఈ అవకాశం మరలా మరలా వస్తుందా!

అందుకే సద్గురువు వెంట నరకంలోనికి అయినా నడచి వెళ్లాలి అంటారు పెద్దలు. నరకంలోనికి ఏమి ఖర్మ! బ్రహ్మాదిదేవతలక్కూడా అసాధ్యము, అపురూపము అయిన ఆ జగన్మాత దర్శనం చేయిస్తానని పరమ గురువు మనల్ని తమ వెంట శ్లోకరూప సోపానాల పైకి ఎక్కిస్తుండగా, మూర్ఖంగా వెనక్కి మరలిపోవచ్చునా? ఆ పరమగురు కృప ఒక్క బిందువు మన పై వర్షించినాచాలు, మన జన్మ జన్మాంతరాల పాపాలు అన్నీ ప్రక్షాళనమై పోయి - మనం నిర్మలమైన మంచి ముత్యాలలా మారి - ఆ తల్లి కంఠసీమ హారాలుగా మారుతాము! నరకంలోనైనా నందనవనాల్ని సృష్టించి చూపగల సమర్థగురువులు వారు. వారు అమ్మవారి "సౌందర్యలహరి' ' లో మునకలు వేయమని చెబుతుండగా ఆలస్యం, ఆలోచనా ఎందుకు?

పదండి - ముందుకు పదండి!

"సకలహ్రీం" అనే నాలుగు అక్షరాల మంత్ర పూత శరీర దర్శనానికి - శక్తి మాత విరాట్ రూప దర్శనానికి, జగన్మాత పాదముల దర్శనానికి, స్పర్శనానికీ - పరమగురువు వెంట పదండి పోదాం.

సృష్టి శక్తికి ప్రతిబింబం. ఆ శక్తి కూటమే అమ్మవారి కటి (నడుము) నుండి -పాదాల వరకు గల శరీరం. సృష్టిశక్తికిది ప్రతిరూపం. మూలాధారంలోని కుండలినీ శక్తి కిది ఆవాస స్థానం. మూలాధారం, స్వాధిస్థానం, మణిపూరకమనే మూడు చక్రాలకిది మూలస్థానం, నాభి, ఉదరము, పొత్తికడుపు, గుదప్రదేశము - జననాంగము, జఘనములు, ఊరువులు (తొడలు) జానువులు (మోకాళ్లు), గుల్ఫములు (పిక్కలు), పాదములు, పాదముల వ్రేళ్లు, గోళ్లు ఇలా క్రియాశక్తికి స్థానములు ఇవన్నీ, సృష్టికి ప్రతిసృష్టి జరగటంలోనూ, సృష్టిలోని సర్వకార్యాలూ చేతల ద్వారా చేయటంలోనూ సహకరించే ప్రధాన పాత్ర వహించే భాగాలు ఇవి. అందుకే అమ్మవారి నితంబ వైభవాన్ని 81వ శ్లోకంలో ఆది శంకరాచార్యుల వారు అద్భుతంగా వర్ణిస్తున్నారు. పారాయణం చేసి తరిద్దామా!

## 81 శ్లో॥ జగన్మాత నితంబవైభవము

**శ్లో॥ గురుత్వం విస్తారం, క్షితి ధరపతిః, పార్వతి! నిజాత్,**
**నితమ్బాదాచిద్య, త్వయి, హరణరూపేణ నిదధే!**
**అతస్తే విస్తీర్ణో గురురయ మశేషాం వసుమతీం!**
**నితంబ ప్రాగ్భార స్థ్యగయతి లఘుత్వం నయతిచ ॥**

**అర్థము :** ఓ పర్వతరాజపుత్రీ! పార్వతీ! ధరసుతా! జగదంబా! నీ తండ్రి హిమవంతుడు, తన నితంబ ప్రదేశము నుండి, గొప్ప బరువును, వైశాల్యమును గ్రహించి, నీకు అరణముగా (అనగా, వివాహ కాలము నందు, తండ్రి, తన కుమార్తెకు సంతోషముగా ఇచ్చు కానుక - బహుమానము) ఇచ్చాడు. కావుననే, నీ పిరుదుల యొక్క (జఘనములు - నితంబము) ఘనత, బరువై, విశాలమై, ఈ భూమినంతయు కప్పుచు, ఇట్టి భూమిని తేలికైన దానినిగా చేయుచున్నది. ఇందు సందేహము లేదు. మామూలుగా ఈ శ్లోకాన్ని యధాతధంగా అర్థం చెప్పుకుంటే వచ్చే అర్థం ఇది. కానీ జగద్గురువు యొక్క లక్ష్యం - కేవలం అర్థాన్ని ఇవ్వటం కాదు. ఆ అర్థంలోని పరమార్థాన్ని ఆలోచింపజేసే - జ్ఞానాన్ని మనకు ప్రసాదించటమే ఆచార్యుల వారి లక్ష్యం.

శ్రీ ఆదిశంకరాచార్యుల వారు వ్రాసిన "భవానీ భుజంగ ప్రయాత స్తోత్రం" లోని 4వ శ్లోకం ఇక్కడ ఒకమారు పరిశీలిద్దాము రండి!

(భవానీ భుజంగ ప్రయాత స్తోత్రము)

**4వ శ్లో॥ సుశోణాంబరాబద్ధ నీవీవిరాజ**
**న్మహాహార రత్నకాంచీ కలాపం నితంబం!**
**స్ఫుర ద్దక్షిణావర్త నాభించ తిస్రో,**
**వలీరంబ! తే, రోమరాజిం భజేహం ॥**

ఈ చిన్న శ్లోకం చక్కగా గానం చేయటానికి వీలుగా వుంటుంది. చిరుమువ్వల - మ్రోతలతో వున్న రత్నహారముల మొలనూలుతో వున్న అమ్మవారి ఘనమైన నితంబము, దక్షిణావర్తమై (కుడివైపుకు చుట్టు తిరిగి ప్రదక్షిణ చేస్తున్నట్లు వున్న నాభి యొక్క త్రిస్ర = అనగా మూడు భాగ్యరేఖలు (వళీరూపాః, తిస్రః) వలె - మూడు రేఖలుతో వున్న రోమరాజి (నూగారు)ను భజిస్తున్నాను. నమస్కరిస్తున్నాను అని అర్థం. ఒక శ్లోకంలో అమ్మవారి నాభి, నూగారు, నితంబ వైభవాన్ని వర్ణించారు. ఆచార్యులవారు ఈ శ్లోకము. ఇక సౌందర్య లహరిలోని 81వ శ్లోకమూ, పరిశీలిస్తే - కొండంత అర్థం ఇమిడి వున్నది. సారూప్యత తెలిసిపోతుంది.

ఆ పరమగురువు ప్రకృతిలోని పర్వతరూపాలను స్త్రీ రూపంగా, జగన్మాత రూపంగా ఆరాధించగలిగిన మహనీయుడు. సహజంగా "పర్వత స్తనమండలీ!" అంటూ భూమాతను కీర్తిస్తుంటారు మహర్షులు - మహాకవులు. అట్లాగే ఇక్కడి ఈ శ్లోకంలో, "పర్వతరాజపుత్రీ! పార్వతీ!" అనే సంబోధనలోనే ఆ జగన్మాత రూపాన్ని మరో గొప్ప పర్వత స్వరూపిణిగా భావించుకోవాలి. దర్శించాలి.

నితంబము (పిఱుదులు) - తొడలూ - ఇలా స్త్రీ యొక్క రహస్య శరీరాన్ని వర్ణించగల సాహసము, చనువు నిష్కాపట్యము - యోగము - ఐదుగురికి మాత్రమే వుంటుంది.

1. శిశువు అయిన - పసిబాలుడు,
2. మహాయోగీశ్వరుడు జితేంద్రియుడు అయిన భక్తుడు,
3. శిల్ప శాస్త్రము, శిల్పకళ, ఒక తపస్సుగా భావించి - శిల్పాలలో సర్వ సృష్టి స్థితిలయాలను దర్శించగల - శిల్పాకృతి తీసుకొనిరాగల మహాతాత్వికుడైన శిల్పి.
4. స్త్రీ, పురుష శారీరక శాస్త్రం (అనాటమీ) ఔ పోసన పట్టి - స్త్రీ పురుషుల శారీరక, మానసిక రుగ్మతలు - నిస్వార్థ బుద్ధితో ఒక తండ్రిలా విని - పరీక్షించి, వారిలోని ఏ అవయవానికి వ్యాధి సోకినా - వైద్యవృత్తే పరమావధిగా, దైవంగా భావించి, స్త్రీ, పురుష భావాలకు అతీతంగా వైద్యం చేయగల, శస్త్ర చికిత్స చేయడం - పరీక్షించగల - రోగ నిర్ధారణ చేయగల భిషగ్వరుడు - (వైద్యుడు - డాక్టరు)

5. తన అర్ధ శరీరంలో తన అర్ధాంగిని నిలుపుకొని - స్త్రీ స్వరూపానికీ, సౌందర్యానికీ, సృష్టి శక్తికీ, పాతివ్రత్యానికీ - సర్వ మంగళ శక్తి స్వరూపానికీ ఒకానొక మహా ఔన్నత్యాన్ని, అర్థాన్ని, పరమార్థాన్ని, దాంపత్య జీవితపు అన్యోన్యరాగాల యొక్క గొప్ప విలువలకు సర్వలోకాలకు చాటిన మహాయోగీశ్వరుడైన ఈశ్వరునికీ - ఆ ఈశ్వర సమానుడైన భర్తకు.

వీరికి మాత్రమే వుంటుందా చనువు, సాహసము

జగద్గురువు - ఆదిశంకరాచార్య - శిశువుగా, మహాశిల్పిగా, పరమహంస పరివ్రాజకాచార్యునిగా, భిషగ్వరునిగా మారి - అమ్మవారి నితంబమును వర్ణిస్తున్నారు. ప్రకృతి మాతగా! (మున్ముందు కొన్ని శ్లోకాలలో - యోగీశ్వరుడైన పరమశివుని లోనికే పరకాయ ప్రవేశం చేసి తాను యోగీశ్వరుడైన పరమ శివునిగా మారి - అమ్మవారిని వర్ణించారు. అది తర్వాత అధ్యాయాలలో తెలుసుకుందాము.)

ప్రకృతిని తల్లిగా ఆరాధించగలిగే ప్రతి మానవులకు వున్నది ఈ హక్కు, చనువు, భక్తి, ప్రపత్తి.

అయితే ఆ మానవుల కళ్లకు దివ్య దృష్టి - చెవులకు పరమార్థ వినికిడి శక్తి వుండాలిసుమా!

పర్వతములు ఈ పృథ్విని ఎలా భారరహితంగా చేసి జలం మీద సమతలంగా నిలుపుతున్నాయో - మనందరం ఎప్పుడూ ఆలోచించము. ఈ భూమి। ఈ వాహనాలు, ఈ జనారణ్యం - ఈ ఉద్యోగ-లు, ఉరుకులు - పరుగులు - ఇల్లు మీద ఇల్లుగా ఐదారు - పది, ఇరవై అంతస్తుల గూళ్లలాటి ఇళ్ళు, అవే మన లోకాలుగా మురిసి పోతుంటాము. కానీ మనం వున్న భూమి - దేని పై వున్నది?

క్రింద జలార్ణవం! అంతా జలం! పైన భూమి తేలియాడుతున్నది బల్ల చెక్కలా!

ఆ భూమి మునిగి పోకుండా నిలవరించటానికే పర్వతాలు వున్నాయి. గురుత్వము - విస్తారము రెండూ పర్వతాలకు సహజ లక్షణములు. హిమవంతుడు తనలోని ఆ రెండు సహజ గుణాలను, తన కుమార్తె అయిన పార్వతికి, వారసత్వంగాను, జన్యుపరమైన సహజ గుణాలుగాను, వివాహ వేళ తండ్రి కుమార్తెకు కానుకగా బహుమానముగా (అరణముగా) ఇచ్చే బహుమతిగాను ఇచ్చాడు.

ఒక పెద్ద ఇనుప కట్టె భూమిలోనికి అక్కడక్కడ దిగవేసి - ఆ కట్టి పై భాగానికి ఇనుప చీలలు బిగించి, బోల్టులు, నట్లుగా పర్వతాలు భూమిలో నుంచి (క్రింది జలార్ణవంలో నుండి) - భూమి పైకి పొడుచుకుని వచ్చివుంటాయి.

శ్రీదేవీ భాగవంతలో - భూమిని ధరించుటకు ఉన్నతమైన - విశాలములగు పర్వతములు సృష్టించబడ్డాయి అని చెబుతూ

**శ్లో॥ లోహకీలం యధాకాష్టే ! తథాతే గిరయః కృతాః**

**"మహీధర" మహారాజ! ప్రోచ్యంతేవిబుధైర్జ నైః ॥**

**జాతరూప మయో "మేరు" ర్బహుయోజన విస్తరః**

**కృతోమణిమయైః శృంగైః, శోభితం పరమాద్భుతః ॥**

**అర్థము :** ఒక పెద్ద కట్టెకు ఇనుప చీలలు బిగించినట్లుగా, పర్వతములు భూమి యందు నెలకొల్పబడినవి. ఆగిరులలో "మేరుగిరి" బహుయోజనముల విస్తీర్ణముతో, వైశాల్యముగలిగి, మణిమయ శిఖరములతో అలరారుచూ, మహాద్భుతముగ బంగారు కాంతు లీనుచు తనరారుచున్నది. (దేవతలంతా ఈ "మేరు" పర్వతం తమ నివాస స్థానంగా చేసుకున్నారు గనుక - ఆ పర్వతము - వారి వారి తపోశక్తుల అద్భుత కాంతులు తేజస్సుతో - బంగారు (పుటం పెట్టిన బంగారు వలె) అగ్నిలా (Glittering) మెరుస్తుంటుంది. అని జనమేజయ మహారాజుకు వ్యాసమహర్షి చెబుతాడు శ్రీదేవీ భాగవతంలో 3వ స్కంధంలో - 13వ అధ్యాయములో.

అలాగే హిమవత్పర్వతం కూడా అతి మహిమాన్వితమైనది. ఇక్కడే పార్వతి జన్మించింది (జగన్మాత) ఇక్కడే. పరమ శివుని తపో భూమి! - ఇక్కడి పర్వతసానువులూ, సెలఏరులు, నదులు - పుణ్యనదులుగా ప్రారంభమయ్యాయి. ఈ పర్వత సానువులలో సెలఏరులలో - సరోవరాలలో - దేవతా స్త్రీ పురుషులు - విహారానికి వస్తారు ప్రకృతి అందానికి ముగ్ధులై! మానస సరోవరం, బదరికాశ్రమం, బ్రహ్మకపాలం - వైష్ణవీదేవి - ఇలా సర్వ పుణ్యక్షేత్రాలు, తీర్థాలు, పరివేష్ఠించి వుండే హిమవన్నగము అది! అతిలోక సుందరము, అతి పవిత్రము అయిన హిమవత్పర్వత శ్రేణి - ఈ మన భారతదేశానికి - కిరీటం వంటిది. జగన్మాత అయిన భారతమాతకు - శిరస్సువంటిది. అట్టి హిమవంతుడు - తన పుత్రిక అయిన పార్వతికి - తన ధృఢత్వాన్ని (గురుత్వాని) గురుత్వాకర్షణ శక్తిని - వైశాల్యమును - ఆమె - నితంబములో ఇమిడ్చి - మరీ ఇచ్చాడు.

పర్వతాల సగభాగం (అనగా చీలల్లా భూమి పైకి పొడుచుకు వచ్చిన భాగాలనే! మనం చూస్తున్న పర్వతాలు! మన కళ్లకు తెలిసినది అదే. ఆ పర్వతాల మూలం (పాదాలు - ఏ పాతాళ లోకాలలో వున్నాయో - ఎవరికి తెలుసు? (సముద్రపు వింతలలో సముద్ర గర్భంలో పర్వతాలను మనం - వింతలు విశేషాలు"గా టి.వి.లలో చూస్తున్నాంగదా!)

అలాటి పర్వతాలను మందు తూటాలు పెట్టి పేల్చి - రాళ్ళు త్రవ్వి చదును చేసి - మానవులు తమ "మునక" తామే కొని తెచ్చుకొంటున్నారు. భూమి పై సమతౌల్యం నశించి పోతుంది పర్వతాలను, వృక్షాలను నాశనం చేస్తే అనే జ్ఞానంలేకుండా!

కాబట్టి "మహి" అయిన భూమిని ధరిస్తున్నది కాబట్టి "మహీధర" అనే పేరు వచ్చింది పర్వతాలకు.

మహీధర పుత్రిక - పార్వతి

**శ్లో॥ "ధరా - ధరాసుతా ధన్యా, ధర్మిణీ ! ధర్మవర్ధినీ ! "**

**అనే శ్లోకం వున్నది లలితా సహస్రనామస్తోత్రంలో.**

పర్వత స్వరూపిణి అయిన ఆ తల్లి, తండ్రి నుండి వారసత్వంగాను, జన్యుపరంగాను (జీన్స్) వివాహవేళ అరణంగాను పొందిన అచలశక్తి (గురుత్వశక్తి) ఆధార శక్తి - విస్తార శక్తితో, తన పర్వత రూప జఘనములు ద్వారా భూమినంతటినీ ఆక్రమించి భూమిని నీటి పై తేలేట్లు చేస్తూ, మునిగి పోకుండా రక్షిస్తూ స్థిరంగా వుండేలా చేస్తూ, సర్వ ప్రాణికోటినీ తన ఒడిలో ధరిస్తూ, భరిస్తూ - కాపాడుతున్నది! అందువలననే ఆ తల్లి జఘనములు - భూమి నంతయు కప్పుచున్నవి.

"అయ్యో! రామా! జగద్గురువు - అమ్మవారి పిరుదులు కూడా వర్ణించిపారేశారు! బాప్‌రే!" అనేవారిని - అలాగే ఆతమస్సులోనే వుండనివ్వండి! మన ఉనికికి కారణభూతమైన భౌగోళిక స్థితిని, శక్తి స్వరూపిణిగా ఆరాధించలేని వారి మాటలను పట్టించుకుంటే మనం సద్గురువు వెంట ముందుకు సాగలేము. వారినలా వెనక్కి వదిలేసి - మనం ముందుకు సాగుదాము పదండి.

**శ్లో॥ జగన్మాత ఊరువుల సౌందర్యం జానువుల (మోకాళ్ల) వైభవము**

**82 శ్లో॥ కరీన్ద్రాణాం శుణ్డాన్, కనక కదళీ, కాణ్డపటలీం**

**ఉభాభ్యా మూరుభ్యా, ముభయమపి నిర్జిత్యభవతి**

**సువృత్తాభ్యాం పత్యుః ప్రణతి కఠినాభ్యాం గిరి సుతే !**

**విధిజ్ఞే జానుభ్యాం, విబుధకరి కుమ్భ ద్వయమపి ॥**

అర్థము : ఓ హిమగిరిపుత్రీ! తల్లీ! వేదార్థ విధినెరింగి అనుష్టించురాణీ! జగదంబా! (తొడలు) గజరాజముల యొక్క తొండములను, బంగారు అరటి స్థంభముల యొక్క

సముదాయములను ఈ రెంటినీ - నీ ఊరువుల సౌభాగ్యం చేత - జయించుచున్నావు. ఇక నీ జానువుల - అనగా మోకాళ్ళు.

గుండ్రముగా సుడి తిరిగి, శోభస్కరంగా వున్నాయి. నీ భర్త అయిన పరమేశ్వరునికి విధి విధానం ప్రకారం మ్రొక్కుట చేత, శోభనముగా వుండే నీ మోకాళ్లు, కఠినములుగా కూడా మారి, దిగ్గజముల కుంభముల కఠినత్వాన్ని కూడా జయించుచున్నవి. శ్రీ శంకర భగవత్పాదుల వారు జగన్మాత ఊరువుల (తొడల), జానువుల (మోకాళ్ల), వైభవాన్ని వర్ణిస్తున్నారు.

ఆ తల్లి తొడలు - (ఊరువులు) బంగారు అరటి స్థంబాలు (బోదెలు) వలె వున్నవి. ఇవి సౌందర్యానికి నిలయాలు.

ఇక్కడొక చిన్న కథ చెప్పుకుందాము.

మధుర మీనాక్షి ఆలయంలో ఒక మహా శిల్పాచార్యుడు వుండేవాడు. శిల్పకళే ఆయన తపస్సు . ఆలయం నిర్మిస్తూ - వేయి స్తంభాల మండపంలో అద్భుత దేవతా శిల్పాలను మలచవలసిందిగా శిల్పాచార్యునికి ఆజ్ఞ ఇచ్చాడు మధుర రాజు - పాండ్యరాజు.

ఆ శిల్పాచార్యుడు (ఈనాడు మనం మధుర ఆలయంలో చూస్తున్న మహాద్భుత శిల్పాలు) తపశ్శక్తితో యుగాల పర్యంతం - జీవకళ ఉట్టిపడ్తూ ఆయా దేవతా సాక్షాత్కారం అయ్యేలా సృష్టించాడు రాతితో. ఆనందించిన రాజు - తన రాణి (భార్య) శిల్పము చెక్కమన్నాడు శిలతో. ఆ శిల్పి చెక్కాడు ఏకాగ్రతతో! ఆ రాణి తొడపైన వున్న పుట్టుమచ్చ కూడా ఆ మహాశిల్పి (తపస్సిద్ధుడైన శిల్పి) మనోనేత్రాలకు గోచరం కాగా చెక్కాడు. రాజుగారి కిది కోప ´ణమైంది. ఆ శిల్పాచార్యుడు - తన రాణిగారిని, స్నానం చేసే సమయంలో రహస్యంగా పొంచి వుండి చూచివుంటాడనీ - అందువలననే - భర్త అయిన తనకు మాత్రమే (ఇతరు లెవరికీ తెలిసే అవకాశం లేని) తెలిసిన ఆమె తొడ పైన గల పుట్టుమచ్చను శిల్పంలో మలచి - చూపి - పదుగురికీ ప్రదర్శించి - తననీ - రాణినీ - అవమాన పరచాడనీ అపోహ పడ్డాడు. రాజుగారు తలచుకొంటే దెబ్బలకు కొదవా? శిల్పాచార్యునికి - నేత్ర దృష్టి పోయేలా కళ్లు పొడిపించమని ఆజ్ఞ ఇచ్చాడు.

అయితే - మహాతపస్సిద్ధుడు శిల్పకళను తపస్సుగా భావించి తరించిన ఆ మహాశిల్పి - రాజుగారి ఎదుట స్వయంగా తన కళ్లనితానే పెరికి - ఇచ్చేశాడు. రాజు అంధుడయ్యాడు పశ్చాత్తాపపడి శిల్పి పాదాల పై పడ్డాడు.

మధుర మీనాక్షి అమ్మవారు చలించిపోయింది. మహాశిల్పి తన భక్తుడు - శిల్పకళే - శిల్ప శాస్త్రమునే తపస్సుగా భావించిన ఆ శిల్పి కన్నులు పోతే ఇక తన మహాత్మ్యం ఏముంది?

శిల్పి చేసిన స్తోత్రంతో సాక్షాత్కరించింది అమ్మవారు మధుర మీనాక్షి!

రాజును మందలించింది.

శిల్పికీ - రాజుకు కూడా దృష్టి ప్రసాదించింది.

"రవిగాంచనిచో కవిగాంచునెయ్యెడన్" అన్నట్లు, సూర్య కిరణాలు చొరబడలే ప్రదేశంలో కూడా కవి దృష్టి చొరబడగలదు. శిల్పి దృష్టి - దివ్యదృష్టిగా మారగలదు.

ఇందరు దేవతా విగ్రహాలను జీవకళతో సృష్టించి గలిగిన మహా శిల్పి దివ్యదృష్టిని శంకించిన రాజుకు - కను విప్పుకలిగించింది జగన్మాత!

అంచేత - మహాభక్తుడు - తపస్సంపన్నుడు - కారణజన్ముడు అయిన ఆది శంకరాచార్యులవారు - మహాయోగీశ్వరునిగా మారి - పరమ శివుని హృదయంలోనికి జొరబ

శ్లో॥ కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా!"

అని లలితా సహస్రనామ స్తోత్రంలో వశిన్యాది వాగ్దేవతలు స్తోత్రం చేసిన శ్లోకంలో "కామేశ్వరుడైన - పరమేశ్వరునికి మాత్రం తెలిసే - (చూడబడే) సౌభాగ్యము, మార్దవము గల ఊరువుల జంటగలిగిన తల్లీ!" అని కీర్తించారు.

ఆ తల్లి బంగారు అరటి బోదెలవంటి ఊరువుల సౌందర్యం దర్శించి - మనందరి చేత దర్శింప జేయగలిగారు.

అంతేగాదు - మానవ శరీరంలో ఊరువులకు అతి ప్రాధాన్యత వున్నది. నడకకు - మూలమైన కాళ్లకు మూలస్థానమైనవి ఊరువులు . ఈ తొడల స్థానం నుండి - హృదయ స్థానంలోని రక్త ప్రసరణ చేసే అత్యంత కీలకమైన నాడీ సముదాయం వున్నది. అందువలననే నేటి ఆధునిక గుండె జబ్బుల పరీక్షలో మొదటి భాగం అయిన "ఆంజియోగ్రామ్" (Angeogram) అనే పరీక్షలో - తొడలోని ఒకానొక రక్త నాళం ద్వారా, అతి సూక్ష్మమైన తీగె (వైర్) ను పంపించి, గుండె భాగం వద్దకు ఆ తీగె చేరే సమయంలో ఏయే రక్త నాళాలలో అవరోధం (బ్లాక్ అయి వున్నాయో) వున్నదో, రక్తం గడ్డ కట్టి అడ్డు పడుతున్నదో, మిషన్ ద్వారా తెలుసుకుంటున్నారు. హృద్రోగ నిపుణులు. ఆ తర్వాత అవసరమైతే - ఆపరేషన్ చేస్తారు.

ఇక స్త్రీకి - అందం - ఊరువులు. సృష్టి - అనగా ప్రసవ సమయంలో చివరి నొప్పులలో - శిశువు జన్మించే సమయంలో, శిశువు శిరసోదయం మొదలు, భూపతనం వరకు షుమారు ఐదు నిముషాల సమయం. "యమగండం" వంటిది. జీవన్మరణ సమస్య. ఇటు పునర్జన్మ, అటు మరణమో తేలిపోయే క్లిష్ట సమయం అది స్త్రీకి. శిశువు బయటపడే సమయంలోని "వత్తిడి" అంతా ఊరువుల పై పడుతుంది. ఊరువులు విరిగి పోతాయేమోనన్నంత దుస్సహ

బాధ, వేదన భరించాలి తల్లి. ఒకానొక చైతన్య రాహిత్య స్థితిలోనికి వెళ్లిపోతుంది. బాధతో. బిడ్డ ఏడుపుతో - మరల ఈ లోకంలోనికి వస్తుంది స్త్రీ. ఆ బిడ్డను చూచుకొని - ఉప్పొంగిన మాతృమమతతో - అంతక్రితం అనుభవించిన దుస్సహ ప్రసవ వేదన - నరకయాతన మర్చిపోతుంది స్త్రీ. ఇదే మాతృత్వంలోని అద్భుత మమకారం. (ఈనాడు సిజేరియన్ ''ఆపరేషన్స్ వచ్చాక'' ఆ బాధ లేదు. అనుభూతీ లేదు ఈ తరం యువతులకు)

ఆ ఊరువులు ఎంత ధృఢంగా బాధ భరించే శక్తి గలవిగా వుంటాయో, ఆ తల్లి ప్రసవం అంత తేలికగా వుంటుంది. చూడటానికి సౌందర్య భరితంగా, రోమ రహితంగా బంగారు అరటి బోదెలలా వుండే స్త్రీ ఊరువులు ఒక ''సృష్టి''ని భరించే శక్తి వంతమైన - శక్తి కారకాలు.

జగన్మాత - సర్వసృష్టికీ - తల్లి

ఇక పురాణాలలో నరనారాయణులు తమ ఊరువుల నుండి ''ఊర్వశి'' మొదలైన అప్సరసలను సృష్టించారు. దీనికీ ఒక కథ వున్నది. నరనారాయణులు శ్రీమన్నారాయణాంశ సంభూతులు - బదరి కాశ్రమంలో - వీరిద్దరూ తపస్సులో నిమగ్నమై తీవ్రనిష్ఠలోవున్నారు. సహజంగా ఇంద్రుడు - తపస్సు చేసే వారంటే భయపడతాడు. వారు తన ఇంద్ర పదవిని వారి తపస్సుతో సాధించుకొంటారేమోనని అందుకు వారి తపస్సులకు ఎన్నో అవరోధాలు కల్పిస్తుంటాడు. కొందరు తాపసుల విషయంలో విఘ్నం కలిగించి విజయం సాధిస్తాడు. మరికొందరి విషయంలో - ఘోరపరాజయం చవిచూచి, చావుతప్పి - కన్ను లొట్టపోయిందన్న (శుక్రాచార్యుని) సామెతగా మిగిలిపోతాడు.

నరనారాయణుల తపోభంగానికి గాను, యువకులైన వారిని ఆకర్షించటానికి దేవ నర్తకీమణులను పంపించాడు. ఇంద్రుడు. వారి గీత వాయిద్యాలు, నాట్యహేలలతో బదరి కాశ్రమ ప్రాంతమంతా ప్రతిధ్వనించసాగింది. నరనారాయణుల తపస్సు నుండి త్రుళ్లి పడి చూచారు. చుట్టూరా అప్సరస స్త్రీలు - వారి సౌందర్య ప్రదర్శన - నృత్య గీతాల అర్భాటాలూ - మన్మధుని ప్రతాపంతో ఋతువుకాని ఋతువులో - వృక్షాలన్నీ పుష్పించి వుండటం, సుమసౌరభాలు, భ్రమర ఝుంకారాలు, కోయిల కూతలు, నెమళ్ల నాట్యాలు - ఒకటేమిటి? ప్రకృతి అంతా ఆకర్షణీయంగా, మారిపోయింది.

నరనారాయణులు ఒకరి వైపు మరొకరు చూచుకొన్నారు. విషయం ఏమిటో వారి దివ్యదృష్టికి క్షణంలో అర్థమైంది.

తమ తపశ్శక్తి ఏమిటో - జితేంద్రియత్వం ఎంత మహత్తరమైనదో - తెలివి లేని ఇంద్రునికి తెలియబరచ దలచారు. నారాయణుడు తన ఊరువును - తన అరచేతితో మధించాడు. ఆ

ఊరువు నుండి అద్భుత సౌందర్యాశి జన్మించింది. జన్మించిన క్షణంలోనే నృత్యగాన కళాకోవిదయై నర్తించింది. ఊరువు నుంచి జన్మించిన ఆ అందాల భామయే "ఊర్వశి" అని పిలువబడింది.

ఈ అద్భుతం చూచి - ఇంద్రుడు - మిగతా - దేవతా నర్తకీమణులు - నివ్వెర పోయారు.

తమలోనే అంతటి అందాలరాశిని - అంతర్గతంగా భరిస్తున్న వారి జితేంద్రియత్వం - భావనామాత్రంగా సౌందర్యరాశులను సృష్టించగల వారి తపస్సు శక్తి గ్రహించాడు ఇంద్రుడు. సాష్టాంగపడ్డాడు - తప్పు క్షమించమని కోరుకున్నాడు. నరనారాయణులు క్షమించారు. నరనారాయణలిద్దరూ - వేలకొలదీ అప్సరసలను సృష్టించార్రు అట్లా తమ ఊరువుల నుండి

ఊర్వశిని - దేవలోకం పిల్చుకు వెళ్లాడు ఇంద్రుడు.

"రంభ, మేనక, తిలోత్తమ, పుష్పగంధి, సుకేశజ, మహాశ్వేత, మనోరమ, ప్రమద్వర, చారుహాసిని, సంగీతజ్ఞ, ఘృతాచి, చంద్రప్రభ, కోకిలభాషిణి, సోమ, అంబుజాక్షి, విద్యున్మాల, కాంచనమాలిని, మొదలైన అతిలోక సౌందర్యవతులైన దేవకన్యలను సృష్టించారు నరనారాయణుల కేవలం - తమ తొడల నుండి వారంతా 16 వేల 500 మంది (పదహారు వేల ఐదు వందల మంది).

వీరందరినీ దేవలోకానికి (స్వర్గలోకానికి) బహుమతిగా ఇచ్చారు నరనారాయణులు. మన్మధుడు - వీరిని తన "సేన" ("కామునిసేన") గా ఆయా సమయాలలో తన వెంట పిల్చుకు వెళతానని ఇంద్రుని కోరాడు. ఇంద్రుడు సరేనన్నాడు. అయితే మరో చిక్కు వచ్చి పడింది. ఈ అప్సరస స్త్రీల (నరనారాయణులు సృష్టించిన వారు) లలో ఎక్కువ మంది నారాయణుడిని తమ భర్తగా భావిస్తున్నామని కూర్చున్నారు. నారాయణుడు నవ్వి -

ద్వాపర యుగంలో - కృష్ణావతారంలో - వారందరినీ - నరకాసురుని చెరబట్టిన స్త్రీలగా జన్మించి - తన భార్యలుగా కాగలరని మాటఇచ్చాడు. శ్రీకృషుని 16 వేల మంది భార్యలు అది ద్వాపరయుగ నాటి కథగా మారింది. ఈ "ఘృతాచి" ని చూచే -వ్యాస మహర్షి మోహపరవశుడు కాగా - ఆరణి మధిస్తుండగా - "శుకమహర్షి" జన్మించాడు.

ఇలా ఊరుమధనంతో పురాణాలలో - కొందరు కారణజన్ములు జన్మించిన ఉదంతాలు చాలా వున్నాయి. జననాంగ రక్షణ కోటలు ఊరువులు! సృష్టి కార్యానికి - పునాదులు - ఊరువులు.

ఇక అమ్మవారి జానువులు - వట్రువులు కలిగి అనగా - సుడి తిరిగినట్లు గుండ్రంగా వుండి - కఠినంగా దిగ్గజముల కుంభ, స్థలములవలె వున్నవి అని వర్ణించారు ఆచార్యులవారు.

ఎందువలన?

విధి విధానం అనగా వేద విధిని ఎఱిగివున్న ఆ తల్లి, నిత్యము - తన పతి అయిన పశుపతికి - తన మోకాళ్ల పై కూర్చొని - నమస్కరిస్తుంది.

"వజ్రాసనం" యోగాసనాలలో ఒక ఆసనం.

పెద్దలకు, గురువులకు, భర్తకు, దైవానికి నమస్కరించే సమయంలో స్త్రీలు సాష్టాంగ నమస్కారం చేయరాదు. స్తనములు, ఉదరము - ఒత్తిడికి గురి అవుతాయి గనుక - ఆ సాష్టాంగం స్త్రీలకు నిషిద్ధము.

వూరికే చేతులు జోడించటం అవిధేయత అవుతుంది. మరెలా? మోకాళ్ల మీద కూర్చొని - చేతులు హృదయ స్థానంలో మోడ్చి నమస్కరిస్తూ శిరసు వంచి - నమస్కరించేది విధి విధానం ప్రకారం స్త్రీలు చేయవలసిన నమస్కార పద్ధతి.

"ప్రణతి" అన్నారు జగద్గురువు. "ప్రణతి" అంటే ఏమిటి? మనసా, వాచా, కర్మణా చేసే నమస్కారము.

నమస్కారాలు మనందరం - ఎన్నో చేస్తుంటాము రోజూ వారి దినచర్యలో మనకు ఎందరో చేస్తుంటారు రోజూ.

"నమస్కారం" అనటం - వ్రాయటం - ఒకానొక సభ్యతకు చిహ్నం. "నమస్కారం" అంటూ లోలోపల విసుగు అణుచుకుంటూ నమస్కారం పారవేయటం ఒక నమస్కార లక్షణం.

చేతులు రెండూ కలిపీ - కలపకుండా, గాలిలోనే వూపి - ఎదుటి వారి పై మనకు గల తృణీకార భావాన్ని చెప్పకనేచెబుతో దానిని "నమస్కారం" అనే ప్రయోగంతో మాట పలకటం - గొప్ప టెక్నిక్. ఈనాడు సమాజంలో - ఇదేఎక్కువగా వున్నది!

మనసులో కొండంత ద్వేషాన్ని, అసూయను, అణగద్రొక్కుకుంటూ వీరికి నమస్కారం చేయవలసి - చెప్పవలసి వచ్చిందిరా దేవుడా" అని లోలోపల తిట్టుకుంటూ - చేసే విధి లేని నమస్కారం ఒకటి వున్నది ఈనాడూ - ఏనాడూ

"ఒక నమస్కారం వీళ్ల మొహానపారేస్తే - ఇప్పుడు కాకపోయినా, ముందు ముందు ఎప్పుడో ఒకప్పుడు పనికివస్తుందేమో. ఆఫ్టరాల్ - వెధవది - ఒక్క ముక్క "నమస్కారం" అంతే కదా? "అని చేసే నమస్కారం - వ్యాపార నమస్కారం. అతి తేలిక నమస్కారం.

ఇక మనం చేయదల్చుకొన్న వారికి - "నమస్కారం" అన్నపుడు వారు వినిపించికోకా, చూడకపోతే - ఆ నమస్కారం పేలని టపాకాయలా - "తుస్సు" మని పోతే కలిగే బాధ అంతా ఇంతా కాదు. ఒక "నమస్కారం" అనే మాట - రెండు చేతులూ కలిపిన ప్రక్రియ - రెండూ వృధా - వేస్ట్ - అనే బాధ - అది. బాధాద్రష్ట నమస్కారం ఇది.

అలాగే మనకి చెందాల్సిన - నమస్కారం - మధ్యలో ఎవరో అడ్డుపడి గ్రహించేసి - అవతలివాణ్ణి దీవించేస్తే - మనకా ఛాన్స్ పోయినందుకు - ఉడుకుమోతు తనం - మధ్య అందుకున్న వారి పై పిచ్చి కోపం (లోలోపల) నమస్కారం - త్వరపడి - ఎవరికి తగులుతుందో తెలీకుండా పెట్టినవారి తెలివి తక్కువతనానికి కోపం - ఇన్ని భావాలు వచ్చేస్తాయి.

రాజకీయ నాయకుల - అక్షరం ముక్కరాకున్నా - పండితుల చేత పొగిడించు కోవాలనే ఉబలాటంతో - డబ్బు - శాలువలు ఇస్తామని ఎరవేసి ఓ మోస్తరు కవులను, పండితులును తోలుకు వచ్చి - తమని పొగడమని పురమాయించే - "రాజకీయ ఉపన్యాస హింసా దురంధరులు" - "నిరక్షర కుక్షులు" అయినవారి సన్మానాలు (అవి వారే చేయించుకుంటుంటారు. డబ్బు ఖర్చుపెట్టి) కార్యక్రమాలలో "వారికి నమస్కారం" అంటూ ఉపన్యాసం ప్రారంభంలో చెప్పేనమస్కారం ఆత్మహత్యా సదృశ నమస్కారం. జన జీవన సరళిలో తప్పించుకోని సమస్యలలానే - ఈ నమస్కారము - ఒక ఆత్మవంచనా నమస్కారం.

"ఏమిటీ? నన్ను చూచి - నమస్కారం అన లేదే?" అని పిలచి - తిట్టి మరీ చేయించుకొనే ప్రబుద్ధులకు, అధికార మదోన్మత్తులకు పెట్టాల్సివచ్చిన "నమస్కారం" ఆత్మక్షోభ నమస్కారం. బ్రతుకు తెరువు పోతుందని భయంతో చేసే నమస్కారం". వీడికి "నమస్కారం" మేనియా, "నమస్కారం" అనకపోతే, ఇంక్రిమెంట్లు శలవులు, ప్రమోషన్స్ అన్నీ కోసేస్తాడు దరిద్రుడు. వీలు చిక్కినపుడల్లా ఒక నమస్కారం పారేస్తుంటే శాంతిస్తాడీ పీనుగ!" అనుకుంటూ చేసే నమస్కారాలు. కేవలం హిరణ్యకశిపుడికి - ఆనాటి ఇంద్రాది దేవతలు - వాడి మరణం అనుక్షణం కోరుకుంటూ - చేసిన నమస్కారాల్లాటివి. చావు దీవెన నమస్కారాలు - నియంతకు నమస్కారాలు అవి.

"అదుగో వారికి నమస్కారం" అందాం. "అంటూ పాలోమంటూ ఎందుకో - ఏమిటో తెలియకుండా గొర్రెల మందలా "నమస్కారం - నమస్కారం అంటూ ఎగబడ్తూ - క్యూలు కట్టి చేసే నమస్కారాలు - గొర్రెదాటు నమస్కారాలు - గుంపులో గోవింద నమస్కారాలు - "అంటు వ్యాధి" నమస్కారాలు.

ఇవిగాక - ఇంకా ఎన్నెన్నో వున్నాయి. ఈ నాటి నమస్కారాలు! అవేవీ "ప్రణతి" కాదు. మనసా, వాచా, కర్మణా విధి విధానంగా చేసేవి కావు. అందుకే అవి గాలికి పోతాయి. మరిప్రణతి సాష్టాంగ నమస్కారం అంటే ఏమిటి ?

**శ్లో ॥ ఉరసా, శిరసా, దృష్ట్యా, మనసా, వచసా, తథా పద్భ్యాం, కరాభ్యాం,**
**కర్ణాభ్యాం, ప్రణామోష్టాంగ ఉచ్యతే ॥**

జగన్మాత తన సర్వస్వము, తన భర్త అయిన పరమశివునికి నిత్యం మ్రొక్కుతుంది ఎప్పుడు? ఎలా?

దైవదర్శనానికి వెళ్ళినప్పుడు - తలారాస్నానం చేసి - శుచియై - (జగన్మాత ఎల్లప్పుడూ శుచియే) - పూజా ద్రవ్యాలతో వెళ్ళి - యోగీశ్వరుడైన పరమశివుడు - యోగ సమాధిలో వుంటే - ఆయనిని కదిలించక - యోగానికి భంగపాటుకలగనివ్వక, ఆయన పాదాలకు కాస్త దూరంలో - తాను మోకాళ్ల మీద కూర్చుని (వజ్రాసన పద్ధతిలో) తన హృదయ స్థానంలో చేతులు జోడించి - శిరసువంచి "నీకు మనసా, వాచా, కర్మణా నమస్కరిస్తున్నాను (ప్రణతులు అర్పిస్తున్నాను) నా ఈ హృదయ్మ పీఠం పై నీవు నిరంతరం కొలువై వుందువు గాక - నీ చరణాల సన్నిధి ఒక్కటేనా పరమ లక్ష్యం" అని భావిస్తూ ఏకాగ్రతో - వుండిపోతుంది. ఆ యోగీశ్వరుడు ఒక గడియకో, గంటకో, రోజుకో, వారానికో, పక్షానికో, మాసానికో - సంవత్సరానికో - ఎప్పుడు సమాధి స్థితి నుండి లేస్తాడో - ఎవరికెరుక? అంతదనుకా ఆ తల్లి ఆ యోగాసన పద్ధతిలో - నిశ్చల సమాధిలో వుండి పోతుంది. అందువలన ఆమె శరీర భారం వహించే ఆమె మోకాళ్లు వజ్రాసన పద్ధతిలో రాటు తేలి - కఠినంగా మారి - గజకుంభముల వలె ధృఢతరంగా మారిపోతాయి.

జగత్పిత - ధ్యాన సమాధి.

ఆయన పాదాల చెంద జగన్మాత ప్రణతి!

ఈ అద్భుత దృశ్యాన్ని - ఒక మహాచిత్రకారునిలా, శిల్పిలా ఆచార్యుల వారు దర్శించి - మనందరి చేత ఆ అద్భుత దృశ్యంలోని ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని, యోగాసన పద్ధతినీ "నమస్కారం" "ప్రణతి"లోని అర్థాన్ని పరమార్థాన్ని - చూపుతెచ్చుకున్న మనసుతో చూడమని పరోక్ష భోధ చేశారు. అది గ్రహించగలిగితే చాలు!

నమస్కారాన్ని - త్వణీకారంగా మార్చుకోలేము.

ఊరువులు - జానువులు - వర్ణించిన ఆచార్యుల వారితోబాటు అంతర్ముఖులమై - ఆ శివ శక్తుల పాదాలచెంత ప్రణతులర్పించగలము. అవునా?

## 83 శ్లో॥ అమ్మవారి జంఘలు సౌభాగ్యము

(అనగా మోకాళ్ల క్రింద నుండి చీల మండల వరకు గల భాగం - కాళ్ల పిక్కల వరకు గల భాగం)

**83 శ్లో॥ పరాజేతుం రుద్రం, ద్విగుణశర గర్భౌ, గిరిసుతే!**
**నిషంగే, జంఘే, తే, విషమ విశిఖో బాఢమకృత,**
**యదగ్రే దృశ్యన్తే దశ శరఫలాః పాదయుగళీ,**
**నఖాగ్ర చ్ఛద్మాన స్సుర మకుట శాణైక నిశితాః ॥**

**అర్థము :** ఓ హిమగిరిసుతా! జగన్మాతా! మన్మథుడు, రుద్రుని ఓడించుటకు తన ఐదు బాణములు చాలవని - (ఉన్మాదం, తాపనము, శోషణము (క్షోభణము) స్తంభనము, సమ్మోహనము అను ఐదు బాణములు)

వాటిని పది బాణములుగా చేసుకొనదలచి (ఒక్కొక్క బాణం రెండుగా 2 × 5 = 10) నీ కాలి పిక్కలను అమ్ముల పొదులుగను కాల వ్రేళ్లను బాణములుగను, కాలివ్రేళ్ల గోళ్లను (నఖాగ్రములను) బాణముల కొనలందు పదును బెట్టి యుంచిన ఉక్కు ముక్కలుగను (బాణపు చివరి ములుకులుగను) చేసుకొనెను. నీ పాదములకు నమస్కరించుచున్న దేవతల కిరీటములందున్న మణులనెడి ఒరిపిడి రాళ్లచే, నఖాగ్రములనెడి ములుకులను పదును పెట్టుకొనుచున్నాడు మన్మథుడు!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి పిక్కలు, కాలివ్రేళ్లు, కాలిగోళ్ల యొక్క సౌందర్య వైభవం వర్ణించారు.

కాలి పిక్కల వద్ద గల ధృఢత్వమే మనిషి నడక వేగం, పరుగుకు ఉపకరిస్తుంది.

భయపడి పారిపోయేవారిని "పిక్కబలం చూపించాడు" అంటాము కదా సహజంగా.

లేడికి - కాళ్ల పిక్కల యందు దాగి వున్న బలమే - దాని పరుగుకు వేగానికి మూలం.

పరుగుల రాణులు ! రన్నింగ్ రేస్‌లలో పాల్గొనేవారు, వారి విజయంలో - వారి పరుగు వేగంలో సహకరించేవి వారి కాళ్ల పిక్కల బలమే!

వయసు పెరిగాక పిక్కల వద్ద కండరాలు గట్టి పడతాయి. కొలెస్ట్రాల్ (కొవ్వు) వలన - మోకాళ్ల వద్ద ఎముకలు అరిగిపోవటం వలనా, పిక్క కండరాలు బిగుసుకు పోవటం వలన, పరుగు వేగం తగ్గుతుంది. నడక వేగం తగ్గుతుంది. పరుగెత్తుతూ "హర్డిల్స్" (అడ్డు పెట్టిన ఎత్తైన కర్రలు - గోడలులాటివి) దూకగల సామర్థ్యంగల వారికి కూడా వయసు మీరిన తర్వాత మామూలు నడకలో మార్పువస్తుంది. పట్టిపట్టినడవటం - వంకరగా నడవటం - బాధపడ్తూ నడవటం - కూర్చుని లేవలేక పోవటం - గబుక్కున కూర్చోలేకపోవటం మెట్లుగానీ - ఎత్తైన స్టూలులాటివిగానీ ఎక్కలేక పోవటంలాటి మార్పులు వస్తాయి. ఇక పరుగెత్తటం - అస్సలు చేయలేరు.

చోరకళ (దొంగతనాలు)లో లాఘవం వున్నవారు - వారు పట్టుబడకుండా వారి పిక్క బలమే కాపాడాలి. అందుకే - వయసు పై బడ్డాక - దొంగతనాలు (ఇళ్లకు కన్నాలు వేయటం వంటివి) మానేసి - వీరు "గురువు"లుగా మారతారు - తమ శిష్యులకు మెళుకువలు చెప్పటానికి! కారణం లాఘవంగా గోడలు దూకి పరుగెత్తలేరుగనుక! శిష్యులా పనిచేయగలరు గనుకా!

అందుకే బాణాలు దాచే! నిలవచేసే, అమ్ముల పొదిగా! అమ్మ వారి పిక్కలను వర్ణించారు ఆచార్యులవారు. బాణం, వేగానికీ, లక్ష్యానికీ - గురికీ - చిహ్నం.

మోకాళ్ల క్రింద - కొంత వెడల్పుగాను, లావుగాను వుండి - క్రిందకు - కాస్త సన్నగా మారివుండే పిక్కలు అమ్ముల పొదిని పోలివుంటాయి.

కామారి అయిన ఈశ్వరుని తన ఐదు బాణాలతో గెలవలేననుకున్న మన్మధుడు - అమ్మవారి కాళ్ల పిక్కలను తన అమ్ముల పొదిగా మార్చుకొని, అమ్మవారి కాళ్ల వ్రేళ్లను తన బాణాలుగా చేసుకొని - ఆ బాణాల ములుకులుగా

నిరంతరం ఆ తల్లి పాదాలకు - తమ వజ్ర ఖచిత కిరీటాలతో మ్రొక్కే దేవతల కిరీటాలలోని మణిమాణిక్యాలతో - ఆ తల్లి పాదాల వ్రేళ్ల గోళ్లను పదును పెట్టి - మార్చుకున్నాడని చమత్కరించారు.

సంకల్పముతోనే సర్వజగత్తులను చుట్టిరాగల ఆ తల్లి "వేగశక్తి" ఆమె పిక్కలలో దాగివున్నది. ఏ ప్రాంతాన్ని ఏ ప్రదేశాన్ని తన పాదరజంతో పునీతం చేసి దివ్యక్షేత్రంగా మార్చదలచినదో, ఆక్షేత్రానికి ఆ ప్రదేశానికి సంకల్పమాత్రంతో గురిగా - వెళ్లగల కాలివ్రేళ్లు అవి! ఏ భక్తులను పరిరక్షించదలచినదో, ఏ దుష్టులను శిక్షించదలచినదో వారి పాలిట - బాణపు ములుకులు ఆ తల్లి కాలిగోళ్లు అయితే - మహాయోగీశ్వరుడైన ఈశ్వరుని మనసు శృంగార రస ప్రపూర్ణమె - తారకాసురవధ జరగటానికి పుత్రోత్పత్తి జరగాలి గనుక - మన్మధుడు - అమ్మవారి కాలిపిక్కలనే తన అమ్ముల పొదిగా, వేళ్లను బాణాలుగా, గోళ్లను - బాణపు ములుకులుగా చేసుకున్నాడు.

ఆ తల్లి పాదనఖములు ఆశ్రయించినా చాలు - ఈశ్వర సన్నిధికి మనలను చేరుస్తాయి అవి - అని పరోక్ష బోధ చేస్తున్నారు ఆచార్యులవారు.

## 84. జగన్మాత చరణముల సౌందర్యము

**84 శ్లో॥ శ్రుతీనాం మూర్ధానో దధతి తవయౌశేఖర తయా**

**మమాప్యేతౌ మాత శ్శిరసి దయయా ధేహిచరణౌ**

**యయోః పాద్యం పాథః పశుపతి జటాజూట తటినీ**

**యయో ర్లాక్షాలక్ష్మీరరుణ హరి చూడామణి రుచిః ॥**

అర్థము : ఓలోకమాతా! జగదంబా! ఏ నీ పాదములను శృతుల శిరస్సులగు ఉపనిషత్తులు సిగపూవుగా ధరించుచున్నవో, ఓ మాతా! దయార్ద్ర హృదయవైన నీవు ఆనీ చరణములను నా శిరస్సు పై కూడా వుంచుము తల్లీ!

శివుని జటాజూటము నందు వర్తించు (నర్తించు) గంగ నీ పాదప్రక్షాళనకు జలము గానున్నది కదా? అనగా పవిత్రమైన పుణ్యనది అయిన సురగంగ నీ పాదాభిషేకము చేసి - మరింత పునీతమౌతున్నది. (శివ జటాజటమున వుండటమే మహద్భాగ్యము కాగా, నీ పాద ప్రక్షాళనతో ఆగంగ మరింత పవిత్రమైన నదిగా మారుతున్నది. సురలోకము, భూలోకము, పాతాళములలోని ప్రాణికోటి నంతటినీ - నీ పాదప్రక్షాళన చేసిన మహిమచే - గంగాదేవి - పునీతులను చేయగల్గుతున్నది. మందాకిని, భాగీరధి, భోగవతి అని కీర్తింపబడి జలరూపదేవతగా పూజలందుకుంటున్న గంగ - నీపాద ప్రక్షాళన చేసిన పుణ్యంతోనే సుమా!

ఇక - శ్రీ మహావిష్ణువు - యోగమాయాస్వరూపిణివైన నీకు నిరంతరం తన శిరస్సుతో మొక్కుతుంటాడు. కారణం - ఆనాడు కంసుని చెరసాలలో - వున్న శ్రీ కృష్ణుని కంసుని బారి నుండి రక్షించటానికి గాను, యోగమాయ వ్రేపల్లెలోనందుని భార్య అయిన యశోదకు ఆడశిశువుగా జన్మించింది. కృష్ణుడు దేవకికి పుట్టగానే - ఆయోగమాయే అందరినీ ఆవహించి నిద్రముంచుకు వచ్చేలా చేసి - అచేతన స్థితిలో అందరినీ పడవేసి, శ్రీకృష్ణుని - వ్రేపల్లెకు - వ్రేపల్లెలోని యోగమాయను చెరసాలలోనికి తెచ్చే ఏర్పాటు చేసింది.

ఆ తర్వాత కంసుడు ఆడశిశువును ఛంపబోగా ఆమె అష్టాదశ భుజదుర్గగా మారి అంతరిక్షాన నిలచి - ఆతనిని హెచ్చరించి అదృశ్యమైంది. సోదరి అయిన యోగమాయను "నంద," "భద్ర" "కాత్యాయని", "విజయ" అనే అనేకానేక పేర్లతో శ్రీకృష్ణుడు - యాదవులు - ఉత్సవాలు జరిపి పూజించే వారు. (మాయ ముందు - మనిషి తర్వాత జన్మిస్తారంటారు అందుకే)

శ్రీమన్నారాయణుడు - యోగమాయస్వరూపిణి అయిన జగన్మాత పాదాలకు శిరసా మొక్కుతున్నపుడు ఆ స్వామి కిరీటంలో వున్న కౌస్తుభమణి (స్ఫటికంవలె - మెరుపువలె తెల్లగా మెరిసేమణి)లో అమ్మవారి పాదములకు వున్న లత్తుక రంగు (పారాణి) ప్రతిఫలించి - ఆమణి లేత ఎరుపు రంగులోనికి మారి లక్ష్మికి ఆవాసమైన కాంతిగా దృగ్గోచరమౌతున్నది. విష్ణువు వక్ష స్థలంలో కౌస్తుభమణి వుంటుంది. ఆమణి లక్ష్మి నివాసము అంటారు పెద్దలు. కౌస్తుభమణిలో అమ్మవారి పాదలత్తుకరంగు ప్రతిఫలించి - లక్ష్మీదేవిని గుర్తుకు తెస్తూ - లక్ష్మీ స్థానాన్ని స్ఫురణకు తెస్తున్నాయి.

ఆలాటి మహిమన్వితమైన జగన్మాత పాదములను - తన శిరసు పై కూడా ఇంచు కదయతో క్షణకాలం నిలపమని ఆచార్యుల వారు భక్తితత్పరతో జగదంబను వేడుకొంటున్నారు.

**శ్లో॥ శృతి సీమంత సింధూరీ కృత పాదాబ్జ ధూళికా!"**

అని లలితా సహస్రనామ స్తోత్రంలో వర్ణించారు వశిన్యాది వాగ్దేవతలు అమ్మవారి పాదాలను - శృతులు - (వేదములకు, పాపిటలైన సీమంతములు) ఉపనిషత్తులు -

(వేదమాతలు), జగన్మాతపాదాలకు శిరసావ్రొక్కగా వారి పాపిట సింధూరం (నొసటి తిలకం) ఆ తల్లి పాదరజంగా మారిందన్నారు వాగ్దేవతలు!

ఆచార్యులవారు మరొక విధంగా ఆ అర్థాన్ని భావయుక్తంగా వర్ణించారు - దర్శించారు. భక్తిలో ఎవరిస్వానుభవం అనుభూతి వారి వారి స్వంతం. మనము ఆ తల్లి శ్రీచరణాలకు మ్రొక్కుదాం పదండి.

## 85వ శ్లో॥ జగన్మాత పాదముల సౌందర్యం మహిమ

**85 శ్లో॥ నమోవాకం, బ్రూమో, నయనరమణీయాయ పదయోః**

**తవాస్మై ద్వంద్వాయ స్ఫుటరుచిర సాలక్తకవతే**

**అసూయ త్యత్యన్తం యదభిహననాయ స్పృహయతే**

**పశూనా మీశానః ప్రమద, వనకంకేళి తరవే ॥**

**అర్థము** : ఓ భగవతీ! జగన్మాతా! పశుపతి యగు శివుడు (నీ పతియగు పశుపతి) ఏ నీ పాద పద్మతాడనమును కోరుచున్నాడో, అలరుల తోటలోని (నందనవనములోని) అశోక వృక్షమును గాంచి దాని పై అసూయ నొందుచున్నాడో. అట్టి మహిమగలిగి,

చూపరుల దృష్టిని మిక్కిలి ఇంపు, సొంపుగలగినదియై, ఎర్రని లత్తుక రసముచే (పారాణిపూతచే) తడిసి, ఎర్రగా కనిపించుచున్న నీ పాద్వయమునకు పలుమారులు నమస్కరించు చున్నాను. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు జగన్మాత పాద ద్వయ సౌందర్యాన్ని, మహిమను వర్ణించారు. నందన వనంలోని బంగారు అశోక వృక్షం పూవులు పూయదు. (అశోక వృక్షాలు పూలు పూయటం అరుదు). అందము, శీలము, యవ్వనము. నిర్మల హృదయము గల దైవగుణ సంపత్తిగల స్త్రీ యొక్క పాదతాడనం (పాదంతో తన్నినట్లు) తో ఆ అశోక వృక్షం పూస్తుందంటారు (పుష్పిస్తుందంటారు) పెద్దలు. పురాణాలలో ఇలాగే వున్నది.

జగన్మాత పాద తాడనంతో, నందన వన కాంచన (బంగారు) అశోక వృక్షం పుష్పించటం చూచిన పరమ శివుడు. ఆమె పాదతాడనం తనకు లభ్యం కాలేదేమో అని అశోక వృక్షంపై అసూయ చెందాడట.. అంటే ఏమిటి?

బంగారు అశోకవృక్షం పుష్పించటం అంటే

జడ పదార్థంలో చైతన్యం రావటం అది? ఎలాటి చైతన్యం అన్నమాట! ఆధ్యాత్మిక

జ్ఞాన సౌరభాలు వెదజల్లే పుష్పాలు పూయటం! జగన్మాత పాదతాడనానికి పాదాలకు, జడులలో - మూర్ఖులలో - నిరక్ష రాస్యులలో దైవాన్ని గురించి ఏమీ తెలియని మానవులు - కేవలం జన్మ, శరీరధారణ దృష్ట్యా మాత్రమే ఉత్తమ మానవ జన్మ ఎత్తిన వారు.

(బంగారం - లోహాలన్నిటిలో విలువైనది. ఈ విలువైన లోహం లోహపు గనుల కోసం అనాదిగా చరిత్రలో యుద్ధాలు - దోపిడీలు - అరాచకాలు ఎన్నో జరిగాయి. - జరుగుతున్నాయి ఈనాడు కూడా విలువైనదే అయినా - అదీ ఒక లోహమే!

మహాయోగులకు - అవధూతలకు - పరమహంసలకు - సద్గురువులకు బంగారం అయినా ఇనుము అయినా మట్టి అయినా ఒకటే! అలా చూడగల వారే నిజమైన గురువులు)

అట్లా క్రిమికీటకాల కంటే - పశుమృగ - పక్షి గణములకంటే మానవ జన్మ విలువైనది. లోహాలలో బంగారంలానే జన్మలలో మానవ జన్మ ఉత్తమము, విలువ అయినది.

అలాటి మానవ జన్మను ఎత్తినవారిని

ఆధ్యాత్మిక వాసన లేని వారినైనా సరే

ఆ తల్లి పాద స్పర్శసోకితే - చాలు - వారిలో జ్ఞానజ్యోతి వెలుగుతుంది. జ్ఞాన పుష్పం మొగ్గతొడిగి అప్పుడే వికసిస్తుంది. "కాళిదాస మహాకవి" జీవితమే ఇందుకొక చక్కని ఉదాహరణ. విద్యాగంధం ఇసుమంతైన లేని పశులకాపరిగా వుంటుండిన మూర్ఖుడు. ఆ జగన్మాతను పూజించటం ఎలాగో కూడా తెలియని అమాయకుడైన ఆతడు - ఆ తల్లి పాదస్పర్శ సోకగానే "మహాకవి కాళిదాసు" (మహా కాళీదేవిదాసునిగా)గా మారిపోయి ఆచంద్రార్కం తనయశస్సుతో చిరంజీవియై నిలచి పోయాడు. కావ్యాల రచన, స్తోత్రాల రచన, దండకాల రచన చేసి సంస్కృత విద్యార్థినీవిద్యార్థులకు భావితరాల వారందరికీ సంస్కృత కవిత్వ రచనకు ఒక పద్ధతి (సిలబస్) ని ప్రవేశ పెట్టగలిగిన ధన్యుడయ్యాడు. మరి ఆశక్తి ఎవరిది? జగన్మాత పాదాల స్పర్శది అవునా?

జడమైన బంగారు లోహపు అశోకం పుష్పించగా లేనిది

మానవులలో జ్ఞాన పుష్పం వికసించదా?

సాధారణ మానవులం మనమంతా!

కానీ పరమ శివుడు మహాయోగీశ్వరుడు. నిరంతరం ఆ ఆదిపరాశక్తినే హృదయంలో ప్రతిష్ఠించుకుని ఆమె బీజాక్షర మంత్రాన్ని జపించే తపస్సిద్ధుడు. అలాటి స్వామి పుష్పించిన అశోక వృక్షాన్ని చూచి తనకు ఆమె పాదతాడనం లభించ వలెనని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ అసూయ చెందాడని చెప్పటంలో తనలోని యోగం ఇంకా ఇంకా ధృఢతరం కావటానికి ఆ దివ్యశక్తి స్వరూపిణి పాదస్పర్శ - కావాలని కోరుకున్నాడు. ఆమెను తన గురురూపిణిగా భావిస్తూ, ఆమెపాద

తాడనం - అనగా పాద - మసక్త ప్రయోగం కోసం - ఆ యోగీశ్వరుడు తహ తహలాడాడు అనే అర్ధం తీసుకోవాలి.

అలాటి దివ్యశక్తిగల పాదములకు లత్తుకరంగు పారాణితో శోభచేకూరగా, విష్ణువు నమస్కరించినపుడు ఆయన కౌస్తుభమణిలో ఆపారాణి ప్రతిఫలించి ఆ మణి ఎర్రని కాంతితో విరాజిల్లగా అది లక్ష్మికి నిలయమైన ఎర్రతామరలా భాసించింది.

ఆపాదద్వయ స్పర్శను మరీమరీ కోరుకుందాం మనం కూడా!

మనలోని అజ్ఞానాంధకారాన్ని పారద్రోలి - జ్ఞాన పుష్పాన్ని పూయిస్తుందా తల్లి పాదస్పర్శ.

"నమోవాకం - బ్రూమో" అన్నారు ఆచార్యులవారు. లత్తుక పారాణితో వున్న మహామహిమాన్విత మైన నీ పాదములకు నమోవాకం - బ్రూమో - మరల జోహారు - జోహారు - జగన్మాతా! జోహారు!

## 86 శ్లో॥ చరణ కమలము - స్పర్శ (తాడన) మహిమ

**86 శ్లో॥ మృషాకృత్వా గోత్ర స్ఖలన మథ వైలక్ష్య సమితం,**
**లలాటే భర్తారం చరణకమలే, తాడయతి, తే**
**చిరాదంత శ్శల్యం దహనకృత మున్మూలితవతా**
**తులాకోటి క్వాణైః కిలికిలిత, మీశాన రిపుణా!**

ఒక అంశాన్ని మరల మరల విస్తరించి చెప్పటాన్ని "వ్యాస పద్ధతి" అంటారు. ఒక విషయాన్ని వివిధ కోణాలలో పరిశీలిస్తూ భోధించటాన్ని "సమాసము" "సమాస పద్ధతి" అంటారు.

శ్రీ శంకర భగవత్పాదుల వారు ఈ శ్లోకంలో జగన్మాత పాదతాడనాన్ని మరో విధంగా ఈశ్వరుని అనుభూతిగా వర్ణిస్తున్నారు. లోగా (85వ) శ్లోకంలో జడమైన బంగారు అశోక వృక్షాన్ని అమ్మవారి పాదతాడన మహిమ పుష్పింపజేయగా, అసూయ చెంది - తనకా పాదతాడనం లభ్యమయితే బావుండును గదా యని ఈశ్వరుడు ఆకాక్షించాడు.

ఈ శ్లోకంలో ఆ స్వామి ఆకాంక్ష సాకారమై సాక్షాత్కరించింది. అమ్మవారి పాద తాడనము ఆ స్వామికి లభ్యమైంది. ఎలా?

**శ్లోకార్థం :** జగన్మాతా ! పొరబాటుగా నీ వద్ద - ప్రసంగవశాత్తు నీ సవతి అయిన గంగాదేవిని గురించి మెచ్చుకొన్నాడు నీ భర్త అయిన పరమ శివుడు తర్వాత తన పొరబాటు గ్రహించి ఆ తప్పు కప్పిపుచ్చుకొనే దారి తెలియక, వెలవెలాబోయాడు. ప్రణయ కోపంతో నీ చరణ కమలములతో నీవు ఆయన నుదుట తాడనం చేయగా

శివునికి శత్రువైన మన్మధుడు, లోగా ఈశ్వరుడు తన శరీరం ముక్కంటి మంటలతో దహించిన సంఘటక గుర్తుకు వచ్చి - అవమాన పడివున్న వాడు గనకు

ఇప్పుడు నీ పాదతాడనంతో శివునికి తగిన శాస్తి జరిగినదని

నీ కాలి అందెల చివర్లలో గ్రుచ్చుబడివున్న రత్నాల చిరుమువ్వలలో (అనంగునిగా) జొరబడి, వాటి క్వణక్వణనాదంలో కలసిపోయి కిలాకిలా నవ్వుతూ - నేటికి తన పగ తీర్చుకున్నాడు శివుని పై!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు - జగన్మాత జగత్పితల ఒకానొక ప్రణయ కలహ ఘట్టాన్ని వర్ణించినట్లే వర్ణిస్తూ, ఆ తల్లి చిరు కోప ప్రదర్శనలో ఆమె పాదకమలములు ఆస్వామి నుదుటికి తగలగా,

మన్మధుడు చిరకాలపు తనపగ తీరిన్నట్లు - కిలకిలా నవ్వాడని (అమ్మవారి కాలి అందెల క్వణ క్వణనాదంలో) చమత్కరించారు.

మహాసాధ్వి - జన్మ జన్మలకు ఈశ్వరుడు తప్ప అన్యులను భర్తగా కోరని మహా పతివ్రతా మతల్లి, తండ్రి ఇంట ఈశ్వరనింద అయినా భరించలేక, సతిగా ప్రాణ త్యాగం - ఆత్మాహుతి చేసుకున్న సతీమతల్లి - మరల హిమవంతుని కుమార్తై పార్వతిగా జన్మించి - ఈశ్వరుని తన తపస్సుతో మెప్పించి - వివాహ మాడి - ఆ స్వామిని క్షణం కూడా ఎడబాసి వుండలేనంతటి అన్యోన్యానురాగాలు, ఆదర్శదాంపత్య రీతిలో అర్ధనారీశ్వరిగా మారిన ఆ తల్లి - తన భర్త కేవలం తన సవతి అయిన గంగాదేవి పేరు తనవద్ద (ఆ గంగ గొప్ప గుణాలు వర్ణించటమనుకున్నా సరే) చెప్పగానే - తన పాదాలతో ఆస్వామి నుదురు మీద తన్నుతుందా? పాద తాడనం చేస్తుందా? అదే నిజమైతే

మన బోటి సామాన్య గృహిణీగృహస్తులం - అస్తమానం ఏదో ఒక చిన్న విషయంలో భార్యాభర్తలు కీచులాడుకుంటూనే వుండే నైజం కలవారం.

భర్త మీద కోపం రాగానే - అతడి నుదురు పగిలేలా కాలితో తన్నెయ్య వచ్చుకదా? ఇది తప్పుకాదు కదా? మన కాళ్లకు రత్నాల అందెలు - లేకున్నా - ఆ సంఘటన ఎదురింటి వారు పక్కపోర్షను వారో, పనివారో, పాలవాడో చూచి - ఆ కాలనీకి అంతా "టముకు" వేయటంతో - వారంతా గుమిగూడి భార్యాభర్తలిద్దరి పరువు కడిగివేస్తూ గుసగుసలు పోతూ కిలకిలమని అదే పనిగా నవ్వుకోరా?

ఇలా పెడర్థాలు తీసుకొనే ప్రమాదం వున్నది,

జగద్గురువు - భోదించిన గూఢార్థం వేరు.

పరమ గురువు లెప్పుడు వేదాంత రహస్యాలను ఒక "పజిల్"లా నిగూఢంగా చెబుతారు. జిజ్ఞాసువులైన భక్తులు ఆ "పజిల్"ను జాగ్రత్తగా ఛేధించాలి! అంతేగానీ అడ్డదిడ్డంగా ఆలోచించకూడదు.

ఈశ్వరుని నుదురు అనగా ఏమిటి?

జ్ఞానం! జ్ఞాన నేత్రం!

మానవుల "ఆ జ్ఞా"చక్రం వుండేది నుదుటి స్థానంలో. ఈ "ఫాల" భాగంలోనే ఈశ్వర సాక్షాత్కారం జరుగుతుంది సాధకులకు.

అయితే అందాకా సాధన చేసిన కొందరు సాధకులు, పొరబాటుగా, లభ్యమయిన సిద్ధుల ఆకర్షణకు లోనుకావటమో, వాటి ప్రదర్శనకు పూనుకొని తమని తాము ఇంద్ర జాలికుల్లా ప్రదర్శించుకుని ధనాకర్షణ, జనాకర్షణకు లోనుకావటమో జరిగి పతనమౌతారు. ప్రక్కదారి పడతారు.

అలాటివారిని - జగన్మాత - సరిదిద్దాలి!

ఆమె పాద తాడనమే వారికి సరైన పాఠం.

ఒకానొక అవమానమో, పరీక్షో - సృష్టించి - ఆ తల్లి వారి మొహం (నుదురు) పగిలేలా - పాదతాడనం చేస్తుంది. అనగా మరిచి పోయిన జ్ఞానాన్ని - తన్ని, తట్టి లేపుతుంది. సవతి - అనగా - ప్రక్కదారి పట్టించిన కోర్కెలు - సిద్ధులు లాటివి అని అర్థం.

ఆ పాదతాడనంతో -జ్ఞాన నేత్రం మరల తెరుచుకుని, సాధకుడు తన తప్పు తాను తెలుసుకుని - మరల జ్ఞానమార్గంలోనికి వెళతాడు.

ఆ తల్లి తన్నినపుడు - (అవమానమో - పరీక్షో జరిగినపుడు) సాధకుని చూచి తాము జయించామన్న భావనతో ఆసిద్ధులు, కోర్కెలు కిలాకిలా నవ్వటమో - మన్మధుడు అందెలలో చేరినవ్వటం అంటే అదేమరి! కోర్కెలకు ప్రతిరూపమే మన్మధుడుకదా ?

ఇక సాధారణ జీవితాలలోనికి వస్తే । మనబోటి వారం మరికాస్తంత వివరణ తెలుసుకోవాలి.

సాధారణ ఏ స్త్రీ అయినా, నిరాశ, నిస్పృహలకు గురి అయినపుడు, అవమానం, బాధలకు గురి అయినపుడు, తన భర్త, బిడ్డలు - మరెవరైనా తన ఆత్మీయులు తనని చులకన చేస్తున్నారనే బాధ కలిగినపుడు - కోపంతో, బాధతో, దుఃఖంతో - మంచం మీద ఒక ప్రక్కగా వత్తిగిలి ముడుచుకుని పడుకుంటుంది. ఆ సమయంలో ఆమె శరీరాకృతి వంగివున్న బాణంలా - ధనుస్సు ( ) లా వుంటుంది. దీనినే మూడంకె (3) వేసి పడుకోవటం అంటారు.

అలా పడుకుని వున్న స్త్రీ వద్దకు అనునయించటానికి భర్త గానీ । బిడ్డలుగానీ వచ్చినపుడు - వారు కూర్చోవటానికి మంచం మీద మిగిలి వుండే చోటు ఆమె పాదాల వద్దే! (బాగా గమనించండి. - అనుభవంలో తెలుసుకోండి.)

అప్పుడా బాధలో ఆమెకు వ్యతిరేకంగానో, హేళనగానో, లేక విమర్శిస్తూనో వారెవరైనా (పాదాల వద్ద కూర్చుని వున్నవారు) మాట్లాడారనుకోండి. ఆమె అసంకల్ప ప్రతీకార చర్యలా చివ్వున వెల్లికిలా తిరుగుతుంది. ఆ తిరగటంలో బాణంలా (ధనుస్సులా) వున్న ఆమె శరీరం - నిటారుగా - (కాళ్లు బారజాపినట్లు నిటారుగా) అవుతుంది. అవేగానికి ఆమె పాదాలు - పాదాల వద్ద కూర్చున్న వారు కాస్తంత వంగివుంటే శిరసుకు - నుదురుకు - నిటారుగా కూర్చుని వుంటే గుండె (వక్ష స్థలం వద్ద) "ఫెడేల్" మని తగిలే అవకాశం పూర్తిగా వుంది!

అందుకే కోపం వచ్చి - అలిగి పడుకుని వున్న ఆడా, మగా ఎవరికైనా సరే - రెండు బారల దూరంలో నిల్చుని మాట్లాతారు కాస్తంత తెలివితేటలు అధికంగా వున్నవారు. కేవలం ప్రేమ - జాలి - పశ్చాత్తాపపడ్తూ ఆపాదాల వద్ద కూర్చునేవారు - ఎక్కువగా "తన్ను" తినే అవకాశం ఎంతైనా వుంటుంది.

శ్రీ కృష్ణ దేవరాయలు వారికి - వారి భార్య (తిరుమల దేవి) మధ్య ప్రణయ కలహంలో - వారికీ ఈ "తాడనం" ప్రాప్తించింది. దానిని వారు తీవ్రంగా పరగణించి ఆమెతో పలకటం మానేశారు. ఆమె చాలా ఆవేదన పడి ఆస్థాన పండితుడు మహాకవి అయిన నంది తిమ్మన (ముక్కు తిమ్మన) గారిని రహస్యంగా అంతఃపురానికి పిలిపించుకుని - జరిగినది చెప్పి, ఎలాగైనా మహారాజా వారు అసంకల్ప ప్రతీకార చర్యగా జరిగిన తన (పాదతాడనం) తప్పును క్షమించి - మరచి - మరలా తామిద్దరి మధ్య సాధారణ సంతోష జీవితం జరిగేలా చేయమని కోరింది.

ముక్కు తిమ్మనగారికి "కథకు" పునాది దొరికింది. ఇక కథనం కావాలి. అది మహారాజును ఉద్దేశ్యించి రాసినదిగా వుండకూడదు. అసలు వారి దంపతుల ప్రణయ కలహం తనకు తెలసినట్లు కూడా వుండరాదు. రాణి వారి పేరు అస్సలు బయటికి రాకూడదు. పండితపామరుల నందరినీ అలరించేదిగాను, అందరికందరు ఈ కథ తమ ఇంట జరిగితే బావుండునని ఊహాలోకాలలో తేలిపోయేదిగాను వుండాలి.

ఆయన గారి బుర్రలో "సత్యభామ" కథానాయికగా మెదిలింది. "పారిజాతాపహరణం' ' భాగవంతంలో ఒక చిన్న సంఘటన! ఆ సంఘటనకు చిలువలు - పలువలు - వలువలూ, విలువలూ అద్భుతంగా తన కవితా చమత్కృతితతో అమర్చి "పారిజాతావహరణం" పద్య కావ్యంగా తెలుగులో రచించి, శ్రీకృష్ణదేవరాయలవారికీ అంకితం ఇచ్చి, సభలో చదివి వినిపించి సభికుల మెప్పు పొందాడు.

అయితే సభికులలో మహారాజుగారితో సహా - ఎప్పుడో ఒకప్పుడు భార్య పాద తాడనం చవిచూచినవారే! అయితే ఎవరూ బయటపడి చెప్పుకోలేరు పైకి ఇతరులతో. అంచేత - ముక్కు తిమ్మనగారు సత్యభామ పాదతాడనాన్ని చట్టబద్ధం (లీగలైజ్) చేశారు పారిజాతపహరణం కావ్యంతో "నా కఠిన మణిమయ కిరీటం తగిలి - నీమృదుపాదం దెబ్బ తిన్నదేమో నని నొచ్చుకుంటున్నాను" అనే శ్రీకృష్ణుని మాటలు - ఆబాల గోపాలాన్ని హర్షంలో ముంచి వేశాయి. దక్షిణనాయకుడు - శ్రీకృష్ణుడంతటి దేవుడే - సత్యభామామణి పాదతాడనాన్ని సహజంగా, గౌరవప్రదంగా, ఇసుమంత గర్వంగా - ప్రకటించుకోగా, తమతమ భార్యల - అప్రయత్న - పాదస్పర్శను తాము తప్పు పట్టడం తప్పుకాదా? అమాయకులైన ఆ ఇల్లాళ్లను - పురుషాహంకారంతో సాధించటం మరీ తప్పుకాదా? అనే పశ్చాత్తాపం అందరి కందరిలోను ఉప్పొంగింది. తమ భార్యల పై ప్రేమ పెల్లుబికి పోయింది. మహారాజుగారి లోనయితే సరేసరి తిమ్మనగారిని సత్కరించి ఆ నాటికి సభ చాలించి గబగబా తిరుమల దేవి మందిరానికి "పారిజాతపహరణ:" తాళపత్ర వ్రాతప్రతితో సహా బయల్దేరారు.

తిమ్మన కోరినదీ అదే. ఒక కథ - ఒక కావ్యం - ఒక మంచి మార్పుకు - ఒక మంచి సవ్యమైన ఆలోచనకు - కారణభూతమైతే - ఆ కవి - ఆ కవిత్వం కూడా ధన్యమైనట్లేకదా?

"పారిజాతాపహరణం" ప్రభావంతో గృహిణులంతా సంతోషించారేగానీ - తమ జీవితాలకు భర్తలకి "పాదతాడనం" ప్రసాదించటమే పరమావధి అని ఎవరూ భావించలేదు ఆనాడు - ఈనాడు కూడా! ఇదే ఒక రససిద్ధి. అవునా?

కాబట్టి - అమ్మవారి పాదతాడనం - పరమ శివుని నెన్నుదురును తాకి - జ్ఞాన భిక్ష అర్థించిన ఆదిభిక్షువు ఆ గురు రూపునికి - ఆ దక్షిణామూర్తి రూపునికి - శిరాసా మ్రొక్కుతూ - ఆ జగన్మాత పాదతాడనం - మనసారా కోరుకుందాం. పాదాలను శరణువేడుదాం. ఏ తల్లీ కాళ్లకు చుట్టుకున్న బిడ్డ ముఖం పగిలేలా తన్నదు. లాలించిఒడి లోకి తీసుకుంటుంది. అవునా?

## 87 శ్లో॥ అరికాళ్ల సౌందర్యం
## జగన్మాత పాదకమలముల సౌభాగ్యం

87 శ్లో॥ హిమానీ హంతవ్యం, హిమగిరి నివాసైక చతురౌ
నిశాయాం నిద్రాణం, నిశి చరమ భాగే చవిశదౌ
వరం లక్ష్మీ పాత్రం శ్రియమితి సృజన్తౌ "సమయినాం"
సరోజం త్వత్పాదౌ జనని జయతశ్చిత్ర మిహికిమ్ ?

**అర్ధము** : ఓ జగన్మాతా! మంచు కొండలయందుండుటలో నేర్పు కలవియును, రాత్రియందును (కలువలరూపంలో) ప్రసన్నములైన ( బ్రహ్మ ముహూర్తములో సమయచారులైన (విగ్రహారాధన । బాహిరమైన పూజా విధానములు లేకుండా, తమలోనే షడ్చక్రములలో పరమాత్మను దర్శించేవారు. - ఎకావెకిని సహస్రార చక్రములోనికి శ్వాసను నడిపేందుకు సాధనచేసే వారు సమయాచారులు) నీ భక్తులకు లక్ష్మిని - అనగా ఆధ్యాత్మిక జ్ఞాన సంపదను ప్రసాదించునవియునూ, మంచు చేత ముకుళించుకు పోవునవియును, రాత్రియందు ముడుచుకొని పోవునవియును, లక్ష్మీదేవికి పాదపీఠములుగాను (సింహాసనముగాను) తగినవియును అయిన కమలములను జయించుచున్నవి(.

కమలముల కంటే - అందముగా సుకుమారముగా వున్నాయి. అమ్మవారి పాదములు అనిభావము.

సమయచారులైన భక్తులు శ్రీమాత పాద పద్మాలను తమ భ్రుకుటి మధ్య ఊహిస్తూ, సాధన చేస్తుంటారు తెల్లవారు జామున బ్రహ్మముహూర్తము సమయములో (వారి ఇష్టదేవతా పాదములనో - వారి సద్గురువు పాదకలను - ఇట్లా - వారి వారి ఊహలలో భావనలలో వున్న దైవం యొక్క శ్రీ చరణాలను హృదయ స్థానమైన అనాహత చక్రంలోను, ఫాలభాగంలో వుండే "ఆజ్ఞా" చక్రంలోను ప్రతిష్ఠించుకొని (భావనలో) ధ్యాన స్థితిలో యోగ సాధన చేస్తారు. వారికి ఆ శ్రీమాత పాదకమలాలు - పాదమంజీరాల ధ్వనులు - చిత్కళలు సాక్షాత్కరిస్తాయి. ఇవే లక్ష్మిని ప్రసాదించే మహదైశ్వర్యాలు వారికి! వారు కోరేవీ ఇవే (కార్లు బంగళాలు కాదు) ఆ తర్వాత శాశ్వత మోక్షాన్ని ప్రసాదిస్తుంది. ఆ తల్లి.

అమ్మవారి నేత్రములను, నేత్ర దృష్టిని "సమాస వ్యాస" పద్ధతిలో వర్ణించారు. ఆది శంకరాచార్యుల వారు లోగా 2వ అధ్యాయంలోను 3వ అధ్యాయంలోని 2 శ్లోకాలలోను మొత్తం 10 శ్లోకాలలో, ఆ తర్వాత 4వ అధ్యాయములలో 4 శ్లోకాలలో అమ్మవారి స్తనయుగమును, వక్షోజ వైభవము - స్తన్యము - స్తన్యపాన మహిమను, వర్ణించారు. 5వ అధ్యాయంలోనే 4 శ్లోకాలలో అమ్మవారి నాభి, నూగారు - రోమరాజి యొక్క సౌందర్యము - ప్రభావమును వర్ణించారు. ఇక ఈ 6వ అధ్యాయములో 8 శ్లోకములలో అమ్మవారి శ్రీచరణములను - శ్రీ చరణముల సౌందర్య సౌకుమార్య, పాదతాడన మహిమ - లక్ష్మీ సంప్రాప్తి మోక్షసాధనను - వర్ణించారు. ఇంతగా ఆచార్యుల వారు వర్ణిస్తున్న ఆశ్రీచరణాల యొక్క మహాత్మ్యాన్ని మనబోటి కలికాల మనుషులు - మరుపు ఎక్కువగా కలవారము । జీవన పోరాటంలో ఆధ్యాత్మక చింతనకు ఎక్కువ సమయం కేటాయించలేని వారమైన మనం - ఏదో ఒక శ్లోకం పైన అయినా సరే మనసు పెట్టి - మనసుని అంతర్ముఖం చేసి - ఆచార్యులు బోధిస్తున్న బోధ అందుకుంటాము అనే అపారమైన దయార్ద్ర హృదయం యొక్క ఆరాటము - నాస్తికత పై పోరాటము కావచ్చు. అవునా?

# 88వ శ్లో॥ జగన్మాత పాదముల వైభవము

## (పాదాగ్రము - పాదము పైభాగము)

88 శ్లో॥ పదం, తే, కీర్తీనాం ప్రపద మపదం, దేవి! విపదాం
కథం నీతం సద్భిః, కఠిన కమఠీకర్పర తులాం
కథంవా పాణిభ్యా ముపమయమన కాలే పురభిదా
యదాదాయ న్యస్తం దృషది దయామానేన మనసా ॥

అర్థము : ఓ భగవతీ! జగన్మాతా! సర్వకీర్తులకు, ఉనికి పట్టై, నీ భక్తుల యొక్క సర్వ ఆపదలను తొలగించు నీపాదగ్రములను - సత్కవులు మిగుల కఠినమైన తాచేటి చిప్పతో ఎట్లు పోల్చుతున్నారు? (ఇది సమంజసమా?) శివుడు - మీ వివాహ వేళ దయమాన మానసుడై తన చేతితోనీ పాదాగ్రమును గ్రహించి, ఎట్లు సన్నెకల్లు పై నుంచెనోకదా?

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి పాదాగ్రములను కఠినమైన తాబేటి చిప్పతో పోల్చుటకు ఇష్టపడలేదు. హిందీ భాషలో (పాతహిందీ) గోస్వామి తులసీదాసు రచించిన "తులసీ రామాయణం" అత్యంత ప్రసిద్ధమైనది. ప్రతి దోహే ఒకర సగుళిక. ఒక్క భక్తి మధువు ఝరి

తులసీదాసుకు సీతారాములపై అపరిమితమైన భక్తి. ఎక్కడ సందర్భంవస్తే - అక్కడ - వారిని - విడివిడిగాను, ఇద్దరినీ కలిపి - దోహేలకు దోహేలే - కీర్తిస్తూ రచించేశాడు. భక్తి తత్పరతతో ఆ అమృత ఝరిలో మునకలు వేసాడు.

ఆయనకు - సీతాదేవిని రావణాసురుడు అపహరించటం సుతరామూ ఇష్టం లేదు. కానీ రామాయణం కథా, రావణాసుర వధా ఆ ఘట్టం మీదే ఆధారపడివున్నాయి. మరి ఎలా? వ్రాస్తున్నది రామాయణము. సీతాపహరణం లేకపోతే ఇక కథ ముందుకు సాగేదెలా?

వాల్మీకి రామాయణంలో - రావణాసురుడు - "కపటముని" వేషంలో వచ్చి, సీతను అపహరించుక వెళ్తాడు. జటాయువు అడ్డుపడి - రావణాసురుని రథాన్ని భగ్నం చేస్తాడు. రావణుడి ఒళ్లంతా తనవాడి అయిన గోళ్లతో చీరివేస్తాడు. సీతాదేవి భయభ్రాంత అయి - అడవిలోని వృక్షాల మాటున పరుగులు పెడుతుంది.

జటాయువును చంపిన రావణాసురుడాయెను - జుట్టుపట్టి - ఈడ్చి - తన రెండు చేతులతోను ఎత్తుకుని ఆమె రెండు కాళ్ల క్రిందా, మెడక్రిందా చేతులు వేసి - బాహు మధ్యంలో - నడుము - చంక మధ్య - ఇరికించుకుని - గగన మార్గాన లంక వైపు పరుగెడతాడు. ఇది వాల్మీకి రామాయణంలోని వర్ణన.

కానీ తులసీదాసుకిది ఎంతమాత్రం నచ్చలేదు. శ్రీ విద్యాస్వరూపిణి అయిన సీతాదేవిని - ఒక కామాతురుడూ, రాక్షసాధముడు అయిన రావణుడు స్పృశించటమా? వీల్లేదు.

ఆయన తీవ్రంగా ఆలోచించాడు.

ఒక సంఘటన సృష్టించాడు.

అడవిలోని మారీచుడు ప్రవేశించటానికి (బంగారు లేడి వేషంలో) ముందుగా - శ్రీరాముడు - సీతాదేవితో "సీతా" ఇక రాక్షసులు విజృంభిస్తారు. మాయోపాయాలు పన్నుతారు. నీవు - ఈ ఆశ్రమంలో వుండటం మంచిది కాదు. నీవు అగ్ని దేవుడి వద్ద దాగి వుండు. మాయసీతను ఆశ్రమంలో వుంచుతాను - రావణుడు ఆమెనే అసలు సీత అనుకొంటాడు రావణవధానంతరం నిన్ను మరల తెచ్చుకుంటాను" అని చెబుతాడు.

భర్తమాటకు ఎదురుచెప్పని సీతాదేవి అంగీకరిస్తుందీ ఆలోచనకు, మాయసీత ఆశ్రమంలోనికి, అసలు సీత అగ్ని దేవుని వద్దకు మార్పు జరుగుతుంది.

అట్లా - రావణాసురుడు అపహరించినది మాయసీతనని తులసీదాసు - తృప్తిగా వూపిరి పీల్చుకున్నాడు.

మహా రామభక్తుడైన తులసీదాసు - సీతను పరపురుషుడు స్పృశించటాన్ని మనసా, వాచా, కర్మణా సహించలేకపోయాడు - వాల్మీకి రామాయణమే ప్రామాణికం అయితే అవుగాక - తన మనోనేత్రాలతో అట్లా దర్శించి వ్రాశాడు. ఉత్తర భారతదేశంలో 30 సం॥ క్రితం వరకు, రైళ్ళలో - రైల్వేస్టేషన్లనో - వృద్ధులుగా వుండే పోర్టర్సు - బిక్షగాళ్ళు, సాధువులు - పండితులు, పామరులు, స్త్రీలు కూడా "తులసీదాసు రామాయణాన్ని" - తన్మయత్వంతో గానం చేయటం వినిపించేది. (ఈనాడు ఫాస్టు ఎక్స్‌ప్రెస్‌లలో చీకటి గుహల్లాటి ఎ.సి. కంపార్ట్‌మెంట్సులో - బయటి ప్రపంచంతో సంబంధంలేకుండా ప్రయాణిస్తున్న పండిత పామరులందరికీ - తులసీ రామాయణంగానం కాదు కదా - తులసీ రామాయణంలోని - భక్తి పారవశ్యత కూడా - ఊహలక్కూడా అందరు)

సరిగ్గా అలాగే ఆదిశంకరులు అమ్మవారి పాదాగ్రాలను కఠిన మైన తాబేటి చిప్పతో పోల్చటానికి - మనస్కరించక - బాధ పడ్డారు.

**శ్లో॥ గూఢగుల్ఫా, కూర్మ పృష్ట జయిష్ణు ప్ర పదాన్వితా!"**

అంటూ కీర్తించారు వశిన్యాది వాగ్దేవతలు లలితా సహస్ర నామంలో అమ్మవారి పాదాగ్రాలను గురించి! తాబేటి చిప్పను (కఠినత్వంలో) జయించే పాదాగ్రాలు గల తల్లీ! అని స్తోత్రం చేశారు వాగ్దేవతలు. అయితే ఆది శంకరాచార్యులవారు - మరల - "నీ పాదాలను తన

చేతితో పట్టుకొని - మీ వివాహ సమయంలో సన్నెకల్లు పై ఎట్లా పెట్టాడో గదా ఈశ్వరుడు?' ' అని ప్రశ్నించారు.

వివాహ సమయంలో చాలా ప్రాంతాలలో ఈ సన్నెకల్లు తొక్కటం అనే ఆచారం వున్నది. సాంప్రదాయం వున్నది.

రాతిరోళ్లు - రాతి రుబ్బుడు పాత్రాలు - కొయ్యరో కలిబండలు, పచ్చళ్లు దంచుకోవటానికి, రుబ్బుకోవటానికి - పసువు మొదలైనవి నూరు కోవటానికి ఉపయోగించేవారు మన పెద్దలంతా! ఈ మిక్సీలు, గ్రైండర్లు అందుబాటులోనికి రానంతవరకు గత పది సం॥ల క్రితం వరకు అందరి ఇళ్లలో ఈ రాతిరోళ్ళు (చిన్నవో, పెద్దవో - కొయ్యరోకలి బండలు - రోకళ్లు - రుబ్బుడు పాత్రాలు, వారి వారి కుటుంబ సభ్యుల సంఖ్యను బట్టి) తప్పకుండా వుండేవి. పల్లెటూళ్లలో పేదవారు - పది ఇళ్లకో రోలు - రుబ్బుడు పాత్రం - ఉమ్మడిగా, కలిసికట్టుగా వాడుకొనే వారు.

వివాహ సమయంలో వధువు పాదం - వరుడు పట్టుకొని ఆమె కాలి బొటన వ్రేళ్లు సన్నెకల్లు రాతిది లేక కొయ్యది - పై వుంచుతూ "ఈ రాతి వంటి ధృఢత్వం నీ పాదాలకు వచ్చుగాక - నీ పాదాలు సధృఢములై, నా వెంట జీవితాంతము, నా సహచరిగా, నా సహధర్మచారిణిగా, కష్టాలలోను, సుఖాలలోను నడుచుటకు అనుసరించుటకు సిద్ధపడును గాక. సంసార సాగరంలోని కఠిన పరీక్షలు - సులభంగా ఎదుర్కొనేందుకు వీలుగా నీ పాదములు (మృదుత్వముగా కనిపిస్తూ) కఠినంగా శక్తివంతములై వుండుగాక!" అని పురోహితుడు సంస్కృతమంత్రాలు చదువుతుండగా - భావిస్తాడు.

స్త్రీల పాదాలు మృదువుగా వుంటాయి. కానీ వారు ఎక్కువగా వంటింట్లో తడిలోను, బట్టలుతుకుతూ, ఇంటి పన్లు చేస్తూ - నీటిలోనూ వుండవలసి వస్తుంది. వారి పాదాలు రానురాను ఆ పనుల ఒత్తిడికి - గట్టిపడి - పాదాలు రాటుతేలుతాయి. ఇదే కూర్మ పృష్టము అంటే తాబేటి చిప్పవలె - నీటిని పీల్చుకొనక, పొడిగాను - నీటిలో నాని త్వరగా పాకుడు రాకుండా ధృఢంగాను వుండటం అంటే (తాబేలు నీటిలోపల ఈదుతుంటుంది. అలికిడి అయితే నీటిలోనే గంటల తరబడి దాక్కుంటుంది, శరీరమంతా తాబేటి చిప్పలోనికి ముడుచుకుంటుంది. ఆ చిప్ప ధృఢంగా వుంటుంది. శత్రు భయాన్ని ఎదుర్కొంటుంది.

జీవితము, జీవిత పరిస్థితులు, జీవితపు పరుగు పోటీ, స్త్రీల పాదాలకు ఆ కఠినత్వాన్ని వద్దన్నా ఇస్తాయి. ఈశ్వరుడు కూడా ఆమె పాదం సన్నెకల్లు పై వుంచుతూ - నా వెంట మంచుకొండ - (వెండికొండ) పైననడవాలి. భోగభాగ్యాలలో పెరిగిన నీవు - ఏ భోగాలు ఆశించని జీవితానికి సిద్ధపడాలి. ఈ నీ పాదాలు - నా జీవిత సహచరిగా, సర్వలోక ప్రాణి శిష్టరక్షణ దుష్ట శిక్షణ అనే

మహత్తర బాధ్యతలో - కఠినాతి కఠినమైన - పరిస్థితులను ఎదుర్కొనుటకు సిద్ధపడాలి" అనే సందేశం ఇచ్చాడు! జగన్మాతకు తెలియదా? కోరి - యోగీశ్వరుని వరించిన ఆమెకు పాతివ్రత్యమే యోగం! - భర్త సాన్నిధ్యమే మహాయోగము!

అందుకే - ఆ పాదాగ్రాల పై శిరసు వుంచి మ్రొక్కిన స్త్రీలకు ఆ తల్లి ఆయాచితంగా, చక్కని దాంపత్య జీవితాన్ని - అన్యోన్యానురాగాలుగల చల్లని సంసారాన్ని ప్రసాదిస్తుంది.

ఒక మోస్తరు బాధలకు, భయాలకు, చలించని ధైర్యం, స్థైర్యం ఈనాటి స్త్రీకి అవసరం. భర్త విహీనులు - భర్తృపరిత్యక్తలు, వివాహం వద్దనుకొని, తమవారి కోసం, త్యాగం చేసే మహిళలు - ఎందరో వున్నారీనాడు! సమాజంలో ఉద్యోగినులుగాను, ఇంటి వద్దవున్న, వారు సాటి ఆడ - ఇతర మగవారి వలన ఎదుర్కొనే బాధలు సమస్యలు ఎన్నో ఎన్నెన్నో! అయినా తమ బిడ్డల కోసం - బిడ్డల భవిష్యత్తు కోసం - జీవితాన్ని ఒక తపస్సులా, తప్పటడుగులు వేయకుండా, బాధ్యతాయుతంగా (కొన్ని కుటుంబాలలో పురుషుడు ఏ బాధ్యతా పట్టించుకోడు) పురుషుని బాధ్యతను కూడా తానే వహిస్తూ కర్తవ్య దీక్షతో - పాదాల కాఠిన్యతతో - నడక సాగించే - జీవన యానం సాగించే వారి గమనానికి ఇంతటి శక్తి, ధృఢత్వం ఎవరిస్తున్నారు?

అన్నదమ్ములా? అక్కచెల్లెళ్లా? తల్లితండ్రులా? సమాజమా? కాదు. కాదు. వారి "విధి నిర్వహణ", "కర్తవ్యపాలన" అనే అకుంఠిత దీక్షలో, అంతర్వాహినిలా వున్న ఆజగన్మాత అపారకరుణ! ఆ ఒకటే! ఆ ఒక్కటే - వీరందరికి నడకకూ శక్తి, అదే వెయ్యేనుగుల బలం! కాదనగలమా?

కొండంత ఆలోచనను - ఒక శ్లోకం ద్వారా మనందరికీ పంచిపెట్టారు జగద్గురువు అవునా?

## 89 శ్లో॥ శ్రీమాత శ్రీచరణముల నఖముల సౌభాగ్యము

**89. శ్లో॥ నఖైర్నాక స్త్రీణాం, కరకమల సంకోచ శశిభిః**

**తరూణాందివ్యానాం, హసత ఇవతే చండి! చరణే**

**ఫలాని స్వస్థేభ్యః, కిసలయ కరాగ్రేణ దదతాం**

**దరిద్రేభ్యో భద్రాం, శ్రియ మనిశమహ్నాయ దదతౌ ॥**

**అర్థము :** ఓ జగన్మాతా! చండీ! సకల సంపదలతో తులతూగుచున్న దేవతలకు మాత్రమే కోరికలు తీర్చు కల్పవృక్షమును, దీనులై, దరిద్రులైన జనులకు మంగళకరమై, వారు కోరిన దాని కంటే అధికమగు సంపదలను, తక్షణమే ఒసంగుచున్నవైన నీ పాద పద్మములు -

శచీదేవి మున్నగు దేవతాస్త్రీల చేత నమస్కరింపబడే సమయములలో, వారి కరకమలముల చేత ముకుళింపజేయు గోళ్లను - చంద్రుని చేత పరిహాసము చేయుచున్నవో అన్నట్లున్నవి.

శ్రీ జగద్గురువు శ్రీ శంకర భగవత్పాదుల వారు ఈ శ్లోకంలో - అమ్మవారి పాదములను, వాటి మహిమను, ఆమె పాదనఖముల గోళ్ల మహిమను, వాటి మహిమను వర్ణిస్తున్నారు.

దేవతలు - తమ తపస్సుతో సాధించుకున్న సంపదలెన్నో వుంటాయి. అయినా వారికి తనివితీరదు. దేవ నందనోద్యానములోని కల్పవృక్షము - తన చిగురుటాకులు అనే చేతులతో (ఆ దేవతా వృక్షపు ఆకులే - వరప్రదాయినులైన ఆ వృక్షపు హస్తాలుగా వర్ణించారు ఆచార్యులవారు) - ఆ దేవతలకు మరిన్ని - సంపదలను తీర్చుతున్నది.

ఇది గమనించిన నీవు - ఓ తల్లీ! మానవుల ఎడల నీకు గల అపార కరుణతో, మానవులలో వున్న దీనులు, దరిద్రులు అయినవారు నిస్సహాయస్థితిలో, నీ పాదాలకు మ్రొక్కిన మరు క్షణంలో వారందరికీ అధిక సంపదలను, ఆధ్యాత్మిక ఉన్నతిని ప్రసాదిస్తున్నావు.

ఇక నీ పాదాలకు నమస్కరించటానికి వచ్చిన శచీదేవి మున్నగు దేవతాస్త్రీలు తమ కరకమలములు ముకుళించి చేతులు మోడ్చి! నీ పాదములకు నమస్కరిస్తుండగా

శుద్ధస్ఫటికముల కాంతి వంటి నీ కాలిగోళ్లలో - నీశిరసు పై వున్న చంద్రుడు పది వ్రేళ్లలోను పది గోళ్లలోను పది చంద్రులుగా ప్రతిఫలించి - ఆ దేవతాస్త్రీల ముకుళిత హస్తాలను చూచి పరిహసిస్తున్నాడు ఏమని?

చంద్రుని కాంతిలో కమలాలు ముకుళిస్తాయి. (కలువలు వికసిస్తాయి)

"ఓ దేవతాస్త్రీల కరకమలములారా! మీరంతా కోరిన కోర్కెలు తీర్చే కల్పం వృక్షం వలన - మీకున్న సంపదలకంటే - తృప్తి లేక ఇంకా ఇంకా సంపదలు కోరి - మీ తపస్సు క్షీణింప జేసుకుంటూ - కోరికలు - సంపదలు అధికంగా పొందుతున్నారు.

కానీ, పాపం ! భూలోక మానవులో?

వారిక ఏ కల్పవృక్షమూ లేదు, వారు స్వర్గానికి సశరీరులైరాలేరు.

వారిలో దీనులు, దరిద్రులు ఎందరో వున్నారు. వారికి ఆర్థిక సాయం అందించే మనవులెవరూ వుండరు.

వారు నిస్సహాయస్థితిలో ఇక దైవంతప్ప దిక్కు లేదన్న శరణాగతి హృదయంతో - జగన్మాతను - ఆమె పాదాలను ఆశ్రయిస్తారు. ఆ తల్లిపాదాలకు శిరసామ్రొక్కిన మరు క్షణంలో వారికి - కష్టాలు, కన్నీళ్లు తొలగిపోయి, అధిక సంపదలను, ఆధ్యాత్మిక జ్ఞాన సంపదను వారు పొందుతున్నారు.

అంతటి భావాన్ని పొందుపరచారు ఆచార్యులవారీ శ్లోకంలో. మన కోర్కెలు గొంతెమ్మ కోరికలు, ఇతరులను పీడించే హిరణ్యాక్ష్య వరాల లాటివి కాకుండా వుంటే చాలు. ఆ తల్లి పాదాలను మనసా, వాచా, కర్మణా మనం శరణాగతి చెందిన మరుక్షణం మనకు సర్వసంపదలు ఒనగూడుతాయి. ఆ జగన్మాత పాదమహిమ అంతగొప్పది. అయితే తెల్లవారే సరికి పూరిగుడిసె బంగళాగా మారి - రిక్షా బండి - ఇంఫాలా కారులా మారిపోయి, శరీరం మీద పాత చొక్కాలు, చీరెలు జరీ బట్టలుగా మారిపోయి, ఇంట్లోని పాత్రలన్నీ బంగారు వెండి పాత్రలుగా మారిపోయి - ఇలాటి పగటి కలలు కాదు "సంపద" అంటే!

మన సమస్యల వలయాల నుండి మనకు తెలియని, వూహించని మార్గం దొరికి మనం బయటపడ్డగలగటమే గొప్పసంపద. "ఏం ఫర్వాలేదు. మనకంటే దీనులు, దరిద్రులు ఎందరో వున్నారు. అవిటి వారు వున్నారు. వాళ్లందరు జీవించటం లేదా!" అనే ఆత్మవిశ్వాసమే కొండంత సంపద.

"మనకు వున్నది చాలు. మనకు కేవలం సుఖాలే రాకూడదు. అప్పుడప్పుడు మన నడవడికను సరిదిద్దే కష్టాలు, ఆత్మ విమర్శ చేసుకొనే అవకాశం కల్పించే కష్టాలు, కన్నీళ్లు - మానవ ప్రగతికీ పురోగతికీ సోపానాలు. "అనేజ్ఞానం ఒకటీ కోట్ల విలువ చేసే సంపద! కాదంటారా?

## 90 శ్లో॥ జగన్మాత చరణ కమలముల చెంత భ్రమరము నైనను చాలు!

**90. శ్లో॥ దదానేదీనే భ్యః, శ్రియ మనిశమాశాను సదృశీ**
**మమన్దం, సౌందర్యప్రకర మకరన్దం వికిరతి**
**తవాస్మిన్ మన్దారస్తబక సుభగే! యాతు చరణే!**
**నిమజ్జన్మజ్జీవః కరచరణైః షట్చరణ తామ్ ॥**

**అర్థము** : తల్లీ! భగవతీ! జగన్మాతా! దీనుల కెల్లరకును, వాంఛానురూపమైన (వారి వారి కోర్కెలననుసరించి) సంపదను నిరంతరం ప్రసాదించేదియును, మిక్కిలి సౌందర్యము, లావణ్య సమూహము అనుపూ దేనియను (మకరందమును) వెదజల్లుచున్నదియు, కల్పవృక్ష రూపమైన నీ పాద పద్మముల యందు.

మనస్సు + పంచేంద్రియములు అనెడి ఆరు పాదముల భ్రమరమునై
నీ పాదకమలములందలి మకరందమును గ్రోలుదును గాక!

ఈ శ్లోకం శ్రీ శంకర భగవత్పాదుల వారు తమని తాము భ్రమరంగా మారి - అమ్మవారి శ్రీ చరణ కమలముల యందలి మకరందము గ్రోలుతూ వుండిపోవాలని ఆకాంక్షించారు.

బ్రహ్మ సూత్రములు, ఉపనిషత్తులు - భగవద్గీత (ప్రస్తాన త్రయము) వంటి గ్రంథములకు వ్యాఖ్యలు వ్రాసి లెక్కలేని స్తోత్రములు రచించి - యావద్భారతదేశానికే గాక, యావత్ ప్రపంచానికే జగద్గురువుగా భాసించిన ఆదిశంకరాచార్యులంతటి వారు - వినయంతో ఒక కీటకంగా, భ్రమరముగా మారి అమ్మవారి పాద పద్మ మకరందం అనే జ్ఞాన సారాన్ని గ్రోల వలెనని ఆకాంక్షించారు.

మనమనగా ఎంతవారం? మన జ్ఞానం ఎంతటిది? ఆచరణలో ఇసుమంత లేక - చూపలేక - కేవలం ఉపన్యాసాలలో, వాచావేదాంతంలో ఘనాపాటీలముగా ఆత్మవంచన చేసుకొంటున్న మనము - జగద్గురువుల - అపార భక్తి - ప్రపత్తి - శరణాగతి - వినయముతో కూడిన నివేదన ముందు - ఎంతటి అల్ప జ్ఞానులమో ఆలోచించుకొనే అవకాశం కలిగిస్తోందీ శ్లోకం.

ప్రతి మనిషికీ - భ్రమరానికీ దగ్గర పోలికలున్నాయి.

భ్రమరం - ఆరు కాళ్లుగల కీటకము.

పూలలోని మకరందాన్ని గ్రోలటమేదాని జీవిత లక్ష్యం

అట్లాగే తన ఆకారంతో సామ్యం (దగ్గర పోలికలు గల)

కీటకం చుట్టూరా ఝుంకార నాదంతో - ప్రదక్షిణలు చేసి చేసి - ఆ కీటకానికి భ్రమర లక్షణాలు। ఆకారము తెస్తుంది భ్రమరం। దీనినే "భ్రమర కీటక న్యాయం" అంటారు పెద్దలు.

ప్రతి మనిషికీ ఆరు పాదాలు వుంటాయి ఎలా?

కళ్లు, ముక్కు, నాలుక, చెవులు, చర్మము - ఇవి పంచేంద్రియాలు. వీటితో కూడిన మనస్సు ఆరవ పాదం. పంచేంద్రియాలు + మనస్సు కలసిన షట్చరణ జీవుడు ఆరు కాళ్ల ప్రాణియే మానవుడు ! స్త్రీ అయినా పురుషుడయినా ఒకటే ఈ విషయంలో.

ఈ ఆరుపాదాలు ఆధారంగానే మనిషి జీవితం మంచి వైపుకో, చెడు వైపుకో ఆకర్షింపబడుతుంటుంది.

ఇక ప్రపంచంలో జనాపేక్ష, ధనాపేక్ష, భోగాపేక్ష - మనుషుల కున్నంతగా ఏ ప్రాణికీ లేదు. పూవు పూవు మీదికీ భ్రమరం పరుగెత్తుతున్నట్టే - మనుషులు సుఖలాలసత, భోగలాలసత, అనే మకరందం కోసం వెంపర్లాడుతూ పరుగెడుతుంటారు.

ఇక - తమ మాటలతో చేతులతో - నిరంతర సాన్నిహిత్యం సాంగత్యంతో - తమ ప్రక్కవారిని ప్రభావితం చేసి తమలా మార్చుతారు మనుష్యులు.

లంచం తీసుకొనని వ్యక్తిని - పోరిపోరి - లంచాలు - తమలానే తీసుకొనే స్థాయికి దిగజారుస్తారు.

నీతిగా బ్రతికే స్త్రీని - అవినీతి పనులకు ప్రోత్సహించి ఆ రొంపిలోనికి దింపి ఆనందిస్తారు కొందరు నీచమైన స్త్రీలు.

వ్యసనాలు అలవాటు లేని వ్యక్తికి, పేకాట, జూదము - వ్యభిచారం వంటి బలవంతంగానైనా నేర్పి - తప్పుదోవ పట్టిస్తారు కొందరు ఘనులు.

కానీ - అలా అని అందరూ ఇలాగే వుండరు.

తమ ఆదర్శవంతమైన జీవితంతో - ప్రక్కవారిని సరిదిద్ది - సన్మార్గానికి తెస్తారు కొందరు సంస్కార పూరితులు.

వ్యసనాలు ఒద్దు ఒద్దు అని పోరిపోరి - అవి వదిలిస్తారు కొందరు సద్వ్యక్తులు.

ఇలా - భ్రమర కీటక న్యాయం ప్రకారం ప్రక్క వారిని ప్రభావితం చేయగల సామర్థ్యము, మాటల గారడీ, వాక్చాతుర్యము - సద్వాక్కు క్రియారూపశక్తి - ఇవన్నీ మానవులకే సాధ్యం.

మంచి వైపు మరలినా - చెడువైపు తిరిగినా ఆ ఆరు పాదాల అడుగులు చాలు మనిషికి!

ఆదిశంకరులు - ఈ మనదేశం మనకు ప్రసాదించిన అనర్ఘ రత్నం. జగద్గురువు వారు - శ్రీమాత చరణ కమలాలను శరణుపొంది. తల్లి పాద కమలాలలోని జ్ఞానమకరందాన్ని జన్మజన్మలకు గ్రోలటానికిగాను కీటక జన్మ భ్రమరంగానైనా మారటానికి వెనుకాడలేదు. ఆ ఆధ్యాత్మిక మకరందాన్ని భ్రమరంలానే (వృక్షాల ఫలదీకరణ భ్రమరం చేసినట్లే -) మనబోటి వారందరికీ పంచి - జ్ఞాన బీజాలు మనందరిలో నాటాలని తహతహలాడి - అందుకుగానూ కీటక జన్మ (భ్రమరం) కోరుకున్న మహనీయుడాయన! వారి "శివానందలహరి" లోని 9వ శ్లోకంలో

## (శివానంద లహరి - 9వ శ్లోకము)

**శ్లో॥ నరత్వం, దేవత్వం, నగ, వనమృగత్వం, మశకతా**
**పశుత్వం, కీటత్వం, భవతు, విహగత్వాది జననమ్!**
**సదాత్వత్పాదాబ్జస్మరణ పరమానంద లహరీ**
**విహారాసక్తం చేద్ధృదయ మిహకిం తేన వపుషా?**

**అర్థము** : మానవుడుగాగానీ, దేవతగాగానీ, పర్వతముగాగానీ, వనముగాగానీ, చెట్టుగాగానీ, దోమగాగానీ, పశువుగాగానీ, పురుగుగాగానీ, పక్షులు మొదలైనవిగాగానీ నా పుట్టుక

ఏదైనా అగుగాక! నీ పాద పద్మముల యొక్క స్మరణ మనెడి పరమానంద ప్రవాహమున విహరించుటకు ఆసక్తి కలిగిన మనస్సు మాత్రము ఉంటే చాలు.

శరీరం ఏదైనా ఫర్వాలేదు. నీ నామోచ్ఛరణ - నీ యందు

భక్తి నాకు స్థిరంగా వుండేలా ప్రసాదించు పరమశివా! శంభో!

అని ప్రార్థించారు. మహాత్ములకు శరీరం నిమిత్త మాత్రమైనది. మనస్సు - ఆత్మే ప్రధానమైనది.

కాబట్టి - మనం - ఎలాటి భ్రమరాలుగా వున్నామో ఇంతవరకు ఆత్మ పరిశీలన చేసుకుందాం!

జగద్గురువంతటి వారు అంతటి వినయంగా ప్రార్థిస్తుండగా, వారి జ్ఞానంలో ఒకటిబై కోటి వంతు లేని మనం - శ్రీమాత చరణ కమలాల భ్రమరాలుగా మారటానికి ఈ జన్మలో ప్రయత్నమైనా చేయవద్దా? తప్పక చెయ్యాలి. తప్పని సరిగా చేయాలి. అయితే - పారాయణం చేద్దాం - పదండి ముందుకు.

## 91వ శ్లో॥ జగన్మాత పాదవిన్యాసము నడక సౌందర్యము హంసగమనము

**శ్లో॥ పదన్యాస క్రీడా పరిచయ మివారబ్ధు మనసః**
**స్ఖలన్త స్తే ఖేలం భవన కలహం సానజహతి**
**అతస్తేషాం శిక్షాం సుభగమణి మంజీర రణిత**
**చ్ఛలా దాచక్షాణం చరణ కమలం, చారుచరితే!**

**అర్థము :** చక్కని చరిత్ర గలిగిన ఓ తల్లీ (చారుచరితే!) నీ పద విన్యాస క్రీడా పరిచయము సంపాదింప గోరిన వైన నీ పెంపుడు హంసలు, నీవలె నడువలేక, తొట్రుపడుచు, నీగమన విలాసమును వీడకున్నవి.

అందువలన ఆరాజహంసలకు ఖేలన శిక్షను (నడవటములోని మెళుకువలను) గరపుచున్నట్లున్నవా? అన్నట్లు, రతనాలు, కెంపులు తాపిన నీ కాలి అందెలు ఒకానొక అతి సున్నితమైన ధ్వనిని చేయుచున్నవి. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి నడకలోని సౌందర్యాన్ని, వైభవాన్ని వర్ణిస్తున్నారు. అమ్మవారి నడక హంసగమనం.

"మరాళీ మందగమనా! మహాలావణ్యశేవధీ" అంటూ కీర్తించారు. వశిన్యాది వాగ్దేవతలు - లలితా సహస్రనామ స్తోత్రంలో. ఆడహంస నడక - శబ్దంగాని - మృదు పదధ్వనితో - వుండే నడక. ఉచ్ఛ్వాస నిశ్వాసములంతటి సున్నితమైన నడక శబ్దం గలవి హంసలు!

అమ్మవారి పెంపుడు హంసలు ఆమె భవనంలో వుంటాయి. అవి హంస గమనంతో అంతటా కలయ తిరుగుతుంటాయి. సరోవరంలో ఈదులాడుతాయి.

అయితే హంస గమనాన్ని జయిస్తున్న అమ్మవారి నడక తీరు చూచి గమనించి, అట్లా తాము నడవవలెననే కోరిక, తాపత్రయముతో అమ్మవారి పాదాల వెంటే ఆమె అడుగులను అనుసరిస్తూ తమ నడక సరిదిద్దుకుంటున్నట్లుగా నడుస్తున్నాయట! ఇక ఆ తల్లి రతనాలు, కెంపులు పొదిగిన కాలి అందెలు - చిరు మువ్వల ధ్వనులు చేస్తూ ఆ హంసలకు "నడకలో శిక్షణ ఇస్తున్నట్లుగా ధ్వనిస్తున్నాయి!

మనందరం నడుస్తాము. కొందరు నడుస్తుంటే - కులికినట్లుంటుంది. కొందరు నడుస్తుంటే - ఒక ప్రక్కకు ఒరిగిన్నట్లుంటుంది. కొందరు నడుస్తుంటే - దూకుతున్నట్లుంటుంది. మరొకొందరు నడుస్తుంటే - "వీళ్లదినడకా? పరుగా?" అనిపిస్తుంటుంది. కొందరు ప్రక్కవారి మాటలు రహస్యంగా వినటానికి - అడుగులో అడుగు వేస్తూ - శబ్దం రానివ్వకుండా - ఊపిరి బిగబట్టినట్లు నడుస్తారు. మరి కొందరు మాటల్ని (విన్న వాటిని - చూచిన వాటిని) అర్జంటుగా అందరికీ బట్వాడా చేయటానికి, పరుగుతో, దూకుతో, పర్వతాలు లంఘించేట్లుగా హైజంప్ పోటీలో పాల్గొంటున్నంత ఉత్సాహంగా నడుస్తారు. మరికొందరు నడుస్తుంటే భూమి బ్రద్దలౌతుందేమోనని భయం వేస్తుంది.

ఇంకాకొందరు "రెస్ట్‌లెస్"గా అటు ఇటు పచారు చేస్తున్నట్టు నడుస్తూనే వుంటారు. వీరు కూర్చోరు. ప్రక్కవారిని స్థిమితంగా కూర్చోనివ్వరు. పద్మవ్యూహంలోనికి జొరబడుతున్నట్లు - మనుషుల మధ్య నుంచి, ప్రక్కల నుండి - పైనుండి - తోసుకుంటు, తొక్కుకుంటు, నిలువుగా, అడ్డంగా, ఐమూలగా - దూరుకుంటు, దూసుకుంటు నడుస్తుంటారు. నడుము మెడా, వీపు సాంతం వంచేసుకుని అధోజగత్‌లోనికి అతివాగుడులాగే ఈ రకం "అతి" నడకల వారితో చాలా చిక్కులు ఎదుర్కొంటుంటాము కృంగిపోతున్నట్లు, గూని వచ్చేసినట్లు, నడుస్తుంటారు కొందరు. శనిదేవుడి అధోదృష్టిలా వుంటుంది వీరినడక! వీరికి తమ కాలిక్రింది వస్తువు తప్ప, కాలిక్కాస్త దూరంలో వున్న ప్రాణిగానీ, వస్తువుగానీ కనిపించవు ఆ "అధోదృష్టి నడకలో! తరచూ.

నడుము అతిగా వంచకుండా, మరీ నీలుక్కున్నట్లుగాకుండా, కులకటం లేకుండా - పాదాలు అతిశబ్దం చేయకుండా - అలాఅని స్పాంజికట్టుకున్నట్లు (పాదాల అడుగున) అస్సలు శబ్దం రాకుండా (దొంగల్లా కాకుండా) తిన్నగా నడవటం ఒక గొప్ప వరం. గొప్ప కళ. అందుకు పూర్వకాలంలో బామ్మలు - అమ్మమ్మలు - ఆడపిల్లల్లో ఎవరైనా సరిగా నడవటం లేదని

గమనిస్తే - ఆ పిల్ల నెత్తి మీద నిండుగా నీళ్లున్న నీళ్ల బిందెగానీ, కడవగానీ పెట్టి - నీరు తొణక్కుండా, మనిషి తట్టుకుని పడకుండా తిన్నగా నడవమని - కొంత కాలం అలా నడిపించి ఆ నడక సరిచేసేవారు.

ఇక ఈ కాలంలో అందాల పోటీలలో పాల్గొనే (మిస్ రాష్ట్రం, మిస్ దేశం - మిస్ వరల్డ్ లాటి) పోటీలకు - శారీరక ఫిట్‌నెస్ తోబాటు - లోక జ్ఞానంకు సంబంధించిన పరీక్ష (ఓరల్ టెస్ట్), (వాకింగ్), నడక కూడా ముఖ్యమైన అంశాలు అవుతున్నాయి. క్యాట్ వాక్ (Cat walk) కూడా ఒకటి. వీటికీ మార్కులు వేస్తారు జడ్జీజలు. నృత్యంలో - అది ఏ నృత్యరీతి అయినా, "నడకలు" ఒక నృత్య శిక్షణ (స్టెప్స్ - ఒక ఐటమ్) హస్త ముద్రల లానే పతాక, అర్థపతాక, అర్థ చంద్ర - అభయ - ఇలా ముద్రలు - హంసనడక, నెమలి నడక, లేడినడక, సింహగమన - గజగమన ఇలా నడకలు వుంటాయి. ఆయా నృత్యాంశాన్నిబట్టి.

శ్రీశంకరభగవత్పాదుల వారు కేవలం అమ్మవారి శారీరకమైన నడకను గురించి మాత్రమే చెప్పలేదీ శ్లోకంలో.

ఒకానొక గూఢార్థాన్ని వివరించారు.

హంసలు అమ్మవారి నడకను అనుసరించటం అనే మాటలో - జగన్మాత దర్శనానికి - శ్వాసనడక - ఇడాపింగళనాడులలోనిది బ్రహ్మ గ్రంథి, విష్ణుగ్రంథి, రుద్ర గ్రంథిని ఛేదించిన తర్వాత, "సుషమ్న"లోనికి ప్రవేశించి - "ఆజ్ఞా"చక్రాన్ని చేరాలి.

అక్కడే "హం, స" అనే రెండక్షరాలు కలిగిన రెండు దళాలు గలిగిన పద్మం వుంటుంది. శ్వాసను-(ప్రాణాయమాన్ని), క్రమబద్ధీకరించగలిగిన సాధకులు "సో, హం") ("హంస") భావనతో అజ్ఞానచక్రంలో శివదర్శనం చేసి (ఆత్మ దర్శనం చేసి) సహస్రార చక్రంలోనికి చేరి కామేశ్వరీ కామేశ్వరులతో - ఐక్యం అవుతున్నారు. సుధా వర్షంలో - నాడీ మండలానికి తర్పణం చేయగలుగుతారు. తొట్రుపాటు పడకుండా, సిద్ధులకు ప్రలోభ పడకుండా, స్వార్థానికి యోగాన్ని ఉపయోగించుకోకుండా - సాధకులు సహస్రారం చేరుకోవటమే తిన్ననైన అమ్మవారి నడకను హంసలు అనుసరించటం అంటే! ఆ హంసలు ఎవరు ? సాధకులు! పరమ హంసలు. ముక్తహంసలు. గమనించారా ?

"చారుచరితే!" అంటూ ఆ తల్లిని గొప్ప చరిత్ర గలిగిన తల్లీ! అని సంభోదిస్తూ ఆ తల్లి తిన్ననైన నడక - సర్వ మానవాళీ అనుసరించదగినది - అనుకరించదగినది - అంతకు మించిన జ్ఞానమార్గం, మోక్షమార్గం మరొకటి లేదు అని పరోక్ష బోధ చేశారు అచార్యులవారు. నడక తిన్నగా వుంటే, నడత తిన్నగా వుంటుందనే సామెత వుంది కదా?

## ఆరవ అధ్యాయం సమాప్తం

ఈ అధ్యాయంలో శ్రీ శంకర భతవత్పాదుల వారు "సకలహ్రీం" అనే నాలుగు అక్షరాల మంత్రమైన పంచదశీ మంత్రంలోని చివరి భాగము - శక్తి కూటమును శ్రీమాత మంత్రరూప శరీరంగా వర్ణించారు. నడుము నుండి పాదాల వరకు - నఖములు, నడకలతో సహా సుస్పష్టంగా వివరించారు. 81వ శ్లోకం నుండి 91 శ్లోకం వరకు గల ఈ అధ్యాయంలోని 11 శ్లోకాలను భక్తి శ్రద్ధలతో పారాయణ చేసిన భక్తులకు శ్రీ జగన్మాత - అగ్నిని ఆర్పగల శక్తి, అగ్నిస్తంభన అనే శక్తి ప్రసాదిస్తుందన్నారు. శ్రీమాత ఉపాసకులు! "అగ్నిస్తంభన" అనగా ఏ భవనాలో షార్ట్ సర్క్యూట్‌తో తగలబడిపోతుంటే హాం - ఫట్ అని ఆర్పగలిగే శక్తి కాదు - లోలోపల అగ్నిలా దహించివేసే కోరికలను, కొరతలను "స్తంభన" - అనగా నిర్వీర్యం చేస్తుంది. జలగండములు లేకుండా - అమ్మవారి అపార కరుణ ప్రసాదిస్తుంది. మనలోని కోర్కెలనే గుర్రాలను, మూర్ఖత్వం అనే మదపుటేనుగులను, తగాదాలు కొని తెచ్చుకొనే తగని ఉత్సాహాన్ని నిరోధిస్తుంది. సద్గురు బోధను - సద్గురు బోధనలోని సారాంశాన్ని, ఆగురువు హృదయంలోని భావాలలోనికి పరకాయ ప్రవేశ విద్యలా ప్రవేశించి ఆకళింపు జేసుకొని, సదర్థాన్ని గ్రహించే వివేకాన్నీ జ్ఞానాన్నీ ప్రసాదిస్తుంది. మన చుట్టూరా భూత ప్రేత పిశాచాల్లా నర్తిస్తున్న ప్రలోభాల కరాళ నృత్యాల నుండి మనల్ని కాపాడుతుంది. అమ్మవారి అపారకరుణతో విషపు పురుగులైన సర్పాలు మొదలైనవి కూడా. భక్తులయందలి దైవ తేజస్సు గుర్తించి - సాధువుల్లా వుండిపోతాయి. (మృగములు కూడా (మృగముల వంటి మానవులు కూడా - చిత్తశుద్ధితో అమ్మవారిని స్తోత్రం చేసే భక్తుల ముందు శిరసువంచుతారు). సర్వరోగ శమనము - ఇటు శారీరక మానసిక రోగములు అటు అజ్ఞానమనే తమస్సుతో కూడిన రోగములు రెండు ఉపశమిస్తాయి. అపారసంపద - అనగా మోక్షధనప్రాప్తి కలుగుతుంది. అయితే చిత్తశుద్ధితో, శరణాగతితో - ఫలం మీద ఆసక్తి మనసా, వాచా, కర్మణా లేకుండా చేసేవారికి పైవన్నీ అమ్మవారు ప్రసాదిస్తుందని గ్రహించాలి: (నిజంగా అలా చేసేవారు ఏ ఫలము ఆశించరు అమ్మవారి కరుణ తప్ప!)

"ఈ శ్లోకం పారాయణ చేస్తాను

నువ్వేమి ఇస్తావు తల్లీ!" అనిపీడించే వారి నుంచి భయపడి - బాధ పడి ఆ తల్లి చాలా చాలా దూరం పారిపోతుంది. ఆమెను అందుకోవటానికి ఈ జన్మచాలదు. అంచేత - చిత్తశుద్ధితో శరణాగతితో పారాయణ చేద్దాం. మనకేది అవసరమో - ఏది ఇవ్వాలో - ఏది ఇవ్వకూడదో - ఆ జగన్మాతకు తెలిసినంతగా మనకు తెలియదు సుమండీ.

## 6వ అధ్యాయం సమాప్తం

# 7వ అధ్యాయము సప్తమోధ్యాయః

# 92 శ్లో॥ అమ్మవారి విరాట్ రూపదర్శనము

జగన్మాత కూర్చునే మంచె యొక్క మహిమ

92. శ్లో॥ గతాస్తే మాఞ్చత్వం ద్రుహిణ హరి, రుద్రేశ్వర భృతః
శివ స్స్వచ్ఛచ్ఛాయా కపట ఘటిత ప్రచ్ఛదపటః
త్వదీయానాం భాసాం ప్రతిఫలన రాగారుణతయా
శరీరీ శృంగారో, రస, ఇవ, దృశాం, దోగ్ధికుతుకమ్ ॥

**అర్ధము** : ఓ జగన్మాతా! భగవతీ! బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు ఈశ్వరుడు అను ప్రపంచ పాలనాధి కారముగల పురుషులు నలుగురు, మహేశ్వర తత్వము నందు అంతర్గతులైనవారు కావున, వారు నలుగురు, నీవు అధిష్టించు మంచము (మంచె) (సింహాసనము) నకు నాలుగు కోడులై వున్నారు. ఇక, నీ పతియగు సదాశివుడు - అతి తెల్లని మేనికాంతి గలవాడు, నిరంతరం నీ సాన్నిధ్యమునే కోరువాడు, (శివశక్తులు అబేధమనే భావము గలవాడు) గనుక, ఆతడు నీ మంచము పై పరచు దుప్పటమై (దుప్పటి), నీ శరీర అరుణ వర్ణమును, తన శుద్ధ స్ఫటిక సంకాశమగు శరీరంలో ప్రతిఫలింపజేసుకుని, నీలోని శృంగార రసము (ఎరుపు వర్గము) మూర్తీభవించి, సదాశివ రూపము దాల్చినదా? అన్నట్లుగా వున్నాడు.

ఈ అధ్యాయంలో 92వ శ్లోకం నుండి 99వ శ్లోకం వరకు శ్రీ శంకర భాగవత్పాదుల వారు ఈ 8 శ్లోకాలలో అమ్మవారి విరాట్ రూప దర్శనం చేస్తున్నారు. మనందరికీ చేయిస్తున్నారు. - లోగా అధ్యాయాలలో అమ్మవారి శరీర సౌందర్యం నెపముతో ఆ తల్లి మంత్ర రూప శరీర సాక్షాత్కారం చేయించారు. ఇక ఈ అధ్యాయంలో ఆ జగన్మాత కూర్చునే మంచె మొదలు, వివిధ రూపములలో ఆ తల్లి విరాట్ రూపమును సాక్షాత్కరింప జేస్తున్నారు.

ఆ జగద్గురువు వెంట, జాగ్రత్తగా నడచి వెళదాం పదండి.

ఈ శ్లోకంలో జగన్మాత కూర్చునే మంచె యొక్క బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, - ఈశ్వరుడు నాలుగు కోళ్లుగా మారారని ఆది శంకరాచార్యుల వారు వర్ణించటంలో - సృష్టిస్థితిలయ దిక్కులు - దిక్పాలకుల యొక్క అధికారులు నలుగురు - ఆతల్లి శక్తికి ఒకానొక సాధనా రూపములుగాను వున్నారని భావము. "పంచబ్రహ్మాసనాసీనా!" అనే లలితా నామ స్తోత్రంలోని నామార్థములవలె పంచబ్రహ్మలే ఆసనముగా గలిగిన తల్లి ఆమె. ఇక సదాశివుడు. పరమశివుడు - ఆమె పతి, ఆమె మంచెకు దుప్పటముగా (మంచె పై పరచే గుడ్డ - దుప్పటి) మారటము అనగా, శివశక్తుల

సమైక్యరూపమును పరక్షోంగా వర్ణించారు. "భూపురత్రయము, నాలుగుద్వారములు" అని చెప్పబడే శ్రీ చక్ర రచనలోని 9వ చక్రముగా ఈ "మంచె"ను ఊహించుకోగలిగితే. నాలుగు వేదములు ఆకోళ్లు, బిందు త్రికోణ రూపిణి అయిన అమ్మవారి స్వరూపానికి ఆలంబన అయిన సదాశివుడు - జగన్మాతల పరస్పర విలీనత - సదాశివుడు దుప్పటముగా మారటము (దీర్ఘచతురస్రము) ఆ తల్లి దేహకాంతి ఎరుపువర్ణము - ఆస్వామి శరీరంలో ప్రతిఫలించటము అనగా, ప్రకాశ స్వరూపుడు శివుడు - విమర్శరూపిణి అమ్మవారు. ఇరువురి సమైక్యతే ఈ సృష్టి అంతా!

## 93 శ్లో॥ శంభుకరుణ

**93. శ్లో॥ అరాళా కేశేషుప్రకృతి సరళా, మన్దహసితే**
**శిరీషాభాచిత్తే దృషదుపలశోభా (దషదిపకఠోరా) కుచతటే,**
**భృశంతన్వీమధ్యే పృథురురసిజారోహవిషయే**
**జగత్త్రాతుం శమ్భో! ర్జయతి, కరుణా! కాచిదరుణా!**

**అర్థము :** తల్లీ! జగన్మాతా! శంభుని యొక్క అనిర్వాచ్యమైన "అరాళా" యను శక్తి - నీ కురుల యందు ప్రకాశించుచున్నది. అందువలననే అవి సుగంధ కుంతలాలు "సుగంధ కుంతలాంబ" అనే దేవీ పీఠం వున్నది. నల్లని మేఘమువలె కాంతి, చల్లదనం కలిగిన కుంతలములు - కేశములు - నీ చిరునవ్వునందు నీ ప్రకృతి సహజ స్వభావముగా "సరళా" యనుశక్తి ప్రకాశించుచున్నది. (ఆ తల్లి చిరునవ్వు అతిసరళంగా, వెన్నెల వెల్లువ వలె వుంటుంది)

నీ చిత్తము నందు "దిరిశెనపూవు" లాగున అతిమృదుతరమైన కృపారస ప్రపూర్ణమైన "మహామృద్వి" అనుశక్తి ప్రకాశించుచున్నది.

ఇకస్తన ప్రదేశమునందు సన్నెకంటి శోభగల (రాతి రుబ్బుడు పాత్రము) "శోభగల శక్తి" ప్రకాశించుచున్నది.

కుచములయందు (పాలిండ్లయందు) "స్థూలశక్తి" ప్రకాశించుచున్నది.

"అరుణాం, కరుణా తరంగితాక్షీం!" అంటూ లలితాసహస్ర నామస్తోత్రంలో ప్రప్రథమ ధ్యాన శ్లోకం కీర్తించారు వశి న్యాది వాగేవతలు. "అరుణ వర్ణము గల తల్లీ! కరుణా తరంగముల వంటి కరుణా ప్రపూర్ణ దృష్టులు ప్రసరించే కనులు గల తల్లీ!" అంటూ

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు ఆ జగన్మాత విరాట్ రూపంలో ఏయే శక్తులు నిక్షిప్తమై వున్నాయో వివరిస్తున్నారు.

ఆమెకురులయందు మాత్రం వక్రత - వంకరలు - (ఇక ఏ అవయవములోనూ వక్రతలేదు) అనే "అరాళా" శక్తి వున్నది. వంకలు వంకలు తిరిగిన జుట్టు స్త్రీలకు ప్రత్యేక అందం ఆ వంకరలు లేనివారు, సినిమాతారలు - ఓ మోస్తరు జరుగుబాటు వున్నవారు, తలపిన్నులుతో, ఎలక్ట్రిక్ ట్రీట్‌మెంటుతో, జుట్టు వంకీలుగా చేయించుకోవటం మనందరికీ తెలుసు.

సహజంగా నొక్కులు నొక్కులుగా వుండే జగన్మాత కురులు, నల్లని కారుమబ్బులు - అలలు అలలుగా కదులాడ్తున్నట్లు వుంటాయి. ఇదే "అరాళా" - వంకలు తిరిగి అనేశక్తి.

ఆమె విరిసీ విరియని పెదవులతో నవ్వేదరహాసరేఖ, చిరునవ్వులో, ప్రకృతి సరళా - అనగా, స్వభావము చేతనే చక్కని నడవడి, ఋజువర్తనము, నిర్మల హృదయము మొదలైన లక్షణాలుగల స్త్రీలు మాత్రమే శబ్దంరాకుండానూ, విరగబడి నవ్వకుండానూ, పళ్లన్నీ బయట పడకుండానూ! ఒక్క చిరునవ్వులో కోటి వెన్నెలలు కురిపించే తమ చిత్తశాంతిని ప్రతిబింబింపజేయగలరు. ఆ తల్లి చిరునవ్వులో "సరళా" శక్తి నిక్షిప్తమైవున్నది.

ఇక ఆ తల్లి చిత్తము - మనస్సు. "దిరసెనపూవు" వంటి సుతిమెత్తని అతిసుకుమారమైన స్వభావముకలది. "పలాశకుసుమోపేత" అనే ఉపమానం చెబుతుంటారు అతి సున్నితమైన పువ్వును స్వభావాన్ని గురించి తెలిపే సందర్భాలలో కవులు. అంతటి నవనీత హృదయ కాబట్టే - ఆ తల్లి తనని పూజించే భక్తుల యొక్క పూజలలో పేద, గొప్ప తేడా చూడకుండా, ఆ భక్తుల యొక్క భక్తి సాంద్రతకు చలించి పోయి - వారిని ఉద్ధరిస్తోంది. అపకారం చేసే దానవులను కూడా చివరివరకు - మంచి మార్గానికి రమ్మని నచ్చ చెబుతుంది. ఇక వాళ్ళు వినక - మూర్ఖంగా లోకపీడ కలిగిస్తున్న తరుణంలో ఆమె చిత్తము కఠిన తరంకాకతప్పదు. వారికీ మోక్షం ఇస్తోంది శిక్షించి. ఇక స్తన మండలము సన్నికల్లునందు పసుపు మొదలైన గట్టి పదార్థాలను నూరే రాయిని "పాత్రము" - అంటారు. దృషత్ + ఉపలశోభా = దృషదుపలము అనగా దానివంటి కాంతి అనగా ఆరాయి అతి నున్నగా కాంతివంతంగా వుంటుంది. (నూరి నూరి పాలిష్ చేయబడినట్లు) అంతకంటే ధృఢత్వము, బరువు - (బలుపు) కలిగి వుంటుంది. ఆ తల్లి కుచములు - సర్వజీవరాశి ఆహారము ప్రసాదించే విగనుక ఆ ప్రదేశము - ధృఢముగను - బరువుగను - గట్టిగను వుంటుంది. ఇక ఆ జగన్మాత - స్తనముల యందు, నితంబము (పెరుగుదల యందు) "పృథుః" అనగా స్థూలమైనది. లావైనది అగుశక్తి నిండివుంటుంది. లోగా ఆ తల్లిని తంబములు వైభవం వర్ణించే శ్లోకంలో హిమవంతుడు తనలోని గురుత్వశక్తినీ - విస్తారశక్తినీ - కుమార్తె అయిన జగన్మాత పిఱుదులలో (నితంబములలో) అరణంగా (వివాహ

సమయ కానుకగా ఇచ్చాడని తెలుసుకున్నాము. అదే ఈ పృథు శక్తి, స్థూల శక్తి ఇది. మానవులు కూర్చోవటానికి ఉపకరించేవి నితంబములు. యోగాసనములు ఎక్కువ భాగం కూర్చోనేవే వుంటాయి గనుక. గంటల తరబడీ ధ్యానంలో కూర్చునే వారికి నితంబములు ధృఢంగా వుండాలి.

శరీర భాగాన్ని భారాన్ని మోసే నితంబము స్త్రీకి విస్తారంగాను ధృఢంగాను వుండి తీరాలి.

శంభోః శంభుని యొక్క, "కాచిత్" అనగా అనిర్వాచ్యమైన అత్యంత మహిమగల "అరుణా" యను శక్తి, కరుణా స్వరూపము గల (కృపా, దయా స్వరూపము గలది అయిన శక్తి) ఈ ప్రపంచమును రక్షించుటకు (జగత్ - త్రాతుం)

"జయతి" అనగా "నేనే అనే అహంకార రూపముతో" (సర్వోత్కర్షతో) అత్యంత ఆత్మ విశ్వాసముతో - వర్తించుచున్నది. శివశక్త్యైక్య స్వరూపాన్ని ఈ శక్తి సమ్మేళనంతో వర్ణించారు ఆచార్యులవారు. పరోక్షంగా అమ్మవారిలో లీనమైవున్న ఈశ్వర శక్తుల ప్రస్తావన చేసి, ఈ జగత్తు నంతటినీ రక్షించటానికి వారిరువురి శక్తుల పరస్పర కలయిక ఆధారము అని చెబుతున్నారు.

తల్లి - తండ్రి - ఇరువురూ, పిల్లలకు వున్నపుడే వారి జీవితాలు ఏ కొరవా, వెలితీ లేకుండా సాగిపోతాయి. ఏ ఒక్కరు లేకున్నా - తీరని వెలితి చోటు చేసుకుంటుంది వారి హృదయాలలో! అందుకే ఆచార్యుల వారు శివశక్తులిద్దరి శక్తి సమ్మేళనను వర్ణించి లోకాలన్నిటికీ ఆ ఇద్దరి కరుణా ఆవశ్యకమని భోదిస్తున్నారు.

## 94వ శ్లో॥ అమ్మవారి మరకత కరండకము అనగా తాంబూల ద్రవ్యాలు దాచుకొనె భరిణె యొక్క మహిమ

**94. శ్లో॥ కళఙ్కః కస్తూరీ రజని కరబిమ్బం। జలమయం,**
**కళాభిః కర్పూరై ర్మరకత కరండం, నిబిడితమ్**
**అతస్త్వ ద్భోగేన ప్రతిదినమిదం, రిక్తకుహరం**
**విధిర్భూయో, భూయో, నిబడయతినూనం, తవకృతే! ॥**

**అర్థము** : ఓ జగన్మాతా! లోకములలోని జనమంతా తమ అజ్ఞానమువలన, చంద్రమండలమని దేనిని భావించుచున్నారో, నిజమునకది చంద్రమండలము కాదనినా భావము. మరకత మణులచే చేయబడి, నీవు తాంబూల చర్వణానికిగాను పచ్చ కర్పూరం, ఏలకులు - లవంగాలు మొదలైన ద్రవ్యాలు దాచుకొనే భరిణె ! చంద్రునిలోని "కళంకము" (మచ్చ) అని దేనిని జనులు వూహిస్తున్నారో అది నీవు తాంబూలములో ఉపయోగించుకొనే

"కస్తూరి" అనే సుగంధ ద్రవ్యం యొక్క రంగు. దేనిని "చంద్రుడని" జనులు పొరబడుతున్నారో, అది నీవు జలకమాడు పన్నీరు నింపిన తొట్టె! (పెద్దగిన్నె - టబ్) "చంద్రకళలు" అని జనులు చెప్పుకొనేవి. నీవు తాంబూలములో ఉపయోగించుకొనే పచ్చకర్పూర తునకలు! ఈ వస్తువులన్నీ నీవు తాంబూల చర్వణములో రోజూ ఉపయోగించుకుంటున్నందువల్ల ఆ భరణె ఖాళీ అవుతుంటుంది. అట్లా అది ఖాళీ అయ్యీ, కాకమునుపే బ్రహ్మ మరలా ఆ వస్తువులను నీ భరిణెలో వేసి మరల మరల (భూయో భూయో) నింపుతున్నాడు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు

జగన్మాత విరాట్రూప దర్శనాన్ని, కాలస్వరూపిణిగాను దర్శింపజేస్తున్నారు. చంద్రుడు అనగా జలం! మనస్సు! అది ఆమెకు జలకమాడు పన్నీరు తొట్టి! అనగా, ఆ తల్లి భక్తుల హృదయాలు - అనే పన్నీటి తొట్టిలో స్నానమాడుతోంది. అందరు నిద్రపోయే సమయంలో యోగులు నిద్రపోరు. వారు నిరంతర జాగరరూకులైవుంటారు. ఆ యోగుల పరమహంసల అవధూతల - పరివ్రాజకాచార్యుల - మహాభక్త శిఖామణుల హృదయాలు - మనస్సు అనే - మహాతొట్టి (టబ్)లో ఆతల్లి రాత్రి వేళ (వారి ధ్యాన సమయంలో - వారు జాగరూకులై దర్శిస్తారు) చంద్ర కిరణాలలో జలకాలాడుతుంది. ఇదొక కాల స్వరూపం! కాలస్వరూపిణి, ఇక చంద్రకళలు పచ్చకర్పూరపు పలుకులు. వాటిని ఆమె తన తాంబూలంలో నములుతుంది. రోజుకో కళ చొప్పున చంద్రుని కళలు తగ్గిపోతాయి. 15 రోజులకు అమావాస్య వస్తుంది. కాల స్వరూపిణి అయిన జగన్మాత ఆచంద్రకళలని తనలో లీనం చేసుకుంటూ - మరల "నిత్య" (16వ కళగా) గా భాసిస్తోంది. ఆ చంద్రకళలు / పచ్చ కర్పూరపు పలుకులు - అయిపోగానే - మరల బ్రహ్మ దేవుడు ఆ భరిణెవాటితో నింపుతున్నాడు అని చెప్పటంలో - అమావాస్య రోజు నిత్యకళ అంతర్లీనంగా వుంటుంది. మరలా పాడ్యమి (ప్రతిపత్) నుండి చంద్రకళలు దినదినాభివృద్ధి పొందుతాయి. పౌర్ణమి వరకు ఈ కళలను బ్రహ్మ మరల మరలా నింపుతున్నాడు తల్లి తాంబూలపు భరిణెలో!

"కస్తూరి" - నలుపు ఎరుపు కలసిన - ఎర్ర మట్టి రంగు (మెరూన్)లో వుటుంది. (పూర్వకాలం బాలింతలకు - ప్రసవానంతరం - వెంటనే శరీరంలోని వేడి రావటానికీ, శీతలం కమ్మకుండా వుండటానికి తమలపాకులలో కస్తూరి పెట్టి - నమిలించే వారు) చంద్రునిలోని "మచ్చ" ఆమె తాంబూలంలో వేసుకొనే "కస్తూరి" అనే సుగంధ ద్రవ్యం యొక్క ముద్ద రంగు.

(ఏలకులు - లవంగాలు - పచ్చ కర్పూరం - జాజికాయ జాపత్రి, కుంకుమపువ్వు, సోపు - ఇవన్నీ వక్కపొడిలో వేసి కలిపి ఇళ్లల్లో తయారు చేసుకొనేవారు. సుగంధంతో బాటు - ఏలకులు కడుపులో మంట (ఎసిడిటీ)ని తగ్గిస్తాయి. లవంగాలు - ఆకలిని, జీర్ణశక్తిని

పెంపొందిస్తాయి - పచ్చకర్పూరం సువాసనతో బాటు కంఠనాళాల్ని - ప్రేవులనీ శుభ్రపరుస్తుంది. జాజికాయ, జాపత్రి - వంటివి సువాసన తోబాటు జీర్ణప్రక్రియకు దోహదం చేస్తాయి - కుంకుమ పువ్వు నోటినీ, నాలుకను, పెదవులను, కాంతివంతం చేస్తుంది. గర్భిణీ స్త్రీలకు రోజూ రాత్రివేళ పాలల్లో కుంకుమ పువ్వువేసి కలిపి త్రాగించే వారు గత మూడు నాలుగు దశాబ్దాల క్రితం! తల్లుల లోపల పెరిగే బిడ్డకు చురుకుదనం, తెలివితేటలు, కాంతివంతమైన శరీరం - వస్తుందని కుంకుమ పువ్వుతో! "కస్తూరి" శరీరంలో తగినంత కాక (శైత్యం కమ్మకుండా) సమశీతోష్ణ స్థితిని ఇస్తుంది. ఇలాటి తాంబూల చర్వణం వలన స్త్రీలకు - జీర్ణప్రక్రియ బావుండి - వారిలో కడుపులో మంట (ఎసిడిటీ - అల్సరులాంటివి) రాకుండాను వారు జన్మనిచ్చే బిడ్డలకు శరీరకాంతి, చురుకుదనము, తెలివితేటలు - జ్ఞానము వస్తాయని ఆయుర్వేద శాస్త్రం ఆధారంగాను, అనుభవసారం ఆధారంగాను చేసేవారు. నోటి దుర్వాసన అరికట్టడానికీ, దంతములు ధృఢంగా వుండటానికి - నాలుక పై రసోత్పత్తి చక్కగా వుండటానికి - పెదవులు ఎర్రగాను, అందంగాను, శీతాకాలం పగలకుండా వుండటానికి - ఆకులు - వక్కలు - (వక్కపొడి, సున్నం, కాల్షియం) - మంచి నెయ్యి వేసి కలుపుతారు వక్కపొడిలో) "వ్యాసలైన్" (వాజిలెన్) లా పని చేయటానికి - ఇన్నిటూత్ పేస్టులు - అడ్వర్టైజ్‌మెంట్లు లేని ఆకాలంలో - పై తాంబూలం - అద్భుతంగా పని చేసేది. వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటుతూ సుగంధ ద్రవ్యాలు - కంటికి కనిపించటమే అరుదై - జీవితపు పరుగులో - వక్కపొడి - తయారీ "పెద్ద పని"" అయిపోయి - రకరకాల వక్కపొడులు మార్కెట్లో లభ్యమవుతుండగా - ఒక "కిల్లీ" వేసుకొంటే తీరిపోయే దానికి - ఇంత జంఝాటం ఎందుకు? అనిపించే ఈ రోజుల్లో - టూత్ పేస్టులూ - బ్రష్‌లు - డెంటిస్టులు - మౌత్‌వాష్‌లు - వచ్చిపడిపోయాయి. అవునా!)

ఇక - మహారాణులు - రాజులు బంగారు - మణులు తాపడం చేసిన భరిణెలు - పెట్టెలు వాడే వారు తాంబూల ద్రవ్యాలకు. జమిందారులు, సంపన్నులు బంగారు, వెండి భరిణెలు, పెట్టెలు, వాడేవారు. మధ్యతరగతివారు అల్యూమినియంతో చేసిన పెట్టెలు - భరిణెలు వాడేవారు. ఆ ద్రవ్యాలు చెడిపోకుండా వుండటానికి, అన్నీ ఒక దగ్గర వుండటానికి (సిగెరెట్లకు అలాటి పెట్టెలు వాడటం కొన్ని రోజులు ఫ్యాషన్‌గా వుండేది). తాంబూల చర్వణానికిగానూ!

అమ్మవారిది మరకత మణులతో చేసిన భరిణె! మరకతములు - అతివిలువైనవి. కల్మషహరములు. విషహరములు. ఆ భరిణె ఏదో కాదు. చంద్రమండలం. చంద్రుని చుట్టూరా పరచుకుని వుండే "ఆరా". కాలస్వరూపిణి అయిన ఆ జగన్మాత. మహాకాలాన్ని తన చేతిలో ఇమిడే మరకత మణి భరిణెగా చేసుకోగల్గిన శక్తి స్వరూపిణి!. ఈ విరాట్ రూప సందర్శనాన్ని చేయించారు ఆచార్యులవారు. అవునా? మరో శ్లోకంలోకి పదండి. ముందుకు.

# 95 శ్లో॥ జగన్మాత పాదసేవ - సపర్యకు అర్హత కావాలి.

95. శ్లో॥ పురారాతే రంతః పురమసి తతస్త్వచ్చరణయో
స్సపర్యా, మర్యాదా, తరళ కరణానామ సులభా
తథాహ్యేతే నీతా శ్శత మఖ ముఖాస్సిద్ధి మతులాం
తవద్వారో పాన్త స్థితి భి రణి మాద్యాభి రమ రాః ॥

అర్థము : తల్లీ ! ఓ జగన్మాతా! నీవు పరమేశ్వరుని పట్టపురాణివి. అందువలన నీ అడుగు దామరలు పూజించుభాగ్యము చపలచిత్తులైన వారికి లభించదు. ఇంద్రుడు మొదలుగా గల దేవతలు నీ ద్వారముల చెంత అణిమాద్యష్ట సిద్ధులతో - కావలి కాచుచున్నారు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు జగన్మాత పాదకమల సేవకు ఎవరు అర్హులో - ఎవరు అనర్హులో - వివరిస్తున్నారు. ఆ తల్లి చింతామణి గృహంలో కొలువై వుంటుంది. జితేంద్రియులై, శరణాగతులై, అనన్యభక్తి శ్రద్ధలతో - నవావరణలు అధిగమించి ఆ తల్లి పాదములను దర్శించగలిగిన వారే అర్హులు.

కొంత తపస్సు - నియమితమైన పూజ, సాధన చేయగానే అణిమాద్యష్ట సిద్ధులు వస్తాయి సాధకులకు. వాటి మోహంలో పడి పోతారువారు. అహంకారం వస్తుంది. వారు ఆ తల్లి పాదకమలాలు దర్శించలేరు.సేవించలేరు! ద్వారంకడనే వుండిపోతారు!

ఇంద్రుడు - శతమఖుడు ! నూరు యజ్ఞాలు చేసి ఇంద్రపదవి పొందిన తపశ్శాలి. ఒక్క యజ్ఞం చేయటమే కష్టం. నూరు యజ్ఞాలు అవిఘ్నంగా చేయగలగటం మాటలు కాదు. కానీ - అంతటి ఇంద్రుడు - తనకు ఆ తపోబలంతో లభ్యమైన అణిమాద్యష్ట సిద్ధుల మాయలో పడి - ప్రలోభాలలో చిక్కుకుని

జగన్మాత పాదాల చెంతకు వెళ్లకుండా - ఆ తల్లి - నవావరణ చింతామణి ద్వీపం వెలుపలి ద్వారం వద్ద - కావలి వాడివలె - పడిగాపులు కాస్తున్నాడు - అతడి వెంట అతడి దేవతాగణము అంతే!

"అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సదుర్లభా!" అని కీర్తించారు. వశిన్యాది వాగ్దేవతలు - లలితా సహస్రనామ స్తోత్రంలో అమ్మవారిని

అంతర్ముఖులై - లౌకిక భోగాలకు ప్రలోభాలకు సిద్ధులకు లొంగని, వాటిని గురించి పట్టించుకోని సమయాచారులు - మహా నిర్మోహ భక్తులకు మాత్రమే ఆ తల్లి పాదసేవ లభ్యమౌతుంది.

"బహిర్ముఖ సుదుర్లభా!" ఇంద్రాది దేవతల వలెనె - నిరంతరం భోగాపేక్ష, ధనాపేక్ష, ప్రలోభాలతో కూడిన మనస్సుతో - సిద్ధులురాగానే - వాటితో అహంకార ప్రదర్శన చేసుకొనేవారికి - "సుదుర్లభా" చాలా చాలా చాలా దూరంగా వుంటుందా తల్లి! మనబోటి వారమంతా ఆ తల్లి పాదదర్శనం - స్పర్శనం - సేవా కావాలో లేక ఓ బంగళా, ఓకారు - ఓ పెద్ద టి.వి., వి.సి.ఆర్ - పొగిడే (డబ్బు చూసి) బంధుమిత్రులు - గొప్ప ప్రదర్శించుకోవటం అనే సంపదలు - సిద్ధులతో - ఆతల్లి పాదాలకు సుదూరంలో నిలబడి పోవాలో - మనంత మనమే నిర్ణయించుకొనే అవకాశం ఇచ్చారు జగద్గురువులు ఈ శ్లోకంలో ! ఆలోచిద్దామా? ఏం చేద్దామో?

## 96 శ్లో॥ జగన్మాత పాతివ్రత్య మహిమ

**96. శ్లో॥ కళత్రం వైధాత్రం, కతికతి భజన్తే న కవయః**
**శ్రియోదేవ్యాః కోవానభవతి పతిః కైరపిధనైః**
**మహాదేవం హిత్వా తవసతి సతీనామ చరమే**
**కుచాభ్యాం మాసంగ కురవకతరో రప్య సులభః ॥**

**అర్థము** : ఓ సతీమతల్లీ! భగవతీ! జగదంబా! సరస్వతీదేవిని ఎందరెందరు కవులు భజించుట లేదు? సిరుల వలన ఒకగూడిన ధనముతో ఎవ్వడు "లక్ష్మీపతి కాడు?

కానీ - సాధ్వీమణులలో శిరోమణివైన - ఓ సతీమతల్లీ! మహాదేవుడైన శివునికి దప్ప, నీ ఆలింగనము కురవక తరువునకు సైతము లభ్యము కాదు కదా?

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు జగన్మాతపాతివ్రత్య మహిమ, సతీత్వమును వర్ణిస్తున్నారు.

కావ్యములు వ్రాసి, కవిత్వములు చెప్పి, ఎందరెందరో కవులు రాజులకో ధనవంతులకో అంకితం ఇస్తుంటారు. ఆ అంకితం పుచ్చుకున్నవారు (కృతికర్త తండ్రిగాను, "కృతిభర్త" అంకితం పుచ్చుకున్నవారు) గాను (సరస్వతీపతి)గా కీర్తింపబడుతాడు. కొందరు కవులు "వాణి నారాణి' ' అని సగర్వంగా చెప్పుకున్నారు కూడాను. ఇక ధనవంతులైన వారంతా "లక్ష్మీ పతులు"గా కీర్తింపబడుతున్నారు - వారివద్ద ధనం పుచ్చుకొనే వారందరిచేతా!

కానీ "పార్వతీ పతిని నేను" అని చెప్పుకొనే సాహసం - దుష్టమాట - ఏ యుగంలోను ఎవరూ అనలేరు! అలా అని ఆ మహాదేవుని ఇల్లాలి వైన నిన్ను అవమానించగల సాహసము శక్తీ ఎవరికీ లేవు. సరస్వతి జడస్వరూపం, సాధనలో అతి కష్టం మీద ఆమెను స్వాధీనపరచుకోవాలి. (అక్షర జ్ఞానం, విద్య - కవిత్వము - కావ్యరచన అన్నీ)

లక్ష్మీదేవి అతి చంచల! ఆమె విష్ణుమూర్తి వద్దనే నిరంతరం వుండదు. లోకాలలో ఎవడు కాస్తంత తపస్సు చేస్తే - వాడి ఇంట్లో - వాడి అర్హతానర్హతలు చూడకుండా కొలువౌతుంది. కానీ జగన్మాత ఆదిశక్తి అట్లా కాదు. మహాదేవుని అర్థ శరీరంలో స్థానం పొందింది. ఆయన శరీరపు బూడిదే తన విభూది (ఐశ్వర్యం)గా భావించింది. ఆ స్వామి సర్పాలే - తనకు ఆభరణాలని భావించింది. పిశాచ గణమేతన ఇష్ట పరివారంగా భావించి, వారిని ఆదరించింది.

మంచుకొండ కాపురమే మహాసౌభాగ్యం అనుకున్నది. జటాజూటధరీ, కపాలధారీ - స్మశానవాసీ అయినా సరే మహాయోగేశ్వరుడైన పరమ శివుడు తన పంచప్రాణాలు అనుకున్నది! అందువలననే శివశక్తులుగా ఒకరిలో ఒకరు లీనం కాగలిగారు. అట్టి పతివ్రతా శిరోమణిని ఎవరు "పార్వతి పతి" అని చెప్పుకోగలడు? కళ్లు పేలిపోతాయి! అవునా!

"కురవతరువు" అనగా గోరింట చెట్టు.

గోరింట చెట్టును ఆలింగనం చేసుకొంటే - కన్యలకు (పెళ్లి ఆలస్యం అయిన కన్యలకు - పెళ్లి కుదరని కన్యలకు - ఇంటి పరిస్థితుల వలన పెళ్లిగాని కన్యలకు - త్వరగా పెళ్లి అవుతుందని - మంచి వరుడు వస్తాడనీ ఒకానొక నమ్మకం వున్నది ఈ నాటికీ పల్లె ప్రాంతాలలో!)

గోరింటాకు - స్త్రీల జీవితాలలో ఒక భాగంగా వుండేది (ఇప్పుడైనావున్నది - హెన్నాలు వచ్చాయి)

గోరింటాకు పెట్టుకొని చేతిగోళ్ళు, అరచేతులు ఎర్రగా పండితే ఆనందించని కన్య, స్త్రీ, ముత్తైదువ వుండదు గాక వుండదు. ఐదవతనం స్థిరంగా వుండాలని ఆషాఢమాసంలో గోరింటాకు తప్పనిసరిగా పెట్టుకుంటారు స్త్రీలు. చేతులకు పెట్టి కోవటానికి వీలు కాపోతే అరికాళ్లలో అయినా పాదాల క్రింద కాస్తంత రాసుకోమంటారు పెద్దలు ఆషాఢ మాసంలో చేతులు అర చేతులు ఎంత ఎర్రగా పండితే అంత మంచి భర్త వస్తాడు కన్యలకని ఓ ప్రగాఢ విశ్వాసం వున్నది. నిరంతరం ఇంటి పనులలో మునిగి వుండే స్త్రీల గోళ్లు తడికి - చిట్లి - (బాక్టీరియాతో ఫంగస్) చీము పట్టి, గోరు చుట్లు లాటి బాధలు రాకుండా గోరింటాకు గోళ్లను రక్షిస్తుంది. చేతివ్రేళ్లు - కాలివ్రేళ్లు అరికాళ్లు - క్రిములను ఎదుర్కొనే శక్తి కలిగివుంటాయి. కళాత్మకంగా- గోరింటాకు పెట్టుకున్న అరచేతులతో - నృత్య కళాకారిణి హస్తముద్రలకు ప్రత్యేక అందం వెల్లివిరుస్తుంది. నవవధువుకు పెళ్లిలో గోరింటాకు తప్పనిసరి అలంకారం!

అరచేతిలో పూసిన మొక్కలేని పూలు ఈ గోరింటాకు - లక్ష్మీ నిలయమైన అరచేతులకు గొప్ప అలంకారం. (ఈనాడు "హెన్నా" గా ప్లాస్టిక్ కోన్‌లలో దొరుకుతోంది. సిటీలలో ఇదేవాడుతున్నారు మరోదారిలేక)

గోరింటాకు చెట్టుకు కొద్దిపాటి ముళ్లు, (చిరుముళ్ళు ) వుంటాయి. (కొన్ని జాతుల మొక్కలకు వుండవు).

"కురవతరువును కౌగలించుకుంటే నీకు త్వరగా వివాహమౌతుంది. అట్లా చెయ్యి. శివుడు దిగివస్తాడేమో!'' అని చెలులు చెప్పగా పార్వతి నవ్వి -

"మహాదేవుని ఆలింగనానికి తప్ప - ఈ నా శరీరం ఏ జడ - చైతన్య పదార్థాన్నీ కోరదు' ' అని ఖండితంగా చెప్పింది.

ఆ పరమశివుడే - ఆమె తపస్సుకు మెచ్చిదిగివచ్చాడు తర్వాత! అందువలన - కురవ తరువుకు (గోరింట చెట్టుకు) కూడా లభ్యంగాని ఆమె ఆలింగనం - ఒక్క మహాదేవునికే పరిమితం! ఆ తల్లి మహాసాధ్వి.

ఆసాధ్వీమ తల్లికి మ్రొక్కుదాం.

తనకు మనసారా మ్రొక్కినవారికి అయాచితంగానే సర్వమంగళములూ ప్రసాదించే సర్వమంగళ జగన్మాత అవునా?

## 97వ శ్లో॥ మహామాయా స్వరూపిణి శ్రీ జగన్మాత

**97. శ్లో॥ గిరా మాహుర్దేవీం ద్రుహిణ గృహిణీ మాగమవిదో**
**హరేఃపత్నీం పద్మాం హరసహచరీ మద్రి తనయామ్!**
**తురీయా కాపిత్వం దురిధిగమ నిస్సీమ మహిమా**
**మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషీ!**

**అర్థము :** ఓ పరబ్రహ్మమహిషీ! జగన్మాతా! ఆగమ విధులు (ఆగమములు క్షుణ్ణంగా తెలిసినవారు) నిన్నే బ్రహ్మ పత్నియగు సరస్వతియందురు. నిన్నే శ్రీహరి పత్నియగు "లక్ష్మి"వి అందురు. నిన్నే హరుని సహచరియగు "గిరితనయ" పార్వతి యందురు. కానీ, నీవు ఈ ముచ్వురి కంటె వేరై, నాలుగవ దేవివై, ఆదిపరాశక్తివై ఇట్టిట్టిదని వర్ణింపనలవికాని అనిర్వాచ్యవై దేశకాల వస్తువులకు అపరిచ్ఛిన్నవై, భేధింప నల వికాని మహా ప్రభావము కలిగినట్టిది, శుద్ధ విద్యయందు అంతర్గతమైన మహామాయవై, మాయాతత్వమువగుచు ఈ ప్రపంచమును నానావిధములుగా మోహపెట్టుచున్నావు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు జగన్మాత యొక్క సర్వశక్తి సమన్విత మైన యోగమాయా స్వరూపాన్ని వర్ణిస్తున్నారు. ఆగమములన్నీ జగన్మాతను

త్వం కీర్తి శ్రీః ధృతి స్సిద్ధి, హ్రీ ర్విద్యా, సంతతి ర్మతిః
సంధ్యా, రాత్రిః, ప్రభా, నిద్రా, జ్యోత్స్నా, కాంతిః క్షమా, దయా!"

అంటూ కీర్తిస్తున్నాయి.

మహాకవి కాళిదాసు తన శ్యామలా దండకంలో తాను కొలిచిన కాళీ స్వరూపిణిని

"సర్వతీర్థాత్మికే, సర్వమంత్రాత్మికే, సర్వతంత్రాత్మికే, సర్వముద్రాత్మికే, సర్వశక్త్యాత్మికే, సర్వవర్ణాత్మికే, సర్వరూపే!హే! జగన్మాతృకే! పాహిమాం! - తుభ్యంనమోదేవి! తుభ్యంనమోదేవి! తుభ్యం నమోమ్!" అంటూ కీర్తించాడు.

సర్వ వర్గములు = అక్షరములు
సర్వ వర్ణములు = రంగులు
సర్వ వర్ణములు = కులములు
} అన్నీ ఆ తల్లి స్వరూపమే

సర్వ తంత్రములు - మంత్రములు, తీర్థములు (పుణ్యనదులు) సర్వపుణ్యక్షేత్రములు, సర్వముద్రలు (యోగముద్రలు, నాట్య ముద్రలు, అధికార ముద్రలు, రాజముద్రలు, (చిహ్నాలు) అన్నీ ఆ తల్లి స్వరూపాలే!

యజ్ఞములు యాగములు యుగములు మొదలు - మోసములు - కపటములు వరకుగల సర్వతంత్ర విద్యలు - తంత్రములు - పద్ధతులు ఆ దివ్యశక్తి యొక్క సంకల్ప, వికల్పముల ప్రతిబింబములే! ఆమె కానిదంటూ ఏమీలేదు. ఆమె లేనిదంటూ ఏమీలేదు. యోగమాయగా సర్వలోకాలను నిద్ర, పరవశత, మూఢత్వ, తామసాలనలోనికి నెట్టివేసే శక్తి ఆమెయే! వాటి నుండి విముక్తి చెందించి - ముక్తిని ప్రసాదించేది ఆమెయే!

ఆమె శుద్ధ విద్యాస్వరూపిణి! తన యోగమాయతో సర్వలోకాలను భ్రమింప జేయనూకలదు. ఆ మాయను తొలగించి, అపార కరుణతో తన భక్తులకు - తన శుద్ధ విద్యారూపాన్ని దర్శింపజేసి, తరింప జేయనూగలదు! అందుకే ఆమె పరబ్రహ్మ మహిషి!

ఆ తల్లి విరాట్ రూపం వర్ణించి, ఆయోగమాయా స్వరూపిణి దర్శనం మన మనో నేత్రాల ముందు సాక్షాత్కరింపజేశారు గమనించండి - జగద్గురువు! ఈ సాంసారికమైన సమస్యల వలయాల నుండి - ప్రలోభాల నుండి కాస్సేపయినా మనంత మనంగా బయటపడి - బంధవిముక్తులమై - ఆశుద్ధ విద్యాస్వరూపిణి పాదాలు దర్శించటానికి పారాయణకు వెళదాంపదండి.

పారాయణ ఎవరింట్లో చేస్తున్నారు? వారు మన అంతస్తుకు తగినవారా? కారా? మనం వెళితే చులకనౌతామా? స్టేటస్ పోతుందా? మనదీ - మన భర్తదీ - అధికారాన్ని వారు - ఈ పారాయణ జాలంతో (వలతో) ఉపయోగించుకోజూస్తున్నారా? పారాయణ చేసినంత మాత్రాన

ఆవిడ ఓ పెద్ద భక్తురాలని భ్రమపడ్తున్నామా? అది అంగీకరించి ఆమె "గొప్ప" పెంచుతున్నామా? ఇంకా ఇంకా ఇలాటి కుశంకలు - బుర్రలో మెదులుతున్నాయా?

అవే! అవే! మనల్ని వెనక్కిలాగే అహం సంకెళ్లు! ఫాల్స్‌ప్రిస్టేజి ఇనుప సంకెళ్లు.

ఏ గృహం జగన్మాత స్తోత్ర పారాయణంతో పునీతం అవుతున్నదో - అదే దేవ నిలయం. స్తోత్రరూపంలో, వాగ్రూపంలో - సౌందర్యలహరి పారాయణ రూపంలో సాక్షాత్కరిస్తున్న జగన్మాతను దర్శించలేని మహామాయకు లోను కాకూడదు సుమండీ! మనకు తర్కాలతో!

పదండి - వెళదాం

## 98 శ్లో॥ జగన్మాత చరణ కమల ప్రక్షాళన జలం తీర్థం - తాంబూల రసం యొక్క మహిమ

**98. శ్లో॥ కదాకాలేమాతః కథయ కలితాలక్తకరసం**
**పిబేయం విద్యార్థీ, తవచరణ నిర్ణేజన జలం**
**ప్రకృత్యామూకానామపిచ కవితా కారణతయా**
**కదాధత్తే వాణీముఖకమలతాంబూల రసతామ్!**

**అర్థము** : తల్లీ! జగదంబా! లత్తు కరసముతో (పారాణితో) కలసిన నీ పాద ప్రక్షాళన జలమును - విద్యార్థినగు (శుద్ధ విద్య తెలుసుకోగోరిన విద్యార్థినగు) నేను ఎప్పుడు త్రాగుదునో చెప్పుము. నీ పాద ప్రక్షాళన జలము త్రావినంతనే, చెవిటి వారికి వినుశక్తి, మూగవారికి మాటలాడు శక్తి కలిగించునదై గురుశిక్ష బడయని వారలకు కూడా (గురువు లేని వారు, గురువు లభ్యం కాని వారు, గురువుకో సంజిజ్ఞాసతో వెదుకుతున్న వారు) కవిత్వరచనా సౌభాగ్యమును ప్రసాదించుచున్నదో, ఆ సరస్వతి మోముదామరలోని (నోటిలోని) తమ్ములంపు (తాంబూలపు) రసమగుటను ఎప్పుడు ధరింతునో కదా? అనగా ఆ తాంబూలపు రసముగా కవిత్వ రసమును, సద్వాక్కును, వాక్శుద్ధిని, ఎప్పుడు పొందుదునోగదా?

ఈ శ్లోకంలో శ్రీశంకర భగవత్పాదుల వారు అమ్మవారి పాద నిర్ణేజన జలం అనగా పాద ప్రక్షాళన తీర్థం యొక్క మహాత్మ్యాన్ని వర్ణించారు. ఆ తీర్థాన్ని ఒక (శుద్ధ విద్యా) విద్యార్థిగా తాను మరల మరల త్రాగాలని మనసారా కోరారు. ఆకాంక్షించారు. సరస్వతి నోటిలోని తాంబూల రసం అనగా అద్భుత కవిత్వ ఝరి - సత్ వాక్ఝరి (వైఖరీ రూపం అమ్మవారిది) (చక్కని గానం - కవిత్వం - ఉపన్యాస ప్రతిభ - ఇవన్నీ ఆ సరస్వతీ దేవితాంబూల రసరూపమే మరి!)

చెవిటి వారికి వినికిడి శక్తిని - మూగవారిని పలికించి - స్తోత్రములు - కవిత్వము చెప్పించగల శక్తిని గలిగివున్న ఆజగన్మాత మహిమను, మాహాత్మ్యాన్ని మనోజ్ఞంగా వర్ణించారు. ఇందులో అంతర్గతంగా శంకర భగవత్పాదుల వారి జీవితంలో జరిగిన యదార్థ సంఘటనలు వున్నాయి.

శంకరాచార్యులవారు - వారి ఎనిమిదవ ఏట - భిక్షకు వెళ్లేవారు రోజూ - ఆయనకు 5వ సం॥లో ఉపనయనం చేయించారు వారి తండ్రి శివగురు. ఆ తర్వాత కొద్ది నెలలోనే "శివగురు' కాలధర్మం చెందారు, (శివైక్యం చెందారు) తండ్రి మరణించటంతో తల్లి బాధ్యత తానే తీసుకొన్నాడు ఆదిశంకరులు. గురుకుల విద్యాభ్యాసము నుండి శంకరులు ఇంటికి వచ్చేసరికి - ఆయన తల్లి అయిన ఆర్యాంబకు ఆరోగ్యం కొంత క్షీణించివున్నది. ఒకరోజు ఆమె చాల బలహీనంగా వుండి, అట్లాగే తమ గ్రామం వెలుపల వున్న "చూర్ణా" నదికి స్నానానికి వెళ్లింది. తిరిగి వస్తూ - స్పృహతప్పి పడిపోయింది. అది తెలిసి శంకరులు బాధపడి

తల్లి కుమారునికి - (బిడ్డలకు) నిజమైన గురువు, ఆ గురు రూపిణికి తనకు చేతనైన గురుదక్షిణ సమర్పించదలచారు. తన తపోమహిమతో చూర్ణానదిని తమ కుటీరం సమీపంలో ప్రవహిస్తూ - వెళ్లేటట్లుగా సంకల్పించారు. వెంటనే నది ప్రవాహం దిశ మార్చుకుని - "కాలడి' ' గ్రామంలో నుండి (ఏ ఇంటికీ ప్రమాదం జరగకుండా) ఆది శంకరుల ఇంటి సమీపంలో ప్రవహిస్తూ వెళ్లింది! మొదటి విజయం ప్రాణాధారమైన నీటి పై అట్లా సాధించారు ఆదిశంకరులు!

ఆ తర్వాత - భిక్షకు వెళ్లేవారు "కాలడి" దగ్గరవున్న ఒక గ్రామంలోకి వెళ్లారు ఆ రోజు ఒక ఇంటి ముందు ఆగి "భవతీభిక్షాందేహి" అన్నారు. పాపం! ఆగృహిణి కడు పేదరాలు. ఈ మహా తేజస్వి అయిన బాలబ్రహ్మచారికి భిక్ష వేయటానికి ఆమె ఇంట ఏమీ లేదు. కారణం ఆమె భర్త కూడా యాయవారవృత్తి మీదే (నంబూద్రి బ్రాహ్మణులు వీరు శంకరులలానే) జీవిస్తున్నాడు. గనుక - పొరుగూరుకు భిక్షకు వెళ్లివున్నారు ఆయన. ఆ గృహిణి బాధతో, లజ్జతో తన ఇంట వెతకగా దొరికిన ఒక ఎండు ఉసిరికాయ తెచ్చి "ఇది ఒక్కటీ వుంది నాయనా! ఇంతకు మించి నీవంటి పరమ శివుని అంశకు ఏమీ ఇవ్వలేక పోయాను!" అని కన్నీళ్లు పెట్టుకుంది.

కరిగిపోయారు శంకరులు.

అన్ని బాధలలోనికీ దారిద్ర్యబాధ దుస్సహమైనది. అది తీరితేనే ఆ మనిషి జ్ఞానం గురించి ఆలోచిస్తాడు.

శంకర భగవత్పాదులు అక్కడే - లక్ష్మి అమ్మవారిని స్తోత్రం చేస్తూ ఆశువుగా "కనకధారా' స్తవం కవిత్వ ఝురిలా చెప్పేశారు! అంతే! స్తోత్రం పూర్తి కావటమేమిటి.

ఆ పూరిగుడిసెలో బంగారు ఉసిరి కాయల వర్షం కురవట మేమిటి రెండూ ఒక్కసారే జరిగాయి. ఆసరికి ఆగృహస్తు కూడా ఇంటికి చేరాడు. ఈనాటికీ "కాలడి"కి దగ్గరనున్న "పల్లంతొట్టం"' (స్వర్ణత్తుమన) అనగా "అంతా బంగారు మయం వున్నది." ("కాలడి" కి 24 కి.మి.. దూరంలో (కేరళలో) అక్కడి అమ్మవారి పేరు "భువనేశ్వరి"! గ్రామంలో "స్వర్ణత్తుమన' ' అనే ఇల్లు (బంగారు వాన కురిసిన ఇల్లు) యాత్రీకులు సందర్శిస్తుంటారు. ఆది శంకరులు అలా తన రెండవ అద్భుతంగా దారిద్ర్యాన్ని పారద్రోలారు.

ఆ తర్వాత శంకరులు సన్యాసదీక్ష తీసుకొన్నారు. "గౌడ పాదుని" శిష్యుడైన గోవింద భగవత్పాదులు - నర్మదా నదీ తీరంలో ఆశ్రమం నిర్మించుకుని వున్నారు. వారి గుహలో కలుసుకున్నారు శంకరులు - "ఎవరునీవు?" అని ప్రశ్నించిన గురువుకు తాను ఈ శరీరాన్ని కాదనీ - పరమాత్మరూపుడననీ - "దశశ్లోకీ" అనే 10 శ్లోకములలో చెప్పాడు. గోవింద భగవత్పాదుల వారు ఆనందించి - సన్యాసదీక్ష - పరమహంస దీక్ష ప్రసాదించారు శంకరులకు ఒక రోజు - నర్మదానదికి వరదలు వచ్చి, గోవింద భగవత్పాదుల ఆశ్రమం కూడా ముంచి వేసే ప్రమాదం వస్తోంది వరదనీరు. అది గ్రహించిన శంకర భగవత్పాదుల వారు తనక మండలం నర్మదానదికి అభిముఖంగా నేల పై పెట్టి - నిశ్చల ధ్యాన సమాధిలో కూర్చున్నాడు. వరద నీటిని ఆకమండలం ఆకర్షించగా, అనేకానేక గ్రామాల ముంపు ప్రమాదం తప్పిపోయి - ఆశ్రమము నిలిచింది. బయటకు వచ్చి చూచిన గోవింద భగవత్పాదులవారు - శంకరుని ప్రభావం గ్రహించి - అంతక్రితం - తనతో వ్యాసమహర్షి "నర్మదానది వరద ఆపగలిగిన వ్యక్తియే బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు (ప్రస్థానత్రయానికి) వ్యాఖ్యవ్రాయగలిగిన మహోన్నతుడని" చెప్పివున్నది స్ఫురణకు రాగా, శంకరులకు ఆ బాధ్యత అప్పగించారు. ఈ భారతదేశ చరిత్రలోనే ఆచంద్రార్కం నిలిచిపోగా అపరశంకరులు - శంకరులనీ గ్రహించారు.

ఆ తర్వాత శంకరులు కాశీ యాత్రకు బయల్దేరారు. త్రోవలో ఎన్నో - సంఘటనలు జరిగాయి. ప్రభాకరుడనే వ్యక్తి తన పదమూడు సంవత్సరాల మూగబాలుడైన కొడుకుని శంకరుల వద్దకు తెచ్చి, ఈ తడికి మూగతనం పోగొట్ట మని ప్రాధేయ పడ్డాడు. శంకరుల వారు - అమ్మవారి పై "లఘుసోత్రము" అనే స్తోత్రము ఆశువుగా చెప్పారు. ఆ తర్వాత తన చేయి (హస్తము) ఆ బాలుని శిరసు పై వుంచి (హస్తమస్తక ప్రయోగము)

"నీ వెవరవునాయానా?" అని ప్రశ్నించారు.

ఆ బాలునికి మాటలు వచ్చాయి. ఆశ్చర్యం.

"స నిత్యోపలబ్ధి స్వరూపోహమాత్మా!"

(నిత్య సత్యస్వరూపుడనైన ఆత్మను నేను!" అని శ్లోకాల రూపంలో అసర్గళంగా జవాబు చెప్పాడు. వెంటనే ఆది శంకరులు ఆ బాలుని కౌగలించుకొని ఆతడికి సన్యాస దీక్ష ఇచ్చి "హస్తామలకుడు" అని పేరు పెట్టారు. అరచేతిలో ఉసిరి కాయవలె - జ్ఞానాన్ని అరచేత ధరించినవాడు "హస్తామలకుడు." హస్తమునందు ఆమలకము (ఉసిరికాయ) ధరించినవాడు.

(ఉసిరికాయ ఔషధ గుణములు లెక్కకు మించినవి. దాహం తీరుస్తుంది. ఆకలికి - ఉపశమనం కలిగిస్తుంది. నోరు -గొంతు - ఉదరమునకు సంబంధించిన చాలా జబ్బులకు ఉసిరి దివ్యౌషధం. పైత్యమునకు విరుగుడు ఉసిరి. ఉసిరికాయ దగ్గరవుంటే చాలు - ఇక అన్నీ వున్నట్లే" అనే భావంతో "హస్తామలకం" అనే మాట పుట్టింది. శంకరుల ఒక శిష్యుని పేరు హస్తామలకుడు. అతడు మాటలు రాగానే శంకరులతో తానెవరు ("సనిత్యోపలబ్ధి స్వరూపోహ మత్మా") అనేది చెప్పిన శ్లోకముల కృతికి - స్వయంగా శంకరులే భాష్యము వ్రాసి ఆకృతికి - కృతికర్తకు అపూర్వ గౌరవం ప్రసాదించారు. ఈ విధంగా మూగతనాన్ని పోగొట్టి తన "లఘుస్తోత్రము" తో ఆది శంకరులు - అది తనగొప్పతనంగా చాటుకొనక - అమ్మవారి అపారకరుణగా వినమ్రంగా అంజలిఘటించారు. ఇంతటి నిరంహకారం ఎందరి కుంటుంది?

అట్లాగే మరొక శిష్యుడు - చెవిటివాడు. బండచెవుడు, పుట్టు చెవిటివాడు. అతడి విషయంలోను "చర్పాస్తుతి" అనే అమ్మవారి స్తోత్రం ఆశువుగా చెప్పి. ఆతడి చేత పలికిస్తూ అతడి చెవిలో ఈస్తోత్రం చదివారు. ఆతడికి వినికిడి శక్తి వచ్చింది.

తమిళనాడులో "తిరుచెందూరు" తిరునల్వేలికి 54 కి.మీ.దూరంలో - (అరేబియా సముద్రం దగ్గర - సముద్రంకి 38 కి.మీ. "క్యూటికూరి" అనే వూరు వున్నది). దానికి దగ్గర ఈ తిరుచెందూరు అక్కడి స్వామి సుబ్రహ్మణ్యేశ్వరుడు. మహా మహిమగలస్వామి.

45 రోజులు సుబ్రహ్మణ్యస్వామిని పూజించిన - మాటలు వచ్చును. పూర్వము - ఒక భక్తుడు - 45 రోజులు ఈ స్వామిని పూజించగా - మాటలు వచ్చి, మహాకవియై కవిత్వము చెప్పెను. మూగవారికి మాటలు తెచ్చుస్వామిగా ఈ స్వామిని కీర్తిస్తారు. ఈ స్వామి నామం చెవిటివారి చెవిలో చెబుతూ, వారిచేత ఆ స్వామి నామం పలికిస్తూ 45 రోజులు భక్తి శ్రద్ధలతో అట్లా చేయిస్తే - చెవిటి వారికి వినికిడి శక్తివస్తుంది. ఆ సుబ్రహ్మణ్యేశ్వరుడి అపారకరుణతో ఈనాడు వేలాది భక్తులు దర్శించే పుణ్యక్షేత్రం ఇది. (తమిళనాడులో)! ఈ కాలంలోనే ఆదిశంకరులను మరో శిష్యుడు శరణువేడాడు. అతడి "పేరుకాలనాధుడు" అతడు శంకరుల పాదాల పై పడి - ఆర్తితో, కన్నీటితో శంకర భగవత్పాదుల వారే తన గురువు అని "తోటక వృత్తంలో" శ్లోకాలలో కీర్తించాడు.

శిఖరిణీవృత్తం (సౌందర్యలహరి) లానే "తోటక" వృత్తం వ్రాయుటకు చాలా కఠినంగా వుంటుంది. కానీ చదువుతున్నా అర్థంలోతుగా గ్రహించినా చాలా మధురముగా వుంటుంది. ఆదిశంకరులు కాలనాథుని శిష్యునిగా గ్రహించి - అతడికి "తోటకాచార్యుడు" (తోటక వృత్తంలో స్తోత్రం చెప్పినవాడుగనుక) అని పేరు పెట్టి సన్యాస దీక్ష ఇచ్చారు.

ఇక - కాశీలో ఆదిశంకరులకు ప్రథమ శిష్యుడు లభించాడు. ఎలా?

చోళ (తమిళనాడు) దేశము నుండి కొంచెం ముందుగా శంకరుల కంటే ముందుగా కాశీ చేరుకున్న "విష్ణుశర్మ" అనే అతడు యువకుడు ఆదిశంకరులను దైవంగా నమ్మి మనసా, వాచా, కర్మణా కొలచిన అనన్యభక్తుడు - శిష్యుడు. ఈతనికి "సనందుడు" అని పేరు పెట్టి సన్యాస దీక్ష ఇచ్చారు ఆదిశంకరులు. సనందుని పై శంకరుల అపరిమితమై వాత్సల్యం - అనుగ్రహం గమనించిన - శంకరుల మిగతా పదమూడు మంది (మొత్తం సనందునితో కలసి 14 మంది శిష్యులు శ్రీ శంకర భగవత్పాదుల వారికి ఆది శంకరులు వ్రాసిన భజగోవింద "ద్వాదశ మంజరికాస్తోత్రం" శ్లోకాలకు వీరంతా తలకో శ్లోకం చెప్పికలిపి మొత్తం 26 శ్లోకాలుగా చేశారు భజగోవింద శ్లోకాలను.) చాలా ఈర్ష్యపడటం ప్రారంభించారు. అది గమనించి - సనందుని ఔన్నత్యం చాటి చెప్పదలచారు ఆదిశంకరులు!

పరమ గురువులు ఏది చేసినా - ప్రత్యక్ష్యంగా చేయరు సున్నితమైన పరోక్ష బోధతో మందలిస్తారు.

గంగానది ఆవలిగట్టునుండి ఈవలి గట్టుకు - పడవలో ఆదిశంకరులు - వారి మిగతా 13 మంది శిష్యులు వచ్చేశారు ఒక రోజు. ఆవలిగట్టు పై గురువుగారి వస్త్రాలు ఉతికి ఆరవేస్తున్నారు సనందుడు.

శంకరాచార్యుల వారు ఎలుగెత్తి - "సనందా! త్వరగారా! త్వరగా! నా ఉత్తరీయం తీసుకురా!" అని కేకలు వేశారు.

మిగతా శిష్యులు ఆశ్చర్యంగా

"సద్గురూ! సనందుడు ఆవలిగట్టున వున్నాడు. పడవవాడు పడవ నిండా మనుషులు ఎక్కితేగానీ వెళ్లడు. అతడూ పడవా, ఆవలి తీరం చేరాలి. మరల పడవ నిండి మనుష్యులతో - పడవ తిరిగిరావాలి. సనందుడు త్వరగా ఎలా రాగలడు?" అన్నారు.

కానీ ఈలోగా ఒక అద్భుతం జరగనే జరిగింది.

గురువుగారి కేక విన్న సనందుడు - గురువుగారి ఉత్తరీయం చేత బట్టుకుని - గంగలో దూకి నడవసాగాడు.

"వస్తున్నా! వస్తున్నా సద్గురూ" అంటూ రాసాగాడు.

ఆతడికి నీటి మీద అడుగులు వేస్తున్న స్పృహ కూడా లేదు. గురువుగారు, గురువు ఆజ్ఞ ఒకటే ఆతడిధ్యేయంగా వున్నాయి. గంగా మాత ఆతడినిశ్చల భక్తికి పులకించి పోయింది. ఆతడి గురుభక్తికి ఆ తల్లి హృదయం ఉప్పొంగి పోయింది ఆనందంతో! ఆతడు అడుగు తీసి అడుగు పెట్టేంతలో, ఒక్కొక్క పద్మం అతడిపాదాల క్రింద ప్రత్యక్షమైంది. ఆ పద్మాల మీద అడుగులు పెడ్తున్న స్పృహ కూడా అతడికి లేదు. ఆచార్యులవారికి ఉత్తరీయం అందించి నమస్కరించాడు. గంగానది పై పద్మాలు చూశారు శిష్యులంతా! ఆ పద్మాలు మాయం కావటం చూశారు.

"పద్మపాదా! నీవు ధన్యుడివి నాయనా!" అన్నారు. ఆచార్యులవారు. ఆనాటి నుండి "సనందుడు" పద్మపాదుడయ్యాడు. ఆదిశంకరుల వారి ప్రథమ శిష్యుడు - ఆది శంకరులను అనుక్షణం అనుసరించి - వారి అపార కృపకు పాత్రుడై - ఒకమారు శంకరుని ప్రాణములు కాపాడి - కొన్ని భాష్యములు వ్రాసి ప్రముఖుడైనాడు. ఈ పద్మపాదుడే!

ఇన్ని కథలు ఎందుకు స్ఫురణకు వచ్చాయి?

మూగవానికి మాటలు తెప్పించి "హస్తామలకుడని" పేరు పెట్టి తన శిష్యునిగా చేసుకున్నారు ఆదిశంకరులు (ఇది శ్రీబలిపురము" అనే ప్రదేశంలో జరిగినదని చెబుతారు కొందరు) చెవిటి వానికి వినికిడిశక్తి తెప్పించారు.

"లఘుస్తుతి - చర్చాస్తుతి"

అనే తమవాహిమాన్వితమైన స్తోత్రములతో.

కానీ - ఇంత గొప్పచరిత్రగల పరమగురువు వినమ్రతతో "తల్లీ! నీవు - నీ కరుణ - మూగవారికి మాటలు తెప్పిస్తుంది. చెవిటివారికి వినికిడి శక్తినిస్తుంది. నీ పాదప్రక్షాళన జలం త్రాగిన మహిమ ఇదంతా!

సరస్వతీ నోటి తాంబూల రసం వంటి కవిత్వం ప్రసాదిస్తుంది!" అని వేడుకుంటున్నారు.

ఆవినయమే మనలో జ్ఞానరూపంగా అంకురిస్తే చాలు, ఆ తల్లి సర్వం ప్రసాదిస్తుంది. సర్వజ్ఞుడైన పరమగురువుతానే ఒక విద్యార్థినని చెప్పుకొంటుంటే, ఏమీ తెలియని మనం సర్వజ్ఞులం అనుకోవటం వెర్రితనం కదా?

## 99 శ్లో॥ జగదంబను - చిత్తశుద్ధితో కొలిచే భక్తునికి వచ్చే గౌరవాలు

**99. శ్లో॥ సరస్వత్యా లక్ష్మ్యా విధిహరి సపత్నో విహరతే!**
**రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణవపుషా,**
**చిరంజీవన్నేవక్షపిత పశుపాశవ్యతికరః**
**పరానందాభిఖ్యం రసయతి రసం, త్వద్భజనవాన్ ॥**

అర్థము : ఓ భగవతీ! నిన్ను భజింపువాడు సరస్వతితోను, లక్ష్మితోను విహరించుచు, బ్రహ్మవిష్ణులకు వైరియై విహరించుచున్నాడు.

తన రమ్యశరీరము చేత, రతీదేవిని కూడా మోహపెట్టి, ఆమె పాతివ్రత్యమును సడలించుచున్నాడు. చివరగా జీవుల సంబంధమును - అవిద్యల సంబంధమును తొలగించుకొనిన వాడై కేవల సదాశివ తత్వాత్ముడై పరానంద సుఖమును ఆస్వాదించు చున్నాడు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు జగన్మాతను చిత్తశుద్ధితో ఆరాధించే భక్తునికి వరుసగా వచ్చే గొప్పధనాలు - శక్తి - సంపదలు వర్ణించారు.

వాణీ, లక్ష్మీ దేవిలతో విహరిస్తూ, బ్రహ్మ విష్ణులకు వైరి, శత్రువు, కావటం అనగా, ఆ భక్తునికి కవిత్వము, వాక్చాతుర్యము - పదుగురినీ ఆకట్టుకొనే ఉపన్యాస చాతుర్యము రాగా, సరస్వతి ఆతడికి "దాసోహం" అన్నట్లుగా వుంటాడు. అట్లాగే అమ్మవారి కరుణతో అపారధనవంతుడై - లక్ష్మీ దేవి "దాసోహం" అన్నట్లుగా గౌరవాలు అందుకుంటుంటాడు. ఇట్లా కొంతకాలం గడవగా, ఆజగన్మాత భజన మహిమవలన - ఈ భోగాల పట్ల విముఖత కలిగి - తృప్తి కలిగి, విరక్తి కలిగి - శాశ్వతానంద పథం వైపు దృష్టి సారిస్తాడు. ఈ భోగాల పట్ల విముఖత ఏర్పడగానే. అతడు సదాశివ రూపునిగా మారిపోతాడు. పరానంద స్వాత్వానందములను సునాయసంగా పొందుతున్నాడు.

అంతటి మహిమ - దయ - అమ్మవారి భజన (స్తోత్రం)లో నిక్షిప్తమై ఉన్నది.

అయితే - ఆ తల్లి విరాట్ రూప దర్శనం చేయించిన శంకర భగవత్పాదుల వారు ఆ తల్లి మహిమలను వివరించారు.

### 7వ అధ్యాయం సమాప్తం.

ఈ అధ్యాయంలో 92వ శ్లోకం నుండి 99వ శ్లోకం వరకు గల 8 శ్లోకాలలో అమ్మవారి విరాట్ స్వరూపాన్ని దర్శింపజేసారు జగద్గురువు.

ఈ అధ్యాయము భక్తి శ్రద్ధలతో పారాయణ చేసినవారికి, భూలాభము, ధనలాభము, రాజ్యలాభము సకలాభీష్టసిద్ధి, ఇష్టార్థ సిద్ధి, మానని వ్రణములు మానుట, విద్యాలాభము, ధృఢమైన శక్తి, బలము, శూరత్వము మొదలైన వన్నీచే కూరును.

పైవాటి కన్నిటికీ - గూడార్థము - ఆతల్లికరుణ ఒక్కటీ సాధించుకోగలిగితే - సర్వ ప్రపంచంలో వారికి లేనిదంటూ ఏమీ లేదు. శ్రీ శంకర భగవత్పాదుల వారికి ఉన్న ఆస్తులెన్ని? కార్లు ఎన్ని? బంగళాలు ఎన్ని - పట్టు వస్త్రాలు - ఆభరణాలు ఎన్ని?

కానీ - వారికి అవేవీలేవు. వారు పొందినది ఆజగన్మాత అపారకరుణ! వారు ఆచంద్రార్కం పరమగురువులే! మరిమనమో?

మనలో చాలా మందికి పైవన్నీ కార్లూ, బంగళాలు, ఓ మోస్తరుగా నైనా ధనం అన్నీ వున్నాయి. కానీ మనమెవరమూ పరమగురువులం కాలేదు! మన మాటమీద ఎవరూ ఆధ్యాత్మిక, బాట వైపు నడవటం లేదు.

కాబట్టి - ప్రపంచంలోని సర్వము - శ్రీమాత పాదాలలోనే నిక్షిప్తమై వున్నాయి. ఆ పాదాలు శరణు వేడితే చాలు. మనకు ఏది కావాలో - సర్వంఇస్తుంది ఆ తల్లి. ఆ ఒక్కటీ గుర్తు పెట్టుకుంటే చాలు.

## ఈ 7వ అధ్యాయం సమాప్తం

ఆ తల్లి మంత్రరూప శరీరం దర్శించాము.

ఆ తల్లి విరాట్ రూపం దర్శించాము.

ఇంతకూ ఆ తల్లి ఎక్కడవున్నది?

కనిపెట్టడం ఎలా?

ఆమె ఎక్కడో లేదు. మనలోనే వున్నది.

ఎలా? ఆచార్యుల వారు చెబుతారు.

అదే తెలుసుకుందాం.

పదండి ముందుకు

★ ★ ★

# 8వ అధ్యాయము

ఈ అధ్యాయములో మానవ శరీరంలోనే జగన్మాతను దర్శించే పద్ధతిని బోధిస్తున్నారు శ్రీ శంకర భగవత్పాదులవారు షట్చక్రములలో అమ్మవారు కొలువైయున్నది. ఆ తల్లిని సాక్షాత్కరింపజేసుకోవాలి. అందుకు ధ్యాన పద్ధతి సమయచార పద్ధతి (ఎకాఎకిని) సహస్రారములోనికి (ఇడా పిగళనాడుల ద్వారా, సుషమ్నానాడి ద్వారా) శ్వాసను పూరక, కుంభక, రేచకములనే ప్రాణాయామ పద్ధతి ద్వారా నడుపుతాడు యోగి. ఆ వివరాలు వివరిస్తున్నారు జగద్గురువు.

అమ్మవారి సాకారరూపాన్ని - విరాట్ రూపాన్ని, మంత్రరూప శరీరాన్ని దర్శింప జేశారులోగా అధ్యాయాలలో. ఈ అధ్యాయంలో ఆ దివ్యశక్తి స్వరూపిణి నిర్గుణ రూపాన్ని - నిరాకరరూపాన్ని, అనంతశక్తి చైతన్యమును తెలుసుకొమ్మని మనందరికీ వివరిస్తున్నారు. పరమగురువు, "మూలాధారం" అనబడే మొదటి చక్రంలో నిద్రాణమైయున్న అపారశక్తిని మేల్కొలిపి, పైపైకి ప్రాకిస్తూ, మేరుదండం (మానవ వెన్నెముక)లో వున్న ఆరుపద్మాలనబడే చక్రాలను ఛేధించుకుంటూ - శిరసు పై భాగంలో (మాడు) నున్న బ్రహ్మరంధములోని సహస్రారమనే వేయిరేకులు (దళములు) గల పద్మంలోనికి చేర్చి, అక్కడవున్న "విశ్వ చైతన్య దీప్తి"తో (ఈశ్వరునితో) మేళవించటమే ముక్తి అని, మోక్షమని వర్ణించారు మహాయోగులు, మహర్షులు, మహాత్ములు, అవధూతలు, పరమహంసలు, ఆదిశంకరులు కూడా.

మానవుడు సూక్ష్మాతి సూక్ష్మమైన "పరమాణువును" (ATOM) ను ఛేధించి అందులోని మహాశక్తి నిస్వాధీనం చేసుకుని ఆటంబాంబులను, అణుశక్తిని కనిపెట్టి, వాటిని మానవజాతి ప్రగతికీ, వినాశనానికి కూడా ఉపయోగిస్తున్నాడు. పరమాణువులో ఎంతటి శక్తి వుందో బాహ్యాప్రపంచంలో - మానవ శరీరంలోని మూలాధారంలో అంతటి శక్తి నిక్షిప్తమై వున్నది. దానిని స్వాధీనం చేసుకొన్నమానవుడు - మంచికి ఉపయోగిస్తే మహాత్ముడౌతాడు. మార్గదర్శియైన పరమగురువు అవుతాడు. చెడుకో, స్వార్థానికో ఉపయోగిస్తే దానవుడు దుష్టుడు - లోక కంటకుడు అవుతాడు. అది ముందుగా గ్రహించాలి.

అయితే ఈ సాధన అంతా ఆ శక్తిని పరిపూర్ణంగా స్వాధీనం చేసుకుని, లోక కల్యాణమే ధ్యేయంగా గల పరమ గురువు ద్వారా మాత్రమే సాధన చేయాలి. గురు సాన్నిధ్యంలో వుండాలి. గురువు పై అనన్యభక్తి ప్రపత్తులు కలిగి వుండాలి. బ్రహ్మ చర్యం మొదలు ఆహారవిహారాలలో కఠోర నియమాలు కలిగి వుండాలి. ఇవేవీ లేకుండా, కేవలం పుస్తకాల సాయంతో యోగసాధనకు

ఉపక్రమిస్తే అది ప్రమాదాలకు దారితీస్తుంది. బుర్ర చెడగొడుతుంది. మతి చలింపజేస్తుంది. అందువలన గురువు తప్పనిసరిగా వుండాలి.

ఈ బ్రహ్మాండం (ప్రపంచ మంతటా) ఏదివ్యశక్తి అణురూపంలో నిండివున్నదో, పిండాండం (మానవ శరీరంలో) అదే అత్యద్భుత శక్తి నిండివున్నది అతిసూక్ష్మరూపంలో అదే "కుండలినీ శక్తి" ఆకాశంలో ఒక విశిష్టమైన క్రమపద్ధతిలో సాగే సంచలనం వంటిదే పరమాణువు (ATOM) లోని "న్యూట్రానులు" (Neutron), "ఎలక్ట్రాన్" (Electron), " ప్రొటాన్లు" (Protron) మధ్య సంచలనంలోని బడీకృతమై వున్నది.

అలాగే మానవ శరీరంలో ఈ "శక్తి ప్రబోధిత కేంద్రాలు" ఉన్నాయి. అవే, మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరకం, అనాహతము, విశుద్ధి, అజ్ఞ - అనే ఆరు పద్మాలు - లేక చక్రాలుగా వర్ణించారు - స్వానుభవంతో తెలుసుకున్న మహర్షులు వీటికి పైన శిరస్సు నందలి బ్రహ్మరంధ్రము (మాడు)లో సహస్రారచక్రం వున్నది. ఈ సర్వసృష్టికీ కారణ భూతురాలైన "ఆదిపరాశక్తి" స్థూల, సూక్ష్మ, కారణ రూపాలలో, మానవుని అన్నమయ, ప్రాణమయ, విజ్ఞానమయ, మనోమయ, ఆనందమయ మనే పంచకోశాలలో వ్యాపించి వుండి, షట్చక్రములను అనుసంధానం చేస్తుంది. సృష్టి క్రమం జరిగిన తర్వాత - మిగిలి వున్న (శేషాంశం) అయిన శక్తి మూలాధారంలో నిక్షిప్తమౌతుంది. (ఇదే నిద్రించటం అంటారు)

ఈ శక్తి అనంతము - ప్రసరణాత్మకము (శరీరమంతా - నాడీ మండలంలోను - షట్చక్రాలలోను) అయిన దిగనుక - దీనిని ఒక సర్పాకారంతో "సర్పం" గా పోల్చారు మహర్షులు. దీని గమనం (శ్వాస) సర్పగమనం వలె వుంటుంది గనుక. అది చుట్ట చుట్టుకొని మూలాధారంలో పడుకుని వుంటుందని - దానిని జాగృతం చేయటమే యోగానికి మొదటి మెట్టు అని వర్ణించారు. ఈ వివరాలే అమ్మవారి నిర్గుణ రూపాన్ని వివరించే ఈ 8వ అధ్యాయములో, శ్రీజగద్గురు శంకర భగవత్పాదుల వారు సౌందర్యలహరిలోని 9వ శ్లోకం నుండి 19వ శ్లోకం వరకుగల శ్లోకాలలో అద్భుతంగా వర్ణించారు. సగుణరూపం ముందుగా దర్శించకపోతే - నిర్గుణరూపాన్ని అర్థం చేసుకోలేము. అందువలన లోగా అధ్యాయాలు 42వ శ్లో॥నుండి 99 వరకు - అర్థం చెప్పుకున్నాము. ఆ తల్లి సగుణ రూపాన్ని దర్శించాము.

ఇక ఇప్పుడు నిర్గుణ రూపాన్ని దర్శిద్దాము. 9వశ్లోకం నుండి - 19వ శ్లోకం వరకు. పదండిముందుకు పారాయణానికి

# 9 శ్లో॥ అమ్మవారు - కుండలినీ శక్తి కుండలినీ నివాసము

9. శ్లో॥ మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే, హృది మరుత మాకాశ ముపరి
మనో z పిభ్రూమధ్యే, సకలమపి భిత్వా, కులపథం,
సహస్రారే పద్మే, సహరహసి పత్యా విహరసే ॥

**అర్థము** : ఓ జగన్మాతా! భగవతీ! నీవు మూలాధారమందున్న పృధివీ తత్వమును, వీడి, మణిపూరము నందున్న జలతత్వమును వీడి, స్వాధిష్ఠాన చక్రమునందున్న అగ్ని తత్వమును వీడి, అనాహత చక్రము నందున్న వాయుతత్వమును వీడి, విశుద్ధి చక్రము నందున్న ఆకాశతత్వమును వీడి, ఆజ్ఞాచక్రమునందున్న మనస్తత్వము వీడి - (వీటన్నిటినీ దాటి) చివరగా, సుషమ్న మార్గము ఛేదించి, సహస్రారకమలమునందు, నీ భర్తయగు సదాశివునితో కూడి రహస్యముగా క్రీడించుచున్నావు.

శ్రీ శంకర భగవత్పాదులవారు ఈ శ్లోకంలో, సమయాచారులైన సాధకులు చేసే అంతర పూజా విధానాన్ని వివరిస్తున్నారు.

సమయచారములో, బిందువు (బైందవస్థానం) చతురస్రంలో వుండి - 'త్రికోణంలో వుంటుంది". ఈ త్రికోణము ఊర్ధ్వ ముఖముగా వుంటుంది. అందువలన సమయాచారులు మూలాధారం మొదలు, సహస్రారంవరకు - శరీరం క్రింద భాగం అనగా గుదస్థానం నుండి - శిరస్సు వరకు, తమధ్యాన పద్ధతి కొనసాగిస్తారు. కౌళాచారులు - అనగా వామాచారులు - యతీశ్వరులు - జితేంద్రియులు కులమును అనగా షట్చక్ర కులమును పూజించువారు కౌళులు, (కౌళాచారులు) సహస్రారం నుండి క్రిందకు - అనగా శిరసు నుండి శరీరం క్రింద భాగానికి (గుదస్థానం వరకు) ధ్యాన పద్ధతిలో ధ్యానం సాధిస్తారు.అనగా వీరి పద్ధతిలో బిందువు చతురస్రంలో వుండి త్రికోణంలో వుంటుంది. కాని - త్రికోణం అధోముఖంగా వుంటుంది.

"క ఏ ఈలహ్రీం - హసకహలహ్రీం - సకలహ్రీం"మంత్రాన్ని యధాతథంగా అనుసరిస్తారు సమయాచారులు.

"సకలహ్రీం! హసకహలహ్రీం - క ఏఈలహ్రీం" వరసలో మంత్ర సాధన చేస్తారు. అనగా శుక్ల పక్షప్రతిపత్ (పాడ్యమి) నుండి పౌర్ణమి వరకు - గల నిత్యాధిదేవతలు వరుసగా వున్నట్లు, కృష్ణ పక్ష పాడ్యమి (ప్రతిపత్) మొదలు అమావాస్య వరకు గల నిత్యాధి దేవతలు - చివరి నుండి ప్రారంభమైనట్లుగా వుంటాయి పై ఇరువురి పూజా విధానాలు.

ఏసాధన అయినా ధ్యేయం ఒక్కటే.నిద్రాణమై వున్న కుండలినీ శక్తిని జాగృత పరచటం శివ శక్త్యైక్య సంధానమనే మహాశక్తిని దర్శించటం.

మన శరీరంలోనే వున్న జగన్మాత కుండలినీ రూపాన్ని ఈ విధంగా దర్శింపజేసారు జగద్గురువు మనందరికీ! అవునా!

## 10వ శ్లో॥ జాగృతమైన కుండలిని శక్తి సుధాదారావృష్టి

**10. శ్లో॥ సుధా ధారా సారైశ్చరణ యుగళాన్తర్విగళితైః**
**ప్రపఞ్చం సిఞ్చన్తీ, పునరపి రసామ్నాయ మహసః**
**అవాప్య స్వాం భూమిం భుజగనిభమధ్యుష్ఠ వలయం**
**స్వమాత్మానం కృత్వా స్వపిషి, కులకుణ్డేన కుహరిణి ॥**

**అర్థము :** తల్లీ! భగవతీ! నీపాద యుగము నుండి స్రవించు సుధాధారలచే (అమృతధారలచే) ప్రపంచమును తడుపుచు, అమృతమునకు నిధానమై, కాంతిచే వెలుగొందు చంద్రుని వీడి, స్వస్థానమైన ఆధార చక్రమును (మూలాధార చక్రమును) మరల ప్రాపించి, (చేరి) అందునీ స్వస్వరూపమును, సర్పము వలె కుండలా కారము గావించి, చుట్టచుట్టుకొని పడుకొని వున్న సర్పంవలె, తామర దుద్దున నడుమ నుండు సన్నని రంధ్రము వలె, మిక్కిలి సూక్ష్మమై, పృథీవీతత్వము నందు కుండలినీ శక్తివై నిద్రింతువు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు మానవ శిరస్సు నందలి బిందుస్థానం (మాడు బ్రహ్మరంధ్రము) అచ్చటికి సాధనతో చేరుకున్న సాధకులకు కలిగే అమృత ధారలస్నానము, వర్ణిస్తున్నారు.

"ప్రపంచం" అనగా, శరీరంలోని డెబ్బైరెండువేల (72 వేల) నాడీ సముదాయము.

"ఓజ్ఞాన స్వరూపిణీ! జగన్మాతా! నీధ్యానయోగం, సమాధిస్థితి సాధించిన భక్తులు, సాధకులు, సహస్రారకమలంలో బ్రహ్మరంధ్రములో అమృతధారలచే - స్నానం చేసి శరీరంలోని నాడీ మండలమంతా ఆ అమృత ధారలచే తడిపి, మరల - చంద్రుని వీడి - అనగా ఆజ్ఞా చక్రంలో నుండి క్రిందికి - అవరోహణ క్రమంలో శ్వాసను నడిపి, నీ స్వస్థానమైన "మూలాధార పద్మంలోని (ఇది నాలుగు దళముల పద్మము. దీని మధ్య - తామరదుద్దు. అందులోని తల్లి సూక్ష్మమైన రంధ్రంలో సర్పంచుట్టుచుట్టుకొని పడుకొనిన్నట్లు - భూతత్వం (పృథివీతత్వం) అయిన మూలాధార చక్రంలోనికి చేరుతావు!"

సర్పం ఎలుకలనో, కోడిగ్రుడ్లనో మ్రింగి ఆకలి తీరినతరువాత - చుట్టులు చుట్టుకొని పడుకొంటుంది. కొన్ని గంటలు - ఆ ఆహారం అలాగే (జీర్ణమయ్యే వరకు తనలో తానే తిరుగుతు - చుట్టలుగా పడుకుని వుంటుంది. సరిగ్గా కుండలిని శక్తి కూడా, సహస్రారం చేరి అమృత స్నానం చేసి తృప్తి చెంది మరల - మూలాధారం చేరి స్వస్థ పడుతుంది. ఆది శకంరులు రచించిన "భవానీ భుజంగ ప్రయాత స్తోత్రంలోని మొదటి (1వ శ్లోకం) ఇక్కడ గమనిద్దాము.

భవానీ భుజం ప్రయాత స్తోత్రము 1వ శ్లో॥

**శ్లో॥ షడాధార పంకేరుహాంత ర్విరాజ**
**త్సుషుమ్నాంతరాలే ऽ తితేజోల సంతీమ్!**
**సుధామండలం ద్రావయంతీం, పిబంతీం!**
**సుధామూర్తి మీడే ! చిదానంద రూపామ్!**

ఎంత చిన్న శ్లోకంలో ఎంత చక్కగా ఆ చిదానంద లహరిని వర్ణించారో గమనించండి ఆచార్యులవారు.

"సౌందర్యలహరి" లోని మొదటి సగం "అనందలహరి" అనీ రెండవ భాగం "సౌందర్యలహరి" అని అంటారు. ఆ ఆనందలహరి - మన శరీరాంతర్గతంగానే వున్నది. అది తెలుసుకోవటమే సాధన.

## 11 శ్లో॥ జగన్మాత శ్రీ చక్రస్వరూపము

**11. శ్లో॥ చతుర్భి శ్రీ కణ్ఠై, శ్శివయువతిభిః పఞ్చ భిరపి,**
**ప్రభిన్నాభి శ్శమ్భోర్నవభిరపి మూలప్రకృతిభిః**
**చతురశ్చత్వారింశ ద్వసుదళ కలా శ్రత్రివలయ**
**త్రిరేఖాభి స్సార్థం, తవ, శరణ కోణాః పరిణతాః ॥**

**అర్థము** : ఓ జగన్మాతా! తల్లీ! నాలుగు (4) శివచక్రములు (భూపురము, మేఖలాత్రయము, షోడశదళము, అష్టదళము - ఇవిగాక

5 (ఐదు) శక్తికోణములు (చతుర్ధశారము, బహిర్ధశారము, అంతర్ధశారము (దశారయుగ్మచక్రము), వసుకోణము, బిందువుతో కూడినత్రికోణము, వీటితో ఏర్పడిన, తొమ్మిది (9) చక్రములు గలిగి, 44 (నలభై నాలుగు) కోణములతో ఏర్పడినదే నీ శరీరంగా అలలారే శ్రీచక్రము. ఇదేనీ నివాస స్థానముగా వున్నది.

ఈ శ్లోకంలో, శ్రీశంకర భగవత్పాదులవారు, అమ్మవారి స్వరూపమైన శ్రీ చక్ర స్వరూపాన్ని వర్ణించారు.

"బిందు త్రికోణ, వసుకోణ, దశారయుగ్మ,
మన్వస్ర, నాగదళ, షోడశ, పత్రయుక్తం,
వృత్తత్రయంచ, ధరణీ సదన త్రయంచ,
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయా॥

ఇది శ్రీ చక్రస్వరూపాన్ని వర్ణించే శ్లోకం. ఆది శంకరాచార్యుల వారు కాశ్మీరు నుండి, కన్యాకుమారి వరకు గల ప్రముఖ శక్తి పీఠాలన్నిటిలోగల శ్రీ చక్రములలోని ఉగ్రబీజాలను తొలగించి, వాటన్నిటిలో సాత్విక కళా బీజాలతో క్రొత్త శ్రీచక్రస్థాపనలు చేసి అమ్మవార్ల ఉగ్రరూపాలను ఉపశమింపజేసి, వారందరినీ సాత్విక తేజోవిరాజితులుగా చేశారు. అసలు బీజాక్షరాలు లేకుండానే శ్రీ చక్రయంత్రాలను సర్వగృహిణీ, గృహస్థులకు పూజాపీఠాలలో అమర్చుకొని పూజించే గొప్ప అవకాశం అదృష్టం కలిగించారు. వారి జీవితంలో వారు సాధించిన గొప్ప కార్యాలలో ఇది ఒకటి మాత్రమే.

శ్రీ శంకర భగవత్పాదుల వారు కాశ్మీరు రామణీయకతకు, ఆధ్యాత్మిక ఔన్నత్యానికి ముగ్ధులైపోయారు. విషయాసక్తులు, లౌకికులు, సంపన్నులు అయినవారికి ఈ ప్రాంతం కేవలం విహార కేంద్రంగా ఆనందింపజేస్తుంది. అక్కడిప్రకృతి. కానీ, ఆధ్యాత్మిక ఔన్నత్యం కలవారికిది మనశ్శాంతిని ప్రసాదించే దివ్యధామము అనిగ్రహించారు. ఇక్కడే - శంకర భగవత్పాదుల వారు "దక్షిణామూర్తి స్తోత్రం రచించారని" తెలుస్తోంది - వారి చరిత్ర గ్రంథాల ఆధారంగా! ఈ స్తోత్రంలో దక్షిణామూర్తి - "చిన్ముద్ర" ప్రదర్శించి కాశ్మీర శైవ సాంప్రదాయపు పరిభాషలో, అద్వైత వేదాంత సారమును భోదించారు. కాశ్మీరములో శైవమతముతో బాటు శక్తి ఆరాధన కూడా ఎక్కువ గా వున్నది. ఇది అద్వైత మత సిద్ధాంతమునకు వచ్చినది. అందువలననే కాశ్మీరము - ప్రముఖ తాంత్రిక కేంద్రంగా మారినది. తాంత్రిక పూజలు ఎక్కువగా వ్యాప్తి చెందింది ఇక్కడే.

ఆర్యావర్తమగు భారతదేశము - శ్రీ చక్రము యొక్క బిందు త్రికోణమును సూచిస్తున్నదని ప్రతీతి! శంకర భగవత్పాదుల అట్లాగే దర్శించారు. ఈ భౌగొళికమైన అందాల - అపురూప కుసుమ విలసిత సీమను, సరస్సులు - మంచుకొండలు - నిష్కపట జీవన విధానం సాగించే కాశ్మీర ప్రజలు - సర్వ దేవతా నిలయం లాభాసిస్తున్నది.

కాశ్మీరము నేపాలము - కన్యాకుమారి మూడు కోణములు కాగా, మధ్య బిందువును కాశీ (వారణాశి)గా సూచిస్తున్నది ఈ భారతదేశ భౌగోళిక స్వరూపము! ఇట్లా కాశ్మీరము, కామేశ్వరీ

కామేశ్వరుల నివాస స్థానముగా - మానసిక శాంతిని ప్రసాదిస్తోంది. కాశ్మీరులోపలి భాగమైన రాజధాని నుండి "బోలోరు" పర్వతము వైపు వెళ్లినచో, "శారద" యను పేరుగల ప్రసిద్ధి చెందిన దారు ప్రతిమ (కొయ్యతో చేసిన దేవీమూర్తి) వున్నది. ఒకమారు గంగా తీరమందు ఆదిశంకరులు తమ శిష్యులతో బసచేసివుండగా కాశ్మీర దేశ వైభవమును, శారదాదేవి మందిరము గురించి ఆ పరమగురువుకు ఎవరో చెప్పారు. మండపాకారముగా (చతురస్రముగ) నాలుగు ద్వారములతో నిర్మింపబడిన ఆ మండపమున, శారదా అమ్మవారిని ప్రతిష్ఠించిన "సర్వజ్ఞ" పీఠము ఒకటి వున్నది. సర్వజ్ఞుడు కాని వాడెవడూ దాని పైకి - మెట్లు ఎక్కుటకు అర్హుడు కాడు. అంతక్రితం - ఎందరో పండితులు భారతదేశపు - ఉత్తరము, పడమర, తూర్పు దిక్కుల నుండి వచ్చి, ఆమండపమున ప్రవేశించుటకు ప్రయత్నించి విఫలులైనారు. శంకరులు దక్షిణ దేశపువాడు (కేరళ), శకంరులీ విషయం తెలుసుకొని ఆ మందిరం ప్రవేశించి, అద్వైత దర్శన సమగ్రత, ఆధిక్యతను ప్రతిష్ఠింపదలచారు. కాశ్మీరములోని వివిధ సంప్రదాయాలకు చెందిన పండితులు, విద్వాంసులు ఆ పరమ గురువును అడ్డగించి, అతని అద్వైత సిద్ధాంతమునకు, "సమ్యక్ దర్శనం" కలదా? అన్ని ప్రశ్నించారు. అణువాదులగు వైశేషికులు - తార్కికులుగా నైయాయుకులు, ద్వైతమతావ లంబులైన సాంఖ్యవాదులు, బౌద్ధులు, జైనులు, అందరు ఒకరి తర్వాత ఒకరుగా ఆదిశంకరులతో వాదానికి దిగారు. అందరినీ తన అద్భుత వాక్చాతుర్యంతో, సిద్ధాంత చర్చతో - తన స్వానుభవ, సాధికారిక అనుభవ ఉదాహరణలతో ఓడించారు శంకరులు - అపర శంకరులు! చివరగా వాదించినవారు "పూర్వమీ మాంసకులు!" కర్మ చేయటమే వేదాంత ఫరమార్థమని వీరి వాదన! అయితే శంకరులు శాస్త్రములను, కర్మను - వేదాంతమును అన్వయించి. ఈ మానవ జీవితము సార్థకము చేసుకొన వలెనని నిరూపించారు.

ఆశ్చర్యం! శారదామందిర ముతలువులు వాటంతటవే తెరుచుకొన్నవి. స్వయంగా శారదామాతయే ఆదిశంకరులను పరీక్షించి - వారి జ్ఞానము, సౌశీల్యము, సర్వజ్ఞత - ఆ విద్వాంసులందరికీ అర్థమయ్యేలా చేసి, "సర్వజ్ఞ పీఠము" అధిరోహించుటకు ఆది శంకరులే అర్హులని - అశరీరవాణిగా తెలిపింది. విద్వాంసుల మనుకొనే వారంతా ఆదిశంకరులకు శిరసా నమస్కరించారు. అయితే వినయ వివేక - వైరాగ్య, జ్ఞాన స్వరూపుడైన జగద్గురువు ఇది తన విజయముగా భావించక - శారదాదేవి అపారకరుణగా భావించి ఆ దేవిని "శారదా భుజంగ ప్రయాత స్తోత్రముగా, "తన అద్భుత కవితాఝరితో కీర్తించారు! అదీ సర్వజ్ఞత అంటే!

ఈ భారతదేశాన్ని శ్రీ చక్ర స్వరూపంగా దర్శించి తరించి - మనందరకు ఆ శ్రీ చక్ర దర్శనం మాతృభూమి యందు కూడా కలిగేలా ఆశీర్వదిస్తున్నారు ఈ శ్లోకంలో శంకరభగవత్పాదుల వారు కాశ్మీరులోనే - శంకరుని పై కొందరు శక్తి (అభిచారము) ప్రయోగించగా ఆయన వ్యాధిగ్రస్తుడయ్యాడు. శిష్యులు జాగ్రత్తగా ఉపచర్యలు చేయగా, ఆదిశంకరుల తపోమహిమతో అది ఉపశమించింది. మరొకసారి ఒక సద్బ్రాహ్మణి యొక్క కోడలితో (ఆమె విదుషీమణి) శక్తి సాంప్రదాయమును గురించి వాగ్వాదము చేసి, ఆమె భక్తి - పాండిత్యము - సంయమమునకు మెచ్చి, శంకరులు ఆమె శిరస్సు పై "తరంగా" అనే ఆభరణాన్ని తమ కానుకగా ఆశీర్వదించి పెట్టారట! ఇప్పటికీ కాశ్మీరులోని సాంప్రదాయ బ్రాహ్మణ స్త్రీలు - "తరంగా" అనే ఈ శిరోభూషణాన్ని జగద్గురువుల కరుణాకటాక్ష - గురుప్రసాదంగా ధరిస్తారు!

శివశక్తుల సమైక్య స్వరూపమే శ్రీ చక్రం!

కామేశ్వరీ, కామేశ్వరుల శరీరమే శ్రీ చక్రం

"శ్రీ చక్రం శివయోర్వపుః" అంటారు పెద్దలు

శ్రీ చక్రం అంటే మానవ మేధస్సుకు ఏనాటికీ అంతుబట్టని పిండాండ (మానవుడు) బ్రహ్మాండం (పరమేశ్వరీ స్వరూపం) అనగా సర్వచరా చరా జగత్తులు రెంటింటి పరోక్ష రూపం. ఈ రెండు కొంతయినా తెలుసుకోవాలంటే, శ్రీ చక్రార్చన ద్వారా లలితా సహస్రనామస్తోత్ర పారాయణ చేయాలని శ్రీ హయగ్రీవస్వామి వారు అగస్త్య మహామునికి శలవిచ్చారు. మనిషి జన్మ ఎందుకు వచ్చింది? దీనితో ఆ మనిషి సాధించవలసిన దేమిటి? ఏ ప్రయోజనం ఆశించి ఈ మానవ జీవితం గడపాలి? తాను ఏ పరబ్రహ్మ స్వరూపం నుంచి విడివడి - ఈ మానవ శరీరాన్ని తీసుకున్నాడో, ఆ పరబ్రహ్మ స్వరూపంలో మరల ఐక్యం కావటానికి చేయవలసిన సాధన ఏమిటి?

మానవ జీవిత కర్తవ్యం తినటం, నిద్రపోవటం, తన సంతతిని సృష్టించటం అనే మూడు తామస విషయాలలోను కూరుకుని పోకుండా, తనలోనేగల ఆ పరాశక్తి నిషట్చక్రాలలో - భక్తితో, పారాయణతో, సాధనతో, ధ్యానంతో - ఎవరికేది సులభమో ఆమార్గం అనుసరించి జ్ఞానం పొందుటకు ధ్యేయం కావాలి. అందుకు 4 శివచక్రాలతో, 5 శక్తి చక్రాలతో వున్న శ్రీచక్రం స్వరూపం ఏమిటో తెలుసుకొందాము.

ముందుగా ఈ చక్రాల వివరాలు పరిశీలిద్దాము.

శ్రీ చక్రం కామేశ్వరి కామేశ్వరుల శరీరం అని తెలుసుకున్నాము కదా?

శ్రీ చక్రంలోని తొమ్మిది చక్రాలలో - మధ్య బిందువులో - శివశక్తులిద్దరు సమైక్య రూపంతో (ఏక రూపంతో) కొలువైవుంటారు. అమ్మవారు "పరా" అని పిలువబడుతుంది.

ఈశ్వరుడు "సదాశివుడు" గా కొలువబడుతాడు. ఒకరిలో ఒకరు ఐక్యం అయిన రూపం ఇది.

బిందువు చుట్టూరా త్రికోణం వుంటుంది. ఇది ఇచ్ఛ జ్ఞాన, క్రియాశక్తులనే మూడు కోణములు గలిగిన త్రిభుజాకార చక్రం. ఇది కామేశ్వరీ కామేశ్వరు సమైక్యరూపం అయిన బిందువును ఆచ్ఛాదించి (చుట్టూరా △ ) వుంటుంది. దీనినే "అమ్మవారి పశ్యంతీ!" శక్తిగా కొలుస్తారు. "పశ్యంతీ" అనగా ఆలోచనాత్మకము, భావనాత్మకము అయిన శక్తి, మానవుల ఆలోచనలు ప్రారంభానికి ఇదే ఆధారం.

ఇకమూడవది "వసుకోణం" ఇది ఎనిమిది కోణములుగల చక్రం అష్టకోణచక్రం" అని కూడా అంటారు. అందుకు ఇది "మధ్యమ" స్వరూపం అమ్మవారి మధ్యమ స్వరూపం ఇది.

"మధ్యమ" అనగా వాక్స్వరూపం. వాగ్రూపం. అయితే ఇది "నాదరూపంగా మనిషిలో మెదులుతూ వుంటుందేగానీ - పైకి శబ్దాలుగా మాటలుగా వివరించి చెప్పలేరు. అందుకే దీనిని "నాద రూపిణి" అనీ, "జ్ఞానరూపిణీ" శక్తి అని కొలుస్తారు. "నాదబిందు కళాశక్తి" గా కీర్తిస్తారు. జ్ఞానం అంకురించిన తర్వాత అజ్ఞానం నశిస్తుంది మానవులలో అజ్ఞానం నశిస్తే - అన్ని రోగాలు తగ్గుతాయి. అందుకే దీనిని "సర్వరోగహర చక్రం" అని పూజిస్తారు. ఇక నాలుగవ చక్రం "దళారయుగ్మం". ఇది రెండు చక్రాలు పరస్పరం. ఒక దానిలో ఒకటి ఆడవారి గాజుయొక్క బయటికొలత లోపలి కొలతల్లా కలసి వుంటాయి. రెండు పది + పది మొత్తం రెండిటికీకలిపి ఇరవై దళాలు కలిగి వుండే చక్రాలు ఇవి. ఈ చక్రాలలో - వసుకోణంలో నాదంగా ప్రారంభమైన జ్ఞానం - వాక్కుగా, కవిత్వంగా, ఉపన్యాసంగా, గానంగా, ఇలా అక్షర సముదాయంతో శబ్దాలుగా, వాక్యాలుగా, కవిత్వంగా గానంగా పరిఢవిల్లుతున్నది. దీనినే అమ్మవారి "వైఖరీ" శక్తి అంటారు. అంతర్దశార చక్రమును "సర్వరక్షాక చక్రనమః" అని పూజిస్తారు. తినటం, నడవటం - వంటి కదలికలకు క్రియలకు కేంద్రం ఈ చక్రం.

బహిర్దశార చక్రమును "సర్వార్థసాధకే చక్రే సంతుష్టానంతనమః" అని పూజిస్తారు. పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అనే ఈ నాలుగు అమ్మవారి సరస్వతీ రూపాలు కూడా శ్రీ విద్యా స్వరూపాలు కూడా! ఈ నాలుగు నామాలు నిరంతరం మననం చేసుకుంటే సరిగా మాటలు రానివారికి (బిడ్డలకు, స్పష్టమైన ఉచ్ఛారణ, మంచి వాక్కు వస్తుందని పెద్దలు చెబుతారు).

ఇక ఐదవ చక్రం "మన్వస్ర" ఇది పదునాలుగు (14) కోణములు కలిగినది. అందుకు చతుర్ధశార చక్రం "అని కూడా అంటారు. ఈ చక్రంలో - మానవులలో త్రికోణ చక్రంలో (పశ్యంతీ) ఆలోచనా, భావనా రూపంలోవున్న భావబీజములు, పరిణితి చెందుతాయి. క్రియారూపందాల్చుతాయి. గనుక దీనిని "సర్వసౌభాగ్యదాయిని చక్రేనమః" అని పూజిస్తారు

మన్వస్రచక్రం తర్వాత 6వ చక్రం అష్టదళం. ఇది ఎనిమిదవ దళములు గల చక్రము. వసుకోణం 8 కోణములు. అది వేరు. ఇది ఎనిమిది దళములు, ఇది వేరు. ఇవి రెండు వేరు వేరు చక్రాలు÷.

"సర్వసంక్షోభిణీ చక్రేనమః" అని పూజిస్తారు. ఇది మానవుల హృదయ స్థానంలో వుంటుంది.

7వ చక్రవం షోడశదళం. ఇది 16 దళములుగల చక్రం. మానవుల కంఠస్థానంలో వుండే "విశుద్ధి" చక్రంలో వుంటుంది. అక్షరాలలోని 16 అచ్చులు - హల్లులతో కూడి వాక్కును - వడబోసిన్నట్టుగా (ఫిల్టర్ చేసినట్లు) విశుద్ధి చేసి ప్రపంచానికి అందిస్తాయి! సంగీత మాధుర్యము ఇక్కడే ఏర్పడుతుంది. స్వరపేటిక, - (ఓకల్ కార్డ్స్) ఇక్కడే వుంటాయి మానవులకు అందుకే దీనిని "సర్వశా పరిపూరక చక్రేనమః" అని పూజిస్తారు.

8వ చక్రం "మేఖలాత్రయం." ఇది మూడు వలయములుగల చక్రం. చంద్రుడు - అగ్ని, సూర్యమండలము ఈ వృత్త త్రయము. ఇవిపైన చెప్పిన చక్రాలలో రెండేసి చక్రాలను చుట్టి వుంటాయి.

9వ చక్రం - భూపురత్రయము నాలుగు ద్వారములు. భూపురము అనగా, భూమండలం (బ్రహ్మాండం) నాలుగు ద్వారాలు, నాలుగు వేదములు.

భూపురము, మేఖలాత్రయము, షోడశదళము, అష్ట దళము అనే చివరి నాలుగు చక్రాలే శివచక్రాలు.

బిందు, త్రికోణ, వసుకోణ, దశారయుగ్మ, మన్వస్ర చక్రములు ఐదు, శక్తి చక్రములు, శక్తి చక్రములలో త్రికోణం క్రిందికి వుంటుంది.

శివచక్రాలలో త్రికోణం పైకి (ఊర్థ్వముఖంగా) వుంటుంది.

మానవులలో నిద్రాణమై వున్న జ్ఞానాగ్నిని రగిల్చి - మేలుకొలిపి - ఈ శ్రీ చక్ర పూజ ద్వారా, షట్చక్రధ్యాన స్థితి ద్వారా, మనిషి మరలా తన స్వస్థాన మైనపరబ్రహ్మలో లీనం కావటమే మానవ జీవిత ధ్యేయమని శ్రీ చక్ర రచన చెబుతోంది.

100 శ్లోకాలలో - సౌందర్యలహరిలో ఆ జగన్మాత యొక్క - మంత్ర, తంత్ర, విరాట్ - స్థూలసూక్ష్మ - శ్రీ చక్రస్వరూపాలను కొంతచిదానంద లహరిగాను - కొంత సౌందర్యలహరిగాను వర్ణించి - జగద్గురువు - మనలోనే కొలువై వున్న అమ్మవారి దివ్యశక్తిని తెలుసుకోవలసినదిగా ఉద్భోధిస్తున్నారు ఈ శ్లోకంలో.

శ్రీ చక్రస్వరూపిణి అయిన పవిత్ర భారతదేశంలో - మానవ జన్మలోనికి వచ్చిన మనం అదృష్టవంతులం. ఈ జన్మవృథా చేసుకోకూడదు. కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు అమ్మవారి దివ్యదర్శనం చేసి పరమగురువులు మన ఎదుట "సౌందర్యలహరి" శ్లోకాల రూపంలో నిలిచి వున్నారు. అవునా ?

## 12 శ్లో॥ శివునిలో ఐక్యం అయి జగన్మాత సౌందర్యమును దర్శించుట శివ సాయుజ్యము

**12. శ్లో॥ త్వదీయం సౌన్దర్యం, తుహినగిరి కన్యే, తులయితుం**
**కవీన్ద్రాః కల్పంతే కథమపి విరిఞ్చి ప్రభృతయః**
**యథాలోకౌత్సు్క్యా దమరలలనాయాన్తి మనసా**
**తపోభిర్దుష్ప్రాపామపి గిరిశ సాయుజ్యా పదవీమ్ ॥**

అర్థము : తల్లీ! జగన్మాతా! పార్వతీదేవీ! నీ సౌందర్యమును వర్ణించుటకు బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మున్నగు కవిశ్రేష్ఠులు ఎంత ప్రయత్నించిననూ - సమర్థులుగా కున్నారు. నిన్ను ఎట్లును వర్ణింప జాలకున్నారు. అట్టిలోకోత్తరమైన నీ సౌందర్యమును దర్శింప కుతూహలము కలవారై నీ సౌందర్యముతో తాము ఇసుమంతయు (కొంచెమైనను) సరిరాకపోయిన వారై, ఈశ్వరుని లోసాయుజ్యమును వారి మనస్సుతో పొందనిచ్చ గించుచున్నారు. అనగా ధ్యానయోగంతో ఈశ్వరునిలో సాయుజ్యం పొంది, ఈశ్వరుని ద్వారా - నీ సౌందర్యమును దర్శింప వచ్చునని ఆశపడుతున్నారు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులు. అమ్మవారి అలౌకిక, అతులిత సౌందర్య వైభవం వర్ణించారు పరోక్షంగా, ఇక్కడ కొంచెం వివరంగా ఆలోచిద్దాము.

శ్రీ శంకర భగవత్పాదులు - కైలాసం నుండి - ఈశ్వర వాణిగా సౌందర్యలహరిని పొంది. దానిని తాటియాకుల మీద (చిత్తుప్రతి వలె త్వరత్వరగా వ్రాసుకొని) కైలాసం నుండి తిరిగి రావటానికి - ఈశ్వరునీ - అమ్మవారినీ శలవు కోరారు. ఆ తర్వాత నంది - ఘర్షణకు దిగాడు.

ఎలాగో శ్రీమాత, ఈశ్వరుల అపారకరుణతో నంది తాకిడి తప్పించుకుని, ఎగిరి పోయిన తాటాకులు - చెల్లాచెదరైన తాటియాకులు కొన్ని ఏరుకొని - మరికొన్ని కానరాక, భూలోకానికి తిరిగివచ్చారు ఆచార్యులవారు.

"సౌందర్య లహరి" వ్రాయటానికి కూర్చున్నారు. విఘ్నేశ్వరుని స్తుతించారు. తన గురువైన గోవింద భగవత్పాదుల వారిని భక్తితో స్మరించారు. ఇష్టదేవతా ప్రార్థన చేసుకున్నారు.

"ఇది ఏ వృత్తంలో వ్రాయాలి?"

అని మధన పడ్డారు... ఆయన హృదయానికి జగన్మాత యొక్క తులలేని సౌందర్యం రాశిభూతమై సాక్షాత్కరింప సాగింది .... "శిఖరిణీ!" అప్రయత్నంగా ఆచార్యులవారి నోటి వెంట వెలువడింది ఆ మాట!

ఔను, "శిఖరిణీ" వృత్తం.

శిఖరిణీ అంటే - ప్రపంచంలో - సాటిలేని సౌందర్యముగల, సాటిలేని స్త్రీ అని అర్థము. (శిఖరిణీ అంటే ఆడునెమలి అనే అర్థం కూడా వున్నది) కానీ - ఈ సౌందర్యలహరి రచన విషయంలో - సౌందర్యంలో, సౌశీల్యంలో, తపస్సులో శక్తిలో - మాతృత్వంలో, మాతృమమతలో, పాతివ్రత్యంలో. ఇలా ఏ విషయంలోను ఆ తల్లితో సరితూగగల స్త్రీ ఎవరూ లేని దివ్యశక్తి స్వరూపిణి ఆమె! కాబట్టి "శిఖరిణీ" శిఖరిణీ వృత్తంలోనే వ్రాయాలి. లలితా సహస్రనామస్తోత్రంలోని "అనవద్యాంగీ" అనే నామానికి సరైన అర్థం చెప్పేట్లుగా వుండాలి ఈ "శిఖరిణీ" వృత్తంలో వ్రాసే "సౌందర్యలహరి" అని భావించారు.

సూత్రములకు అతీతమైనది. చక్కని సూత్రములు కలది. మృదువైన నడక గలది - మధురమైన భావములను తనలో ప్రసరింపజేయగలది. పాదమునకు 17 (పదిహేడు) అక్షరములు. 4 పాదములు (నాలుగు పాదములు) గలది ఈ శ్లోక లక్షణం ("కించిత్" అంటే గణం సరిపోదు. "కిఞ్చిత్" అనాలి. "మంచ" అనరాదు "మఞ్చ' అనాలి).

ఆచార్యువారు ఆనందంతో హృదయం ఉప్పొంగి పోగా ఘంటం చేతబూనారు. అనన్యసామాన్య సౌందర్యలహరిగా వారి కవిత్వంలో అమ్మవారు లాస్యం చేయ నారంభించింది. "శిఖరిణీ" వృత్త శ్లోకాలు.

కాబట్టి - ఈ శ్లోకంలో - తన స్వానుభవాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ - ఆచార్యుల వారు "త్వదీయ సౌందర్యం - "తుహినగిరి కన్యే! తులయితుం" అంటూ శల విచ్చారు మొదటి పాదంలో

"శిఖరిణీ" వృత్తము సప్తదశమైన (అనగా 17) "అత్యష్టి" చందస్సుకు సంబంధించినది. ప్రతిపాదమునకు పదిహేడు అక్షరములు (17) వుంటాయి. దీనిలో 131072 (పదమూడులక్షల పదివేలా డెబ్భైరెండు) వృత్తములు పుట్టినవి. ఇందులో "య - మ - న - స - భ - వ"

అనుగుణములు వుంటాయి. 12వ అక్షరము (పన్నెండవ అక్షరము) తరువాత, 13వ అక్షరము (పదమూడవ అక్షరము)నకు ముందు "యతి" వుంటుంది. సంస్కృతములో "యతి" అనగా "విరామము," అని అర్ధము. అనగా, ఒక పదము పూర్తియై మరియొక పదము ఆరంభమగుట.

తెలుగులో "యతి" అనగా అక్షరములకు మైత్రి.

(సంస్కృతంలో అయితే - విరామము.)

ఉదాహరణకు ఈ శ్లోకం గమనిద్దాము.

| 69. | గళేరే | ఖాస్త్రిస్రో | గతిగ | మకగీ | త్రైకని | పుణే |
|---|---|---|---|---|---|---|
| | I U U | U U U | I I I | I I U | U I I | I U |
| | య | మ | న | స | భ | వ |
| | లఘువు, రెండు గురువులు | మూడు గురువులు | మూడు లఘువులు | రెండు లఘువులు ఒకగురువు | ఒకగురువు, రెండు లఘువులు | ఒక లఘువు ఒకగురువు. |

యతి : - గీ - త్రైక

అట్లాగే 76వ శ్లోకం

| 76. | హరక్రో | ధజ్వాలా | వళిభి | రవలీ | ఢ్యేనవ | పుషా |
|---|---|---|---|---|---|---|
| | యు | మ | న | స | భ | వ |

ఇట్లా "సౌందర్యలహరి" లోని అన్ని శ్లోకములూ "శిఖరిణీ" వృత్తములో రచించారు ఆచార్యులవారు.

సంస్కృతములో, తెలుగులో వలె, రెండవ అక్షరము, ప్రతి పాదములో తప్పని సరిగా పునరావృత్త మగుట లేదు. ("ప్రాస"లేదు.)

తెలుగులో ఉన్న "ఉత్పలమాల" "చంపకమాల" మొదలైనవి, సంస్కృతములోని ఛందస్సులలోనివే! వృత్తములన్నియు గణములతో కూర్చబడును. ప్రతి ఛందస్సులోని వృత్తమునకు అక్షర సంఖ్యానియమము, నాలుగు పాదములలోనూ సమానముగా వుంటుంది. "సీస పద్యము", "తేట గీతి" మొదలైన వాటిలో అక్షర సంఖ్యా నియమము వుండదు. వాటిలో ఇంద్రగణములు, సూర్య గణములు ఉంటాయి. అవి అక్షరసంఖ్యతో నియమితములు కావు. వృత్తమునకు, మాత్రా ఛందస్సునకు సంబంధము లేదు.

తెలుగులో శిఖరిణీ వృత్తమును ఎక్కువ మంది కవులు ఉపయోగించలేదు. "భవభూతి" మొదలైన సంస్కృత మహాకవులు చాలామంది శిఖరిణీ వృత్తాన్ని తమ తమ కావాల్యలలో ఉపయోగించుకున్నారు. ప్రయోగించారు. "భవభూతి" రచించిన "ఉత్తర రామ చరిత్ర" నాటకములో శ్రీరాముని విరహ దుఃఖమును వర్ణిస్తూ చెప్పిన పద్యము. ప్రసిద్ధమైనది. "శ్రీ రాముని విరహ వేదన దుస్సహ దుఃఖము చూచి, బండరాయి కూడా రోదనము చేయుచున్నది "వజ్రముయొక్క హృదయము కూడా పగిలిపోవుచున్నది" అనే అర్థం వచ్చే ఈక్రింది శ్లోకాన్ని పరిశీలించండి."

శ్లో ॥ అపిగ్రావా రోది త్యపి దళతి వజ్రస్య హృదయమ్

ఇది శిఖరిణీ వృత్తంలో రచింపబడినది, ఎలాగో గమనిద్దాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అపిగ్రా | వారోది | త్యపిద | ళతివ | జ్రస్యహృ | దయమ్ |
| య | మ | న | స | భ | వ, |

గ్రావా = రాయి (బండరాయి) అపి = కూడా, రోదతి = రోదనము చేయుచున్నది. వజ్రస్య = వజ్రముయొక్క, హృదయమ్ = హృదయము, అపి = కూడా, దళతి = పగిలి పోవుచున్నది.

శ్రీ శంకర భగవత్పాదుల వారు, తమ సౌందర్యలహరిని - - - జగత్తులన్నిటిలో - అత్యంత సౌందర్యవతి అయిన జగన్మాత సౌందర్యమును సౌశీల్యమును, సౌకుమార్యమును - పాతివ్రత్యమును, మహాత్మ్యమును, ప్రభావమును, విరాట్‌రూపమును, స్థూల సూక్ష్మ, మంత్ర, తంత్రయంత్ర రూపమును తాను దర్శించి - మనందరకు ఆ బ్రహ్మానందాన్ని అందించాలనే అపార, అవ్యాజ కరుణతో, అత్యంత సౌందర్య భరితమైన "శిఖరిణి" వృత్తాన్ని - అత్యష్ఠి ఛందస్సులో (పాదమునకు 17 అక్షరాలూ, నాలుగుపాదాలు) నూరు శ్లోకాలలో అందించారు. కొన్ని శ్లోకాల నడక కొద్ది మార్పు (మనం పలికే రాగంలో) అనిపిస్తుందే గానీ, ఛందస్సులో వృత్తంలో ఏ మార్పూ లేదు. ఆ జగద్గురువు - కవితాశక్తినీ - కవిత్వ ఝురికీ - ఒకగొప్ప ఉదాహరణ - సౌందర్యలహరి రచన. అవునా ?

బ్రహ్మ, విష్ణు, ఇంద్రుడు మొదలైన కవీశ్వరులు - ఆ తల్లి సౌందర్యం (సౌశీల్యం - తపశ్శక్తి - శక్తి స్వరూపం) పూర్తిగా దర్శించాలని కుతూహల పడ్డా - లాభం లేకపోయింది. పూర్తిగా తెలుసుకోలేక పోయారు. వారు ఒక ఉపాయం ఆలోచించారు. తమ తపశ్శక్తి - సాధన - ఉపాసన యోగం - ధ్యానం - సర్వంధార పోసి - ఈశ్వరుని సాయుజ్యం - తమ హృదయంతో పొందగలిగితే - తద్వారా అమ్మవారిని దర్శించవచ్చు. అని!

ఎంత గొప్ప భావమో గమనించండి!

ఈశ్వరునిలో ఐక్యం అయివున్న విమర్శ రూపిణి ఆ తల్లి, ఆమెను దర్శించాలంటే - ఈశ్వరసాయుజ్యం, ఈశ్వరునిలో విలీనం అయిపోవాలి! ఎలా ?

సాధారణ కోర్కెలు, ప్రలోభాలూ, సిద్ధుల పట్ల ఆకర్షణా - వున్న వారెవరూ - శివుని పాదాలదరిదాపులకు కూడా వెళ్లలేరు- ఇక ఈశ్వరునిలో ఏకంగా సాయుజ్యం సాధించాలంటే - ఈశ్వరుని వలె మారిపోవాలి యోగంలో! అది సాధించినవారికీ ఆ తల్లి అతులిత సౌందర్యం గోచరమౌతుంది! అందుకు సిద్ధపడ్డారు ఆ దేవతలు .- అవునా ?

## 13వ శ్లో ॥ జగన్మాతను ఉపాసించినవారి మహిమ.

**13 శ్లో॥ నరం వర్షీయాంసం, నయన విరసం, నర్మసు జడం,**
**తవా పాఙ్గాలోకే పతిత మనుధావన్తి శతశః**
**గల ద్వేణీ బంధాః, కుచకలశ విస్రస్త సిచయాః**
**హఠాత్త్రుట్య త్కాంచో, విగళిత దుకూలా యువతయః ॥**

**అర్ధము :-** ఓ జగన్మాతా! భవానీ! కరుణకు ఆకరమైన నీ కడగంటి చూపునకు (కృపా కటాక్ష వీక్షణమునకు) పాత్రుడైనవాడు, అతడు ఎంతటి వృద్ధుడైననూ, నిత్యజీవితంలో ఎందుకూ పనికిరాని జడుడైననూ, వికార రూపుడైననూ, అట్టివానినే వలచి, సౌందర్యవతులైన స్త్రీలు, తమ కొప్పులు జారగా (తలముడులు వీడగా), (పరుగు పరుగున రావటంలో, సంభ్రమములో) పైటలు జారగా, మొలనూళ్లు తెగగా, కోక ముడులు వీడిపోగా (కుచ్చిళ్లు జీరాడుతుండగా,) - ఆతడిని వెంబడించి పరుగులిడుదురు గదా ?

ఈ శ్లోకంలో, శ్రీ శంకర భగవత్పాదులవారు, అమ్మవారి ఒక్క కరుణా కటాక్ష వీక్షణం సోకిన భక్తుని, ఉపాసకునికి వచ్చే దివ్య శక్తిని అద్భుతంగా వర్ణించారు.

పుసులు కట్టిన కళ్లు - వికార రూపుడు - జడుడు (మన్మథ క్రీడలందు ఆసక్తి లేనివాడు) అయిన వృద్ధుడిని ఏ సౌందర్యవతులు - కోరుతారు! అతి దారిద్ర్యంవలన కట్నాలు ఇవ్వలేకనో - ఏ బలవత్తర పరిస్థితుల్లోనూ - కాలుజారో లేక - బలవంతంగా మాన భంగం చేయబడో - దీన అయినస్త్రీకి - ఎలాగో ఓలా పెళ్లిచేసెయ్యాలి. రెండోపెళ్లివాడికి, లేక మూడోపెళ్లివారికి - అలా ఆలోచించి, - వృద్ధులకు ఇచ్చి కట్టబెట్టడం చూస్తున్నాం - ఈ పరిస్థితి దారిద్ర్యంలో వున్నది! నిస్సహాయతలో వున్నది. అత్యాశలుగల కట్నరూప పిశాచపు తలితండ్రులు -

యువకులవలన ఉత్పన్న మౌతున్నది. ఇక బలి పశువులా మారిన ఆ కన్యలులో లోపల అసంతృప్తిని (దిగమింగుకుంటూ - ఈ దేశం - తమకు పుట్టుకతో ప్రసాదించిన జ్ఞానం, ఆత్మసం యమనం, పాతివ్రత్యం - ఓర్పు - మాతృ మమతలాటి మహోన్నత గుణాలతో జీవితాలలో సర్దుకుపోతారు - వారి హృదయాంతరాళాలలో కొండంత అసంతృప్తి) చీకటి దాగివున్నా వారు దానిని బహిర్గతం చేయరు. చేసేపనైతే కొన్నివేల సంసారాలు పరువుహీనంగా తయారౌతాయి.

కానీ - అమ్మవారి కరుణా కటాక్ష వీక్షణం సోకిన ఆ వికార రూపుడూ వృద్ధుడూ - జడునికి - అతి సౌందర్యవతులైన స్త్రీలు తమ ఒళ్లు తెలియనంతటి మోహ పరవశత్వంతో - వెంటబడటం ఏమిటి ? విచిత్రంగా లేదూ ?

ఇది విచిత్రంగాదు - ఆ జగన్మాత కరుణా కటాక్ష వీక్షణం - ఆసాధకునికి ప్రసాదించిన దివ్యశక్తి మహిమ! దేవీ భాగవతంలో "సుకన్య" చరిత్ర వున్నది. అది ఈ సందర్భంలో చెప్పుకుందాం. శర్యాతి మహారాజు కూతురు సుకన్య! అందంలో, సకల కళలలో ఆరితేరిన సుకుమారి. రాచరికపు భోగాలలో పెరిగిన కన్య ఆమె.

ఒకరోజు శర్యాతి మహారాజు, సపరివార సమేతుడై - అరణ్యంలో వేటకు వెళ్లాడు. ఆయన వెంట సుకన్య కూడా, తన చెలికత్తెలతో వస్తానని కోరింది. తండ్రి అయిన శర్యాతి మహారాజు, కుమార్తె కోరిక కాదనలేక, ఆమెను ఆమె చెలి కత్తెలను కూడా వెంట పిల్చుకు వెళ్లాడు. ఆకాలంలో మహారాజులు - అలా వేటకు వెళ్లి, మృగాలను, క్రూరమృగాలనూ వేటాడి. ఆశ్రమ వాసులైన ఋషులకు ప్రశాంతత చేకూర్చటం ఆనవాయితీ!

శర్యాతి మహారాజు, పరివారమూ, వేటాడిన తర్వాత - ఒక రమణీయవనంలో విడిదిచేశారు విశ్రాంతికోసం, అది మహాతపోనిధి అయిన చ్యవన మహర్షి ఆశ్రమ ప్రాంతవనము. కానీ ఆమహర్షి అక్కడ లేడు. ఈలోగా సుకన్య, తన చెలికత్తెలతో, వనం అంతా తిరుగుతూ, ఒకబ్రహ్మాండమైన పుట్టను చూచింది. ఆపుట్ట రంధ్రంలో నుండి - రెండు జ్యోతులు - మెరుస్తూ వుండటం చూచింది. బాల్య చాపల్యం వదలని - యవ్వన కుతూహలం ప్రారంభమైన వయస్సు ఆమెది. ఆ మెరుస్తున్న జ్యోతులేమిటోనని, మిణుగురు పురుగులేమోనని భ్రమపడి, ఒకపుల్లతో ఆ రంధ్రంలో పొడిచింది : తర్వాత చెలులతో కలిసి ఆటపాటలలో నిమగ్నమైంది

- కానీ - శర్యాతి మహారాజుకూ, ఆయన పరివారానికీ, మలమూత్ర దిగ్బంధన జరిగిపోయింది! ఇకవేటచాలించి అందరూ రాచనగరు చేరుకున్నారు. వారం రోజులైనా అదే పరిస్థితి. అందరి ఆరోగ్యమూ దెబ్బతిన్నది. శర్యాతి రాజు తీవ్రంగా ఆలోచించాడు, చ్యవన మహర్షి ఆశ్రమ

ప్రాంతంలో తమకీ దుస్సహబాధ సంప్రాప్తమైంది - ఆ మహర్షి ఆశ్రమంలో అయితే లేడు, కానీ - ఆయన కేదో అపచారం జరిగింది తమ వలన - అనిగ్రహించాడు. పరివారాన్నంతా ప్రశ్నించాడు వనంలో ఎవరేమి చేశారు ? అంటూ.

సుకన్య - తండ్రితో జరిగింది చెప్పింది. తానుపుట్టలో మెరుస్తున్న జ్యోతులు చూచి - పుల్లతో పొడిచాననీ చెప్పింది. శర్యాతి మహారాజు బాధపడ్డాడు. భయపడ్డాడు.

మరలా శర్యాతి రాజు - కు మార్తె పరివారమూ వెంటరాగా చ్యవన మహర్షి ఆశ్రమావనానికి వెళ్లాడు, పుట్ట మెల్లిగా తొలగించాడు. నిర్ఘాంత పోయాడు.

వృద్ధుడూ - జడలు కట్టిపోయిన జుట్టుతో - తపస్సుతో కృశించిన శరీరంతో, కళ్లు తన కుమార్తె పొడవగా, అవి దృష్టికోల్పోయి, రక్తంకారి కారి - గడ్డకట్టిపోయి - వికార స్వరూపుడై పడివున్న చ్యవన మహర్షి కనిపించాడు. రాజు, ఆ మహర్షి పాదాలపైపడ్డాడు. క్షమించమని వేడుకున్నాడు.

ఆ తపశ్శాలి - క్షమించాడు. అందరికీ మలమూత్ర దిగ్బంధన నుండి విముక్తి కలిగింది. కానీ ఈ మహర్షికి ఎవరు సేవచేయాలి ? అందుకే శర్యాతి మహారాజు - తన వద్దవున్న పరిచారి కలను ఆ వృద్ధ తాపసి సేవకు నియమిస్తానని చెప్పాడు. అప్పుడు సుకన్య - పెదవివిప్పింది. ఆమె దేవీభక్తురాలు. "ఈ జరిగిన తప్పు అంతా నావలన జరిగింది. ఆ మహర్షి కళ్లు - పుట్టలో జ్యోతుల వలె మెరుస్తుండగా, అవి మిణు గురుపురుగులని భావించి - పుల్లతో పొడిచి, ఆ మహర్షి దృష్టి పోగొట్టినదానను నేను. ఇంత చేసినా తపోనిధి నన్ను శపించలేదు. భస్మం చేయలేదు. ఆ తాపసోత్తముని క్షమముందు నా ఈ జీవితం ఏపాటిది ? తండ్రీ! పరిచారి కలను నియమించవద్దు - ఈ తాపసిని వివాహంచేసుకుని, నేను వారికి సేవచేసి - నా పాప ప్రక్షాళనం చేసుకుంటాను!" అని చెప్పింది, శర్యాతి మహారాజు, రాణి దిగ్భ్రాంతి పొందారు. ఆ నిర్ణయం వద్దని చెప్పిచూశారు సుకన్య వినలేదు.

ఇక చేయగలిగినది లేక - వారు చ్యవన మహర్షికి - సుకన్యకు వివాహంచేశారు సుకన్య రాచనగరు వదిలి - మహర్షి ఆశ్రమంలో మహర్షి వద్ద వుండిపోయింది.

ఆయనను బహిర్భూమికి పిల్చుకుపోవటం మొదలు - తపస్సాధనకు అన్నీ అమర్చేవరకూ ఆమె స్వయంగా సేవచేసేది! ఏ క్షణంలోనూ, విసుగు కానీ, బాధగానీ లేదా సేవలో! ఒక మహాతపోనిధి తన భర్త అనే భావనతప్ప - ఆయన వృద్ధుడా ? జడుడా ? కురూపుడా ? అనే విమర్శ లేదా మెలోమన సా,వాచా, కర్మణా! ఒకనాడు - అశ్వనీ దేవతలు చ్యవన మహర్షి

ఆశ్రమానికి వచ్చారు. సుకన్యను చూచి ఎవరని ప్రశ్నించగా ఆమె తన వృత్తాంతం అంతాచెప్పింది. వారు తపోనిధి అయిన చ్యవన మహర్షిని - తమకు - దేవతలతో బాటు యజ్ఞాలలో సోమపానానికి అర్హత, అధికారం ప్రసాదించమనీ, చ్యవన మహర్షికి తాము నిత్యయవ్వనం ప్రసాదిస్తామని చెప్పారు చ్యవన మహర్షి అంగీకరించాడు. వారు - చ్యవన మహర్షిని - ఒక సరస్సులో స్నానం చేయమన్నారు. స్నానం చేసి బయటకు వచ్చిన ఆ మహర్షి నవయావ్వన సుందరాంగునిగా మారిపోయాడు. సుకన్య - చ్యవన మహర్షి - ఆనందించారు. తన తపశ్శక్తితో, ఇంద్రాది దేవతలను నిలువరించి - యజ్ఞంలో - అశ్వనీ దేవతలకు సోమపాన అర్హత అధికారం ప్రసాదించాడు చ్యవన మహర్షి!

సుకన్య చరిత్ర అజరామర మైంది!

ఈనాడూ ఆరోగ్యానికి "చ్యవనప్రాస!" లేహ్యం వాడమని ఆయుర్వేద వైద్యంలో ఒక లేహ్యానికి "చ్యవనప్రాస!" అనే పేరువున్నది గమనించండి. అతి వృద్ధుడు - వికార రూపుడూ - దృష్టి పోయినవాడూ అయిన చ్యవనునికి - ఆ అశ్వనీ దేవతలు (దేవవైద్యులు) ఇచ్చిన ఔషధాల సమ్మేళనమే "చ్యవనప్రాస" అని ఆయుర్వేద వైద్యులు చెబుతుంటారు కూడాను.

చ్యవన మహర్షిలాటి వృద్ధ తాపసిని - విరూపుడిని - ఆనాటి సుకన్యలాటి సౌందర్యవతి, రాచకన్య - సుకుమారి కోరివరించి వివాహమాడి - మనసా, వాచా, కర్మణా సేవలు చేసిందీ అంటే ఇది ఎవరిమహిమ ? తన ఉపాసకుడూ, అనన్య భక్తుడూ - తపశ్శాలి అయిన చ్యవన మహర్షిపై - జగన్మాత కరుణా కటాక్ష వీక్షణం ప్రసరించటం కాదా ? - దాని ఫలితమే మిగతా జరిగిన కధ అంతా!

నర నారాయణుల ఊరువుల నుండి జన్మించిన - అతి సౌందర్యవతులైన దేవతాస్త్రీలు (ఊర్వశి మొదలైనవారు) ఆ మహర్షుల తపస్సుకు ఆకర్షితులై - వారిద్దరినీ తమ భర్తలుగా కోరుకొన్నారు కాదా ?

కాబట్టి - జగన్మాత కరుణా కటాక్ష మహిమ వలన సౌందర్యవతులే కాదు - సకల సిద్ధులూ - ఆ ఉపాసకులకు పరవశంతో దాసోహమంటాయి.

ఇన్ని ఆలోచనలు - ఒక్క శ్లోకంలో పొందు పరచారు. శ్రీ శంకర భగవత్పాదుల వారు. మనమూ ఆ తల్లి కరుణా కటాక్ష వీక్షణంలోని ఒక వెయ్యోవంతు కిరణం పొందటానికి ప్రయత్నిద్దాము. పదండి - పారాయణ చేద్దాం.

# 14 శ్లో ॥ జగన్మాత మయూఖములు.
# (కిరణములు)

14 శ్లో ॥క్షితే షట్పం చాశ, ద్ద్విసమధిక పంచాశ దుదకే!
హుతాశే ద్వాషష్టిశ్చ మరధిక పంచాశ దనిలే,
దివిద్వి ష్షట్త్రింశ, న్మనసిచ చతుష్షష్టి రితి,యే
మయూ ఖాస్తే షామప్యుపరి తవ పాదాంబుజ యుగమ్ ॥

**అర్థము** :- ఓ దేవీ! జగన్మాతా!

| | |
|---|---|
| "క్షితి" అనగా పృధివి (భూమి) యందు | 56 |
| ఉదకము (జలము) నందు | 52 |
| అనిలుడు (అగ్ని) యందు | 54 |
| దివి (ఆకాశము) యందు | 72 |
| మనస్సునందు | 64 |

సంఖ్యగలవై, నీ చరణకమలములు వెలుగొందు చున్నవి. ఆ ఆరింటికీ (6)కీ పైన సహస్ర దళముల మధ్యన వర్తించు చంద్రబింబాత్మకమైన బైందవ స్థానమను పేరుగల అమృత జలధిలో, నీ పాదయుగము ప్రకాశించుచున్నది..

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు "కాలస్వరూపిణి"గా శ్రీమాత విరాట్ స్వరూపాన్ని అద్భుతంగా వర్ణిస్తున్నారు.

మనందరికీ కనిపిస్తున్న ఈ చరా చర ప్రపంచమంతా, ఒక "కాలనియమానికీ," "కాలపరిధికీ" కట్టుబడి వున్నదనే నగ్నసత్యంత - మనం మర్చిపోతున్నా, మహర్షులూ, మహాగురువులూ - మర్చిపోరు!

సంవత్సరానికి 360 (మూడు వందల అరవై)రోజులు, ఇవి ఎలా ఏర్పడుతున్నాయి ? తెలుసుకుందామా .

| | | |
|---|---|---|
| అగ్నికి జ్వాలలు | - | 108 |
| సూర్యునకు | - | 116 |
| చంద్రునకు | - | 136 |
| మొత్తం కూడగా | = | 360. |

మొత్తం 360 జ్వాలలు లేక కిరణములు. ఇవే సంవత్సరమును రోజులుగా చెప్పబడుతున్నాయి.

ఇక మన శరీరాంతర్గత మగు "షట్చక్రములలో" ఈ సూర్య, సోమాగ్ని రూపమైన కిరణములు ఎలా విస్తరించివున్నాయో తెలుసుకుందామా ?

1. మూలాధారము + స్వాధిష్ఠానము అనే రెండుచక్రాలూ ఒక ఖండము. ఇదే అగ్నిస్థానం. ఈచక్రాల చుట్టూరా వలయంలా వుండేదే "అగ్నిఖండము" లేక "ఆగ్నేయఖండము," అంటారు. దీనినే "బ్రహ్మగ్రంది" అంటారు.

మణి పూరకము + అనాహతము అనే రెండుచక్రాలూ ఒక ఖండము. ఇదే సూర్యస్థానము. ఈ చక్రముల చుట్టూరా వుండే వలయమే సూర్యఖండము" అంటారు. ఇదే"విష్ణుగ్రంది". విశుద్ధి + ఆజ్ఞా చక్రములు రెండూ ఒక ఖండము. (3వ ఖండము.) ఇదే చంద్రస్థానం (మనస్సుస్థానం)! ఈ రెండుచక్రాల చుట్టూరా వుండే వలయమే "చంద్రఖండము" అంటారు. ఇదే "రుద్రగ్రంది". లలితా సహస్రనామ స్తోత్రంలో

**శ్లో ॥ మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంధి విభేధినీ**
**మణిపురాంత రుదితా విష్ణుగ్రంధి విభేధినీ.**
**ఆజ్ఞాచక్రాంత రాళస్థా రుద్రగ్రంధి విభేధినీ!**
**సహస్రా రాంబుజా రూఢా సుధాసారాభి వర్షిణీ!**

అనిస్తోత్రంచేశారు వశిన్యాది వాగ్దేవతలు.

ఆ మూడు వలయాలనే - "మేఖలాత్రయం" అనే 8వ (ఎనిమిదవ) చక్రంగా - శ్రీచక్రంలో వర్ణించారు మహర్షులు! ఈ గ్రంధి భేదనం చేసిన సాధకుడు (శ్వాసక్రమంతో) ఎన్నో సిద్ధులుపొంది, కర్తృత్వాహంకారం వీడి, సహస్రారం కమలంలోనికి చేరి అక్కడ అమృతధారలతో స్నానంచేస్తాడు అని ధ్యానయోగ సిద్ధులు శలవిచ్చారు.

మూలాధారం - పృధివీ, (భూ) తత్వాత్మికమైనది. ఈ చక్రమందున్న అగ్ని జ్వాలలు - 56.

దీనిపైన వున్న (స్వాధిష్ఠాన చక్రములో (మూలాధారానికీ, మణిపూరానికీ మధ్యవున్న చక్రం - స్వాధిష్ఠానం) - సూర్యుని యొక్క కిరణములు - 62.

వాయుతత్వాత్మికమైన అనాహతచక్రమునందున్న సూర్యుని యొక్క కిరణములు - 54

ఇవిరెండూ అనగా స్వాధిష్ఠాన + అనాహత (హృదయస్థానం) చక్రములలోని సూర్యునియొక్క కిరణములు. మొత్తం 62 + 54 = 116.

సూర్యకిరణములు - మణిపురం వదిలి, స్వాధిష్ఠానచక్రమును ప్రవేశించుటవలన - సూర్యాగ్నులు (సూర్యుడు+అగ్ని) ఒక్కటిగా మారటం సంభవిస్తున్నది. అనగా సూర్యునిలో అంతర్గతంగా అగ్ని వున్నది. అందువలననే సూర్యకిరణములు వెలుగునే గాక - నిప్పులాటి శెగ - ఉష్ణోగ్రత, తీక్ష్ణత కలిగివుంటాయి. అవునా ?

సూర్యాగ్నులకు స్థానమైన స్వాధిష్ఠాన, మణిపూరక చక్రముల, "మధ్య ప్రదేశమునందు" అగ్నిస్థానము నందు సూర్యుడు ప్రవేశించుట అట్లే సూర్యస్థానమునందు అగ్ని ప్రవేశించుట జరుగుతుంటుంది. ఇక - సర్వజగములను దహింపజేయు అగ్నిని - శమింపజేయు (చల్లార్చు) నది "సంవర్తము" అనుపేరుగల మేఘం స్వరూపము. ఇది (సంవర్తము) సూర్యుని కిరణములవలన - పుట్టినదై - వర్షము కురియుటకు కారణ మగుచున్నది.

(మనంచూస్తున్న ప్రపంచంలో తీక్ష్ణమైన ఎండతో, సముద్రములలోని నీరు ఆవిరి రూపంలో ఆకాశంలో చేరి, ఘనీభవించి, కారు మేఘముల వలె మారి, వర్షిస్తున్నది కదా ?)

ఈ విధంగా సూర్య కిరణాలు 116 అని తెలుసుకున్నాం కదా ?

ఆకాశ తత్వాత్మకమైన "విశుద్ధి" చక్రంలో చంద్రుని కిరణములు - 72 వున్నాయి.

మనస్తత్వాత్మకమైన "ఆజ్ఞా" చక్రంలో చంద్రుని కిరణములు - 64 వున్నాయి రెండూకలిసి (విశుద్ధి+ఆజ్ఞాచక్రాలలోని చంద్ర కిరణముల సంఖ్య) 72+64 = 136 చంద్ర కిరణములు! మరల మరొక్కమారు పరిశీలించండి.

| | | |
|---|---|---|
| అగ్నికి- | 108 | జ్వాలలు. |
| సూర్యునికి | 116 | జ్వాలలు. |
| చంద్రునికి | 136 | కళలు. |
| మొత్తం | 360. | |

(అందుకే పై సంఖ్యలను అనుసరించే జపమాలలోని పూసల సంఖ్య 108 గావుంటుంది. బహుమతి - విరాళం. అట్లా మన ఇష్టులైన వారికి ఇచ్చేటప్పుడు 116 రూ॥లు - చదివిస్తుంటాము. వారికి అవి ఆయురారోగ్యాలు - జ్ఞానమూ ప్రసాదించే - సూర్య కిరణాలు - అమ్మవారి పాద - కిరణాలు - మయూఖలు - దయా కిరణాలు - అనే భావనతో!)

ఈ విధంగా మన మానవశరీరమైన పిండాండములోనూ, పరమేశ్వరీ స్వరూపమైన బ్రహ్మాండములోనూ ఈ కిరణముల యొక్క సంచారమే ఒక "ఆవృత్తి" అగుచున్నది. సమయాచారులు (ధ్యానయోగులు) తమ శ్వాసను మూలాధారంనుండి, సహస్రారం శిరస్సు

నందలి బ్రహ్మరంధ్రము) వరకూ చేరి, మరల తిరిగి మూలాధారానికి చేర్చటాన్ని ఒక "ఆవృత్తి' ' అంటారు.

బ్రహ్మాండంలో - అనగా, మనం చూస్తున్న ప్రపంచంలో, 15 రోజులు - 15 తిధులు- ఒక పక్షం. 15 రోజులు శుక్లపక్షం పాడ్యమి - (ప్రతిపత్) నుండి పౌర్ణమివరకూ - శుక్షపక్షం

మరల పాడ్యమినుండి అమావాస్యవరకూ కృష్ణపక్షం - 15 రోజులు. ఈ తిధులే చంద్రుని కళలు. 15 కళలు - 16వది నిత్యషోడశి కళ. వృద్ధిక్షయములు లేనిదే ఈ నిత్య''.

మిగతా రోజులలో చంద్రకళలు తగ్గుతూ హెచ్చుతూ వున్నా, అట్లా వృద్ధిక్షయములు లేనిదే "నిత్య" (నిత్యషోడశి కళ.). బాహ్య ప్రపంచంలో ఈ తిధులలోని చంద్రకళల వృద్ధిక్షయములు తెలుస్తుంటాయి మనందరికీ. కానీ సమయాచారులైన యోగులు - అంతర్ముఖులై చేసే ధ్యాన పద్ధతిలో - శ్వాస క్రమం ఆరోహణ, అవరోహణ క్రమంలో సాగిస్తుంటారు. అవే శుక్షపక్ష, కృష్ణ పక్షములుగా వుంటాయి. వారిలోని చంద్రకళలు. శ్రీ విద్యలో "చంద్రకళావిద్య" అనే విద్యవున్నది. శ్రీ విద్య పంచదశితిధుల (15) స్వరూపము గలది గనుక - చంద్రకళా విద్యలోని అంశమునే "పంచదశీ మాలాపూజా విధానముగా - ఒక్కొక్క తిధిరోజు ఒక్కొక్క చంద్రకళనూ, (తిధి దేవతను పూజిస్తూ - అందుకు ద్వాదశ ఆదిత్యులు ఋషులుగా - ఆయా ఛందస్సులలో సాగేపూజా విధానం "త్రిపురారహస్యం" లాటి యోగగ్రంధాలలోని గూఢంగా వున్నది.

ఇట్లా 360 రోజులు 1 సంవత్సరం అవుతుంది బాహ్య ప్రపంచానికి కాల స్వరూపిణిగా, 15 అక్షరాల " క ఏ ఈ లహ్రీం -హ స క హ లహ్రీం స కలహ్రీం" అనే పంచదశీ అక్షరాల మంత్రంగా సాధకులకు సాధనా సంపత్తిని చేకూర్చుతున్నది.

ఇక ఏ పూజలయినా, "విషువత్" పుణ్యకాలములలోనూ, సంక్రాంతులలోనూ చేయమనీ - అధిక ఫలితాన్ని ఇస్తాయనీ - (లలితా సహస్రనామ పారాయణంగానీ - విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణంగానీ - మరే మంచిపూజలయినా,) చెబుతారు మహర్షులు - పెద్దలు. ఎందువలన ? ఈ విషువత్ పుణ్యకాలాలు ఏమిటి ?

ఇదీ తెలుసుకొని తీరాలి సుమా!

1. సూర్యుడు తన ఉచ్చస్థానమైన, మేషరాశిలోని "అశ్విని" నక్షత్రంలోనికి ప్రవేశించే సమయాన్ని "విషువము" అంటారు. ప్రవేశించటానికి ముందు (పూర్వము) 10 గడియలు, ప్రవేశించటానికి తర్వాత (పరము) 10 గడియలు, "విషవత్ పుణ్యకాలము" అంటారు.

2. సూర్యుడు, తన "శత్రు"స్థానమైన, వృషభరాశిలోని "కృత్తికా నక్షత్ర" రెండవపాదములోనికి ప్రవేశించే సమయాన్ని" విఘుపదము - లేక "విష్ణుపదము" అంటారు.
3. సూర్యుడు - తన "సమ"స్థానమైన "మిధునరాశి"లోని "మృగశిరా నక్షత్ర" మూడవ పాదములోనికి ప్రవేశించే సమయాన్ని "షడశీతి" అంటారు.
4. సూర్చుడు, తన "మిత్ర"స్థానమైన "కర్కాటక"రాశిలోని - పునర్వసు నక్షత్రము 4వ పాదములోనికి ప్రవేశ సమయాన్ని "ఆయనము" అంటారు. ఇదే "దక్షిణాయనము".
5. సూర్యుడు- తన "స్వ "స్థానమైన" "సింహరాశి"లోని "మఖా" (మఘా) నక్షత్ర మొదటి పాదములోనికి ప్రవేశించే సమయాన్ని మరలా "విష్ణుపదము" అంటారు.
6. సూర్యుడు తన "సమ "స్థానమైన "కన్యారాశి" లోని ఉత్తరా నక్షత్ర 2వ పాద ప్రవేశ సమయాన్ని "షడశీతి" అంటారు.
7. సూర్యుడు - తన "నీచ"స్థానమైన "తులారాశి"లోని చిత్తా నక్షత్ర మూడవ (3వ) పాద ప్రవేశ సమయాన్ని "విఘువము" అంటారు. (అంటారు). ఇది సూర్యుడు "తులారాశి" లోని చిత్తా నక్షత్ర మూడవపాదంలోనికి ప్రవేశించటానికి పూర్వము (ముందు) 15 గడియలు - పరము (తర్వాత) 15 గడియలు కాలము "విషవత్ పుణ్యకాలము" అంటారు.
8. సూర్యుడు తన మిత్రస్థానమైన వృశ్చికరాశిలోని "విశాఖా" నక్షత్ర 4వ పాదము ప్రవేశ సమయాన్ని "విష్ణుపదము" అంటారు.
9. సూర్యుడు తన మిత్రస్థానమైన ధనూరాశిలోని మూలానక్షత్ర మొదటి పాదములోనికి ప్రవేశమును "షడశీతి" అంటారు. దీనినే "ధనుర్మాసము" అంటారు.
10. సూర్యుడు తన "శత్రు"స్థానమైన, "మకరరాశి"లోని "ఉత్తరాషాఢః" 2వ పాద (రెండవ పాద) ప్రవేశ సమయాన్ని "ఆయనము" అంటారు. దీనినే "ఉత్తరాయణము" అంటారు.
11. సూర్యుడు తన "శత్రు"స్థానమైన, "కుంభరాశి"లోని ధనిష్ఠా నక్షత్ర - మూడవ (3వపాద) పాద ప్రవేశ సమయాన్ని "విష్ణుపదము" అంటారు.
12. సూర్యుడు తన "మిత్ర" స్థానమైన "మీనరాశి"లోని "పూర్వాభాద్రా నక్షత్ర 4వ పాద (నాలుగువ పాద) ప్రవేశ సమయాన్ని "షడశీతి" అంటారు.

సంక్రాంతి ప్రతినెలా వస్తుంది. (నెలకోకసారి వస్తుంది. సూర్యుడు ఆయారాశిలో ప్రవేశించిన సమయంలో)

మేష, మిధున, వృషణ - ఇలా సంక్రమణాలు. ద్వాదశరాశులకూ ఆయారాశి పేర్లతో వుంటాయి.

సూర్యుడు ఆయారాశిలో ప్రవేశించే "సంక్రమణ" సమయమే సంక్రాంతి.

"మకరరాశి"లో ప్రవేశించినదే - మకర సంక్రాంతి, ఇది ఉత్తరాయణము. (జనవరి నెలలో వచ్చే సంక్రాంతి పండగ) కర్కాటకరాశిలో ప్రవేశించినదే - కర్కాటక సంక్రాంతి - దక్షిణాయనము (జూన్‌నెలలో వస్తుంది)

ఇలా సంక్రాంతులూ, విషువత్ పుణ్యకాలములూ అంటే ఏమిటో తెలుసుకున్నాము కదా? ఆ పుణ్యకాలములలో చేసే పూజలూ - జపాలూ, పుణ్యనదీ స్నానాలూ, - ఇలాటివన్నీ అపరిమితమైన పుణ్య ఫలాన్నిస్తాయి అంటారు పెద్దలు. అమావాస్య ముందురోజువచ్చే చతుర్దశి తిధిని "మాస శివరాత్రి" అంటారు. శివపూజ, అభిషేకానికి ఇదిశ్రేష్ఠం :

ఇంతటికాల చక్ర భ్రమణం వున్నది! మనకు తెలియకుండానే ఏరోజుకారోజు జరిగిపోతున్నది! ఈ "కాలం" అంతా ఆ మహాకాల స్వరూపిణి అయిన జగన్మాత పాదముల కిరణములు - "మయూఖములు" అని చెప్పారు శ్రీ శంకర భగవత్పాదులవారు. శ్రీ మాత చరణములు ఈ కిరణములకు పైన "ఖైందవ స్థానంలో" వున్నవి అని ఆచార్యుల వారు చెప్పటంలో - బ్రహ్మాండంలోని ఖైందవస్థానం - మానవుని శిరసునందలి బ్రహ్మ రంధ్రము (మాడు) లో వున్నది. సూర్య చంద్రాగ్ని లోకములు దాటి ఆ తల్లి పాదములు వున్నవి ఆ తల్లి విరాట్‌రూప - కాలస్వరూపదర్శనం చేయించారు జగద్గురువు ఒక్క శ్లోకంతో, పగలు - సూర్యుడు. సంధ్యా సమయం - అగ్ని, రాత్రి - చంద్రుడు, ప్రకాశిస్తూ అటు ప్రపంచానికీ - ఇటు మానవ శరీరానికీ, జీవితానికీ అవసరమైన ఆరోగ్యం, ఆహ్లాదం - రోగనిరోధక శక్తి - ఉత్తేజమూ, ఉత్సాహము, చైతన్యము, సర్వం ప్రసాదిస్తుండగా, జఠ రాగ్ని మొదలు - ప్రళయాగ్ని వరకూ - అన్ని దావాగ్నులనూ ఉపశమింపజేసే "సంవర్తమనే" మేఘసంచయనమూ - అటుప్రపంచంలోనూ ఇటు మానవ శరీరంలోనూ కూడా వున్నది. ఆధ్యాత్మిక పథం వైపున నడిపిస్తున్నదీ - మోక్షాన్ని ప్రసాదిస్తున్నదీ ఈ జగన్మాత శ్రీచరణాల మయూఖములే! "కాల స్వరూప కిరణములే!

ఇది గ్రహించక - వెర్రిపరుగుతో భోగలాలసతో పరుగులెత్తే వారి జీవితాలు నిష్ప్రయోజనం సుమా!

కొండంత అర్థాన్ని - నాలుగుపాదాల శ్లోకంలో అందించిన జగద్గురువు మనకీ భారత మాత ఇచ్చిన మహావరం కాదా ? ఆలోచించండి.

15. శ్లో ॥

## జగన్మాత అపారకరుణతో కవిత్వ మధుర ఝరి.

**15 శ్లో॥ శరజ్జ్యోత్స్నా శుద్ధాం, శశియుత జటా జూట మకుటాం.**
**వరత్రాసత్రాణ స్ఫటిక ఘటికా, పుస్తక కరామ్!**
**సకృన్నత్వా, నత్వా, కధమివ సతాం సన్నిదధతే!**
**మధు, క్షీర, ద్రాక్షా, మధురిమ ధురీణాః ఫణి తయః ॥**

**అర్థము** :- తల్లీ! జగన్మాతా! శరశ్చంద్రికల వలె శుద్ధమైన దానవును, శశియుతమైన (చంద్రవంకతో కూడిన) జటా జూటమే కిరీటముగా గల దానవునూ, వరాభయ ముద్రలు, అక్షమాలా పుస్తకములను ధరించిన దానవునూ అగు - (నిన్ను స్మరించి) నీకు ఒక్కమారైనా (సకృత్) ఎప్పుడైనా, నమస్కరించిన కవీశ్వరులకు, పూదేనేతో, గోక్షీరములతో, ద్రాక్షా ఫలముకు సాటివచ్చు మాధుర్యమును వహించిన మధురవాక్కులు ఎట్లు ప్రాపింపకుండును ?

(తప్పక ప్రాపించును)

ఈ శ్లోకములో శ్రీ శంకర భగవత్పాదుల వారు, అమ్మవారికి ఒక్కమారు మనసా, వాచా, కర్మణా నమస్కరించిన కవీశ్వరులకు (సాధారణ కవులకైనా) అసాధారణ మాధుర్యం గల కవితాశక్తి - కావ్యరచనాశక్తి వచ్చి తీరుతుందని ఘంటా పథంగా చెబుతున్నారు.

నిజమేమరి! అక్షరజ్ఞానం లేక, మూర్ఖునిగా బ్రతుకుతూ, పశుల (గొర్రెల) కాపరిగా బ్రతుకుతూ వుండిన - ఒక పామరునికి - రాజకుమార్తెతో (విద్యాధరి) వివాహమూ, మహా కాళీ ఆలయ ప్రవేశమూ ప్రసాదించి, అమాయకంగా ఆతడు మ్రొక్కిన మ్రొక్కుకు సంతుష్టాంత రంగ అయిన శ్రీ మాత ఆతడిని "మహాకవి కాళిదాసు"గా మార్చలేదా క్షణంలో! ఆతడు సమర్పించిన దేమిటి ఆతల్లికి ? మణులా! మాణిక్యాలా ? పూజలా ? జపాలా ? హోమాలా ? యజ్ఞయాగాలా! ధ్యానయోగాలా ? స్తోత్రాలా ? సహస్రనామాలా ? ఏ ఒక్కటీకావు! ఏ ఒక్కటీ తెలియవు ఆతడికి!

తర్కం - లేని - ఎరుగని - చిత్తశుద్ధితో కూడిన - నిర్మలమైన నమస్కారం ఒక్కటే అతడు ఆతల్లికి సమర్పించిన "ప్రణతి".

ఆతల్లి సౌందర్యాన్ని శరశ్చంద్రికలతో వూహిస్తూ, చంద్రవంక ఆభరణంగా గలిగిన ఆజగన్మాత జటా జూట కిరీటాన్ని హృదయంలో వూహిస్తూ వరా భయముద్రలతో కుడి ఎడమ క్రింద చేతులనూ, పైనున్న (పర) హస్తములతో అక్షరమాలనూ, పుస్తకమునూ దరించి వున్న సరస్వతీ స్వరూపిణిగా, శ్రీ విద్యా స్వరూపిణిగా భావిస్తూ - ఎవరైతే ఆతల్లికి మనసారా మ్రొక్కుతారో వారికి - ఆజగన్మాత - మధురమైన కవిత్వము - మధుర మంజులగాన శక్తి - సర్వకళలూ - తప్పక ప్రసాదిస్తుంది. కవిత్వం మాట అలావుంచినా, మంచిగా మాట్లాడటం - ఇతరులను నొప్పించకుండా మాట్లాడటం - అస్తమానం ఇతరులను విమర్శించకుండా మాట్లాడటం - చాడీలు చెప్పకుండా వుండటం, నోరు తెరిస్తే పిచ్చి తిట్లతో సాగకుండా వాక్కును సంస్కరించుకోవటంలాటివి ప్రసాదిస్తుంది మన బోటివారికి ఆ జగన్మాత. అదిచాలదా జీవితం తిన్నగా సాగిపోవటానికి ? ఏమంటారు ?

## 16 శ్లో ॥ అమ్మవారి కరుణ కిరణం.

## "అరుణ"

**16 శ్లో॥ కవీన్ద్రాణాం చేతః కమలవన బాలా తప రుచిం**
**భజన్తే, యేసన్తః, కతిచి దరుణా మేవ భవతీమ్!**
**విరిఞ్చ ప్రేయస్యా, స్తరుణ తర శృఙ్గార లహరీ.**
**గభీరాభి ర్వాగ్భి ర్విదధతి సతాం రఞ్జనమమీ ॥**

**అర్థము :-** ఓ జగన్మాతా! తల్లీ! పద్మములను ఉదయకాలపు లేే(త) ఎండ ఎలా వికసింప జేస్తుందో, అలాగే కవుల మనస్సులనెడి పద్మములకు వికాసము కలిగించు అరుణ రాగ రంజిత శరీరి వగు - "అరుణ"శక్తి యుతవగు నిన్ను ఏ మహాత్ములు మనసారా భజింతురో, వారు శారదాదేవి (విరించి - బ్రహ్మ ప్రేయసి అనగా సరస్వతీదేవి) ప్రసాదలబ్ధమైన శృంగార రస ప్రపూర్ణములైన గంభీరములై, సుభాషితములై, మహారాజుల సభలలోని సజ్జనులకు, మనోరంజకములైన కావ్యములతో అలరించగలుగు తున్నారు. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - "అరుణ" వర్ణం దేవీస్వరూపానికి చిహ్నం, మంగళకరము. శృంగార రసమునకూ చిహ్నము. అరుణాశక్తి అమ్మవారిది. ఆ తల్లిని ఆరూపంతో సాక్షాత్కరింప జేసుకున్న

కవీశ్వరుల హృదయాలు అనే కమలాలను వికసింపజేస్తే ఉదయ సూర్య కిరణాల అరుణిమ వలె - ఆతల్లి సాక్షాత్కరించి వారి కవిత్వంలో - అసభ్యత. అశ్లీలతలేని అమలిన శృంగార కవిత్వాన్ని ప్రసాదించి - సభాసదులను మెప్పింపజేస్తుంది అని వర్ణించారు.

ఇందుకు సంబంధించి - శ్రీ శంకర భగవత్పాదుల వారి జీవిత ఘట్టం ఒకటి మనం ఇక్కడ స్మరించు కుందాము. పరమగురువుల చరిత్ర పారాయణం ఒక గొప్పపుణ్యం ప్రసాదిస్తుంది. అనుభవ సారాల వాక్కు - కవిత్వం వారివి కాబట్టి.

తుంగభద్రా నదీ తీరమున గల "శృంగేరీ" పీఠములో - (దీనినే శృంగగిరి - ఋష్య శృంగ గిరి అంటారు-) అక్కడ శారదా పీఠము నెలకొల్పారు ఆదిశంకరాచార్యులవారు. ఇదెలా జరిగింది? యావద్భారత దేశంలోని నానా విధ మత స్థాపకులనూ తన అద్వైత మత సిద్ధాంతంతో ఓడిస్తూ - వచ్చారు ఆదిశంకరాచార్య. మండన మిశ్రుని దర్శించవలెననే కోరికతో వచ్చారు. "మండన మిశ్రుని" ఇల్లుఎక్కడ ?" అని అడుగగా, "ఏ ఇంటి ద్వారంలో చిలుకలు వేదాంత చర్చ చేస్తుంటాయో అదే మండన మిశ్రుని గృహంగా తెలుసుకోండి!" అని చెప్పారు ఆ వూరి ప్రజలు - ఆచార్యుల వారితో! చిలుకలు వేదం వల్లించటము అంటే ఏమిటి ?

సరస్వతీ అమ్మవారి వద్ద - చిలుకలు వుంటాయి. మధుర మీనాక్షి వద్ద చిలుకలు వుంటాయి. ఆతల్లి భజంపై వాలి వుంటుంది చిలుక.

శారికలు వేదం పలకటం ఎప్పుడు సాధ్యం ? నిరంతరం అవి వేద పఠనం వింటున్నపుడే సాధ్యం.

అదే సరస్వతీ మందిరం అదే దేవీ మందిరం. మండన మిశ్రుని గృహం దేవీ మందిరం అనీ - సరస్వతీ నిలయం అని అర్థమైపోయింది ఆచార్యులవారికి మండన మిశ్రుని అర్ధాంగి అయిన భారతీదేవి సాక్షాత్ సరస్వతీ స్వరూపం అనికూడా బోధపడిందా జగద్గురువునకు. మండన మిశ్రునితో వాదం ప్రారంభం కావాలి ఇక! మధ్యవర్తిగా - ఆయన భార్య - మహాసాధ్వి "ఉభయ భారతీదేవి" కూర్చుంది. ఆమెనే న్యాయనిర్ణేతగా కూర్చోమన్నారు ఇద్దరూ!

శంకరులమెడలో ఒకపూలమాలనూ, భర్త మెడలో ఒకపూలమాలనూ తెచ్చివేసిందామె!

"నాయనా! ఇది శారదాదేవి నిలయం, తీర్పు ఆజగన్మాతదే! వాదం ఎంతకాలం జరిగినా. ఆ మాలలువాడవు. ఎవరిమెడలో పూలమాలవాడిపోతే - వారు ఓడినట్లు. ఓడినవారు గెలిచినవారి ఆధ్యాత్మిక మార్గాన్ని అనుసరించి తీరాలి. ఇదీ షరుతు! "అనిచెప్పిందామె. "అలాగే తల్లీ!" అన్నాడు ఆదిశంకరాచార్యులవారు. మండన మిశ్రునికీ - ఆదిశంకరులకూ వాదం ప్రారంభమైంది. వారం రోజులుగడిచాయి.

భర్త మెడలోని పూలమాల కొద్ది కొద్దిగా వాడటం గమనించింది భారతీదేవి పతివ్రతగా భర్త ఓటమి సహించ లేక పోయిందా తల్లి. "నాయనా! నేనూ కుతూహలంతో ఒకప్రశ్న వేస్తాను. దీనికీ సమాధానం చెప్పగలిగితే మా ఓటమి అంగీకరిస్తాము!" అన్నదా విదుషీమణి. ఆమె భర్త పై గల అపారప్రేమతో కించిత్ వంచనకు పాల్పడింది, ఈ సమయంలో భర్త ఓటమిని సహించలేకపోయిన మనస్సుతో! ఆది శంకరులకు స్త్రీలందరకూ జగన్మాత స్వరూపిణులే!

"తప్పకుండా ప్రశ్నించండి తల్లీ!" అన్నారు వినమ్రంగా. "గృహస్థ జీవితంలో - భార్యా భర్తల అనుబంధంలో - శృంగార రస సన్నివేశంలో - భార్యాభర్తలలో ఎవరు ఎక్కువ రసానుభూతిపొందుతారు! ఎందువలన?" అని ప్రశ్నించింది భారతీ దేవి. శంకరులు నిశ్చేష్టులయ్యారు. ఇది బ్రహ్మచారియైన తనను అడగవలసిన ప్రశ్నకాదు. అందు నా ఒకగృహిణి పుత్రసమానుడైన తనని అడగదగిన ప్రశ్నాకాదు. అసలామె ఇలా కల్పించుకొనే హక్కు లేదు. ఆమె న్యాయ నిర్ణేత. పరీక్షకురాలుకాదు. కానీ అడిగింది. అడగరాని ప్రశ్న అడిగింది! ఇందులో గూఢార్థం ఇమిడివుంది. ఇందులో ఒక అద్భుత కారణం - కార్యం - ఏదో దాగివున్నది.

భారతీ దేవి అమాయకురాలు కాదు. ఇంగితం లేని స్త్రీ కాదు. సాక్షాత్తు సరస్వతీ స్వరూపిణి. ఆమె "ఉభయభారతి" క్షణకాలం ఆలోచించిన ఆది శంకరులు - ఆ తల్లికి ప్రణమిల్లి ఇలా అన్నారు. "తల్లీ! నేనీ ప్రశ్నకు సమాధానం - కొంత కాలం గడువిస్తే తప్పక చెబుతాను! "అన్నాడు.

భారతి సరేనన్నది! ఆ బ్రహ్మచారి ఇక మరలరాడు - తన భర్త పరువు దక్కింది. అనుకున్నదా ఇల్లాలు. శంకరులు - శిష్యుల వద్దకు ఒక్కతృటిలో వెళ్లారు - గుహలో తన నిర్జీవ కళేబరం వుంటుందనీ - దానిని ఎట్టి పరిస్థితులలోనూ పరులకు దక్కనివ్వ వద్దనీ - ఆనతిచ్చారు. పద్మ పాదునితో మాత్రం తాను - మరణించిన మహిష్మతీ దేశపు రాజుగారి శరీరంలోనికి పరకాయ ప్రవేశం చేసి కొద్దిరోజులలో రాగలననీ - రహస్యంగా చెప్పి మరీ తన ప్రాణత్యాగం చేసి, నిర్జీవ కళేబరాన్ని గుహలో వదిలి - ఆత్మ - ఆమహారాజు శరీరంలో - పరకాయప్రవేశం చేశాడు. ఆరాజు మరలా బ్రతికినందుకు - మహారాణి, మంత్రి - ప్రజలు అంతాసంతోషించారు. కానీ - రాజుగారిలో దివ్య తేజస్సు - విచిత్ర నడవడిక మహారాణి మాత్రమే గుర్తించింది! ఆమె పరమసాధ్వి. ఆమెపేరు మాయాదేవి.

మహారాజు అమరకుడు - వెనకటిలా భోగలాల సునిగాలేరు.

నర్తకీమణుల నాట్యాలు - తిలకించటం లేదు.

రాచ కార్యాలలో ఆసక్తి చూపటం లేదు.

కేవలం ఒకానొక మహాయోగిలా - తామరాకు మీది నీటిబొట్టులా - వుంటున్నారు. - ఒకరోజు రాజుగారిలో వున్న ఆచార్యులు - ఒక రాత్రివేళా - కొంత తడబాటుతో ఆమెను (రాణిని) తనని భారతీ దేవి వేసిన ప్రశ్న వేశారు.

మహారాణి రాజు మరలా మారాడని సంతోషించి - నిస్సం కోచంగా ఆ ప్రశ్నకు సమాధానం చెప్పింది.

"ధన్యుడిని తల్లీ!" అన్నాడు రాజు.

రాణినివ్వెరపోయింది. ఈ కంఠస్వరం - తన భర్త అయిన మహారాజుది కాదు.. ఆ పిలుపు - ఆసంబోధన - "తల్లీ!" అంటూ తనని పిలవటం - ఇది తనసందేహాన్ని నిజం చేసిందనిపించింది. రాజులో వున్న ఆత్మ ఎవరో మహాత్ముడిది! ఆమె - వెంటనే అంతః పురం వెలుపలికి వెళ్లి - మంత్రిగారిని పిలిపించి - తమ మహారాజులో ఎవరో మహాయోగి పరకాయ ప్రవేశం చేసివున్నాడనీ - ఆ మూలంగానైనా - మహారాజు జీవించి వుంటే చాలుననీ - ఎక్కడైనా రహస్యంగా నిర్జీవ కళేబరం ఏ మహాత్మునిదైనా రహస్యంగా కాపాడబడుతూ వుంటే - వెంటనే దానిని దహనం చేయించమనీ ఆజ్ఞాపించింది. మంత్రి గారూ పరివారమూ వెళ్లారు. గుహలో - వున్న ఆది శంకరుల కళేబరాన్ని గుర్తించారు. శిష్యులను ప్రక్కకు త్రోసివేసి - ఆ కళేబరాన్ని చితిపై అమర్చారు. ఇక్కడ మహారాజుగారిలో వున్న శంకరులు - తన ప్రశ్నకు సమాధానం దొరికిందని ఆనందించి - రాణిగారు ఆదమరచి వుండగా - తను శరీరం త్యజించి వెళ్లిపోదామనే ఉద్దేశ్యంతో, పడుకుని వున్నారు. ఆ సమయంలో పద్మపాదుడు పరుగెత్తుకు వచ్చి - రాజాంతః పురంలోనికి వినిపించేలా - శంకరుల శరీరం (కళేబరం) దహనం చేయబోతున్నారని ఎలుగెత్తి అరచాడు. ఇతరులకు అర్థం కాకుండానూ, గురువు గారికి అర్థమయ్యేలానూ ఎలుగెత్తి గురువుగారిని పిలుస్తున్నాడు పద్మపాదుడు అంతే! శంకరులు - మహారాజు శరీరం వదిలి - తన శరీరంలోనికి వచ్చేశారు! కానీ ఆ సరికే - రాజ భటులా కళేబరానికి అగ్ని ముట్టించేశారు. చేతులు - కాళ్లు - కాలిపోయాయి .

ఆ కాళ్లు చేతులులేని కళేబరం లేచి కూర్చుంది అగ్ని శిఖల మధ్య! భటులు భయపడి పారిపోయారు. శిష్యులు - గురువుగారి వికలాంగత చూచి బాధపడ్డారు.

కానీ ఆది శంకరులు చలించలేదు.

"శ్రీ మత్పయోనిధినికే తన చక్రపాణీ!

భోగీంద్ర భోగమణిరాజిత పుణ్యమూర్తే

యోగీశ! శాశ్వత శరణ్య భవాబ్ది పోత
శ్రీ లక్ష్మీ నృసింహా! మమదేహి! కరావలంబమ్!"

అంటూ లక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్రం ఆర్తితో ఆయనలో నుంచి సురగంగా ఝరిలా ఉబికి వచ్చింది. కాలిపోయిన కాళ్లూ చేతులూ వచ్చేశాయి! ఒకానొక మహత్తర "కరావలంబ స్తోత్రం" అట్లా రూపు దిద్దుకున్నది పరమ గురువు హృదయంలో నుండి. శ్రీ లక్ష్మీ నృసింహ స్వామి ఆయన మనోనేత్రాలకు సాక్షాత్కరించాడు. ఇక క్షణం జాగుచేయక - మరలా మండన మిశ్రుని గృహానికి వెళ్లారు ఆచార్యులవారు.

"తల్లీ! నీప్రశ్నకు సమాధానం ఫలానా మహారాణివారి వద్ద గ్రహించాను. ఆ తల్లి కూడా మహాసాధ్వి. ఈ బిడ్డకు - సంశయని వృత్తిచేసి పుణ్యం కట్టుకుంది." అని చెప్పారు. భారతీదేవికి అర్థమయ్యింది. ఈ శంకరులు కారణజన్ములని! భర్త అయిన మండన మిశ్రుని మెడలోని మాల పూర్తిగా వాడిపోయింది ఆసరికి! అది శంకరుల మెడలోని పూలమాల వసివాడలేదు. ఆ పూలమాల సౌరభాలు వెదజల్లుతోంది ఆతడి నిష్కపట నిర్మల జీవన విధానం - తపశ్శక్తిలానే! భారతీదేవి మనసారా అతనికి మ్రొక్కింది. "చిన్న వాడవైన నిన్ను క్షమించమని వేడుకుంటున్నాను నాయనా! నా భర్త ఓటమి సహించలేక - న్యాయ నిర్ణేతగావున్న నేను కించిత్ అన్యాయానికి పాల్పడి, నిన్ను అడగరాని ప్రశ్న అడిగాను. ఇది చాలాతప్పు. నా తప్పు - నీ తల్లినిగా నన్ను భావించి క్షమించు!" అన్నది. శంకరాచార్యులు నొచ్చుకున్నారు. "అట్లా అనకు తల్లీ! జగన్మాతృ స్వరూపిణివి! నీ ప్రశ్న ద్వారా - నాకు "శ్రీలక్ష్మీ నృసింహస్వామి కరావలంబ స్తోత్రం" ఉబికి వచ్చింది. అది పారాయణం చేసిన వారికి శ్రీ నరసింహుడు సకల ఆపదలు తొలగించి - సకలైశ్వర్యములూ ప్రసాదించే వరమూ పొందాను. నీవు అంత మేలుచేశావు నాకూ - లోకానికీ!" అన్నాడు వినమ్రంగా, మండన మిశ్రుడు మనసారా ఓటమి అంగీకరించాడు. "అపరశంకరా! ఆదిశంకరా! ఇకపై నేను నీ కింకరుణ్ని!" అన్నాడు మనస్ఫూర్తిగా మండనమిశ్రుడు - ఆదిశంకరుల శిష్యునిగా మారారు. ఆయనకు "సురేశ్వరుడు" అనే సన్యాసనామం ప్రసాదించి సన్యాస దీక్ష ఇచ్చారు ఆదిశంకరులు.

"నాయనా! నేనూ నా భర్తననుసరించి - నీ వెనకాల వస్తాను ఆధ్యాత్మిక బాటలో! నీవు నా అందెల చప్పుడును బట్టే నేను నీ వెనకాల వస్తున్నానని గ్రహించు. వెనుదిరిగి చూడకు. సుమా!" అన్నది ఉభయభారతీ దేవి.

"అలాగే తల్లీ!" అన్నారు ఆచార్యులవారు, సురేశ్వరునిగా మారిన మండనమిశ్రుడు - ఆచార్యులవారు ముందు నడుస్తుండగా - వారి వెనకాల - భారతీదేవి వస్తున్నందుకు గుర్తుగా

ఆమె కాలి అందెల ఘల్లు ఘల్లుమనే మోత (రవళి) వినిపిస్తూ వస్తున్నది. ఆచార్యుల వారు - ముందుకు సాగుతున్నారు. "తుంగ" నదీతీరం అది. "భద్ర" నదీ ఆ తర్వాత కొంతదూరంలో "తుంగ"నదిలో కలుస్తుంది. కనుక దానికి "తుంగభద్ర" అని పేరు వచ్చింది.

తుంగభద్రా నదీ తీరంలో - భారతీ దేవి పాదములు నేలకంటుకొని పోయి ఇక అడుగుపడలేదు. ఆ ప్రదేశం అత్యంత రమణీయమైన ప్రకృతి గలది. అందెల చప్పుడు హఠాత్తుగా ఆగిపోవటంతో అప్రయత్నంగా ఆదిశంకరులు వెనుదిరిగి చూశారు.

అంతే! భారతీదేవి - అరుణ వర్ణంతో - అరుణా శక్తితో శరజ్జ్యోత్స్నా చంద్రికలవంటి శుద్ధస్ఫటిక శరీర చ్ఛాయతో - చతుర్భుజయై, ఒకచేత అక్షమాల, మరొక చేత పుస్తకము, మిగతా రెండు చేతులలో వరదా భయ ముద్రలతో, చంద్ర వంక శిరోభూషణంగా గల జటా జూటపు కిరీటంతో - క్షణకాలం ఆదిశంకరుల మనో నేత్రాలకూ - నేత్రాలకూ దృగ్గోచరమైంది. ఆతల్లి - కోటి వెన్నెలల చిరునవ్వుతో - శంకరులను ఆశీర్వదించింది.

"తల్లీ! అపర భారతీ! సరస్వతిగా, "ఉభయ భారతిగా" - మండన మిశ్రుని ఇల్లాలిగా - నాకుదర్శనమిచ్చి - ప్రశ్న మిషతో - నాలో లక్ష్మీ నృసింహ కరావలంబ స్తోత్రాన్ని రూపకల్పన చేసి - చివరగా నన్ను అనుసరిస్తున్న మిషతో - నీ శారదా పీఠానికి ఈ తుంగభద్రా నదీతీరాన, శృంగేరి వద్ద - నీవే స్థల నిర్ణయంచేసి - శారదామాతగా నిన్ను ప్రతిష్ఠించే అదృష్టాన్ని నాకు కలుగ జేశావా జగన్మాతా!" అంటూ ఆ తల్లి చరణాలపై శిరసువుంచి మ్రొక్కారు జగద్గురువు.

మండన మిశ్రుడూ మొక్కాడు - ఇన్నేళ్లూ - తన ఇల్లాలి రూపంలో వున్న అపర శారదా స్వరూపానికి! మరుక్షణం అక్కడ ఆమె లేదు. ఆ దివ్యక్షేత్రంలో శారదా పీఠం స్థాపించారు ఆదిశంకరులు!

ఆ తల్లిని స్వయంగా అట్లా దర్శించిన ఆదిశంకరులు - మహాద్భుత "సౌందర్యలహరి" వ్రాశారు. ఆ తల్లి అంగాంగ వర్ణనా చేశారు - సౌందర్యలహరిగా, కానీ షుమారు 1500 సంవత్సరాల క్రితం (క్రీ.శ ॥ 540 సం॥ ఆది శంకరుల కాలం అని కొన్ని చరిత్రలు చెబుతున్నాయి)

ఆ ఆచార్యుల వారు వ్రాసిన స్తోత్రాలూ - ఈనాడూ నిత్య నూతనంగా వున్నాయి. పండిత పామరులంతా గానం చేసేందుకు వీలుగా వున్నాయి. ముక్తి ప్రసాదిస్తున్నాయి.

అంగాంగ వర్ణనచేసిన సౌందర్యలహరి - ఆనాటి నుండి ఈనాటి వరకూ పారాయణ గ్రంథంగా వున్నది. స్త్రీ పురుషులు అంతా స్తోత్రం చేస్తున్నారు సౌందర్యలహరి! ఎవరికీ - ఏనాడూ - ఏ

అసభ్యతా - మలిన శృంగారం కనిపించలేదు - వినిపించలేదు - మరి! ఆ అనుభవాన్ని - అనుభూతినీ ఈ శ్లోకంలో పరోక్షంగా శలవిచ్చారు జగద్గురువు! ఒక గొప్ప అనుభవపాఠాన్ని ఒకచిన్న శ్లోకంలో అందించి కాళిదాసాది మహాకవుల కావ్యాలన్నీ సభలలో ప్రస్తుతింపబడటానికి కారణభూతమైన అమ్మవారి అరుణ స్వరూపాన్ని వర్ణించారు జగద్గురువు. మనకూ సాక్షాత్కరింపజేసారు. అవునా ?

## "అమ్మవారి అపార కరుణతో కావ్య కర్తృత్వ సమర్థత వస్తుంది.

**17 శ్లో॥ సావిత్రీ భిర్వాచాం, శశిమణి శిలాభఙ్గ రుచిభిః**
**వశిన్యాద్యా భిస్త్వాం సహజనని సఞ్చి న్తయతి యః (సంచింత యతియః)**
**సకర్తా కావ్యానాం, భవతి మహతాం భఙ్గీ రుచిభిః**
**వచో భిర్వాగ్దేవీ వదన కమలా మోద మధురైః. ॥**

**అర్థము** :- తల్లీ! జగన్మాతా! వాక్కులను సృజించువారునూ, వాక్కులకు అధి దేవతలైనవారునూ, చంద్రకాంత మణుల శకలములవలె తెల్లనైన (స్ఫటికము వంటి) దేహము - ముఖకాంతి గలవారును అగు, వశిన్యాది (వాగ్దేవతలు) - శక్తులచే సేవింపబడుచున్న నిన్ను ఎవ్వడుచక్కగా ధ్యానించునో, అతడు, వాల్మీకి మొదలైన కవుల యొక్క కవిత్వ రచనల వలె, రుచిమంతములు, శాశ్వతములు అయిన సరస్వతీ దేవి ముఖపద్మ పరిమళములను వెదజల్లు వాగ్గుంభనములతో చిర యశస్సుగల కవి యగుచున్నాడు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - వశిన్యాది వాగ్దేవతా శక్తులచే పరివేష్టితురాలై, వారందరిచే సేవింపబడుతున్న జగన్మాతను భావనలో ధ్యానించి ఎవరు తరిస్తారో, వారు వాల్మీకాది మహాకవులవలె - గొప్ప కావ్యములు - కవిత్వములు వ్రాసి చిరయశస్సు సాధించగలరని - తన స్వానుభవంతో కూడిన మాటగా, వేదవాక్కుగా చెబుతున్నారు.

కశ్యప శిల్పశాస్త్రం ఆధారంగా గ్రంథస్థం చేయబడిన "రూపధ్యాన రత్నావళి" అనే శిల్పశాస్త్ర గ్రంథంలో, అకారాదిక్ష కారాంత దేవతలకు ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క దేవత, ఆమె శరీర వర్ణం, ఆమె చేతుల సంఖ్య (ద్విభుజ - చతుర్భుజ ఇలా), వాటిలో ధరించే ఆయుధాలు - చక్కగా వర్ణించారు ఆ శిల్పాచార్యులు. అట్లాగే ఆయా అక్షరదేవతల ధ్యాన శ్లోకాలూ వున్నాయి. సరిగ్గా అలాగే ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు - సరస్వతీ దేవి ముఖపద్మ పరిమళాలు

అనగా (తాంబూలరసం - ఆరసమే వాఙ్మయం) అక్షర మాలలోని దేవతల నందరినీ సాక్షాత్కరింప జేసారు.

ఎలాగో గమనించండి!

అక్షరములన్నీ శ్రీ విద్యాస్వరూపములే! అక్షరాలు నేర్చుకోవటం, చదువుకోవటం, అంటే, జ్ఞాననేత్రం తెరిపించు కోవటమే! సాధారణ జీవితాలలో అక్షరాలు - భుక్తిని ప్రసాదించే వృత్తి సాధనాలు అయితే, ఆధ్యాత్మిక జీవితంలో - బాటలో ఆ అక్షరాలే, బీజాక్షరాలు - ముక్తి సోపానాలు!

స్తోత్రంతో, గానంతో, ఉపన్యాసంతో, కవిత్వంతో, వాక్కుతో - ఏవిధంగానైనా, అక్షరోపాసన చేసి తరించవచ్చు. కానీ, ఎటోచ్చీ, అక్షరాలు "దైవ స్వరూపిణులు" అనే ధృఢ విశ్వాసం, భక్తీ వుండాలి, అంతే! సంస్కృతంలో 50 (యాభై) వర్ణములు (అక్షరములు) వున్నాయి. వీటిని ఎనిమిది (8) వర్గములుగా విభజించారు మహర్షులు - మహాత్ములు, వేదవిదులు:

1.అ. 2.క. 3.చ 4. ట. 5.త. 6.ప. 7.య. 8.శ.

వీటిలో "అ" నుండి అః వరకూగల 16 అక్షరములూ - ప్రధమవర్గము.

ఇక ఇప్పుడు వరుసక్రమంలో గమనించండి.

ప్రధమవర్గము :-

1వ వర్గము అ నుండి అః వరకూ గల 16 అక్షరములు.

2వ వర్గము

ద్వితీయవర్గము :- క, ఖ, గ, ఘ, ఙ (5 అక్షరములు)

3వ వర్గము

తృతీయ వర్గము :- చ, ఛ, జ, ఝ, ఞ (5 అక్షరములు)

నాలుగవవర్గము :- ట, ధ, ద, ధ, న, (5 అక్షరములు)

చతుర్ధ వర్గము

ఐదవవర్గము :- త, థ, ద, ధ, న, (5 అక్షరములు)

పంచమవర్గము

షష్ఠమ వర్గము :- ప, ఫ, బ, భ, మ (5 అక్షరములు)

6వ వర్గము

7వ వర్గము :- య, ర, ల, వ, (4 అక్షరములు)

సప్తమవర్ణము

8వ వర్గము :- శ, ష, స, హ, ళ (5 అక్షరములు)

అష్టమవర్గము

ఈ విధముగా 8 శక్తులతో కూడి ("అ, క, చ, ట, త, ప, య, శ")

శ్రీ మాత స్వరూపం వున్నది. ఈ ఎనిమిది శక్తుల స్వరూపాన్నీ 1. బిందు, 2. త్రికోణ, 3. వసుకోణ, 4. దశారయుగ్మ, 5. మన్వస్ర, 6. నాగదళ, 7. షోడశదళ, 8. మేఖలాత్రయ, భూపురములుగా శ్రీ చక్రంలోని 8 చక్రాలుగా వర్ణించారు మహర్షులు. (తొమ్మిదవది బిందువు)

ఇక ఈ ఎనిమిదిమంది శక్తులు ఎవరు.

1. వశిని, 2. కామేశ్వరి 3. మోదిని, 4. విమల, 5. అరుణ 6. జయిని, 7. సర్వేశ్వరి, 8. కౌళిని" అనేవారు. వీరే వశిన్యాది వాగ్దేవతలు. వీరు లలితా సహస్రనామస్తోత్రం అమ్మవారి ఆదేశానుసారం సృష్టించినవారు. వీరు సరస్వతీదేవి వాక్కుకు ప్రతిబింబాలు, శుద్ధ స్ఫటికసంకాశ శరీరచ్ఛాయగలవారు.

ఇక విద్యాయోగినులున్నారు. వీరెవరు ?

1. విద్యాయోగిని, 2. రేచికా యోగిని 3. మోచికాయోగిని, 4. అమృతాయోగిని 5. దీపికాయోగిని, 6. జ్ఞానయోగిని, 7. అప్యాయనీయోగిని, 8. వ్యాపినీయోగిని 9. మేధాయోగిని, 10. వ్యోమరూపాయోగిని, 11. సిద్ధిరూపాయోగిని, 12. లక్ష్మీయోగిని. వీరు ద్వాదశయోగినులు అంటే! ఇక "గంధాకర్షిణి" అనే నలుగురు వున్నారు.

1. గంధాకర్షిణి, 2. రసాకర్షిణి, 3. రూపాకర్షణి, 4. స్పర్శాకర్షిణి. వీరు నలుగురూ నాలుగు ద్వారాలకూ ద్వారపాలకులై వున్నారు. (శ్రీ చక్రానికీ - ప్రపంచానికీ కూడా, మనలోనూ వున్నారు.)

వశిన్యాది వాగ్దేవతలు 8 మంది + ద్వాదశ (12) యోగినులు కలిసి మొత్తం 20 (ఇరవైమంది) కళలు - శుద్ధస్ఫటిక సంకాశ వర్ణములై (అక్షరములై) దశారయుగ్మ చక్రంలోని 10+10 (మొత్తం 20) దళములలో - ఒక్కొక్క దళంలో ఒక్కొక్కరుగా కొలువై వున్నారు.

శ్లో ॥ గంధ ద్వారం, దురాధర్షాం, నిత్యపుష్టాం కరీషిణీం

ఈశ్వరీగ్ం సర్వభూతానాం, త్వామిహోపహ్వయేశ్రియం ॥

అని స్తోత్రం చేస్తాము కదా శ్రీసూక్తంలో - అమ్మవారి పూజా ప్రారంభంలోనూ! ఈ శ్లోకార్థం వివరంగా తెలుసుకోగలిగితే - మన పూజయొక్క లక్ష్యమేమిటో గ్రహించ గలుగుతాము.

"గంధద్వారాం." = "గంధ" శబ్దముచేత (మాటచేత) గంధ, రస, రూప, స్పర్శములు తెలియబడుచున్నవి. అందుచేత గంధాకర్షిని, రసాకర్షిణి, రూపాకర్షిణి, స్పర్శాకర్షిణి, అను నలుగురు దేవతలతో కూడిన నాలుగు ద్వారముల గలది "గంధద్వార" మనబడుచున్నది.

"దురాధర్షాం": - మంద భాగ్యులకు, బహిర్ముఖులకు, నాస్తికులకు, అదృష్ట హీనులకు, దక్కనిది, వారు పొందరానిది, పొందలేనిది అని అర్థము.

"నిత్యపుష్టాం": - నిత్యానంద స్వరూపిణి అయిన తల్లి.

"కరిషిణీ : అనగా, కరులు- (గజములచేత) చుట్టబడినది (పరివేష్ఠించి వున్నది) - గంధాదులను ఆకర్షించు శక్తి అని అర్థము.

"ఈశ్వరీం సర్వభూతానం" = సర్వ చరాచర భూతకోటికీ మాత అయిన తల్లి.

తాం = ఆమెను.

" ఆపోహ మిహే స్వయం" - ఈశ్రీచక్రము నందు, బాహ్య పూజలో పెట్టుకున్న శ్రీచక్రం - యంత్రం - మేరువు మొదలయిన వాటిలో, లేక మన అంతరంగమందు ప్రతిష్ఠించుకున్న షట్చక్ర దర్శనమనే శ్రీ చక్రమునందు ఆహ్వానించుచున్నాను. "ఇదీ ఆ శ్లోకార్థము. వశిన్యాది వాగ్దేవతా శక్తులతోనూ, ద్వాదశయోగినుల తోడనూ, గంధా కర్షణ్యాదులు నలుగురు తోడను - మొత్తం 24 మంది మాతృకారూప (అక్షరరూప) త్రిపుర సుందరిని ధ్యానింపవలెను స్మరింపవలెను. ఈ శక్తుల శక్తి విస్తీర్ణము అపారము. శక్తి విస్తీర్ణము అనగా ప్రకాశ శక్తి. ప్రభావమూ అని అర్థము. కొన్ని కోట్ల యోజనాల దూరం - సూర్యకాంతి - మెరుపువేగాన్ని మించిన వేగం గల విస్తీర్ణము అది. వారి శక్తిలోని ఒక్క కిరణం - కరుణ కిరణం చాలు మనలో జ్ఞాన వెల్లువలు వెల్లి విరియటానికి! కాబట్టి - ఏ మహాత్ముడు - ఏ మహర్షి, ఏ మానవులు - ఆ అమ్మవారిని మాతృకా వర్ణరూపిణిగా ఉపాసిస్తారో, ఆతల్లివారికి, శ్రీ విద్యా, శ్రీ చక్రస్వరూపిణిగా దర్శనమిచ్చి, అద్భుత కవిత్వప్పాండిత్యాన్ని ప్రసాదిస్తుందని చెప్పారు ఆచార్యులవారు. ఏ చదువులూ, ఏడిగ్రీలూలేకున్నా, ఏజపాలూ, మంత్రాలూ రాకున్నా, ఆ తల్లిని అక్షర రూపిణిగా భావించినాచాలు - తరిస్తారు మానవులు అని ఉద్బోధించారు జగద్గురువులీ శ్లోకంలో - అవునా ?

## 18 శ్లో ॥ అమ్మవారి అరుణ వర్ణ మహిమ.

**18 శ్లో॥ తనుచ్ఛాయాభిస్తే తరుణ తరణి శ్రీ సరణి భిః**
**దివం సర్వాముర్వీ మరుణిమ నిమగ్నాం స్మరతియః**
**భవన్త్యస్య త్రస్యద్వనహరిణ శాలీన నయనాః**
**సహోర్వశ్యా వశ్యాః కతి కతిన గీర్వాణ గణికాః ॥**

**అర్థము :-** తల్లీ! భగవతీ! ఉదయించుచున్న బాల భానుని కాంతి పుంజములను వెదజల్లుచున్న నీ శరీర కాంతులచే, భూమ్యాకాశములు కెంపు వన్నెకు దిరిగి, మున్నీటి యందు మునిగిన వానిగా ఎవడు స్మరించునో, వానికి, బెదిరిన లేడి కన్నులు గల (చక్కని నేత్రములు) - అప్సరసకన్యలు - ఎందరెందరో **ఎందుకు వశ్యులుకారు ?**

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల **వారు, అమ్మ**వారి శరీర చ్ఛాయను, ఉదయభానుని అరుణకిరణాల కెంపురంగుతో పోల్చి, ఆ రంగు ఆ తల్లి విరాట్‌రూప స్వరూపంగా భూమ్యాకాశాలు నిండిపోగా, ఈ భూమ్యాకాశములు రెండూ ఆ ఎర్రరంగు మున్నీటిలో మునిగి పోతున్నట్లుగా అందమైన గొప్పదృశ్యాన్ని ఒకగొప్ప చిత్రకారుని వలె ఊహిస్తూ, భావిస్తూ, స్తోత్రంచేస్తారో, అలాటి భక్తులకు, సాధకులకు - ఆ అరుణ శక్తి వలన అత్యంతా కర్షణ శక్తిరాగా, బెదిరిన లేడి కన్నుల వంటి అందమైన కన్నులుగల అందమైన అప్సరస స్త్రీలు వశ్యులై సేవిస్తారు అని శలవిచ్చారు. ఒక మహాతపస్వి, సాధకుడు తపస్సు చేస్తుంటే, ఆ తపశ్శక్తికి వున్న ఆకర్షణ మరి దేనికీ వుండదు. ఇంద్రునిలాటి ఈర్ష్యాళువులు - ఆ తాపసి తపస్సు భంగం చేయటానికి అందమైన అప్సరసలను పంపినా, వారు ఆతని తపస్సు భంగం చేయలేకపోగా, వారే ఆతని తపశ్శక్తికి వశ్యులై సేవలు చేస్తారు. ఇందుకు ఎన్నో దృష్టాంతాలు వున్నాయి.

జగన్మాత నామ జపమహిమ, రూప భావనామహిమ, ధ్యాన మహిమ అంతగొప్పవి. శ్లోకంలో వర్ణించిన ఆ రంగు చూడాలంటే - సూర్యోదయాన్నీ, సూర్యాస్తమయాన్నీ - ఏ సముద్రపు తీరంనుండి అయినా చూడగలిగితే చాలు, కన్యాకుమారి, కోణార్క వద్దవుండే సముద్రతీరంలో - ఈ సూర్యోదయ, సూర్యాస్తమయదృశ్యాలు అత్యద్భుతంగా వుండి - దేవీదర్శనం వలెనే వుంటాయి.

# 19 శ్లో॥ "అమ్మవారి మన్మధకల." అనగా - మన్మధుడు సాధించిన అమ్మవారి శ్రీ విద్యా స్వరూపం.

19. శ్లో॥ ముఖం బిన్దుం కృత్వా, కుచయుగ మథస్తస్య తదధో,
హరార్ధం, ధ్యాయేద్యో, హరమహిషి! తే, మన్మథ కలామ్,
ససద్య స్సంక్షోభం నయతి వనితా, ఇత్యతి లఘు
త్రిలోకీ మప్యాశు భ్రమయతి రవీన్దు స్తన యుగామ్!

**అర్థము :-** ఓ మాతా! జగజ్జననీ! నీ నెమ్మోమును బిందువుగాచేసి, దానిక్రింద కుచయుగము నుంచి, దానిక్రిందుగా త్రికోణము నుంచి నీ మన్మథ కలను (కళను) ఎవడుధ్యానించు చున్నాడో, అతడు, మరుక్షణముననే, వనితలను సంక్షోభితులను చేయుచున్నాడు. అంతేకాదు ఈ కనబడే సూర్య చంద్రు లిరువురు చనుగవకాగా, నొప్పుచున్న ముల్లోకములనూ భ్రాంతి నొందేలా, మోహ పెట్టుచున్నాడు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి శ్రీ విద్యాస్వరూపంలోని "కామరాజకూటము" అయిన రెండవ మంత్రభాగాన్ని ఆతల్లి విరాట్ రూపంగా భావించి ఎవరు ధ్యానిస్తారో - వారు - సర్వసిద్ధులనూ వశం చేసుకొని ముల్లోకములనూ మోహపెట్టగలరు అని చెబుతున్నారు.

"ముఖంబిందుం కృత్వా" అనగానే - ఈ మన పవిత్రభారతదేశ భౌగోళిక రూపం ఆచార్యులవారి హృదయంలో మెదిలింది! కాశ్మీరు, నేపాలు - కన్యాకుమారి త్రికోణం కాగా, కాశీ - బిందువుగా భావించారు ఆచార్యులవారు. ఏ మహాయోగీశ్వరుడైనా అలాగే భావిస్తాడు ఈ దేశాన్ని శ్రీ చక్రంతో పోల్చుకోగల దివ్య సంస్కారం వుంటే! శ్రీ జగన్మాత ముఖా రవిందాన్ని ఆకాశంగా భావించాలి. ఆ తల్లి విరాట్‌రూపాన్ని కొందరు సాధకులు (సమయాచారులు) అలాధ్యానిస్తారు గనుక! సూర్యచంద్రులు ఆమెస్తనయుగం! పగటికి వెలుగును ప్రసాదిస్తూ, సర్వప్రాణి కోటికీ జవ జీవాలనూ, జీవిత కర్తవ్య శక్తినీ ప్రసాదించే, కాలం విలువనూ, విధులనూ తెలిపే కర్మసాక్షి సూర్యుడు కాల స్వరూపం ఒక స్తనం కాగా, ఇక రెండవ స్తనం చంద్రుడు, ఇదే మనస్సు. శీత కిరణాలతో రాత్రి కర్తవ్యాలను, రాత్రివేళా స్థిమితంగా చేసే సదాలోచనలూ,

రేపటిరోజు నిర్వర్తించవలసిన కర్తవ్యాల బేరీజు, ఆధ్యాత్మికమైన భావాలూ అన్నీ ఈమనసు యొక్క భావనా తీవ్రతపైనా, ఆ మనసు యొక్క పూర్వజన్య సంస్కార పుణ్య విశేషం పైనా ఆధారపడి వుంటాయి. ఆవన్నీ మానవులకూ, సర్వప్రాణి కోటికీ తన అమృత క్షీర ధారలనే చనుబాల ద్వారా అందించే ఆ జగన్మాత -

ఆరెంటి క్రిందుగా "హరార్థం" అనగా హరునిలో సగం శక్తి అయిన ఆ తల్లి రూపాన్ని - (అక్షరరూపంలో సున్న, అరసున్నలుగా) ఎవరైతే మన్మధకల (కళ)గా, మన్మధ విద్య అయిన శ్రీవిద్యా స్వరూపిణిగా ఉపాసిస్తారో, (మన్మధ విద్యే - దీనినే కామరాజ బీజం అంటారు.) అక్షరాలలో అయితే "ద్రాం, ద్రీం, క్లీం, బ్లూం, సః" అని (గురు భోధ ద్వారా మంత్రోపదేశం పొంది) ఉపాసిస్తారో, ఆ తల్లి విరాట్‌రూపం దర్శించి, వారు సర్వసిద్ధి స్వరూపిణులైన దేవతలను (అణిమాద్యష్టసిద్ధులను) కూడా మోహ పెట్టగలరు - వారే ఈతనికి దాస్యం చేయగలరు. ఆ సిద్ధులను అధిగమించిన వారికే - అవిదాస్యం చేస్తాయి. ప్రలోభపడిన వారిని - ఏడిపించి పతనం చేస్తాయి. అమ్మవారి విరాట్‌రూపాన్ని దర్శింపజేసారు ఆచార్యులవారు ఈ శ్లోకంలో!

## 8వ అధ్యాయం సమాప్తం.

ఈ అధ్యాయం అమ్మవారి కుండలినీ శక్తి, శ్రీ చక్ర స్వరూపము, శివునిలో సాధకుని సాయుజ్యము, అమ్మవారి ఉపాసకునికి అమ్మవారి కరుణ ద్వారా కలిగే మహిమలు, అమ్మవారి పాదముల మయూఖములు (కిరణములు) - అమ్మవారి అనుగ్రహంతో పొందే కవిత్వ శక్తి, సరస్వతీ స్వరూపంగా ఆ తల్లిని ధ్యానించి తరించటం - అక్షర స్వరూపిణిగా దర్శించి తరించటం, ఆ తల్లి అరుణకాంతి అరుణశక్తి, మన్మధకల - 9వ శ్లోకంనుండి 19వ శ్లోకం వరకూగల 11 శ్లోకాలలో అద్భుతంగా వర్ణించి ఆ తల్లి కాలస్వరూపిణిగా - దర్శనం చేయించారు శ్రీ శంకర భగవత్పాదులవారు.

ఈ అధ్యాయం భక్తి శ్రద్ధలతో పారాయణం చేసిన వారికి, అమ్మవారి అపారకరుణతో, పంచ భూతములను జయించే శక్తి - అనగా, మనలోనే ఇంద్రియ నిగ్రహము, అనవసరమైన కోర్కెలు జయించటము - ఎన్ని ఏళ్ళు వచ్చినా (ఇరవై సంవత్సరాలు దాటిన తర్వాత కూడా) రజస్వల కాని కన్యలు - రజస్వల కావటం, మనలోనే శ్రీచక్ర దర్శనం - షట్చక్రదర్శనంలాటి అపారజ్ఞానం కలగటం, వసంత ఋతువునందు, శరదృతువు నందు - వచ్చు జబ్బులు ఉపశమించటం, కవిత్వము - చిరయశశ్శురావటము, సకల కళలలో ప్రావీణ్యత సాధించటము, మొదలైన దివ్యశక్తులు వస్తాయి.

అయితే ఒకరోజు - లేదా ఒకనెల పారాయణంచేసి, సిద్ధులు శక్తులూ వస్తున్నాయా ? అని దిక్కులు చూస్తే లాభం లేదు. అది వ్యాపారపూజ-లాభాసక్తిపూజ. నిష్కపటంగాని స్వార్థంగా పారాయణ చేయగలిగిన వారికి సర్వశక్తులూ, కళలూ - అమ్మవారి అపార కరుణతో వెన్వెంటే వస్తాయి. కావలసింది భక్తిలో చిత్తశుద్ధి, అది లేని పారాయణ వృథా.

పదండి ముందుకు - **9వ అధ్యాయంలోనికి.**

# 9వ అధ్యాయం

## అమ్మవారి అపారకరుణ వలన సర్వవిషశాంతి

**20. శ్లో॥ కిరన్తీ మఙ్గేభ్యః, కిరణని కురుమ్బా మృత రసం**
**హృదిత్వా మాధత్తే హిమకర శిలామూర్తి మివయః,**
**స సర్పాణాం దర్పం శమయతి శకున్తాధిప ఇవ**
**జ్వర ప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాదార సిరయా ॥**

**అర్థము :-** ఓ జగన్మాతా! తల్లీ! సర్వాయవముల నుండి, అమృత రసమును వర్షించుచున్న నిన్ను (అనగా, సహస్రార కమలములో దేవీ స్వరూపం అమృత ధారలను వర్షిస్తుంటుంది సాధకునిపై) ఏసాధకుడు - చంద్రకాంతి మణి నిర్మితదేహముగల ప్రతిమ వలె - (అనగా స్ఫటికము వంటి కాంతిగల రూపముతో విగ్రహముగా, మూర్తిగా,) తన హృదయమునందు ప్రతిష్ఠించుకొని ధ్యానించుచున్నాడో, అతడు గురుత్మంతుని వలె, సర్ప విషమును శమింప జేయుచున్నాడు.

జ్వర తీవ్రతచే మిగుల తాపమునొందిన రోగులకు, అమృత నాడియైన (అమృతం ప్రవహించే సిరలు వలె) తన చల్లని చూపుచే (కరుణారస దృష్టిచే) ఆ జ్వర బాధలు తొలగించి, ఆ రోగులకు మిగుల సుఖమును, స్వస్థతను చేకూర్చుచున్నాడు. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు అమ్మవారి ఉపాసకులకు వచ్చే మహిమలను గురించి చెబుతున్నారు. జగన్మాత కరుణతో ఉపాసకులకు కొన్ని దివ్యశక్తులు వస్తాయి. అవి స్వార్థానికి గాక, పరోపకారం కోసం ఉపయోగించే ఉపాసకులకు అవి జీవితమంతా పనిచేస్తాయి. స్వార్థానికి ఉపయోగించుకొనే వారికి, కొంతకాలం మాత్రం పనిచేసి, తర్వాత ఇక పనిచేయవు. దేవీ భక్తుడైన ఉపాసకుని వద్దకు పాము కరచిన వారిని, తీసుక వెళతారు. (ఈనాటికీ వున్నదీ పద్ధతి పల్లె

ప్రాంతాలలో) ఆ ఉపాసకుడు - తన ఉపాసనాశక్తితో మంత్రం వేయగానే, ఆ పాము కరచినవ్యక్తికి విషం ఎక్కదు తగ్గిపోతుంది. తమహస్తస్పర్శతో, ("A man of Golden Towch") వివిధ రకాల మొండి జ్వరాలను ఉపశమింపజేస్తారు కొందరు ఉపాసకులు. ఇది నిజమేనా ? మంత్రాలకు చింతకాయలు రాలుతాయా ? అని అడుగుతారుకొందరు. ఉపాసకులలో చిత్తశుద్ధి, నిస్వార్థం పరోపకారత అనేవి వున్నపుడు - ఏదైనా సాధ్యమే నిస్సందేహంగా, సాయిబాబా, రమణమహర్షి, రామకృష్ణ పరమహంస మొదలైన ఎందరో మహనీయుల వద్ద, పాముకాటు విషాలు, జ్వరాలు, కుష్టువ్యాధి మొదలైనవి నయమైన సంఘటనలు ఎన్నో జరిగాయని వారి వారి చరిత్రలు చెబుతున్నాయి. వారంతా భగవదనుగ్రహం పరిపూర్ణంగా పొందిన నిర్మోహ, నిశ్చల భక్తులు. తమకంటూ ఏ కోరికలూ కోరనివారు. వారి కరస్పర్శ, చల్లని చూపే ఎదుటివారిలోని రుగ్మతలనూ, గ్రహబాధలనూ, పాము తేలు వంటి విష క్రిమివిషాన్ని హరింపజేస్తుంది. స్వయంగా అమ్మవారే - తన పతిఅయిన ఈశ్వరుడు - సర్వదేవదానవ మానవులూ, భయపడి పారిపోతుండగా, క్షీరసాగర మథన వేళా - వాసుకి నోటినుండి వెలువడిన విషాగ్ని కీలలు - దావాగ్నిలా చెలరేగి సర్వ లోకాలనూ ఆక్రమించుకుంటుండగా, దానిని ఒక నేరేడు పండులా ముద్దచేసి, తాను ఆదేవదాన మానవులందరినీ రక్షించటానికి - ఆ గోళాన్ని మ్రింగుతానని చెప్పగా - "మ్రింగు"మని సర్వమంగళ అనుమతిచ్చింది. తన భర్త మరణిస్తాడేమోననే భయం ఆమెలో ఇసుమంత కూడా కలగలేదు! కారణం. శ్రీ విద్యా స్వరూపిణి అయిన తాను - భర్త శరీరంలో సగమై వున్నది. శ్రీ విద్యాన వాక్షర మంత్రాన్ని నిరంతరం జపించే ఈశ్వరుడు - ఆమంత్ర మహిమవలన విషాన్ని జీర్ణించుకోగలడని ఆమె ధృఢ విశ్వాసం, అలాగే జరిగింది కూడా!

ఇక ఉపాసకుల ఉపాసనా శక్తి మహిమ కూడా సాధారణమైనది కాదు. గురువుపట్ల, దైవం పట్ల వారికి గల ధృఢ విశ్వాసం, భక్తి వారికి ఏ అరిష్టాన్నయినా ఎదుర్కొనగల శక్తి ఇస్తాయి.

యాజ్ఞవల్క్యుడు యువకుడు. అతడి గురుభక్తి అనన్య సామాన్యం, ఆ దేశపు రాజుగారికి ఒకసారి చాలా జబ్బు చేసింది. ఎందరు రాజవైద్యులు చికిత్స చేసినా, రాజుగారి జబ్బు నయం కాకపోగా, వ్యాధిముదిరి, రాజుగారు సన్నగాబక్క చిక్కిపోయి - ఎముకల గూడులా మారిపోతున్నారు. చివరగా వైద్యులవలన వ్యాధి ఉపశమించదనీ, ఎవరైనా మహా ఉపాసకుడైన పరమగురువు వల్ల - వారి ఉపాసనా బలం వలన వ్యాధి తగ్గవలసిందే తప్ప, మరో మార్గం

లేదని నిర్ణయించుకున్నారు. రాజవైద్యులు - మంత్రులు - మహారాణీ అంతా! వారి రాజ్యంలో వుంటున్న యాజ్ఞవల్క్యాని గురువుగారి వద్దకు దూతను పంపారు. గురువుగారు వచ్చి, రాజును పరీక్షించి - తాను రోజూ దేవీఉపాసన చేసినతరువాత, ఆ అమ్మవారి పవిత్ర పాదతీర్థం తన శిష్యుని చేత పంపుతాననీ, అది భక్తితో త్రాగితే నలభై రోజులలో వ్యాధి నయమౌతుందనీచెప్పి ఆశ్రమానికి వెళతాడు.

రోజూ గురువుగారు జప, ధ్యానాదుల తర్వాత అమ్మవారి నిషోడ శోపచారాలతో పూజించి - నైవేద్యం పెట్టి, ఆ తల్లి పాదజలాన్ని, ఒక చిన్న పాత్రలోపోసి మూతపెట్టి శిష్యుని చేతరాజుగారికి పంపసాగారు. రాజుగారు కూడా అది సేవించేవారు. నెలరోజులు ఇలా జరిగిపోయింది. గురువుగారు అత్యవసరంగా గ్రామాంతరం వెళ్లవలసి వచ్చింది. తన శిష్యులందరిలో చిన్నవాడూ-యువకుడూ అయిన "యాజ్ఞ్య వల్క్యాని"పిలిచి "నాయనా! నావలెనే నీవు రోజూ భక్తి శ్రద్ధలతో దేవిని ఉపాసించి - రాజుగారికి తీర్థం తీసుకుని వెళ్లి ఇస్తుండు!" అని ఆజ్ఞాపించారు.

యాజ్ఞ్యవల్క్యుడు అపార గురుభక్తి దైవభక్తి గలవాడు. కానీ కర్మ కాండలమీద ఎక్కువ గురి లేనివాడు. అందరు శిష్యులలా బోడిగుండు, పిలక గాక, జుట్టు జులపాలలా వుంచుకున్నాడు. గురువుగారు కూడా ఆతడిలోని నిష్కల్మష భక్తి ప్రపత్తులు - శక్తి ఎరిగిన వాడవటం వల్ల తల గుండు గీయించుకోమనీ, పిలక పెట్టుకోమనీ బలవంత చేయలేదు.

యాజ్ఞ్యవల్క్యుడు - గురువుగారు చెప్పిన ప్రకారం నిష్ఠగా ధ్యానంచేసి - అమ్మవారి పాదతీర్థాన్ని రాజుగారి వద్దకు తీసుకెళ్లాడు. రాజుగారి పరివారంలో చాలామంది యాజ్ఞ్యవల్క్యాని వేషం చూచి - హేళన చేశారు. లెక్కపెట్టు కోకుండా లోపలికి వెళ్లాడు. రాజుగారు పడుకుని వున్న శయ్యను సమీపించి "మహారాజా! మా గురువుగారి ఆజ్ఞ ప్రకారం - అమ్మవారి పాదతీర్థం మీ కోసం తెచ్చాను. మీరు మంచం మీద లేచికూర్చుని స్వీకరించండి!" అని చెప్పాడు.

రాజుగారు హేళనగానవ్వారు. "నీ ఈజుట్టు, జులపాలూ, నీవాలకం చూస్తుంటే నీవా గురువుగారి శిష్యుడవేనా ? "అనే అనుమానం కలుగుతోందినాకు! పైగా నీవు నిజంగా ఉపాసన చేయగలవా ? అని కూడా అనుమానంగా వుంది. నీవు తెచ్చిన ఈ తీర్థం నేను తాగను. మీ గురువుగారు తిరిగివచ్చిన తర్వాతే మరల తీర్థం ఔషధంగా సేవిస్తాను వెళ్లు!" అన్నాడు. తిరస్కారంతో, యాజ్ఞ్యవల్క్యుడు - చాలాసేపు తన గురుభక్తి గురించి, తాను నిర్మలంగా ఉపాసన చేసే శిష్యుడిననీ - చెప్పి చూశాడు. గురు వాజ్ఞగా - తీర్థం తెచ్చాననీ చెప్పాడు. అయినా రాజుగారు వినలేదు.

"మరి జగన్మాతను మనోవాక్కయకర్మలా పూజించి - తెచ్చిన ఈ తీర్థం మీ కోసం నిర్దేశింపబడినవి. ఈనాటి తీర్థ సేవనంతో మీ ఆరోగ్యం ఒక్కసారిగా కుదుటపడాలని సంకల్పించి మరీ తెచ్చిన పవిత్ర తీర్థం ఇది. ఇది వెనక్కు తీసుకపోరాదు. ఏం చేయమంటారు ?" అని అడిగాడు యాజ్ఞ్యవల్క్యుడు - రాజుగారి తిరస్కార భావంతో "అదుగో! నా ఎదురుగా కనిపిస్తున్నదే దారు ప్రతిమ (కొయ్యబొమ్మ) దాని నోట్లో పోసిపో!" అన్నాడు.

"మంచిది!" అంటూ యాజ్ఞ్యవల్క్యుడు మంత్రోచ్ఛారణతో తన చేతిలోని తీర్థాన్ని నిలువెత్తు దారు ప్రతిమనోటిలో కొంత పోసి కొంత శిరసుపై చిలకరించి - అంతఃపురం వదిలి వెళ్లిపోయాడు.

ఆశ్రమానికి వచ్చేసరికి - గురువుగారు - వెళ్లినపని ఆగిపోవటంతో తిరిగివచ్చేశారు. జరిగినదంతా ఏమీ దాచుకోకుండా చెప్పాడు యాజ్ఞ్యవల్క్యుడు. గురువు నిర్ఘాంతపోయాడు. - రాజుగారి దురదృష్టానికి లో లోపల బాధపడ్డాడు.

"రాజుగారు తామసం, రాజ సంగల వ్యక్తి. ఆయన నీ పట్ల తిరస్కార భావంతో వ్యవహించారనుకో! నీవెందుకు రోషపడ్డావు నాయనా ? నీకు నేను నేర్పిన విద్య అంతా ఏమైంది? శాంతం, క్షమ మర్చిపోయావా ? నీవు నా అంతటి గొప్ప ఉపాసకుడవనీ నాకు తెలుసు. ఆ పవిత్రతీర్థం వెనక్కి తీసుకురాలేక పోయావా ? నా విద్య అంతా నీ పట్ల వృధా అయింది!" అని బాధపడ్డారు. యాజ్ఞ్య వల్క్యుడూ బాధపడ్డాడు." గురువర్యా! ఆరాజుగారికి నా పట్ల తిరస్కారం కలిగితే నేను బాధ పడేవాణ్ణికాను. నా ఉపాసన పట్ల - నా గురువు గారి ఆజ్ఞను నేను నెరవేర్చుతుండగా, నా గురు వాజ్ఞను కూడా నన్ను ఆచరించకుండా చేయటమనే తిరస్కారాన్ని నేను సంహించలేకపోయాను. సరే! రాజుగారికి ఇవ్వమన్నారు మీరా తీర్థం ఆతడు పుచ్చుకోలేదు. దారు ప్రతిమకు పోయమన్నాడు! పోసేశాను! మీవద్ద పొందిన విద్యకు నేను, అవినయంగా ప్రవర్తించలేదు మీ పట్ల! అయినా మీరు బాధపడ్తున్నారు గనుక. మీ విద్యను వమనంచేసేస్తున్నాను!" అంటూ యాజ్ఞ్యవల్క్యుడు - ఆశ్రమం వెలుపలికి వచ్చి - తాను ఆగురువు గారి వద్ద నేర్చిన విద్యను వమనం (వాంతి) చేసేసుకున్నాడు.

అక్కడ చెట్టుపై నున్న "తిత్తిరి" పక్షులు. ఆవమమాన్ని తిన్నాయి. వాటిలో అద్భుతజ్ఞానం వచ్చి, యాజ్ఞ్యవల్క్యునికి గురువుగారు బోధించిన శాస్త్రం అంతా స్పష్టంగా అప్పజేప్పాయి! తిత్తిరిపక్షులు పలికిన శాస్త్రం గనుక దానికి "తైత్తిరీ యోపనిషత్తు" అని పేరు వచ్చింది ఆనాటినుండి. గురువు గారు - మిగతాశిష్యులు దిగ్భ్రాంపొందారు. యాజ్ఞ్యవల్క్యుడు గుర్వుగారి

వద్ద శలవుతీసుకొని వెళ్లిపోయాడు. సూర్య భగవానుని ఏకదీక్షగా ఉపాసించి సూర్యుని ప్రత్యక్షం చేసుకొని, కర్మసాక్షి అయిన సూర్యుని అనుగ్రహంతో, సూర్యుడే గురువుగా, సకల వేదాలూ అభ్యసించాడు యాజ్ఞ్యవల్క్యుడు. అందుకే సూర్యోపాసకులలో ప్రముఖుడు యాజ్ఞ్యవల్క్యుడయ్యాడు. ఇక్కడ అంతఃపురంలో - రాజుగారు - యాజ్ఞ్యవల్క్యుని అగౌరవపరచి పంపించివేసి నిద్రపోయారు. ఒకగంట తర్వాత నిద్రలేచి చూడగా, రోజూ ఆయన మంచం ఎదురుగా పెట్టి వుండే దారుప్రతిమ (కొయ్యబొమ్మ) స్థానంలో, లేతచివుళ్లతో, పూలతో, కాయలతో, దోరపిందెలతో వృక్షస్వరూపం వున్నది. భటులను పిలిచి అడిగాడు అదేమిటని ? వారూ దిగ్భ్రాంతి పొందారు, తమకు తెలియదని! పరిశీలించి చూడగా, షుమారు ఏ యాభై సంవత్సరాలనుండో అక్కడ వుండే ఆదారు ప్రతిమకే -- చివుళ్లు మొలిచి, అది సజీవమైన వృక్షరూపం సంతరించుకునివున్నది! యాజ్ఞ్యవల్క్యుని చేతి తీర్థమహిమ - ఒక దారుప్రతిమను చివురింప జేసింది!

రాజుగారికి తన అహంకారం, మూర్ఖత్వం అర్థమయ్యాయి. యాజ్ఞ్యవల్క్యునిలోని అద్భుత తపోశక్తి, ఉపాసనా మహిమ భోధపడ్డాయి. ఆ తీర్థమే తాను భక్తిగా పుచ్చుకుని వుంటే - ఈ సరికి - ఆ దారుప్రతిమలానే తన జబ్బు మాయమై పరిపూర్ణ ఆరోగ్యవంతుడై వుండేవాడు. కానీ, బుద్ధి కర్మాను సారిణి కదా .

తర్వాత రాజుగారు పశ్చాత్తాపంతో గురువుగారి వద్దకు పరుగెత్తుకు వెళ్లాడు. ఏమిలాభం ? జరగవలసినది జరిగిపోయింది, గురువుగారు అతడిని మందిలించి, యాజ్ఞ్యవల్క్యుడు ఇక తిరిగిరాడనీ - తానుకూడా అంతటి మహనీయుడైన శిష్యుని కోల్పోయాననీ చెప్పి - మరలా ఔషధసేవనంగా తీర్థం - మరో మండలం (40) రోజులు పంపుతాననీ రాజుగారిని సమాధానపరచి పంపేశాడు!

ఈ శ్లోకంలో ఆది శంకరాచార్యుల వారు. పరోక్షంగా "గారుడ" విద్యను గురించి భోధించారని చెబుతారు పెద్దలు. ఆరునెలలు ధ్యానయోగంలో సిద్ధిని సాధించిన ఉపాసకుడు, గరుత్మంతునితో సమానుడౌతాడు. గరుడపక్షి ఆకాశంలో అత్యంత ఎత్తుకు ఎగరగలదు - అలాగే దానిచూపు చాలా సునిశితమైనది. అంతటి ఎత్తునుండీ నేలమీద తల్లిరెక్కలమాటున తిరుగుతుండే చిన్న కోడిపిల్లలను గమనించగలదు! మెరుపు వేగంతో వచ్చి - తన కాలి వాడిగోళ్లతో ఆ కోడిపిల్లను పైకి తన్నుకుపోతుంది. పాము నయినా అంతే! ఇది పల్లెటూళ్లలో ఈనాడూ సర్వసాధారణంగా అందరూ చూచేదృశ్యమే!

గరుడపక్షి దృష్టీ, వేగమూ, గగనగమనమూ, పాములనూ, పాము విషములనూ హరించగల శక్తీ - సాధకుడు సాధించు కోవటమే "గారుడ విద్య". సర్వలోకాలలో జరిగే విషయాలనూ సాధకుడు తన దివ్యదృష్టితో చూడగలుగుతాడు ఈ గారుడ విద్యలో - గరుడ పక్షివలెనే! రామాయణ మహాకావ్యంలో - "సంపాతి" అనే (గరుడ పక్షి) - సముద్రం ఇవతలి తీరాన నుండి చూచి - లంకలో వున్న సీతాదేవిని గురించి ఆంజనేయుడు మొదలైన వానరులకు చెబుతుంది. అదే ఈ విద్య! అమ్మవారి ఉపాసకుడు - గరుత్మంతుడు తన వాడిగోళ్లతో సర్పములను చీల్చివేసినట్లు, సర్పవిషమును - తనగారుడ మంత్రప్రయోగంతో లాగి వేయగలుగుతాడు.

ఇక జ్వరములు శమింపజేయటం అన్నారు ఆచార్యులవారు. అదేమిటో తెలుసుకుందాము. జ్వరములు ఎలాపుట్టాయి ? "స్కందపురాణంలో" ఒక చక్కని కథ వున్నది.

దక్ష యజ్ఞ వాటికలో సతీదేవి అవమానింపబడి, ఆత్మాహుతి చేసుకున్నట్లుగా, ఆమెవెంటవచ్చిన ప్రమథ గణములు - పరుగెత్తుకువెళ్లి, కైలాసంలో వున్న ఈశ్వరునికి చెబుతారు దుఃఖిస్తూ,! ఈశ్వరుడు ఉగ్రుడై, ప్రళయకాలరుద్రుడై, తన జటనొకదానిని పెరికి, (కింద పడవేయగా, అది వీర భద్రునిగా అవతరించి, రెండవ రుద్రునిగా ఎదిగింది. వీరభద్రుని వెంట, భూత కోటిచే పరివేష్ఠింపబడిన "భద్రకాళి" పుట్టింది.

శివుని కోపంతో కూడిన నిట్టూర్పులనుండి - నిశ్వాసాలనుండి "100 (నూరు) జ్వరములూ,' ' 13 (పదమూడు) "సన్ని పాతజ్వరములు" పుట్టినవి. ఈ జ్వరములన్నీ లోకాల మీద పడ్డాయి! వీరభద్రుని వెంట కాత్యాయనీ, ఈశానీ, చాముండా, ముండమర్దని, భద్రకాళీ, భద్రా, త్వరితా, వైష్ణవీ, నవదుర్గా సహిత శాకినీ, ఢాకినీ, ప్రమథ మొదలైనవారూ, "గుహ్యకులూ" అనేవారూ, (ఒకజాతి గణాలు) 64 వేలమంది యోగినీ గణాలూ, దక్ష యజ్ఞవాటిక ధ్వంసం చేయటానికి పుట్టుకవచ్చి, బయల్దేరారు. ఇక ప్రమథ గణాలు వుండనే వుండే! వందలూ, వేలూ! వారూ బయల్దేరారు.

సతీదేవితో బాటు 20 వేలమంది ప్రమథగణాలు (తమ అమ్మవారి ఆత్మాహుతి చూసి సహించలేక బాధతో) ఆత్మాహుతి చేసుకున్నారు. ఈ జరిగిన ఘోరానికి ప్రతీకారం తీర్చుకోవటానికి వీరభద్రుడు - ససైన్య సమేతుడై బయల్దేరాడు, దక్షయజ్ఞ ధ్వసం జరిగింది. ఇక ఆ జ్వరాల మాటేమిటి ? అవి ఆవరించిన చోట జ్వరం వస్తుంది. స్ఫోటకములు (దద్దుర్లుతో కూడిన) ఆటలమ్మ, నూగులమ్మ, తట్టు - మశూచి వగైరా పేర్లతో, దుర్భరమైన బాధతో కూడిన

"అమ్మవారు" అనే పేరుగల జబ్బులు వస్తాయి! ఇవి సరైన చికిత్స లేకపోతే, ఆవ్యక్తులు కురూపులుగా మారటం, కాళ్లు, చేతులు, వ్రేళ్లు చచ్చుపడటం, దృష్టిపోవటం వంటి అనర్ధాలకూ దారి తీస్తాయి. (ఇలాటివి వస్తే ఈనాటికీ పల్లెటూళ్లలో అంకమ్మ, పోలేరమ్మ - ఇలా గ్రామశక్తులకూ, శక్తిదేవతలకూ తిరుణాలలూ, జాతరలూ చేస్తుంటారు. (వారి మూఢ భక్తిలోనూ దైవత్వం వున్నది.) నాగరీకులు అర్ధం చేసుకోవటానికి ఒక జన్మచాలదు) ఇవి జ్వరాలు - మశూచిలాటివి - సర్పవిషాలూ, తేలు విషాలు (మొదలైనవి) ఉపశమింపజేయగలది ఒక్కఅమ్మవారి పూజే! శక్తిపూజే! దేవీ ఉపాసకులూ, నిస్వార్ధపరులూ అయిన వారిచేతి తీర్ధం. (దేవీ ప్రసాదం, తీర్ధం) వారి కరస్పర్శ - ఆశీశ్శులు - చక్కగా పనిచేస్తాయి. ఎటొచ్చీ, ఆ ఉపాసకులు అది "తమ మహిమ" అని అహంకారపడకుండా "దేవీకరుణ"గా భావించాలి. చెప్పాలి. మనసా, వాచా, కర్మణా నమ్మాలి, అప్పుడే మంత్రం ఫలిస్తుంది. తీర్ధం అమృతం అవుతుంది. శాంతించిన ఈశ్వరుడు లోకాలను తన ఆశీశ్శులతో శాంతింప జేసాడు. ఈ చిన్న శ్లోకంలో కొండంత అర్ధాన్నీ ఆలోచనలనూ భోధించారు ఆచార్యులవారు - అవునా ?

## 21 శ్లో॥ "అమ్మవారి సాదాఖ్య కల"

**21. శ్లో॥ తటి ల్లేఖా తన్వీం, తపన శశి వైశ్వానరమయీం**
**నిషణ్ణాం, షణ్ణా మప్యు పరి కమలానాం, తవకలామ్!**
**మహా పద్మాటవ్యాం, మృదితమల మాయేన మనసా,**
**మహాన్తః పశ్యంతో దధతి, పరమానందల హరీమ్!**

**అర్ధము :-** తల్లీ! జగన్మాతా! భగవతీ! మెరపు తీగెవలె దీర్ఘమై సూర్యచంద్రాగ్ని రూపమై, క్షణం వెలిగేదిగా వుండి, "షట్చక్రముల" కు పైన "సహస్రారము" నందు, మహా పద్మాటవిలో కొలువై యున్న నీ "సాదాఖ్య" కళను పరిపక్వచిత్తులూ, సంసారమాయను జయించిన జితేంద్రియులైన మహనీయులూ, మాత్రమే పరమానందలహరి"గా తెలుసుకొనుచున్నారు. నిరతిశయా నందమును, నిరంతరము పొందుచున్నారు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులు అమ్మవారి "సాదాఖ్య" కళ అనగా "నిత్య" షోడశికళను - వృద్ధిక్షయములు లేని "సాద" అను 16వ కళను [illegible]రించి వర్ణించారు. ఆ తల్లి నిత్య, సత్యస్వరూపిణి! ఉపాసకుడు - శ్వాసక్రమంద్వారా, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, ఆజ్ఞా చక్రాలను అధిగమించి - సహస్రార కమలంలోనికి ప్రవేశిస్తాడు ధ్యాన

యోగంద్వారా, ఈ షట్చక్రాలూ అధిగమించే సమయంలో అమ్మవారి స్వరూపం ఒకానొక మెరుపుతీగెలాగా, సూర్యచంద్రాగ్ని రూపకమైన మెరుపులాగా, మెరిసిమాయమౌతుంటుంది సాధకుల హృదయాకాశములలో! ఏ సాధకుడైతే, తనసాధనలో, లభించిన సిద్ధులకు లొంగక, పొంగక, వాటిని లెక్కచేయక, "మాయ"కు అతీతంగా ధృఢచిత్తంతో సాధన చేయగలుగుతాడో, అతడొక్కడే సహస్రార కమలంలో "సాదాఖ్య" పేరుతోగల, నిత్య, సత్యమైన జగన్మాత పరిపూర్ణ రూపాన్ని దర్శింప గలుగుతాడు. ఈ మాయ ఏమిటి ?

ఎప్పటికప్పుడు, ఏక్షణానికి ఆక్షణం మనుషుల్ని కమ్మివేసి, వివిధ విషయాలపైకి మనసును మరలించి, ప్రలోభ పెట్టేదే మాయ! కాస్తంత సాధన కాగానే, కొన్ని దివ్యశక్తులు, సిద్ధులు వస్తాయి! ఇక అవి ప్రదర్శించటం, జనాకర్షణ, ధనాకర్షణ, ఆశ్రమాలు, శిష్యబృందం - ఘనసన్మానాలూ, అధికారంలో వున్న వారి ప్రాపకాలూ, ఇలా సాధకులు మాయలో చిక్కుకుంటారు. మరికొందరు - చక్కని ఉపన్యాస గర్వం, విద్యాగర్వం, - శాస్త్రపాండిత్యగర్వం - అనే మాయలలో కూరుకుపోతారు. మరికొందరు ఇంద్రజాల విద్యలలాటి గారడీలతో జనాకర్షణ, ముఖ్యంగా అమాయకపు స్త్రీలను ఆకర్షించటం, వారిని తప్పుదారి పట్టించటం-లాటి మాయలలో పడి పతనమౌతుంటారు. ఇలాటి వారెందరో, తాత్కాలిక దివ్య శక్తుల మహిమకు - మాయకులొంగి, మోక్షమార్గం విడచి, ప్రక్కదారులు పడతారు. - వీరందరికీ అమ్మవారు ఒక మెరుపులా మెరిసి మాయమౌతుంది. ఇవేవీ పట్టించుకోక, వీటన్నిటినీ తృణప్రాయంగా త్రోసివేసి ముందుకు సాగిన జితేంద్రియులు - మాయను జయించిన మహనీయులు మాత్రమే జగన్మాతయొక్క పరిపూర్ణమైన షోడశ కళ అయిన "నిత్యా"ను "సత్య స్వరూపాన్ని", దర్శించగలుగుతారు. అందువలననే శ్రీ శంకర భగవత్పాదులవారు తమ భవానీ భుజంగప్రయాతస్తోత్రంలో 2వ శ్లోకంలో

## భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం - 2వ శ్లో

శ్లో ॥ జ్వలత్కోటి బాలార్క భాసారుణాంగీమ్!
సులావణ్య శృంగార, శోభాభి రామామ్,
మహాపద్మ కింజల్క మధ్యేవిరాజ
త్రికోణే నిషణ్ణాం, భజే శ్రీ భవానీం!

అనిస్తోత్రం చేశారు. మహాపద్మాటవీ మధ్యలో - మహా పద్మకేసరముల మధ్య త్రికోణంలో బిందు స్వరూపిణిగా సహస్రార చక్రంలో సమయాచారులైన యోగీంద్రులకు దర్శనమిచ్చే - అరుణ వర్ణయై - బాలార్కతేజః పుంజయై - సులావణ్య శృంగార - సౌందర్యలహరియై సాక్షాత్కరించే తల్లిని - తేలిక పదాలలో - చిన్న శ్లోకంలో వర్ణించారు జగద్గురువు.

ఆభావాన్నే "సాదాఖ్య" కళగా విస్తృతంగా వర్ణించారు ఈ "సౌందర్యలహరి" 21వ శ్లోకంలో" "తటిల్లే ఖాతన్వీం"అంటూ - అవునా ?

తర్వాత శ్లోకంలోనికి వెళదాంపందండి - ముందుకు. పారాయణానికి.

## 22. శ్లో. అమ్మవారి అపార కరుణతో ఆ తల్లి ఉపాసకులకు (దాసులకు), సాయుజ్యపదవి ప్రసాదించుట.

**22. శ్లో॥ భవాని త్వందాసే మయి, వితర దృష్టిం సకరుణాం**
**ఇతిస్తోతుం వాంఛన్ కథయతి "భవాని" త్వమితియః**
**తదైవ త్వంతస్మై దిశసి, నిజసాయుజ్య పదవీం**
**ముకుంద బ్రహ్మేంద్ర స్ఫుట మకుట, నిరాజిత పదామ్ ॥**

**అర్థము** :- తల్లీ! భవునిరాణీ! భవానీ! జగదంబా! నేను నీ దాసుడను నన్ను కటాక్షింపుము." అని నీ భక్తుడైన ఉపాసకుడు ప్రార్థించబోయి" తల్లీ! భవానీ!" అంటూ తన మనసులోని భావాలను మాటలలో చెప్పబోవుతుండగనే - అతడి భక్తికి మెచ్చి, నీ అపారకరుణ అతని పై వర్షించి, అతనికి - నీవు. ఏ నీ పాద పద్మములకు, తమ మణిమయ, రత్నమయ కిరీటములతో శిరసువంచి ముకుంద బ్రహ్మేంద్రులు - నీరాజనము (తమ రత్న మయకిరీటములలోని రత్నములవెలుగే హారతిగా) పెట్టి, నీసాయుజ్య పదవిని కోరుచున్నారో -

ఆ అతిదుర్లభమైన సాయుజ్య పదవిని - నీ ఉపాసకునికి - అయాచితముగా ప్రసాదించుచున్నావు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు దేవీనామ సంకీర్తన మహిమ వలన, దేవీభక్తులు అయాచితంగా పొందే సాయుజ్య ముక్తినిగురించి అద్భుతంగా వర్ణించారు.

సంవత్సరాల తరబడి బహ్మోపేంద్ర, ముకుందులు - శ్రీమాత శ్రీచరణాలకు తమ మణిమయ రత్న ఖచిత కిరీటాలతో - శిరసులు వంచి నమస్కరిస్తూ - శరణాగతితో, నీరాజనం పెడ్తూ -

తమకు సాయుజ్యపదవిని ప్రసాదించమని కోరుతున్నారు. కానీవారికి అణిమాద్యష్ట సిద్ధుల వలన కలిగిన సంపద - దివ్యశక్తుల పట్ల మోహంవున్నది. అందువలన వారికా సాయుజ్యపదవి ఇంకా లభ్యం కావటం లేదు.

కానీ - అమ్మవారి నిజభక్తుడు - నిజదాసుడు - నిరహంకారి, నిర్మోహుడు అయిన భక్తుడు - ఒక్కసారి ఆర్తితో, శరణాగతితో "తల్లీ భవానీ! నీ సాయుజ్యం ప్రసాదించుజగన్మాతా! నాకు లౌకికమైన ఇతరమైన ఏ సంపదలూ, ఏ సిద్ధులూ, ఏ భోగాలూ వద్దు" అని మనసారా మనసులో (మొక్కుకుంటూ. ఆ భావాన్నే ఆతల్లితో మాటలలో చెబుదామని" భవానీ! తల్లీ!" అంటున్నాడో లేడో - ఆ తల్లి ఆతడికి సాయుజ్య పదవి ప్రసాదిస్తున్నది.

అంటే ఏమిటి ? కాస్తంత ఉపాసనతో వచ్చిన సంపదలు - భోగాలూ, శాశ్వతమనుకుని, వాటి మాయలో పడినవారు - ఎన్ని సంవత్సరాలు ఉపాసించినా - భోగ జీవితం వస్తుందే గానీ, మోక్షం రాదు.

భోగాలమీద అనాసక్తత - ప్రాప్తించినదానితో తృప్తి - జగన్మాత పాదాలపై నిశ్చలచిత్తం వున్న దాసులకు - భవాని - పేరు ఉచ్ఛరించగానే - సాయుజ్యం ప్రసాదిస్తోంది. ఆ తల్లి మాతృ మమత, కరుణ అంతగొప్పవి మరి!

ఉద్యోగినులు, గృహిణిలూ, నిరంతరం - సమస్యలలో కొట్టుమిట్టాడే మనబోటి గృహిణీ గృహస్థులమంతా - ఆ తల్లిని - మన తీరిక సమయంలో - మనసులో నామస్మరణ చేసుకుంటుంటే చాలు! ఆ జగన్మాతే - మనల్ని తన దారిలోనికి మరలించుకొని వెంట తీసుకెళ్తుంది.

అలాగని మనం ఏమీ చేయకుండా నిర్వ్యాపారంగా (జగన్మాత నామోచ్ఛరణ చేయకుండా) కూర్చుని, ఆమే మనల్ని వెంటపెట్టుకు పోతుంది లెమ్మనుకోవటం బద్ధకానికీ, నిర్లక్ష్యానికీ పరాకాష్ఠ మనవంతు కృషిగా అమ్మవారి నామోచ్ఛరణ - శ్లోక, స్తోత్రపారాయణ మనసారాచేస్తుండాలి ఒక అడుగు మనం ఆ తల్లి వైపు నడవగలిగితే - ఆజగన్మాత మనవైపు పది అడుగులు వేసి వస్తుంది.

ఆలస్యం ఎందుకు ? పరమగురువు - స్వానుభవంతో గురుబోధగా హెచ్చరిస్తుంటే ఇంకా ఆలస్యం చేయతగునా ? పారాయణం ప్రారంభిద్దాం ఈ రోజే! పదండి మరి - ముందుకు

# 23 శ్లో ॥ అమ్మవారి అర్ధనారీశ్వర తత్త్వము.
# (గౌరీ శంకర తత్త్వము)

**23 శ్లో॥ త్వయాహృత్వావామం, వపురి పరి తృప్తేన మనసా**
**శరీరార్ధం శంభో, రపర మపి శంకే హృతమ భూత్**
**యదేత త్త్వద్రూపం, సకల మరుణాభస్త్రినయనం,**
**కుచాభ్యా మానమ్రం, కుటిల శశిచూడాల మకుటమ్ ॥**

**అర్ధము** :- ఓ జగన్మాతా! నీవు మొదట శంభుని (ఈశ్వరుని) శరీర వామ భాగమును (ఎడమ భాగమును) వహించావు (ఆక్రమించావు! అంతటితో తనివి తీరని చిత్తముతో, నీపతియైన ఈశ్వరుని మిగిలిన సగము శరీరము కూడా (కుడివైపు కూడా) గ్రహించితి వని (ఆక్రమించిలెవని) నేను భావించుచున్నాను. ఏలయనగా, నా హృదయ కమలములోనీ రూపము - ఉషోదయము నందలి బాలభానుని కాంతితో కెంపు వన్నెతో ఒప్పారుచూ, (తినయనగా, స్తనభారము చేత ఇంచుక వంగియున్న నడుముతో, చంద్ర రేఖను శిరో భూషణముగా గలిగిన జటా జూటము అనే కిరీటముతో సాక్షాత్కారించివున్నది.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, అర్ధనారీశ్వరరూపాన్ని తాము సాక్షాత్కరింపజేసుకుని - మనందరికీ, అద్భుతంగా సాక్షాత్కరింపజేస్తున్నారు.

1 శ్లో ॥ చాంపేయ గౌరార్ధ శరీరికాయై, కర్పూర గౌరార్ధ శరీరకాయ
ధమిల్లకాయై చ జటాధరాయ, నమశ్శివాయైచ నమశ్శివాయ!

2. కస్తూరికా కుంకుమ చర్చితాయై, చితారజః పుంజ విచర్చితాయ!
కృతస్మరాయై, వికృతస్మరాయ, నమశ్శివాయైచ, నమశ్శివాయ!

3. ఝణత్క్వణత్కంకణ, నూపురాయై, పాదాబ్జరాజ త్ఫణినూపురాయ,
హేమాంగదాయై, భుజగాంగదాయ, నమశ్శివాయైచ నమశ్శివాయ!

4. విశాలనీ లోత్పలలోచనాయై, వికాసిపంకేరుహ లోచనాయ
సమేక్షణాయై, విషమేక్షణాయ, నమశ్శివాయైచ, నమశ్శివాయ!

5. మన్దారమాలా కవితాలకాయై, కపాలమాలాంకిత కంధరాయ,
దివ్యంబరా యైచ, దిగంబరాయ, నమశ్శివాయైచ, నమశ్శివాయ!

6. అంభోధర శ్యామలకుంతలాయై, తటిత్ప్రభా తామ్రజటా ధరాయ,
నిరీశ్వరాయై, నిఖిలేశ్వరాయ, నమశ్శివాయైచ, నమశ్శివాయ!
7. ప్రపంచ సృష్ట్యున్ముఖ లాస్యకాయై, సమస్తసంహారక తాండవాయ,
జగజ్జనన్యై, జగదేక పిత్రే, నమశ్శివాయైచ, నమశ్శివాయ!
8. ప్రదీప్త రత్నోజ్వల కుండలాయై, స్ఫురన్మహా పన్నగ భూషణాయ!
శివాన్వితాయైచ, శివాన్వితాయ, నమశ్శివాయైచ, నమశ్శివాయ!
9. ఏతత్పఠే దష్టక మిష్టదం యో, భక్త్యా సమాన్యో తస్యసమస్త సిద్ధిః ॥
ప్రాప్నోతి సౌభాగ్య మనంతకాలం, భూయాత్సదా తస్య సమస్త సిద్ధిః ॥

ఇది శ్రీ శంకర భగవత్పాదులవారు రచించిన మహాద్భుతమైన అర్ధనారీశ్వర స్తోత్రం అష్టకము! కుడి ఎడమలయందు కలసిపోయిన - శివశక్తి స్వరూపాలకు ఇంతకుమించిన తేలిక భాష (పదాల) వర్ణన మరెవరు చేయగలరు) ఆబాలగోపాలానికీ అర్ధమయ్యే శ్లోకాలు ఈ ఎనిమిదీనూ! ఆచార్యులవారు తాము ఆఅర్ధనారీశ్వర రూపం దర్శించి మరీ స్తోత్రం చేశారు కనుకే, ఈ సౌందర్యలహరిలోని 23వ శ్లోకంలో - ఆ తల్లి అర్ధనారీశ్వర రూపాన్ని మన కళ్లకు కట్టినట్లు వర్ణిస్తున్నారు. మనో నేత్రాలతో తిలకిద్దాం! రండి!

లలితా సహస్రనామ స్తోత్రంలో "నిరీశ్వరా!" అనే నామం వున్నది అమ్మవారికి నిరీశ్వరా లనగా ఈశ్వరుడు లేనిది! అని అర్థం

ఈశ్వరులేని ఈశ్వరివున్నదా ? అదిసాధ్యమా ? కాదు!

ఈశ్వరునిలో మనసు, మాట - శరీరం - మూడూ ఐక్యమైపోయి - ఇరువురిదీ- ఒకేరూపు, ఒకేచూపు, ఒకేమాట - ఒకేబాట అయిన అపురూప - మహాఅరుదైన - అన్యోన్యదాంపత్య ప్రతిబింబమే అర్ధనారీశ్వరతత్వం, ఆరూపంలోని ఆంతర్యం!

ఈశ్వరునిలో ఐక్యం అయిపోయి - కర్పూరంలా కరిగిపోయిన ఆ తల్లి తన ఉనికీనీ, వ్యక్తిత్వాన్ని - భావాలనూ, క్రియలనూ సర్వాన్ని ఆస్వామిలో లీనం చేసింది! ఆమె "నిరీశ్వరా" గా మారిపోయింది! వేరే ఈశ్వరుడు లేడు. ఆమెలోనే వున్నాడు. వేరే ఈశ్వరిలేదు. ఆస్వామిలోనే ఒదిగిపోయింది! భర్తలోనే కర్పూరంలా కరగిపోయినస్త్రీ ఆ భర్త తేజస్సునూ, రూపాన్ని, ఆదర్శాలనూ, శక్తినీ - అయాచితంగా పొందుతుంది.

రామాయణంలో, సీతాదేవిని అశోక వనంలో చూచిన ఆంజనేయుడు - ఇలా అనుకుంటాడు.

"ఉపావాసాలతో శుష్కించిపోయి - రాక్షస మూకల మధ్యవున్న ఈ తల్లి - ఎలా బ్రతికి వుండగలిగివున్నది ?

ఆమె మనోవాక్కాయ కర్మలూ, శ్రీరామునిలో ఐక్యం అయివున్నాయి గనుక - ఆ స్వామి తేజస్సు ఇక్కడ ఈమెలో ప్రతిఫలిస్తోంది. అక్కడ (అడవిలో - ఋష్యమూక పర్వతంపై) శ్రీ రాముడు కూడా, మహాసాధ్వి అయిన ఈమె ఎడబాటును ఓర్చుకుని ఎలా జీవించివున్నాడూ అంటే - ఈమె పాతివ్రత్యము, దివ్యత్వమూ, ఆయనలో నిండివున్నాయి గనుక ఒకరి దైవత్వం, మరొకరి పాతివ్రత్యం - ఇరువురిలో - కలిసిపోయివున్నాయి. వీరిద్దరూ - ఒకరి హృదయమూ, తేజస్సు - మరొకరిలో ప్రతిబింబించగా, జీవించివున్నారు!" అంటూ ఆలోచిస్తాడు - అద్భుతంగా వర్ణిస్తారు వాల్మీకి మహర్షి సుందరకాండలో శ్లోకాలలో! ఈ ఘట్టాన్ని!

ఇదే అర్ధనారీశ్వరతత్వం కూడాను.

అందుకే శంకర భగవత్పాదులవారు అర్ధనారీశ్వర స్తోత్రంలో నిరీశ్వరాయైచ నిరీశ్వరాయ "నమశ్శివాయైచ, నమశ్శివాయ అంటూ స్తోత్రం చేశారు. ఇక రుద్రములో -

యాతేరుద్ర శ్శివాతనూః విశ్వాహ భేషజీ

శివా రుద్రస్య భేషజీ తథానో మృడ జీవసే ॥

(అర్థము :- పరమేశ్వరా! నీవు పుట్టినావు సరే! నీకు ఔషధం ఎవరిస్తున్నారు ? రెండు రకాలయిన శరీరాలున్నాయి నీకు. అందులో ఒకటి ఘోరమైనది. మరొకటి మంగళకరమైనది! ఘోర స్వరూపము నీది. (జటా జూటము, సర్పములూ - విభూది దిగంబరములేక - గజచర్మవస్త్రము - విరూపాక్షం (త్రినేత్రంతో) తో అలరే ఘోరరూపం నీది) పరమ మంగళ స్వరూపంతో విలసిల్లుతున్న దేహం - జగదంబది! ఈ సకల చరాచర విశ్వానికంతటికీ ఆవిశ్వేశ్వరి ఔషధం ప్రాయంగా వున్నది! ఆమె కటాక్షం వుంటేచాలు! అకాల మృత్యువు అనే మాట ఆపరిసరాల్లో కూడా వినబడదు. నీకున్నూ ఆమెయే భేషజియై (వైద్యనియై) వైద్యం చేస్తున్నది కాబోలు! పరమ మంగళమైన ఆమెశరీరం - నిన్ను అంటి పెట్టుకుని వున్నందువలననే, నీవు జీవిస్తున్నావు!)

రుద్రంలోని శ్లోకం

**శ్లో ॥ యాతేరుద్ర శివాతనూ రఘోరా పాపకాశినీ**

**అఘోరేభ్యో ధఘోరేభ్యో, ఘోర ఘోరతరేభః ॥**

**అర్థం** :- ఈ మహాఘోరస్వరూపాన్ని (సర్పహారాలూ - జటలు, దిగంబరత్వం - విభూదిమై పూత ముక్కన్ను వగైరాలతో) ఈశ్వరుని - భర్తగా స్వయంగా తపస్సు చేసిమరీ వరించి,

పాతివ్రత్యాన్ని అనుష్ఠిస్తూ పార్వతీదేవి - తన భర్తను తన తండ్రి అయిన దక్షుడు దూషించాడనీ - తనను అవమనాపరచాడనీ బాధపడి - ఆ కారణంగా, శరీరత్యాగం చేసి (సతిగా) - మరలా ఆ ఈశ్వరునే భర్తగా పొందటానికి పర్వత రాజపుత్రికగా, పార్వతిగా జన్మించి, ఘోరతపస్సు ఆచరించి - అతనినే పెళ్లాడిన పార్వతి సర్వమంగళ స్వరూపిణి. ఆ సర్వమంగళను ఆరాధిస్తే - ఆమె అనుగ్రహమూ - పాతివ్రత్యమూ కూడా వాటంతట అవే స్థిరంగా వుంటాయి సుమా!

అందువలననే, శ్రీ జగద్గురువు ఆ జగన్మాత, జగత్పితల సమైక్యస్వరూపాన్ని - వారిపాదాల చెంత శిశువై కూర్చుండిపోయి కళ్లారా, మనసారా, తనివిదీరా దర్శించారు. పాదాలచెంత నున్న బిడ్డడిని - ముద్దుచేస్తూ, లాలిస్తూ, దీవిస్తూ, ఇంచుక వంగిన తల్లి వలెనే, జగన్మాత అర్ధనారీశ్వర రూపంలో - స్తనభారంతో ఇంచుక వంగిన నడుముతో - దర్శనమిచ్చింది ఆచార్యులవారికి, పతియైన పశుపతిని ఒక్కక్షణం - కలలో కూడా ఎడబాసివుండలేని ఆతల్లి - పతివ్రతా శిరోమణియైన జగదంబ - సగం శరీరం ఆక్రమించుకుని తృప్తిపడక - మిగతా శరీరములో కూడా ఆయనలో అంతర్గతంగా లీనమై, "శివ స్వరూపిణిగా - చంద్రరేఖ శిరో భూషణంగా, జటా జూట కిరీటంతో సాక్షాత్కరించింది.

మనమూ - దర్శించి తరిద్దాము. పదండి.

## 24 శ్లో ॥

## సృష్టిస్థితి లయకారిణియైన జగన్మాత స్వరూపవైభవము.

**24 శ్లో॥ జగత్సూతే ధాతా, హరి రవతి, రుద్రః క్షపయతే!**

**తిరస్కుర్వన్నేత త్స్వమపి వపురీశస్తి రయతి!**

**సదాపూర్వం స్సర్వం తదిద మనుగృహ్ణాతి చశివః**

**తవాజ్ఞా మాలంబ్య క్షణ చలితయోర్భ్రూలతి కయోః ॥**

**అర్థము :-** ఓ జగన్మాతా! భగవతీ! సృష్టికర్తయగు బ్రహ్మ, ఈ చరాచర విశ్వాన్నీ సృష్టిస్తున్నాడు. విష్ణువు ఈ జగత్తును రక్షిస్తుంటాడు. రుద్రుడు ఈ సర్వప్రపంచాన్నీ లయింపజేస్తాడు.

మహేశ్వరుడు ఈ (పై) ముగ్గురినీ తనలో లీనంచేసుకుంటాడు. (ఇతడు అమ్మవారి మంచెమునకు - 4వకోడు)

సదా శివుడు పై నలుగురినీ తనలో విలీనం చేసుకుంటున్నాడు.

మరలా వారిని నలుగురినీ అనగా, బ్రహ్మ, విష్ణు, రుద్ర మహేశ్వరులనే నాలుగు కోడులుగా వున్నవారిని - మంచె దుప్పటముగా వున్న సదాశివుడు - తిరోధానరూపంలో మరలా అనుగ్రహించి (వేరు వేరుగా తనలో నుండి బయలు వెడల జేసి) వారిచేత పునః సృష్టి, స్థితి, లయలనే కర్తవ్యాలను పరిపాలింపజేస్తున్నాడు. ఇదంతా ఆమంచెపై ఆ సీనురాలవై యున్న నీ కనుబొమల కదలిక వలననే జరిగిపోతున్నది కదా ?

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, అమ్మవారి "భ్రూ విభ్రమ మహిమను వర్ణిస్తూ, ఆ తల్లి సర్వసృష్టి స్థితి లయ తిరోధాన, అనుగ్రహాలనే పంచకృత్యములనూ తన ఒక్క కనుబొమ కదలిక ద్వారా ఆజ్ఞాపించి చేయిస్తున్నది అని అద్భుతంగా చెప్పారు. సాధారణంగా, ఒక చక్రవర్తి, ఒక మహారాజు, లేక పెద్ద అధికారంలో వున్న సమర్థుడైన వ్యక్తి లేక - స్త్రీ, తాను ఎక్కువగా మాట్లాడదు. మాట్లాడ కూడదు! కూడాను!

తన భృత్యులకు పనులు చెప్పిచేయించు కొనే సమయంలో, కొద్దిమాటలతో ఆ పనిని గురించి చెప్పి, ఆతర్వాత, తన ఆమోదాన్ని అంగీకారాన్నీ లేక అనంగీకారాన్నీ, ఇష్టతనూ, అయిష్టతనూ, మెచ్చుకోలునూ, ఆనందాన్నీ, కోపాన్నీ - ఇలా తనభావాలను మాటలలో వద వద వాగకుండా కేవలం ఒక్క కనుబొమల కదలికద్వారా, భావ ప్రకటన చేస్తారు. ఆయాభావాలను మాటలలో కంటే - ఎక్కువగానూ, స్పష్టంగానూ సూచిస్తాయి కనుబొమల కదలికలు, తద్వారా, ఎదుటి వారిలో భయాన్నీ భక్తినీ, రాబట్టుకుంటారు. అతిచనువుకు ఆస్కారం ఇవ్వరు. ఇది ఒకకళ! కొందరికే ఇది చేతనౌతుంది!

ఉన్నతోద్యోగాలలో వున్న కొందరు స్త్రీలను గమనించండి! వారు ఎంతో మితభాషిణులుగా వుంటారు! వారి చూపులు - కనుబొమల కదలికద్వారానే. క్రింది ఉద్యోగులను అదుపులో పెడ్తుంటారు. అలా చేయలేకపోతే క్రింది ఉద్యోగులు - వీరికివ్వవలసిన గౌరవం ఇవ్వరు సరికదా, అతి చనువు తీసుకొని, ఇబ్బందులకు గురిచేస్తారు. ఇక ఇంత పెద్ద విశ్వాన్ని నియంత్రణ చేయవలసిన జగన్మాత - భ్రూవిభ్రమ విన్యాసం ఒక లాస్యం! నవరసాలు, ఆ కనుబొమల కదలికలోనే పలికించగల మితభాషిణి, మృదుభాషిణి - శ్రీ మహారాజ్ఞి ఆతల్లి. ఇది రాజ లక్షణం. అవునా ?

## 25 శ్లో॥ అమ్మవారి పూజ చేస్తేచాలు త్రిమూర్తులనూ పూజించినట్లే

25 శ్లో॥ త్రయాణాం దేవానాం, త్రిగుణ జనితానాం, తవశివే!
భవే త్పూజా, పూజా తవచరణయో ర్యా విరచితా,
తథాహిత్వత్పాదో ద్వహన మణి పీఠస్య నికటే,
స్థితా హ్యేతే శశ్వ న్ముకుళిత కరోత్తం సమకుటాః ॥

**అర్థము :-** ఓ శివునిరాణీ! శివే! భవానీ! నీ చరణములకు గావించు పూజయే, నీ త్రిగుణముల నుండి జనించిన త్రిమూర్తులకు చేయుపూజ. వేరైనది కానేకాదు. నీ పాదములు పెట్టివున్న నవరత్న ఖచిత పీఠమునకు (నీ పాద పీఠమునకు) దగ్గరగా, నీ బంగారు రత్నమణి మయసింహాసనము వద్దచేరి, తమ శిరములపై నున్న రత్నమయ కిరీటములపై తమ చేతులు జోడించి, నీ పాద కమలములకు మ్రొక్కుతూ, ఆత్రిమూర్తులు (బ్రహ్మ, విష్ణు, రుద్రులు) - సదా నీ ఆజ్ఞాను వర్తులై సృష్టి, స్థితి, లయలు అనే తమ విధులు నిర్వరిస్తున్నారు. అట్టి నీ పాద పీఠమునకు భక్తితో మ్రొక్కే భక్తులు - ఆ త్రిమూర్తులకూ మ్రొక్కిన వారే అవుతున్నారు. ఇక వేరుగా వారి పూజ చేయనవసరంలేదు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, అమ్మవారి పాదకమల అర్చన ఒక్క టీ చాలుననీ, అదే సకలదేవతా రాధన అనే, గొప్ప సత్యాన్ని చాటిచెబుతున్నారు.

సృష్టి, స్థితిలయములు అనే గొప్ప విధులు నిర్వర్తించటానికి గానూ, తన సత్వగుణంనుండి బ్రహ్మనూ, తన రజోగుణం నుండి విష్ణువునూ, తన తమోగుణం నుండి రుద్రునీ అమ్మవారు సృష్టించింది. వారు ముగ్గురూ వారి విధులు నిర్వరిస్తున్నారు అమ్మవారి ఆజ్ఞతో - భ్రుకుటి కదలికతో! ఆ ముగ్గురూ జగన్మాత శ్రీ చరణార్చన వల్లనే ఆశక్తి పొందుతున్నారు. మరి ఆ తల్లి పాదపూజ నేరుగా చేయగలిగినవారూ, చేసే భక్తులూ, వేరు వేరుగా త్రిమూర్తులకు పూజలుగానీ, మరి ఏ ఇతరదేవతల పూజలుగానీ చేయనవసరంలేదు. ఒక్క జగన్మాతను సర్వశక్తి సమన్వితగా, సర్వశక్తి స్వరూపిణిగా భావించి, పూజిస్తే చాలనీ, ఆతల్లి అపార కరుణతో - సర్వదేవతా పూజా ఫలాన్ని పొందవచ్చుననీ, సాధికారికంగా చెబుతున్నారు పరమ గురువు ఆదిశంకరాచార్య. మరి ఆలస్యం ఎందుకు ?

ఆ జగన్మాత శ్రీ చరణాలు కొలిచి తరిద్దాం,
ఆ తల్లినామ పారాయణచేసి తరిద్దాము - రండి - వెళదాం ముందుకు.

# 26 శ్లో ॥ అమ్మవారి సంహార విహారము జగన్మాత సామీప్య - సాయుజ్యమహిమ.

26 శ్లో॥ విరిఞ్చిః పఞ్చత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశంకీనాశో భజతి, ధనదోయాతి నిధనమ్
వితంద్రీ, మహేంద్రీ వితతిరపి సమ్మీలిత దృశా
మహాసంహారే స్మిన్ విహరతి, సతి! త్వత్పతిరసౌ ॥

**అర్థము** :- తల్లీ! జగన్మాతా! భవానీ! మహాప్రళయ కాలమునందు, బ్రహ్మ పంచత్వమునొందు చున్నాడు. హరివిశ్రాంతి గోరి, యోగ నిద్రలో లీనమౌతున్నాడు (చైతన్య రాహిత్యస్థితిలోనికి వెళ్తున్నాడు) - మృత్యువుకు అధి దేవతయైన యముడు కూడా నాశమునొందుచున్నాడు. ధనాధి పతి అయిన కుబేరుడు నిధనము (నిర్యాణము -) పొందుచున్నాడు. చతుర్దశ (14మంది) ఇంద్రులూ కనుమూయుచున్నారు (మరణించుచున్నారు.)

కానీ ఓ సతీమతల్లీ! సాధ్వీ లలామా! అంతటి మహాప్రళయమంుు కూడా నీ పతిఅయిన సదాశివుడు మాత్రం, ఈ సహస్ర దళములయందు కన్పట్టుచు, స్వేచ్ఛగా, చిరంజీవియై విహరించుచున్నాడు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, అమ్మవారి కరుణా కటాక్ష మహిమనూ, అమ్మవారిలో తానులీనమై పోయి, అంతటి మహాప్రళయంలోనూ, చిరంజీవత్వము సాధించి, అమ్మవారిస్థానమైన సహస్రదళ పద్మము (సహస్రారము)లో స్వేచ్ఛగా విహరిస్తున్న "సదాశివ తత్త్వాన్ని" అద్భుతంగా వర్ణించారు.

మహాప్రళయకాలంలో బ్రహ్మ, విష్ణు, యమ, కుబేర, మను, ఇంద్రాదులైన జగత్పరిపాలకులంతా అచేతనులై ఉనికి వ్యక్తిత్వం, ఆకారమూ కోల్పోతున్నారు. చరా చర ప్రపంచమంతా ప్రళయంలో లీనమై పోతున్నది. అనగా, యోగధ్యాన పద్ధతిలో ఆలోచిస్తే - అమ్మవారి భక్తుడు - సాధకుడు. సాధనా తీవ్రతలో - సహస్రార కమలానికి (శిరస్సునందలి బ్రహ్మరంధ్రము) చేరుకుంటాడు ఆ చేరుకొనే చివరిసాధన మహాప్రళయం వంటిది. కారణం సాధకుడు ఎన్నో పరీక్షలూ - ప్రలోభాల తుఫానులూ ఎదుర్కొంటాడు!

బ్రహ్మ అన్నగా సృష్టి - కోర్కెలు విష్ణువు అనగా అవి (కోర్కెలు) తీర్చుకొనే మార్గాలూ, సాధనా, సాధకాలూ, ఆశలూ!

ఇక యముడు అంటే అడుగడుగునా, సాధకునికి ఎదురయ్యే ఆధ్యాత్మిక సాధనాపరమైన మృత్యుసమానమైన ఎదురుదెబ్బలా, పరీక్షలూ! శారీరక, మానసిక, ఆర్థిక, సామాజిక ఎదురుదెబ్బలూ, పరీక్షలూ అన్నమాట!

ఇక మనువులూ ఇంద్రులూ అనగా ఇంద్రియములు. జీవన విధానానికి కావలసిన కట్టుబాట్లు విధులూ - ఇంద్రియలముల తాలూకు వత్తిడులు - నిగ్రహములూ - మొదలైనవి. "కుబేరుడు" అనగాధన సంబంధమైన - భోగలాలసత సంబంధమైన ప్రలోభము. ఇవన్నీ సాధకుడు - తన తీవ్రతరమైన సాధనతో, వైరాగ్య భావంతో జయించాలి. అలా జయించినప్పుడే పై చెప్పిన వారంతా నిర్వీర్యులూ, నిధనులూ అవుతారు.

ఈ ప్రయత్నంలోని త్రీవ్రతే మహాప్రళయం.

చివరగా సాధకుడు ధ్యానసిద్ధిని సాధించగలుగుతాడు. అప్పుడు అతడు - సహస్రార చక్రంలో, సహస్రదళ పద్మంలో - అమ్మవారినీ - అమ్మవారి వద్ద - స్వేచ్ఛగా తిరుగాడుతున్న "సదాశివ తత్వం", అనగా, మంగళకరమైన ఆధ్యాత్మిక గమ్యం - ధ్యేయం - దర్శిస్తాడు. ఆ సదాశివ తత్వం అనుభూతి చెంది - స్వాత్మానంద సుఖాన్ని పొందుతాడు.

ఇంత అర్థం ఒక్కశ్లోకంలోబంగారు ఆభరణంలో విలువైనవజ్రాన్ని పొదిగినట్లు అమర్చారు ఆది శంకరాచార్యులవారు. మహాత్ములైన వారికి, మరింతలోతుగా ఆలోచించిగలిగిన వారికీ, ఇంకా ఇంకా వేదాంత - యోగధ్యాన రహస్యాలెన్నో ఈ శ్లోకంలోనే విశదం అయ్యేట్లుని గూఢ అర్థాలు కూడా వుండే వుంటాయి! ఎప్పటికప్పుడు క్రొత్తగా! మనబోటి సామాన్యులం - మన కొద్దిపాటి ఆలోచనతో ఇంత మటుకూ అర్థం చేసుకోగలిగినా చాలు - ప్రలోభాలకూ - కోర్కెలకు కాస్తంత దూరంగా జరుగుతాము. అవునా ?

## 27 శ్లో॥ అమ్మవారి పాదాలకు సర్వసమర్పణ. శరణాగతి - ఆత్మార్పణ

**27 శ్లో॥ జపో జల్పః శ్శిల్పం, సకలమపి ముద్రావిరచనా,**
**గతిః ప్రాదక్ష్యిణ్య క్రమణ మశనాద్యా హుతి విధిః**
**ప్రణామ స్సంవేశ స్సుఖ మఖిల మాత్మార్పణదృశా**
**సపర్యా పర్యాయస్తవ భవతు యన్మే విలసితమ్ ॥.**

**అర్థము :-** ఓజగన్మాతా! భగవతీ! నీ పాదములచెంత ఆత్మార్పణ భావముతో (శరణాగతితో) నేను చేయు సల్లాపము (సంభాషణ - నీ మంత్రజపముగనూ, నా హస్త విన్యాసమంతయూ

(చేతులు రకరకాలుగా తిప్పుతూ మాట్లాడటం కొంతమందికి అలవాటు మనలో చాలామంది మనమాటలకు - చేతుల అభినయం జోడించనది మాట్లాడలేము. గమనించండి!) నీ ముద్రా రచనగనూ, (ధ్యానయోగంలో ఒక్కొక్క రకం ధ్యానపద్ధతికి ఒక్కొక్క రకం ముద్ర వుంటుంది.)

ఇక నా విచ్చలవిడి సంచారమంతయునూ, (ఎక్కడెక్కడ నేను తిరిగినాసరే) అది అంతా, నీకు చేసే ప్రదక్షిణగనూ, నా భోజనాదులు (నేను తీసుకొనే ఏవిధమైన ఆహారమైనా సరే నీకు చేసే యజ్ఞంలో సమర్పించే ఆహుతులుగనూ, నేను పరుండుట (శయనించుట) నీకు నేను చేసే సాష్టాంగ దండ ప్రణామముగనూ, ఈ విధంగా ప్రతిక్షణమూ - నిత్యజీవితములో నేను సుఖంగానూ, సహజంగానూ చేసే ప్రతిపనీ, చేష్ఠా - అన్నీ నీకు నేను చేసే సమగ్రమైన - సంపూర్ణమైన - సంతోషదాయకమైన పూజగా అగుగాక! (అట్లు నీవు స్వీకరించి నన్ను కరుణించెదవు గాక!)

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, అమ్మవారి పూజ వేరుగా గాక - మన నిత్యజీవిత కదలికలలో ప్రతి కదలికా, ఆతల్లి పూజలో భాగంగా భావించి చేస్తే - అదే ఆత్మార్పణ అని శలవిస్తున్నారు. ఇదెంతో సులభ తరుణోపాయం కూడాను. శ్రీ శంకర భగవత్పాదుల వారు, తమ "శివ మానస పూజ స్తోత్రంలో"

**శ్లో ॥ ఆత్మాత్వం, గిరిజామతే స్సహచరప్రాణాః శరీరంగృహం,**
**పూజాతే విషయోప భోగరచనా, నిద్రా సమాధి స్థితిః**
**సంచారః పదయో ప్రదక్షిణ విధౌ, స్తోత్రాణి సర్వాగిరౌ**
**యద్యత్మర్మ కరోమి దత్త దఖిలం, శంభో తవారాధనమ్!**

అంటూ ఆత్మార్పణచేసుకున్నారు." నా ఆత్మవు నీవు - నామతి (బుద్ధి) గిరిజ - నాసహచరులంతా, నా పంచప్రాణాలు, నేను చేసే ప్రతిపనీ నీ పూజేసుమా! నా నిద్ర -నీ ధ్యానయోగము సమాధిస్థితి. నేనెక్కడెక్కడ తిరిగినా, అది నీ చుట్టూరా నేనుచేసే ప్రదక్షిణ విధేసుమా! నేను మాట్లాడే ప్రతిమాటా, (సర్వాగిరే) నీస్తోత్రమే మహేశా!

"యద్యత్కర్మ కరోమి దత్త దఖిలం - శంభో తవారాధనమ్" నేను ఏయే పనులు చేసినా, అవన్నీ నీకే అంకితం! అవన్నీ నా ఆరాధనలుగా భావించి- నన్ను తరింపజేయుము పరమశివా!" అని ప్రార్థించారు.

సరిగ్గా అలాగే - ఈ సౌందర్యలహరిలోని 27వ శ్లోకంలోనూ, "నా ప్రతిమాటా, నీ మంత్రజపంగానూ, నా చేతుల కదలిక నీ ధ్యానముద్రలుగానూ, నానడక అంతా, నీకు నేను

చేసే ప్రదక్షిణగానూ, నేను తినే ఏఆహారమైనా, అది నీయజ్ఞంలో నేనుసమర్పించే ఆహుతులుగానూ, నా విశ్రాంతిగా పరుండటం అనే చర్య - నీకు సాష్టాంగ దండ ప్రణామముగానూ - ప్రతిచేష్టా - నీసేవగా భావించినన్ను కృతార్థుడిని చేయితల్లీ!" అని వినమ్రంగా ప్రార్థించారు.

"భేష్! ఇదేదో చాలాబావుంది! సులభ తరుణోపాయం చూపారు జగద్గురువులు, ఎంచక్కా రోజువారీ పూజ, స్తోత్రప్రారాయణమూ ఎగవేద్దాం! టి.వి చూస్తూ, పేకాడుతూ, బార్‌లకు వెళ్తూ, పోచుకోలు కబుర్లుచెబుతూ, కొంపలంటుకు పోయే చాడీలమాటలు చెబుతూ, వేళగాని వేళలో - అతి తిండి, అతి నిద్రలతో రోజులు గడిపివేస్తూ, ఇదంతా - అమ్మవారిపూజ కిందే లెక్కలోకి వస్తుంది గనుక - మనకే ముక్తి ఫస్ట్! 'ఆది శంకరాచార్యులంతటి వారే శలవివ్వగా, మనకేమిటి భయం ?" అని పెడర్థాలు తీసే మహానుభావులు - మహాతల్లులు - కాస్త ఆగి కాస్త ఆలోచించి మరీ ముందుకు అడుగువేయాలి.

శారీరక దౌర్బల్యం ఏర్పడిన వృద్ధులూ, యాక్సిడెంటో - మరేదో వ్యాధివలననో, కాళ్లూ చేతులూ - అవయవాలు - పనిచేయనివారూ, ఇంట్లో పూజా పునస్కారాలకు ఏమాత్రం అనుకూలించని దురదృష్టకర పరిస్థితులు వున్నవారూ, అశక్తులూ - ఇలాటి వారికోసం - ఆది శంకరాచార్యులవారు- "మీరు పూజసాంగోపాంగంగా చేయలేదని బాధపడకండి, భయపడకండి!

అన్నిటికీ మూలమైనది మనస్సు - హృదయం.

ఆహృదయం - ఎవరికీపైకి కనిపించదు - వినిపించదు.

మన్మథుడు - శరీరం లేనివాడు అయినా మనస్సుతో శ్రీ విద్యను సాధించి జగన్మాత అనుగ్రహం పొంది-" మన్మథ విద్యగా - కామ విద్యగా శ్రీ విద్యకు తనదైన ఒకశైలి - వరవడి తెచ్చిన మహోన్నత సాధకుడయ్యాడు.

అలాగే - మనలో శారీరక - మానసిక, గృహసంబంధమైన, సామాజికమైన దౌర్బల్యాల వలన - సాంగోపాంగ పూజ చేయటంకు దరనివారు. మనసుతో - శరణాగతి భావనతో - "తల్లీ! నా ప్రతి కర్మా, వాప్రతిచేష్టా, ప్రతివాక్కూ - ప్రతి అడుగూ - ప్రతి విశ్రాంతి - నీ పూజగాభావించి తరింపజేయి - నీవుతప్ప - అన్యమెరుగను!" అనేభావనతో మానసికపూజ చేసుకోవచ్చునని శలవిచ్చారు. మానసిక పూజలోనే షోడశోప చారములు చేసుకోవటానికి "మానసిక స్తోత్రాలు" శివునికీ - గణపతికీ - అమ్మవారికీ - ఇలా రచించారు.

ఇవన్నీ అనన్య శరణా గతికి మార్గాలు అని చెప్పారు అంతేగానీ - బార్‌లకు వెళ్లటం ప్రదక్షిణ అనీ - పేకాట - చిన్ముద్ర అనీ - వ్యభిచారం - నృత్యగాన వినోదమనీ అబద్ధాలు - అతివాగుడూ - మంత్రజపమనీ, - భావించమని అమ్మవారిని అనుకోమంటే - ఆవిడా మనం ఊహించుకొనేంతటి వెర్రి తల్లికాదు! ఈ సకలవిశ్వం ఇలాటి బద్ధకపు - బూటకపు భక్తుల చేష్టలూ - మాటలూ - ఆమెకూ చిరపరిచితాలే! వారికి తగిని ఫలితం - శిక్ష - ఆమెఇస్తుంది ఆలస్యం కాకుండా అంతటి కుట్రకు యుక్తులతోనే! అంచేత - ఆచార్యులవాణికి పెడర్థాలు తీయక - జగద్గురువుల బోధ - సవ్యంగా - సక్రమంగా అర్థం చేసుకొని ఆ తల్లిని శరణాగతి చెందుదాము. ఏ విపత్కర పరిస్థితులలోనో - వీలుపడని సమయంలోనో - "నా సర్వపనులూ నీవిగా భావించుతల్లీ! మరలా వీలుపడగానే యథావిధిగా నీ పూజపారాయణం - బద్ధకించకుండా చేస్తాను!" అనుకోవటమే మనబోటివారి సాధనా మార్గం. మనం తీసుకొనే పథ్యం ఆహారం - (పాలు - పండ్లు - రొట్టె - చివరకు సెలైన్) అదే అమ్మవారి యజ్ఞంలో ఆహుతులు! నైవేద్యం సద్వాక్కు - సత్యంగం - సదాలోచన - అదే ఆతల్లికి మంత్రజపం! కదలలేని స్థితిలో పడుకొని వుండాల్సివస్తే - అదే సమాధిస్థితి, ఈ బలహీనతల వల్ల - అమ్మవారికి పూజ చేయలేకపోతున్నామనే పశ్చాత్తాపంతో ఉబికివచ్చే కన్నీరే సురగంగ - ఆమెపాదప్రక్షాళన జలం - శరణాగతితో చేసే ఈ అంతరపూజ - సమయాచారులూ - యోగులూచేసే అంతర్యాగంతో సమానం సుమా!

ఆతల్లి తప్పక కరుణించి - సాక్షాత్కరించి - మన కన్నీళ్లు, సమస్యలు తొలగిస్తుంది. అదీ శరణాగతి, ఆమాటే చెప్పారు ఆచార్యులవారు ఈ శ్లోకంలో! 9వ అధ్యాయం సమాప్తం.

ఇరవై (20)వ శ్లోకంనుండి 27వ (ఇరవై ఏడవ) శ్లోకం వరకూ గల ఎనిమిది శ్లోకాలలో - ఈ అధ్యాయంలో - శ్రీ శంకర భగవత్పాదుల వారు - అమ్మవారి కరుణగల ఉపాసకులు గారుడ విద్యతో - సర్ప విషాన్ని హరించగల శక్తి - జ్వరాలను తగ్గించగలశక్తీ - పొందగలరనీ, సాధకులు కోర్కెలకూ) సిద్ధుల ప్రలోభాలకూ, సంసార మాయలకూ అతీతంగా సాధన - భక్తి చేస్తే - ఆతల్లి "సాదాఖ్య" కళ అనే పరిపూర్ణ స్వరూప సాక్షాత్కారం పొందుతారనీ, భవానీ దాసుడైన భక్తుని కోర్కెలు - ఆ భక్తులకు శ్రేయస్కరమైన సాయుజ్యపదవిని - వారు కోరే కోరకముందే - తన నామజప మహిమ వలన ఆతల్లి ప్రసాదిస్తుందనీ, అమ్మవారి అర్ధనారీశ్వర తత్వమూ, మహాత్మ్యమూ, బ్రహ్మ విష్ణు రుద్రులచేత జగజ్జగని భ్రూ విభ్రమమ వైభవమే - ఆజ్ఞాపాలన చేయిస్తుందనీ, ఆతల్లి పాదపీఠ పూజ - పాదకమలముల పూజే సర్వదేవతారాధన అనీ - త్రిమూర్తి పూజ ఇక వేరుగా చేయనవసరంలేదనీ, సదాశివ తత్వరహస్యాన్నీ - శరణాగతితో చేసే ప్రతి పనీ - ఆతల్లి సేవలో భాగమేననీ 8 శ్లోకాలలో అద్భుతంగా వర్ణించారు.

ఈ అధ్యాయం పారాయణ చేసిన భక్తులకు అమ్మవారు, సర్ప విషశాంతి, కలిగించి ఇతరుల వలన చేయబడిన విషప్రయోగములు, ఫలించకుండుట, సకలైశ్వర్యప్రాప్తి, ఇంద్రియ నిగ్రహము (సకల జనవశ్యము అనగా - మనలోని ఇంద్రియములపై కోర్కెలపై మనం జయంసాధించటం), సర్వాపదల నివారణము, ఋణవిమోచనము, పిశాచ గ్రహ బాధలు, అపస్మారములు తొలగుట, ఉత్కృష్ట పదవీ లాభము (అనగా అమ్మవారి పూజావిధానంలో మెట్టు మెట్టుగా జ్ఞాన సోపానములు అధిరోహించుట) - శత్రుజయము (మనలోని అంతశ్శత్రువుల ఆరింటినీ జయించగలిగేశక్తి - ఆత్మవిమర్శ శక్తి, ఆత్మశక్తి రావటం - బహిశ్శత్రువుల విషయంలో - ఎలా ఎదుర్కోవాలో - ఆ జగన్మాతే - దారి చూపటం వంటివి), మంత్రసిద్ధి, దేవీదర్శనము, ఆత్మజ్ఞానము కలగటము వంటి గొప్పవరాలు ప్రసాదిస్తుంది.

అయితే - "ఈ రోజు నీ పారాయణ చేసాను. తెల్లవారే సరికి నాకు నువ్వు నిధులిస్తావా ? నిక్షేపాలు చూపిస్తావా ? ఎదురింటి వారిని - పక్కింటి వారినీ - పై ఇంటివారినీ - శత్రువులుగా భావించి - అందరినీ బాధించగలిగే శక్తి ఇస్తావా ? నీవే సాక్షాత్కారిస్తావా ? లేదా ? " అని పీడించే రకం - స్వార్థపూరిత పూజగా గాక - ఈ అద్భుతమైన మానవజన్మ ప్రసాదించి - అందులో ఆతల్లిని పూజించి తరించే అర్హత, అదృష్టం, అవకాశం - కాస్తంత ఆత్మజ్ఞానం ప్రసాదించిన ఆతల్లికి - ఆ జగన్మాతకు మనం ఇవ్వగలిగింది ఏమీలేదనీ - ఇస్తున్న ప్రతిదీ ఆమె పాదరజమే అనీ - గ్రహించే జ్ఞానంఒక్కటీ సాధించగలిగితే పారాయణానికి ప్రయోజనం సిద్ధించినట్లే, అవునా! ఇక పదవ అధ్యాయంలోనికి జగద్గురువులవెంట నడుద్దాం పదండి.

## 10వ అధ్యాయము.

# 28 శ్లో॥ జగన్మాత తాటంకమహిమ.

**28 శ్లో॥ సుధామప్యాస్వాద్య ప్రతిభయ జరామృత్యు హరిణీం!**
**విపద్యన్తే విశ్వే విధి శతమఖ మఖాద్యా దివిషదః**
**కరాళం యత్క్ష్వేళం కబళిత వతః కాలకలనా**
**న శమ్భో స్తన్మూలం, తవజనని తాటఙ్క మహిమా ॥**

**అర్థము :-** తల్లీ! జగన్మాతా! బ్రహ్మ, ఇంద్రుడు మున్నగు దేవతలందరూ, జరామృత్యువులను జయించే అమృతం త్రాగి నవారై వుండి కూడా, ప్రళయకాళం వచ్చినపుడు మరణిస్తున్నారు. (మరణాన్ని జయించలేకుండా వున్నారు) లోకములను దహించే కాలకూట విషమనే మహా విషమును మ్రింగి - నీల కంఠునిగా మారిన నీ పతి అయిన శంభుడు మాత్రం ప్రళయకాలమునందు కూడా మరణించక చిరంజీవియై వున్నాడు.

అందుకు ముఖ్య కారణం - నీ చెవులయందు భాసిల్లుచున్న రత్న తాటంకముల ప్రభావమే కదా తల్లీ! ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - కాలకూట విషాన్ని త్రాగిన ఈశ్వరుడు మృత్యువును జయించి నీలకంఠునిగా చిరంజీవిగా నిలిచిపోవటానికి కారణం అమ్మవారి తాటంక మహిమేనని - అమ్మవారి తాటంకముల మాహాత్మ్యాన్ని అద్భుతంగా వర్ణించారు.

జగన్మాత తాటంకములు (పెద్దపెద్ద చెవి కమ్మలు చక్రాల్లావుండే వాటిని తాటంకాలు అంటారు) పరమశివుణ్ణి మృత్యువాత పడకుండా కాపాడమేమిటి! ఒకదానికొకటి పొంతన లేకుండా వూందేమిటి ? అని సందేహం వస్తుంది కొందరికి.

కానీ - మన ఒక విషయం తెలుసుకోవాలి ఇక్కడ పరమ గురువులు ఒకని గూఢమైన విషయాన్ని చెప్పదలచినపుడు - ఆ శిష్యులా విషయాన్ని ఒక "పజిల్"లా పరిష్కరించి తెలుసుకోవాలే గానీ, ఆపళంగా అరటిపండు ఒలిచి చేతిలోగాక, నోట్లోపెట్టినట్లు అతి సులభంగా తెలియజెప్పరు. అలా చెబితే, ఆ శిష్యులలో - పాఠకులలో, శ్రోతలలో ఆ విషయం పట్ల ఆసక్తి, జిజ్ఞాస, తెలుసుకోవాలన్న కృషి, దీక్ష, పట్టుదలవుండవు. ఆధ్యాత్మిక సాధనలో వున్న ఆసాధకులు "ఆఁ! ఏముందిక్కడ ? అంతా తెలిసిన విషయమే కదా ?" అనే చులకన భావం వస్తుంది. "అంతా మాకు తెలుసు" అనే అహంకారమూ వస్తుంది. ఈ రెండు భావాలలో ఏది వచ్చినా ఇకా ఆ శిష్యులూ - లేదా సాధకులు, ఆధ్యాత్మ సాధనలో ముందుకూ పోలేరు.

అందుకనే కొండంత అర్థాన్ని - "ఆలోచించి తెలుసుకోండి! "అనే పద్ధతిలో ఒక పజిల్‌లానూ ఒక గణిత శాస్త్రంలోని "లెక్క"లానూ చెబుతారు పరమ గురువులు. ఆ పనే చేశారు శ్రీ ఆది శంకరాచార్యులవారు ఈ శ్లోకంలో అమ్మవారి తాటంక మహిమ గురించి చెబుతూ స్త్రీల తాటంకములు (చెవి కమ్మలు) ముక్కుపుడక, మెడలో నల్లపూసలు - మంగళసూత్రం లాటివి, కాళ్ల వ్రేళ్లకు మెట్టెలు మొదలైనవి మంగళకరమైన ఆభరణాలనీ, అవి ఆస్త్రీల ఐదవ తనాన్ని, భర్త శ్రేయస్సునూ కాపాడుతాయనీ చెబుతారు పెద్దలు. భర్తకు ఏదైనా ఆపద వస్తుంటే, భార్య చెవి కమ్మ (తాంటకం) హఠాత్తుగానూ, అప్రయత్నంగానూ చెవి నుండి జారి పడటంలాటి అపశకునం జరుగుతుందంటారు పెద్దలు. ఒక కీడును సూచిస్తూ తాటంకం దానంతటదే జారి పడ్తుందని భావము. (అవన్నీ మూఢ నమ్మకాలనీ, పిచ్చి సెంటిమెంట్సు అనీ, కొట్టిపారేసి, అవేవీ శరీరం మీద లేకుండా జాగ్రత్త పడ్తున్నారు. కొందరు పెళ్లైన యువతులు ఈనాడు ఇది వేరే కథ. మనం ప్రస్తుతం శ్లోక కథలోనికి వద్దాము - రండి!) పార్వతీ పరమేశ్వరులు కైలాసంలో కొలువై వున్నారు. అంతక్రితం రోజు - లక్ష్మి, సరస్వతులిద్దరూ కాలక్షేపానికి కైలాసానికి వచ్చి

వెళ్లారు. ఆ సంఘటన పార్వతీదేవి మదిలో మెదులుతోంది ఈరోజు ఇప్పుడు! నిన్న - లక్ష్మీ సరస్వతి వచ్చేసరికి ఎప్పటిలాగే పరమశివుడు - సమాధిస్థితిలో వున్నాడు. పార్వతి - వదినగార్లైన లక్ష్మీదేవికీ - (శ్రీమన్నారాయణుడు పార్వాతీదేవికి అన్న వరుస గనుక) - సరస్వతికీ మర్యాద చేసింది. అతిథి మర్యాదలు చేసింది. ముగ్గురూ కబుర్లలో పడ్డారు. వాళ్లిద్దరూ శరీరం నిండుగా రక రకాల విలువైన ఆభరణాలు ధరించి వున్నారు. "ఇవిక్రొత్తగా విశ్వకర్మచేత చేయించారు నాభర్త! ఇవుగో ఈ ఆభరణాలలోని మణులు విలువలేనివి" అంటూ వంతులవారిగా తమ ఆభరణాలు ప్రదర్శించుకున్నారు గొప్పగా. పార్వతీదేవి చూచి సంతోషించింది. "బాగున్నాయని' ' మెచ్చుకున్నది. ఆమె ఈశ్వరునిలోగానీ, ఈశ్వరుని శరీరంపై గానీ ఏ భోగమూ, ఏ ఆభరణాలూ, ఐశ్వర్యాలూ చూచి, ఆయనను వివాహమాడలేదు. కేవలం పరమశివునిలోని పరమ వైరాగ్య భావమనే శివతత్వాన్ని, యోగాన్నీ గ్రహించి ఆయననే భర్తగా కోరుకున్నది ఆత్మార్పణ చేసుకున్నది. అర్ధనారీశ్వరిగా మారింది. ఈ కైలాసమనే మంచుకొండపై, వృషభ వాహనం (నంది) తోడుగా, రుద్రాక్షధారులైన ప్రమధ గణాలు, యోగినీ బృందాలూ, పరిచారకులూ, పరిచారికలూ కాగా, ఆకాశం పందిరీ, కొండచరియల భూమి - అరుగులు - శిలా సింహాసనాలు కాగా, భర్త అయిన పరమశివుడు - ఏ పురుషుడూ ఏ ఇల్లాలికీ ఇవ్వని - ఇవ్వలేని అర్ధనారీశ్వర గౌరవం, ప్రేమ - అన్యోన్యదాంపత్యం అనే పూజనీయతే తన మహదైశ్వర్యంగా - సంతృప్తిగా జీవిస్తోంది.

అయితే ఆమెను ప్రలోభ పెడదామనీ, కాస్తంత ఏడిపిద్దామనీ - తమ ఐశ్వర్య ప్రదర్శన, ఆభరణ ప్రదర్శనలతో ఆమెలో కాస్తంత అసంతృప్తిరే కెత్తించి, తద్వారా ఆమె కాపురంలో చిన్న అలజడి సృష్టించి, వినోదిద్దామని వచ్చారు లక్ష్మీ, సరస్వతిలిద్దరూ కూడ బలుక్కుని. అత్తా కోడళ్లుగా ఒకరితో ఒకరికి పడకపోయినా, మూడవ వారిని ఏడిపించటానికి ఇద్దరూ ఒకటయ్యారు!

"మా ఆభరణాలు చూచి మెచ్చుకోవటమేగానీ, నీకు ఒక్క ఆభరణమైనా కొత్తది చేయించుకున్నావా ? మాకు చూపావా ? ఎప్పుడైనా ? "అంది లక్ష్మిదేవి హేళనగా పార్వతి నవ్వి వూరుకున్నది.

"కనీసం నీ చెవులకు కొత్త తాటంకాలు అయినా చేయించుకున్నావుకావు గౌరమ్మ పెద్దమ్మా! మీ పెళ్లినాడు మీ తలితండ్రులైన హిమవంతుడు, మైనాదేవి, పెట్టిన రత్న తాటంకాలు తప్ప - అవీ మాసివన్నె తరగి వెల వెలాబోతున్నాయి - మరొక కొత్తజత తాటంకాలు చేయించాలనన్నా - పెదనాన్నగారికి - అదే - పరమ శివుడుగారికి తోచకపోయే! ఆయనగారెప్పుడూ సమాధిస్థితిలో వుంటారాయె! నీ వన్నా - అడిగి - చెప్పి చేయించుకోవాలి గానీ - పురుషులు గ్రహించి

చేయిస్తారనుకోవటం - కలలోమాట! నేనే ఆభరణం కావాలన్నా, మీ అల్లుణ్ణి సాధించి మరీ చేయించుకుంటాను. అత్తయ్య - ఈ లక్ష్మీదేవి అయితే సరే సరి, అలిగి - వైకుంఠం వదిలివెళ్తానని బెదిరించి మరీ చేయించుకుంటుంది." అంది సరస్వతి.

పార్వతికీ సంభాషణ బాధ కలిగించింది. తాను కోరితే - తన భర్త అయిన పరమ శివుడు కోటి తాటంకాలు చేయిస్తాడు. నశ్వరమైన అలంకారాలూ, ఆభరణాలకంటే - శాశ్వతమైన యోగమే తాను కోరుకున్నది. ఆమాటే అన్నది రోషంగా పార్వతి.

"అబ్బో! భర్తగారి మీద ఈగ వాలనివ్వదు మా పార్వతి! ఆడబడుచు! వదినా! పార్వతీ! మన భర్తలు - వాళ్ల యోగంలో వాళ్లున్నారని మనమేమీ కోరకపోతే - వాళ్లు సరసం తెలియని జడుల్లా మారిపోతారు.

మరోనాలుగురోజుల్లో మేమిద్దరం మరలా కైలాసానికి వస్తాము. ఆ సరికి నీ చెవులకు మాకు ఎవరికీ లేని అత్యద్భుతమైన తాటంకాలు - ఆభరణాలుగా వుండాలి సుమా! అప్పుడు గానీ - పరమశివుడు గారికి నీ మీదగల ప్రేమ నిజమైందో కాదో, తెలుస్తుంది మాకు!" అన్నది లక్ష్మీదేవి. మరికాస్సేపటికి వాళ్లిద్దరూ వెళ్లిపోయారు వారు కోరిన పని సాధించారు. పార్వతి హృదయంలో శల్యంలా వారి మాటలు నాటుకున్నాయి. తన భర్త ప్రేమను శంకించటం కాదు. తాను ప్రాపంచికమైన కోరికను తన భర్తతో చెప్పటమా . లక్ష్మీ సరస్వతుల ముందు తన ఓటమీ - తన భర్తకు తనపై గల ప్రేమను సందేహా స్పదం చేయటమా . ఇదే ఆలోచన. ఈ రోజూ ఆ ఆలోచనే ఆమె హృదయంలో ముల్లుఅ కదలాడుతోంది.

హఠాత్తుగా పరమ శివుడు కళ్లు తెరిచాడు. ఆయన సమాధి భగ్నమైంది కారణం - తన అర్ధ శరీరం అంతరంగంలోని కలవరం ఆయన సగం శరీరాన్ని స్పందింప జేసింది. ఆయన యోగం చెదిరింది. "ఏమిటి పార్వతీ! ఏదో వేదన చెందుతున్నావు ? నాతో చెప్పరాదా ? "అన్నాడు పరమశివుడు అనునయంగా, పార్వతి వైపుచూస్తూ, పార్వతి నిన్న జరిగినదంతా చెప్పింది. ఈశ్వరుడు విన్నాడు. క్షణకాలం ఈశ్వరుని భ్రుకుటి ముడిపడింది. లక్ష్మీదేవి - రత్న గర్భ అయిన క్షీరసాగరుని కుమార్తె. ఏ రత్నం - వజ్రం - వైఢూర్యం నవరత్నాలలో ఏది చూపినా, చూచినా "ఆఁ! ఇదొక లెక్కా ? ఇలాటివి మాపుట్టింట రాసులుగా పడివున్నాయి!" అనేస్తుంది చులకనగా, ఐశ్వర్య అహంకారంతో! ఇక సరస్వతీదేవి వాక్సుధారాణి - తన పలుకులపై, కళలపై ఆమెకు ఎనలేని అహంకారం!

"ఆఁ! ఈ రత్నాలూ, మరక తమణులూ సర్వం ఒక్క నాగానానికీ, శిల్పానికీ, నాట్యానికీ, 64 కళల్లో ఏ ఒక్కదానికీ సాటిరావు. రత్నాలన్నీ కేవలం పైపై మెరుగు రాళ్లు! నా కళలు శాశ్వత

విలువగల - విలువ నివ్వగల వజ్రాల, రత్నాలగనులు!" అంటుంది. మరి పార్వతికి అపురూపమైన తాటంకాలు సమకూర్చాలి! ఆమె సగర్వంగా వారిద్దరికీ సమాధానం చెప్పగలగాలి! వారిద్దరికే కాదు - యావత్ సృష్టిలో - ఏ యుగంలోనూ ఏస్త్రీ ధరించలేని తాటంకాలు సమకూర్చాలి! ఆతాటంకాలు - పార్వతితో బాటు పూజనీయాలు కావాలి. వాటికంతటి ప్రత్యేకత రావాలి.. ఎలా ? పరమ శివుని హృదయంలో ఒకానొక భావవీచిక, ఒకానొక బ్రహ్మాండరచనా - విశ్వాకృతిగా చమత్కృతిగా తళుక్కున మెరిసింది.

"పార్వతీ! నీకు ఏ యుగంలోనూ, ఏ లోకంలోనూ, ఏ దేవదానవ మానవ కాంతలెవరూ ధరించని, ధరించబోని, ధరించి భరించలేని - ఏ సంపదతోనూ తులతూగలేని అద్భుత తాటంకాలు సమకూరుస్తాను. అవి పధ్నాలుగు భువనాలలోనూ, నీకూ - నీ భక్తులకూ పూజనీయమై, కొంగు బంగారమై నిలిచిపోతాయి! నీ వ్రతాలలో, నీపూజలలో నీ తాటంకాలు ఒక ప్రత్యేక పూజా ఆభరణాలుగా నిలిచిపోతాయి. పుణ్యస్త్రీల ఐదవతనపు ఆనవాళ్ళుగా నిలిచిపోతాయిసుమా!" అన్నాడు.

పార్వతి వినయంగా నమస్కరించింది. "మీ ఇచ్ఛస్వామీ!" అన్నది. అంతే ఆస్వామి ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులలో నుండి ఆమె తాటంకాల రూపకల్పన జరిగిపోతోంది! "నా వెంటరా" అన్నాడు పరమశివుడు. ఆమె కదిలింది. ఇద్దరూ కైలాస పర్వత సానువులలో కొంతదూరం నడిచారు. మంచుకొండలు కాబట్టి - అన్నిరకాల వృక్ష జాతులూ ఏపుగా పెరుగవు - ఒకటీ అరా ఆ శీతలతను తట్టుకుని కాస్తంత ఎత్తు పెరుగుతాయి అంతే - మిగతావృక్షాలన్నీ ఆరడుగుల లోపే ఎదుగుతాయి.

అలాటి ధృఢమైన పొట్టి వృక్షాలలో తాళవృక్షం ఒకటి ఆకొండలలో! తాటిచెట్టు, భూమి మీదైతే ముప్పై అడుగుల ఎత్తు పైగా పెరిగే ఈ తాటిచెట్లు - ఆమంచు కొండమీద ఐదారు, అడుగులలోపు ఎత్తువుంటుంది. పత్రాలు (తాటిఆకులు మాత్రం ధృఢంగా, చాలా వెడల్పుగా, కవులకు తాటి ఆకు గ్రంధాలకు తాళపత్రాలుగా ఉపయోగించటానికీ - ఎన్ని సంవత్సరాలకూ చెడిపోని విధంగా వుంటాయి. ఎండా వానలకు ఓ పట్టాన చెడిపోవు అధృఢమైన ఆకులు, చెదలు ఆశించదు.

"ఒక్క క్షణం నీ కళ్లు మూసుకో పార్వతీ! నీకు అద్భుత తాటంకాలు అమరుస్తాను!" అన్నాడు పరమశివుడు. బుద్ధిగా కళ్లు మూసుకుని - చంద్రకాంత శిలపై కూర్చుంది పార్వతి.

పచ్చి తాళపత్రాన్ని తన గోటితో చీల్చి, కుడిచేత చూపుడు వేలు, బ్రొటన వేలుతో - వాడిగా, శుద్ధస్ఫటికాల వలె మెరుస్తున్న పొడవాటి గోళ్లతో - పరమ శివుడు ఆతాళపత్రంపై నఖచిత్రంలా ఏదోచిత్రిం చేస్తున్నాడు. ఆయన కళ్లు అర్ధని మీలితాలై, యోగమార్గంలో దృష్టి సారించి, ఒకానొక దివ్యచిత్రాన్ని చిత్రించేశాడు క్షణంలో! లిఖిస్తున్నంత సేపు ఆయనలోని భావన కనుగుణంగా ముక్కోటి దేవతలూ, మంత్రపూతంగా - వారి వారి సాంగ, సపరివారస శక్తియుతులై - ఆయన కొనగోటిలోనికి వచ్చి చేరి - తాటంక నఖ చిత్రంలోనికి లీనమై పోతున్నారు. సూక్ష్మ మంత్ర శరీరరాల దివ్యా కృతులతో, బీజాక్షర రూపాలతో! పార్వతి అలాగే కళ్లు మూసుకునే కూర్చునివున్నది. కాస్సేపయ్యాక, పరమశివుడు ఆ తాటియాకును తన వేలికి చుట్టలుగా చుట్టి - తాటి ఈనె (ధృఢంగా వుండే చీలలలా) రెండు ముక్కలుచేసి, వాటికీ తాళపత్ర వలయాలు చుట్టి, పార్వతి దగ్గరగా వచ్చి, ఆమె చెవులకున్న పాత తాటంకాలు తీసివేసి, ఈ సరిక్రొత్త తాటంకాలు అమర్చి,

"బిందు త్రికోణ, వసుకోణ దశారయుగ్మ
మన్వస్ర నాగదళషోడశ పత్ర యుక్తమ్
వృత్త త్రయంచ, ధరణీ సదనత్రయంచ
శ్రీ చక్రరాజ ఉదితః పరదేవతాయా!"

అంటూ ఆశీర్వదించాడు ఆమె చెవులూ - తలా మృదువుగా స్పృశిస్తూ! అంతే ఆమెలో అద్భుత శక్తి ఏదో ప్రవేశించిన అనుభూతి కలిగిందొక్కసారిగా, ఆమె శరీరం గగుర్పాటు చెందింది క్షణకాలం! "పార్వతీ! ఇప్పుడు నీ చెవులకు నేను అమర్చిన తాటంకాలు - ఏదేవతలూ తమ ఇల్లాళ్లకు ఇవ్వలేనివి! ఏ యుగంలోనూ విలువ తరగనివి. ఒకానొక శ్రీ విద్యకు శ్రీకారం చుట్టిన ఈ నీ తాటంకములు. నీవు నీతోబాటు నీ దివ్యశక్తులూ - యావత్ భువనములూ - సర్వజీవరాసుల సృష్టిస్థితిలయాలకూ - పరోక్ష సంకేతరూపం! నీవీ తాటంకాలతో త్రిలోకపూజ్యవై విరాజిల్లుతావు. శ్రీ చక్రం నీస్వరూపంగా మారుతుంది. ఇది సదాశివవిద్యగా, శంభువిద్యగా, పరిఢిల్లుతుంది. నవాక్షరీ, షోడషాక్షరీ, పంచదశాక్షరీ విద్యగా నవావరణలతో - నలభై నాలుగు కోణములతో - మహామంత్ర తంత్ర విద్యగా ఎల్లలోక ఆస్తికులకూ మోక్షం కరతలామలకం చేస్తుంది సుమా! ఆ (! ఇప్పుడిక కళ్లుతెరు!" అన్నాడు పరమశివుడు. ఆమె చెవులకు తాళపత్ర తాటంకాలు అమర్చటం పూర్తయ్యింది గనుక! అమ్మవారు కళ్లు తెరిచింది. చేతుల వ్రేళ్లతో

చెవి తాటంకాలు తడుముకుంది. దివ్యనాదములు, దివ్యశక్తులు, దివ్యమంత్రాలు, దివ్య మోక్షద్వారాలూ - సర్వం తన చెవులకే అంటి పెట్టుకుని వున్నట్లు అనుభూతి కలిగింది. తనలోనికి ఇంతక్రితం లేని - దివ్యతేజమూ, శక్తీ - గంగాఝురిలా ఉప్పొంగి వస్తున్నట్లునిపించింది. "స్వామీ! ఇవి తాటంకములా ? ఇవి ఏరత్నాలు, మణులతో - వైఢూర్యాలతో, సంకల్ప మాత్రంతో చేశారు తమరు ?" అన్నది ఆనందంతో - చంద్రశిలా ఫలకంప్రక్కనే నిశ్చలంగా వున్న స్వచ్ఛమైన చిన్న కొలనులో తనప్రతిబింబం చూచుకుంటూపార్వతి. పరమ శివుడు నవ్వాడు. "నాలుగు శివకోణములు, ఐదు నీ - అనగా శక్తి కోణములు అనే దివ్యశక్తులను నా నఖచిత్రంలో రూపొందించాను దేవీ! వెలలేని వజ్రవైఢూర్యముల వంటి బీజాక్షరసము దాయం - వానిలో నింపాను. మన ఇరువురి శివశక్తుల సమ్మేళనానికీ, శ్రీ విద్యకూ - చిహ్నాలు ఈ నీ తాటంకాలు. వీటికి సాటివచ్చే ఆభరణాలు ఏ లోకంలోనూ లేవు. రావు!" అన్నాడు శివుడు.

"నాలుగు శివకోణాలూ, ఐదు శక్తికోణాలూ నాస్వామీ ?" అంది పార్వతి "అవునుదేవీ! బ్రహ్మ, విష్ణు, ఇంద్ర రుద్రులు నలుగురూ నీ మంచెపు కోళ్లుగా, నాలుగు శివతత్వాలుగా, ఐదవది అయిన నా సదాశివ తత్వంలో లీనమై, నీమంచెకు దుప్పటముగా మారుతాము. అలాగే సత్వ రజస్తమో గుణములు, శక్తితత్వము, నీ నాలుగు తత్వాలుకాగా, ఐదవది అయిన అపురూప జగన్మాత తత్వం - ఐదు శక్తితత్వాలుగా రూపుదాల్చింది.

మన ఇరువురి పంచ విధసామ్యాన్ని ఇలా చక్రరూపంలో, యంత్రరూపంలో - పూజారూపంలో, తాటంక రూపంలో చిత్రించి, దానినే మేరువుగా, కైలాసప్రస్తారంగా భూప్రస్తారంగా, నాచిటికెన వ్రేలికి చుట్టలుగా చుట్టి - నీ చెవులకు అమర్చానుదేవీ! ఇక పదపోదాం!" అన్నాడు పరమశివుడు పార్వతి సంతుష్టాంగ రంగ అయ్యింది. పరమశివుడు పార్వతికి క్రొత్త తాటంకాలు అమర్చాడనే వార్త ముల్లోకాలకూ అందింది. అవి చూడాలనే కుతూహలం కలిగింది అందరికీ! నాలుగురోజుల తర్వాత - లక్ష్మీ సరస్వతులు - అన్నమాట ప్రకారం వచ్చారు - వారిద్దరే రాలేదు. పార్వతి తల్లి అయిన మేనాదేవికి కూడా చెప్పి, ఆమెను వెంటబెట్టుకుని మరీవచ్చారు.

ముందుగా తల్లిపాదాలకు నమస్కరించింది పార్వతి.

"మీ అల్లుడుగారు నాకు విలువలేని తాటంకాలు అమర్చారమ్మా!" అంటూ చూపింది పార్వతి : కుమార్తె చెవులకువున్న పచ్చి తాటాకుచుట్టలు చూచి - నిర్ఘాంతపోయింది మేనాదేవి

"ఇవి! ఇవా ?" అన్నది. శివుడు - ఈ వెర్రిపిల్లకు - చెవులకు తాటాకులు కట్టి - తాటాంకాలని మురిపించాడు. ఆ భర్తపై గల అపారప్రేమతో ఈ వెర్రిపిల్ల నమ్మేసింది. అయినా తను పైకి తేలకూడదు - "చెవులకు తాటాకులు కట్టాడు!" అనుకున్నది మనసులో! లక్ష్మి, సరస్వతి చూశారు తాటంకాలవైపు " ఇవా నీ విలువలేని తాటంకాలు ?" అన్నారు హేళనగా.

ముట్టుకుని చూశారు! అంతే!

"సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా!".

అనే బీజాక్షర సముదాయానికి మంత్రార్థంలా ఇరువురూ ఆతల్లికి కుడి ఎడమల నిల్చుని - వీ వనలు వీయసాగారు! వారిలో - అహంకారం మాయమై - భృత్యభావం వచ్చేసింది! భృత్యులైపోయారు మరుక్షణం వశిన్యాది వాగ్దేవతలు ఆ తల్లిని స్తోత్రంచేస్తున్నారు. మేనాదేవికి - ఇప్పుడర్థమయ్యింది ఆ తాటంక మహిమ. శివునివైపు చూచి భక్తితో చేతులు జోడించింది.

పరమశివుడు నవ్వాడు "తల్లీ! మేనాదేవీ! నీ కుమార్తె చెవులకు తాటాకు తాటంకాలుగా కట్టాను : కానీ అవే గౌరీవ్రతంలో ముత్తైదువలకు వాయనదానం ఇచ్చే సమయంలో - వాయనంతో బాటు అలంకారవస్తువులు లైన అద్దము, దువ్వెన కాటుక, గంధము - పసుపు కుంకుమలతో బాటు - నల్లపూసలూ, "చెవ్వాకు" అని చెప్పబడే పచ్చితాటాకు ముక్క అనిచెప్పబడే ఈ తాటంకపు గుర్తు తప్పనిసరిగా వుండాలి. ఇది స్త్రీ ఐదవ తనానికీ, శ్రీ చక్రానికీ చిహ్నం, గౌరీదేవి ఆభరణాలలో ఇది ముఖ్యమైనది. "అన్నాడు.

మేనాదేవి మరల మరల చూచింది పార్వతి చెవులకేసి! పదునాలుగు భువనములే భూపురముగా, నాలుగు వేదాలే నాలగు ద్వారాలుగా, బిందు, త్రికోణ, వసుకోణ, దశారయుగ్మ మన్వస్ర, నాగదళ, షోడశ పత్రయుక్తంగా, వృత్తత్రయం అయిన సూర్యచంద్రాగ్ని వలయాలతో, ధరణీ సదనత్రయంతో - శ్రీ చక్రరూపిణి అయిన అమ్మవారిగా, అఖిలాండ కోటిబ్రహ్మాండనాయికగా - పార్వతి - ఆదిపరాశక్తిగా సాక్షాత్కరిస్తోంది! "పార్వతీ! ఉమా! కన్నతల్లీ! నీవు నా బిడ్డవనే మమకారంతో - శివుడు నిన్ను మోసగించి, చెవులకు తాటాకులు కట్టాడని లో లోపల - ఈసడించుకున్నాను. నీ అమాయకత్వానికి బాదపడ్డాను.

కానీ - కానీ మీరిరువురూ శివశక్తులు, జగన్మాత - జగత్పితలు, కారణజన్ములు! మా పర్వతరాజవంశం, ఉద్ధరించటానికి మాకుజన్మించిన కులదేవతవు నీవు! పరమ యోగీశ్వరుడు పరమశివుడు! నా తప్పు తెలిసివచ్చింది. దేవీ నవరాత్రులు రాబోతున్నాయి. మొదటగా నేనే - మూసి వాయన వ్రతం నవరాత్ర వ్రతం ఆచరించి - నీ తాటంకాలకు గుర్తుగా "చెవ్వాకు" తో

- ముత్తైదువలకు వాయనదానం ఇస్తాను గౌరీవ్రతం చేస్తాను! నీ తల్లినయిన నాకు ఆ అదృష్టం నాకే దక్కింది! "అంటూ ఆ ఇరువురికీ మనసారాప్రమొక్కి వీడ్కోలు తీసుకొని వెళ్లిపోయింది!

ఆనాటినుండి, ఈ నాటివరకూ - మూల గౌరీవ్రతాలలో, మంగళ గౌరీవ్రతాలలో, అమ్మవారివ్రతాలలో, మూసి వాయనాలలో, అమ్మవారి తాటంక చిహ్నాలైన, "చెవ్వాకు" పూజా వస్తువుగా, అలంకార తాటంకములుకు చిహ్నంగా నిలిచిపోయింది! శివశక్తులామె చెవుల తాటంకాలు కాగా, కాలకూట విషంమ్రింగిన శివునికి మరణం ఎలా సంభవిస్తుంది ?

ఇక కలియుగ కథకువస్తే - ఆది శంకరాచార్యులవారు అమ్మవారి ఉగ్రరూపాలు తగ్గించటానికి ఆయా శక్తి పీఠాలలో శ్రీచక్ర యంత్రస్థాపనచేస్తూ వస్తున్నారు.

జంబుకేశ్వరం వచ్చారు. తమిళనాడులోని "తిరుచునా పల్లికి" 10కిలో మీటర్ల దూరంలో, శ్రీ రంగక్షేత్రానికి సమీపమున వున్నది. జంబుకేశ్వరం - పంచ భూతాత్మిక పంచలింగాలలో రెండవది, జలలింగం. ఈ లింగంక్రింద నిరంతరం నీరు దానంతటదే వూరుతుంటుందని ప్రతీతి!

ఇక్కడి అమ్మవారు అఖిలాండేశ్వరి, అపరిమిత ఉగ్రస్వరూపిణి. ఆదిశంకరాచార్యులవారు ఈ తల్లిని శాంతింపజేయదలచి, శ్రీ చక్రయంత్రాన్ని ప్రతిష్ఠించదలచారు. అయితే ఆతల్లి ఒక వట్టాన అంగీకరించలేదు యంత్రం ప్రతిష్ఠించటానికి, ఆదిశంకరులు ఒక ఉపాయంఆలోచించారు.

"తల్లీ! నీ కర్ణాలకు కర్ణాభరణాలు పెడదామని ఈ బిడ్డడిగా కోర్కెవుందినాకు అందుకైనా అనుమతించు!" అని కోరారు. ఆభరణం మాటవినగానే - అంతటి ఉగ్రస్వరూపిణి కూడా, స్త్రీ సహజమైన ఆసక్తితో - "అలాగే! కర్ణాభరణాలు అలంకరించునాయనా!" అన్నది అనుమతిఇస్తూ! ఈ అవకాశం జారవిడుచుకోలేదు శంకర భగవత్పాదులవారు. ఆమె శక్తిని ఆకర్షించి ఆమె ఒక చెవికి రత్నమయమైన శ్రీ చక్రం ఒక కర్ణంలోనూ, పంచాక్షరీ మంత్రం వ్రాసిన తాటంకం (తాటియాకు చుట్ట -) మరొక కర్ణానికి తాటంకంగానూ అమర్చారు! దానితో శివశక్త్యైక్య స్వరూపిణిగా సౌమ్యరూపిణిగా మారిపోయింది ఆతల్లి!

ఇంకా అమ్మవారి ఉగ్రరూపం ఉపసంహరించు కోందోలేదోనని ఎందుకైనా మంచిదని ఆమెఎదురుగా ఆమె ముద్దులకు మారుడైనా విఘ్నేశ్వరుని విగ్రహాన్ని ప్రతిష్ఠించి ప్రాణప్రతిష్ఠ చేశారు!

మిట్టమధ్యాహ్నము, పూజారి - ఇక్కడ చీరె కట్టుకుని, కళ్లకు కాటుక పెట్టుకుని, స్త్రీ వేషధారియై పూజలు చేయటం ఈ ఆలయ ప్రత్యేకత! ఉగ్రరూపిణి అయిన అమ్మవారు సౌమ్యమూర్తిగా మారినప్పటికీ - ఆ తల్లి శక్తికి ఇంచుక భయ భక్తులతో వుంటారు భక్తులు.

అంతటి మహాత్మ్యం గల తాటంకాలు అవి.

ఈశ్వరుడు తాటియాకు తాటంకాలు పెట్టగా అపర శంకరులైన ఆది శంకరులు - రత్న తాటంకం శ్రీ చక్రంగా ఒక చెవికీ - పంచాక్షరీ మంత్రపూతమైన తాటంకం మరొక చెవికీ అలంకరించారు అమ్మవారికి. అందువలననే అంతటి సాధికారికంగా "నీ తాటంకముల మహిమే సుమా! తల్లీ! జగన్మాతా!" అని చెప్పగలిగారు ఆదిశంకరులు.

ఒక్క చిన్నశ్లోకంలో - ఎంత కథ - ఎన్ని విశేషాలూ, పూజావ్రత విధానములూ బంగారు ఆభరణంలో వెలలేని వజ్రాలుగా పొదిగి ఆ తల్లి తాటంకాలను హృదయంలో దర్శించినాచాలు - మన సర్వపాపాలూ ప్రక్షాళనమై పోతాయని పరోక్ష బోధ చేశారు జగద్గురువులు. అదీ గురుబోధ లక్షణం. కాస్తంత ఓర్పుగా, ఆలోచనతో అందుకోవాలి ఆ గురుభోధ అందుకో లేకపోతే)

"ఆ ఁ! తాటంకాలేమిటో - మహిమ ఏమిటో!" అని పారాయణఅనే మహాపుణ్యకార్యం నుండి బద్ధకంతో పారిపోయే అదృష్ట హీనులలో మనమూ ఒకరం అవుతాము! అవునా ? అలా కాకూడదనే - ఈ పారాయణ ధ్యేయం - మరి పదండి ముందుకు.

## 29 శ్లో॥ త్రిమూర్తులు జగన్మాత పాదసేవతో తరిస్తున్నారు.

**29. శ్లో॥కిరీటం వైరి ఞ్చం పరిహర పురః కైటభ భిదః**
**కఠోరే, కోటీరే స్ఖలసి జహిజ మ్భారి మకుటమ్,**
**ప్రణమ్రే ష్వేతేషు, ప్రసభముపయాతస్య భవనం,**
**భవ స్యాభ్యుత్థానే తవ పరి జనోక్తి ర్విజయతే ॥**

**అర్థము** :- ఓ జగన్మాతా! భవానీ! త్రిపుర సంహారముచేసి, విజయుడై కైలాసములో నీ భవనమునకు తిరిగి వస్తున్న నీభర్తయగు పరమశివుని యొక్క, విజయాగమన వార్తవిని. నీవు అత్యంత సంతోషముతోనూ, సంభ్రమముతోనూ, నీ సింహాసనము నుండి లేచి, గబ గబా నడచుచూ, ఆ నీస్వామికి హారతి ఇచ్చి, స్వాగతము పల్కటానికి గానూ వస్తుండగా, అంతవరకూ,

నీ పాదపీఠము వద్ద శిరసులు వంచి, నీ పాదములకు సాష్టాంగ దండప్రణామములు ఆచరిస్తున్న బ్రహ్మ, విష్ణు, ఇంద్రుల కిరీటములు, నీ నడకవేగములో నీ కాళ్లకు తగిలి - వారి కిరీటములలోని రత్నముల మణుల ఒరిపిడికి నీమృదుపాదములు గాయపడు నేమోనని భయపడి, నీ అనుంగు పరిచారికలు, "అమ్మా! ఇది బ్రహ్మకిరీటము! తొలగిపొమ్మా! తల్లీ! ఇది విష్ణు కిరీటము! తడబడుదువేమో, జగజ్జననీ! ఇది ఇంద్రుని కిరీటము! తొలగిపొమ్మా!" అనుచూ నీకు హెచ్చరికలు చేయుచున్నారు.

ఈశ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - జగన్మాతయొక్క పతిభక్తి పరాయణత, పతిపై ఆమెకుగల ప్రేమ, పాతివ్రత్యమూ పరోక్షంగా దృశ్యరూపంగా మనందరికీ సాక్షాత్కరింపజేస్తున్నారు.

బ్రహ్మ విష్ణు ఇంద్రులలాటి లోక కర్తలూ, లోకభర్తలూ - లోకపాలకులూ తనపాదాలకు శరణాగతితో మ్రొక్కుతుండగా, భర్త ఆగమన వార్త వినిని ఆ జగదంబ, క్షణం జాగుచేయక, పతికి ఎదురేగి, ఆస్వామి వీర విజయగాధ వార్తకు ఉప్పొంగిపోతూ, స్వాగతించటానికి సంభ్రమముగా, అనగా క్రొత్తగా పెళ్లి అయిన వధువు - తనభర్త వచ్చిన సంగతి తెలిసి - సంభ్రమంగా ఎదురొచ్చినట్లుగా - వర్ణించారు. ఆరావటంలో ఆమె తన పాదాలకు త్రిమూర్తులు మ్రొక్కుతున్నారనే స్పృహ కూడా కలిగిలేదు గనుక, వారి కిరీటాలు ఆమె పాదాలకు తగిలి - ఆమె చీరెకుచ్చిళ్లు అడ్డుపడి ఆమె అడుగులు తడబడతా యేమోనని చెలులు హెచ్చరిస్తున్నారు.

ఎన్ని పదవులువున్నా, ఎంత హోదావున్నా, ఎంత సిరివున్నా, ఇల్లాలికి భర్తనుమించిన దైవం, భర్తను మించిన గొప్ప ఐశ్వర్యం మరొకటి లేదు అని పరోక్ష బోధ - అమ్మవారి నడక సంభ్రమం ద్వారా బోధచేస్తున్నారు ఆచార్యులవారు తన భర్తను మనసా, వాచా, కర్మణా గౌరవించే స్త్రీ, తనని తాను అత్యున్నతంగా గౌరవించు కున్నట్లే, ఆమె పూజనీయత వేల రెట్లు పెరుగుతుంది.

తనకి ఇతరులుచేసే సన్మానాలూ, పొగడ్తలూ - తన ధనమూ, ఉద్యోగమూల్లాటివి చూచుకొని, తానే గొప్పఅని తనభర్తను చులకన చేసే స్త్రీ - సమాజంలో ఎదురుగా గౌరవింపబడ్తుంది. చాటుగా విమర్శింపబడ్తుంటుంది. నిజమైన పూజనీయస్థానం పొందలేదు. తనని ప్రేమించేభర్తలో - అతడి మంచితనాన్ని అర్థం చేసుకోక, అస్తమానం లోపాలు ఎంచే స్త్రీ, బయటివారి ముందు "మా వారిలో ఆలోపంవుంది! ఈ లోపంవుది" అని చెప్పుకోనే స్త్రీలు, తమనితాము చులకన చేసుకుంటున్నారనే గ్రహించాలి.

ఇక, అనుమాన పిశాచాలైన భర్తనూ వ్యసనపరులైన భర్తనూ శాడిస్టులైన భర్తనూ దురదృష్టవశాత్తూ పొందినస్త్రీలు - మనసా, వాచా, కర్మణా వారిని గౌరవించలేరు, పూజించలేరు. ఆ భర్తల తాలూకు మారని వ్యసనాలు - సమాజంలో ఆమె ఎంత గొప్ప హోదాలోవున్నా ఆమె స్థానాన్ని తెలివితేటలనూ కృంగదీస్తూనే వుంటాయి. ఇది ఆస్త్రీల దురదృష్టం అనే చెప్పాలి. జగన్మాత ఆరాధనతో - నామ జపంతో వీరి సమస్యలకు పరిష్కారం దొరకాల్సిందే తప్ప, సాటి మానవులు ఎవరూ ఏమీచేయలేని నిస్సహాయస్థితి అది! కానీ భర్త మంచివ్యక్తి, తనకి గౌరవం, ప్రేమ, ఇచ్చేవ్యక్తీ అయి వున్నపుడు, - వారిని నిర్లక్ష్యంచేసి "మీరు ఇంటిపని చేయండి. నేనే చేయాలా ?" అంటూ సతాయించే స్త్రీలు - తనయొక్క సన్మానాలకూ, సన్మానాలు చేసేవారి పొగడ్తలూ సర్వస్వం అనుకుంటే మాత్రం - అతిత్వరగా పతనమౌతారు. ఆ నమస్కారాలూ, పురస్కారాలు అన్నీ స్వార్థంతో కూడుకున్నవి.

భర్త ప్రేమ, అభిమానం - దాంపత్యంలోని పరస్పర అవగాహన కూడిన అన్యోన్యానురాగాలే నిజమైన సన్మానాలూ, పురస్కారాలూ స్త్రీకి - ఆ పురుషునికీ కూడా అవునా ?

## 30 శ్లో ॥ జగన్మాత ఉపాసకునికి ప్రళయాగ్ని కూడా నీరాజనం అవుతుంది.

**30 శ్లో॥ స్వదేహో ద్భూతాభి ర్ఘృణిభి రణిమా ద్యాభిరభితః**
**నిషేవ్యే నిత్యే, త్వా, "మహమితి", సదాభావీయతియః,**
**కిమాశ్చర్యం ? తస్య త్రినయన సమృద్ధిం తృణయతః**
**మహా సంవర్తాగ్ని ర్విరచయతి, నీరాజన విధిమ్ ॥**

**అర్థము :-** ఆద్యంతములు లేని నిత్య, సత్యస్వరూపిణి వగు ఓ జగన్మాతా! భగవతీ! భక్తులచే సేవింపబడుదానవగు ఓ తల్లీ! నీ దేహమునుండి పుట్టిన కాంతులచేనైన (అనగా, నీదేహ కాంతుల నెడి కిరణములతో ఏర్పడిన) అణిమాద్యష్ట సిద్ధులతో అంతటా ఆవరింపబడిన (ఆరా) ప్రకాశమును - "నిన్ను - నేననీ - నేనే - నీవనీ -" "సోహం" భావనతో ఏ సాధకుడు ధ్యానించుచున్నాడో, అతడు త్రినయనుడని పేరుగల సదాశివుని యొక్క నిండు ఐశ్వర్యమును తృణీకరించు ఆసాధకునికి - మహాప్రళయకాల మందు జనించి సర్వలోకాలనూ దహించివేసే "మహా సంవర్తాగ్ని" అనే పేరుగల ప్రళయాగ్ని - నీరాజన మిచ్చుచున్నది (ఆసాధకునికి హారతి

ుట్టుచున్నది.) ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - జగన్మాత యొక్క విరాట్ రూ
్యానాన్ని - సాధకులకు ఉపదేశిస్తున్నారు.

**శ్లో ॥ అరుణాం, కరుణా తరంగి తాక్షీం**
**ధృత పాశాంకుశ పుష్పబాణ చాపాం**
**అణిమాదిభిరా వృతాం మయూఖై**
**"రహ"మి త్యేవ విభావయే మహేశీమ్!"**

అంటూ లలితా సహస్రనామ స్తోత్రంలోని ప్రధమ ధ్యాన శ్లోకాన్ని వర్ణించారు వశిన్యా
గ్దేవతలు.

"అరుణ వర్ణ శరీరకాంతులతో, కరుణా కటాక్ష తరంగితాక్షియై, అణిమాద్యష్ట సిద్ధుల
ప్రకాశ కిరణాలచే ఆవరింపబడి - పాశాంకుశ, ఇక్షుచాప, పుష్పబాణములతో వున్న ఆ జగన్మాతన
అహమిత్యేవ" "నేనే" ఆ రూపమును - అని ధ్యానిస్తున్నాను!" అని ఆశ్లోకం యొక్క భావము
ిరిగ్గా అలాగే - శ్రీ శంకరభగవత్పాదుల వారు - తమ భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలో
1వ శ్లోకంలో భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం :-

**1 శ్లో ॥ గణే శాణి మాద్యాఖిలైః శక్తి బృందై**
**ర్వృతాం, వై స్ఫురచ్చక్ర రాజోల్ల సంతీమ్!**
**పరాం! రాజ రాజేశ్వరీం! త్రైపురీం! త్వాం!**
**శివాంకో పరిస్థాం, శివాం! భావయామి!**

అంటూ చిన్న శ్లోకంలో ఆ భవాని సౌందర్యలహరిని వర్ణించారు. గణేశుడు ·
ుణిమాద్యష్టసిద్ధులూ, శక్తి బృందాలు (యోగినీ బృందాలూ (సప్తమాతృకలూ) వారందరి చేత
రివేష్ఠింపబడి - శ్రీ చక్రరాజము గారూపొందిన తల్లీ!

పరాం! పరాశక్తీ! రాజ రాజేశ్వరీ - త్రిపుర సుందరీదేవిగా - నిన్ను. శివుని అంకపీఠంపై
ిలువున్న నిన్ను, శివా! భవాని - నా ధ్యానంలో భావిస్తున్నాను. ధ్యానిస్తున్నాను." అన్నారు
రణా గతి భావంతో! అణిమాద్యష్ట సిద్ధులంటే ఏమిటి ? వాటి వాటి సిద్ధివలన సాధకులు
ొందే దివ్యశక్తులేమిటి ? తెలుసుకుందామా ?

1. **అణిమాసిద్ధి** :- మిక్కిలి చిన్నజంతువు కంటే కూడా చిన్నదిగా శరీరాన్ని చేయగల
టము, సాధకునికి ఈ శక్తి వస్తుంది. ఉదాహరణకు - సుందర కాండలో ఆంజనేయుడు

"సురస" నోటిలోనికి వెళ్లి, మరల అంతటివేగంగానూ బయటికి వస్తాడు అంగుష్ఠప్రమాణ రూపంతో, అలాగే లంకా నగరంలో రాత్రివేళా, సీతమ్మవారిని అన్వేషిస్తూ చిన్నపిల్లి అంత ప్రమాణం గల శరీరంతో సంచరిస్తాడు రాక్షసులు గమనించకుండా : ఇదే ॥అణిమాసిద్ధి.

2. **మహిమాసిద్ధి :-** మిక్కిలి పెద్దదగుట, సాధకుడు తన శరీరాన్ని చాలా చాలా పెద్ద పరిణామం గలదిగా పెంచగలగటం. వామనావ తారంలో వామన మూర్తి త్రివిక్రముడై ముల్లోకాలనూ ఆవరించటమూ, సముద్రలంఘనకు ముందు - తనవానరుల ముందు ఆంజనేయుడు మహాకాయునిగా పెరగటమూ, మరలసీతమ్మవారికి తన విశ్వరూప సందర్శనం చేయటమూ వంటి దివశక్తులు ఈ మహిమా సిద్ధి వలన వస్తాయి. ఈ సౌందర్యలహరి 30వ శ్లోకంలో - అమ్మవారి శరీర కాంతులనే కిరణములే అణిమాద్యష్టసిద్ధులు - వాటిచేత పరివేష్ఠిపబడిన ఆతల్లిని - నీవే - నేను - నేనే - నీవు అనే సోహం, దాసోహం అనే భావంతో - ఆత్మార్పణా భావంతో అనన్య భక్తితో ఏసాధకుడు ధ్యానిస్తాడో - అతడు - శివుని (త్రినయనుని) ఐశ్వర్యాన్ని తృణీకరించటం అంటే - అహంకారంతో కాదు సుమండీ, ఈశ్వరుడు భోళా శంకరుడు. కాస్తంత పూజ - ఒక బిల్వదళమూ, ఒక చెంబునీళ్లు అభిషేకము చేసినా చాలు - చాలా ఆనందపడతాడు. అలాటి భక్తవ శంకరుని కాస్తంత కఠోరతపస్సుతో మెప్పిస్తేచాలు - కోరినవరాలూ, కోరని ఐశ్వర్యాలూ కూడా కో కోల్లలుగా ప్రసాదిస్తాడు. పురాణాలలో ప్రతి రాక్షసుడూ ఈశ్వరుని ప్రసన్నం చేసుకుని - విపరీతమైన వరాలు పొందినవారే గమనించండి! భస్మాసురుడు - బాణాసురుడు - గజాసురుడు లాటివారు ఆభోళా శంకరుని, భక్త వశంకర తను ఆసరాగా, అలుసుగాతీసుకొని కోరరాని కోర్కెలు కోరి ఆస్వామిని బాధపెట్టి - చివరగా తాము పతనమై మరణించినవారే కదా ?

అందువల్ల - ఈశ్వరుని పూజవలన లభ్యమయ్యే ఐశ్వర్యాలు తనకు వద్దనీ - ఆ సిద్ధులూ - భోగాలూ అవసరంలేదనీ అమ్మవారి పాదాలే తనకు సర్వంఅనీ భావించే సాధకుడు. ఆ తల్లిలో తాధ్యాత్మ్యం చెంది ఆ జగన్మాత స్వరూపంగా మారిపోతాడు.

అటువంటి యోగీశ్వరునికి - ప్రళయ కాలంలో విజృంభించే "మహాసంవర్తాగ్ని" అనే ప్రళయాగ్ని - సర్వాన్నిదహించివేసే మహా ప్రళయాగ్ని - హారతి వలె మారుతుంది. ఏమీ చేయలేదు ఆతని శక్తిముందు! మరొకవిధంగా ఆలోచిస్తే - అంతటి యోగీశ్వరుడెవరుంటారు ? మరెవరు? పరమశివుడే! నిరంతరం తనలోనే ఐక్యం అయివున్న ఆ ఆదిపరాశక్తిని "నీవే నేను" అనే భావనతో ధ్యానిస్తూ - భోగాలకతీతుడై - దిగంబరునిగా, సర్పభూషణునిగా, జటాధారిగా, రుద్రాక్ష

పట్టుచున్నది.) ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - జగన్మాత యొక్క విరాట్ రూప ధ్యానాన్ని - సాధకులకు ఉపదేశిస్తున్నారు.

**శ్లో ॥ అరుణాం, కరుణా తరంగి తాక్షీం**
**ధృత పాశాంకుశ పుష్పబాణ చాపాం**
**అణిమాదిభిరా వృతాం మయూఖై**
**"రహ"మి త్యేవ విభావయే మహేశీమ్!"**

అంటూ లలితా సహస్రనామ స్తోత్రంలోని ప్రథమ ధ్యాన శ్లోకాన్ని వర్ణించారు వశిన్యాది వాగ్దేవతలు.

"అరుణ వర్ణ శరీరకాంతులతో, కరుణా కటాక్ష తరంగితాక్షియై, అణిమాద్యష్ట సిద్ధులనే ప్రకాశ కిరణాలచే ఆవరింపబడి - పాశాంకుశ, ఇక్షుచాప, పుష్పబాణములతో వున్న ఆ జగన్మాతను "అహమిత్యేవ" "నేనే" ఆ రూపమును - అని ధ్యానిస్తున్నాను!" అని ఆశ్లోకం యొక్క భావము. సరిగ్గా అలాగే - శ్రీ శంకరభగవత్పాదుల వారు - తమ భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలోని 11వ శ్లోకంలో భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం :-

**11 శ్లో ॥ గణే శాణి మాద్యాఖిలైః శక్తి బృందై**
**ర్వృతాం, వై స్ఫురచ్చక్ర రాజోల్ల సంతీమ్!**
**పరాం! రాజ రాజేశ్వరీం! త్రైపురీం! త్వాం!**
**శివాంకో పరిస్థాం, శివాం! భావయామి!**

అంటూ చిన్న శ్లోకంలో ఆ భవాని సౌందర్యలహరిని వర్ణించారు. గణేశుడు - అణిమాద్యష్టసిద్ధులూ, శక్తి బృందాలు (యోగినీ బృందాలూ (సప్తమాతృకలూ) వారందరి చేతా పరివేష్టింపబడి - శ్రీ చక్రరాజము గారూపొందిన తల్లీ!

పరాం! పరాశక్తీ! రాజ రాజేశ్వరీ - త్రిపుర సుందరీదేవిగా - నిన్ను. శివుని అంకపీఠంపై కొలువున్న నిన్ను, శివా! భవాని - నా ధ్యానంలో భావిస్తున్నాను. ధ్యానిస్తున్నాను." అన్నారు. శరణా గతి భావంతో! అణిమాద్యష్ట సిద్ధులంటే ఏమిటి ? వాటి వాటి సిద్ధివలన సాధకులు పొందే దివ్యశక్తులేమిటి ? తెలుసుకుందామా ?

1. **అణిమాసిద్ధి :-** మిక్కిలి చిన్నజంతువు కంటే కూడా చిన్నదిగా శరీరాన్ని చేయగల గటము, సాధకునికి ఈ శక్తి వస్తుంది. ఉదాహరణకు - సుందర కాండలో ఆంజనేయుడు

"సురస" నోటిలోనికి వెళ్లి, మరల అంతటివేగంగానూ బయటికి వస్తాడు అంగుష్ఠప్రమాణ రూపంతో, అలాగే లంకా నగరంలో రాత్రివేళ, సీతమ్మవారిని అన్వేషిస్తూ చిన్నపల్లి అంత ప్రమాణం గల శరీరంతో సంచరిస్తాడు రాక్షసులు గమనించకుండా : ఇదే ॥అణిమాసిద్ధి.

2. **మహిమాసిద్ధి** :- మిక్కిలి పెద్దదగుట, సాధకుడు తన శరీరాన్ని చాలా చాలా పెద్ద పరిణామం గలదిగా పెంచగలగటం. వామనావ తారంలో వామన మూర్తి త్రివిక్రముడై ముల్లోకాలనూ ఆవరించటమూ, సముద్రలంఘనకు ముందు - తనవానరుల ముందు ఆంజనేయుడు మహాకాయునిగా పెరగటమూ, మరలసీతమ్మవారికి తన విశ్వరూప సందర్శనం చేయటమూ వంటి దివశక్తులు ఈ మహిమా సిద్ధి వలన వస్తాయి. ఈ సౌందర్యలహరి 30వ శ్లోకంలో - అమ్మవారి శరీర కాంతులనే కిరణములే అణిమాద్యష్టసిద్ధులు - వాటిచేత పరివేష్ఠిపబడిన ఆతల్లిని - నీవే - నేను - నేనే - నీవు అనే సోహం, దాసోహం అనే భావంతో - ఆత్మార్పణా భావంతో అనన్య భక్తితో ఏసాధకుడు ధ్యానిస్తాడో - అతడు - శివుని (త్రినయనుని) ఐశ్వర్యాన్ని తృణీకరించటం అంటే - అహంకారంతో కాదు సుమండీ, ఈశ్వరుడు ఖోళా శంకరుడు. కాస్తంత పూజ - ఒక బిల్వదళమూ, ఒక చెంబునీళ్లు అభిషేకము చేసినా చాలు - చాలా ఆనందపడతాడు. అలాటి భక్తవ శంకరుని కాస్తంత కఠోరతపస్సుతో మెప్పిస్తేచాలు - కోరినవరాలూ, కోరని ఐశ్వర్వాలూ కూడా కో కోల్లలుగా ప్రసాదిస్తాడు. పురాణాలలో ప్రతి రాక్షసుడూ ఈశ్వరుని ప్రసన్నం చేసుకుని - విపరీతమైన వరాలు పొందినవారే గమనించండి! భస్మారుడు - బాణాసురుడు - గజాసురుడు లాటివారు ఆఖోళా శంకరుని, భక్త వశంకర తను ఆసరాగా, అలుసుగాతీసుకొని కోరరాని కోర్కెలు కోరి ఆస్వామిని బాధపెట్టి - చివరగా తాము పతనమై మరణించినవారే కదా ?

అందువల్ల - ఈశ్వరుని పూజవలన లభ్యమయ్యే ఐశ్వర్యాలు తనకు వద్దనీ - ఆ సిద్ధులూ - భోగాలూ అవసరంలేదనీ అమ్మవారి పాదాలే తనకు సర్వంఅనీ భావించే సాధకుడు. ఆ తల్లిలో తాధ్యాత్మ్యం చెంది ఆ జగన్మాత స్వరూపంగా మారిపోతాడు.

అటువంటి యోగీశ్వరునికి - ప్రళయ కాలంలో విజృంభించే "మహాసంవర్తాగ్ని" అనే ప్రళయాగ్ని - సర్వాన్నిదహించివేసే మహా ప్రళయాగ్ని - హారతి వలె మారుతుంది. ఏమీ చేయలేదు ఆతని శక్తిముందు! మరొకవిధంగా ఆలోచిస్తే - అంతటి యోగీశ్వరుడెవరుంటారు ? మరెవరు? పరమశివుడే! నిరంతరం తనలోనే ఐక్యం అయివున్న ఆ ఆదిపరాశక్తిని "నీవే నేను" అనే భావనతో ధ్యానిస్తూ - భోగాలకతీతుడై - దిగంబరునిగా, సర్పభూషణునిగా, జటాధారిగా, రుద్రాక్ష

మాలాధరునిగా, కపాల మాలాధరునిగా, మారిపోయిన ఆ యోగీశ్వరుని మించిన మహాయెగీశ్వరుడెవరుంటారు ?

ఆ యోగీవ్వరునికి - మహాసంవర్తాగ్ని నీరాజనం పడ్తుంది! నటరాజస్వామి విగ్రహంలో ఒకచేతిలో అగ్ని వుంటుంది గమనించండి! ప్రళయతాండవ నృత్యవేళా - మహాసంవత్సర్తాగ్నిని అరచేతధరించి - హారతి ఇస్తున్నట్లుగా నాట్యం చేస్తాడా సప్తతాండవ నాట్యాచార్యుడు!

కాబట్టి సాధనలో - ఐశ్వర్యాల జోలికి, సిద్ధుల జోలికిపోకుండా - జగన్మాతతో "నీవేనేను" అనే భావంతో సాయుజ్య ముక్తిని కోరే సాధకులకు, భక్తులకు - సర్వ లోకాలలో భయపెట్ట గలిగినదీ - నశింపజేయగలిగినదీ ఏదీ లేదు. వారిని ప్రళయాగ్ని కూడా దహించలేదు. అదీ ఆచార్యుల వారి అంతరంగ భావన - అవునా ?

3. "గరిమా"సిద్ధి :- మిక్కిలి బరువుగా అగుట. సాధకుని శరీరం పర్వతంవలె బరువు అవుతుంది. ఉదాహరణకు - చిన్ని కృష్ణుడు తనని ఆకాశంలోనికి ఎగర వేసుకుని వెళ్తున్న "తృణావర్తుడు" అనే మహాగాలి ప్రభంజనం రూపుడైన రాక్షసుని సంహరించటానికి గానూ - వాడిమెడపై కూర్చున్నాడు. చిన్నబాలుడు పర్వతమంత బరువైపోయాడు. ఆరాక్షసుడా బరువుకు క్రిందపడి మరణించాడు. ఈ శక్తి "గరిమా! సిద్ధి!

4. **"లఘిమాసిద్ధి"** : మిక్కిలి తేలికగా కావటం. సాధకుని శరీరం నీటిమీద తేలగలదు పడవలా! నీటిమీద నడచిన భక్తులగాథలూ, "పద్మపాదుడు - అనే శంకరాచార్య శిష్యుడు నీటిమీది నడచివస్తాడు అపార గురుభక్తితో ఎన్నోవున్నాయి పురాణాలలో, షిరిడీసాయిబాబా జానెడు వెడల్పుగల చెక్క పలకను సన్నని గుడ్డపేలికలతో వ్రేళ్లాడగట్టి, దానిపైకి ఎక్కిపడుకొనేవారు - మరలా దిగేవారు - ఎలా ఎక్కేవారో, అది విరగకుండా, ఆ గుడ్డపేలికలు బాబా బరువుకు తెగిపోకుండా ఎలా వున్నాయో, ఎలాదిగేవారో ఎవరికీ అంతుబట్టేది కాదు. బాబా మనకంటే కేవలం 75 - సం॥ ముందు జీవించి వున్నారు! (1918 బాబా మహాసమాధి) వారూ ఈ శక్తి కొంతకాలం ప్రదర్శించి - ఆపేశారు.

5. **ప్రాప్తిసిద్ధి** :- వేలికొనతో చంద్రాదులను పొందటం అనగా ఎన్ని లోకాలనైనా - వ్రేలితో, కొనవ్రేలిపై భరించగలగటం చిన్ని కృష్ణుడు చిటికెన వ్రేలిపై గోవర్ధనగిరి ఎత్తటం, బ్రహ్మాండాలను తన బుల్లినోటిలో చూపగలగటంలాటి దివ్యశక్తులువస్తాయి. ఈ ప్రాప్తిసిద్ధితో,

6. **"ప్రాకామ్యసిద్ధి"** :- అడ్డులేని ఇచ్ఛ ఈ సిద్ధి యొక్క దివ్యశక్తి - సాధకుడు తనుకోరినది భావనా మాత్రంగా - తృటిలో పొందగలుగుతాడు. ఎవరిని కోరితే వారిని రప్పించగలగటం -

తాను ఎక్కడికి పోదలస్తే అక్కడికి వెళ్లి ప్రత్యక్షంకావటం - రెండు మూడు ప్రదేశాలలో ఒకే సమయంలో కనిపించటం లాటి శక్తులు - ఇచ్ఛా గమనం, ఇచ్ఛా వేగం - ఇచ్ఛాక్రియ ఈ సిద్ధి యొక్క లక్షణాలు.

7. **"ఈశిత్వమ్"** :- అందరినీ మించి ఉండటం. అనగా అందరిలో లోనూలేని ప్రత్యేకత, గౌరవింపదగిన, పూజింపబదగిన స్థితికి ఎదిగిపోవటం, పరమహంసలకు, అవధూతలు మహాఋషులు, అవతారపురుషుల స్థితి ఇది. వీరికి దేవతలు - చక్రవర్తులూ - అణిమాద్యష్టసిద్ధులూ - దాస్యంచేస్తాయి.

8. **"వశిత్వమ్"** :- ఇంద్రియములు తనవశములో నుంచుకొనుట. అనగా జితేంద్రియత్వం ఇది సాధించినవారికి ఇక ఏ లోకంలోనూ ఎదరులేదు. వాక్కు మొదలు మనసువరకూ వీరి స్వాధీనంలో వుంటాయి - ఈ సాధకునికి పంచభూతాలూ అదుపులో పెట్టగల శక్తి వస్తుంది. పరకాయ ప్రవేశంలాటి సర్వ విద్యలూ - దివ్యశక్తులూ - అదృశ్యం కావటం లాటి దివ్యశక్తులూ సర్వం సమకూరుతాయి.

జగన్మాత ఉపాసనతో - ఈశ్వరోపాసనతో - దైవ ఉపాసనతో - సాధకుని భక్తి సాంద్రతను బట్టి ఇవి ఒక్కొక్కటిగా, లేదా అన్నీ సాధించగలుగుతారు.

అయితే ఇవి ప్రదర్శనకూ, స్వార్థానికీ ఉపయోగించినమరుక్షణంనుండే ఆసాధకునికి పతనం ప్రారంభమౌతుంది. ఎంత కీర్తి వస్తుందో, అంతటి అపకీర్తి అనుభవించాలి. ఎంతటి పూజనీయత వస్తుందో, అంతటి అవమానమూ ఎదుర్కోనాలి. ఎంతటి భోగం అనుభవిస్తాడో, అంతటి దుఃఖమూ అనుభవించాలి - వీటిని తృణీకరించిన సాధకుడే మోక్షానికి అర్హుడు. తృణీకరించిన సాధకునికి ఇవి దాస్యంచేస్తాయి.

## 31 శ్లో ॥ శివునిచే ఏర్పరుపబడిన 64 (చతుష్షష్టి తంత్రములు. అవి కేవలం తంత్రములు. శ్రీ విద్య ఒక్కటే మోక్ష సాధనం.

**31 శ్లో** ॥ చతుష్షష్ట్యా తన్త్రైః, సకల మతిసన్ధాయ భువనం
స్థిత స్తత్తత్సిద్ధి ప్రసవ పరతన్త్రైః, పశుపతికిః
పునస్త్వన్నిర్బన్ధా దఖిల పురుషార్థైక ఘటనా
స్వతన్త్రం తే తన్త్రం క్షితితల మవాతీతరదిదమ్ ॥

**అర్థము :-** ఓ జగన్మాతా! భగవతీ! నీపతి అయిన పశుపతి 64 (అరవైనాలుగు) విధములైన శంబరాది తంత్రములను ఈ భూమండలంపై ప్రవేశపెట్టాడు. సకల సిద్ధి ప్రదాయకములూ, ఐహిక (ప్రాపంచిక) ఫలదాయకములూ అయిన ఈ తంత్రములద్వారా, సమస్త ప్రపంచమును మోహింప జేసి వూరకున్నాడు (మిన్నకున్నాడు) మరల నీ నిర్బంధమువలన (నీ బలవత్తరమైన కోర్కెవలన) ధర్మార్థకామ మోక్షములనెడు పురుషార్థములను ప్రసాదించునదైన - నీ తంత్రమును అనగా శ్రీ విద్యాతంత్రమును ఈ లోకమునకు ప్రసాదించాడు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు శివప్రసాదములైన 64 తంత్రములను గురించీ, వాటన్నిటినీ మించిన అమ్మవారి శ్రీ విద్యా తంత్ర మాహాత్మ్యం గురించీ వివరిస్తున్నారు.

పార్వతీదేవి పరమ శివుణ్ణి - ఒక్కొక్క సందేహం, ఒక్కొక్క వ్రతవిధానం, పూజావిధానం గురించి పరిప్రశ్నిస్తుంది. తీరికూర్చుని - పనిలేక అడిగేప్రశ్నలు కావు అవి. అన్యోన్య దంపతులైన వారిరువురూ - ఆధ్యాత్మికంగా కూడా ఒకే అత్యున్నతస్థాయి గలిగిన యోగస్థితులు! పార్వతి పరమేశ్వరుణ్ణి ప్రశ్నించే ప్రశ్నలన్నీ ఆధ్యాత్మికమైనవి! వాటన్నిటికీ పరమశివుడు అంతటి స్థిర చిత్తంతోనూ, యోగమార్గ దర్శకంగానూ జవాబులు చెబుతాడు. అట్లా ప్రపంచంలో ఎన్నోవ్రతాలూ, పూజలూ, పూజా విధానాలూ ధ్యానపద్ధతులూ, మంత్రాలూ మంత్ర జప అనుష్టాన విధానాలూ ప్రవేశపెట్టారు జగన్మాత, జగత్పిత లిద్దరూ! ఈ ప్రపంచంలో తమ లీలతో జన్మించిన మానవ కోటికంతటికీ మరల మోక్ష మార్గం చూపాలన్న తపనతో వచ్చినవే ఆ ప్రశ్నలూ, సమాధానాలూ అన్నీనూ! అట్లాగే ఈశ్వరుడు పార్వతికి 64 తంత్రాలు (చతుష్షష్టి) తంత్రాలు గురించి పూజా విధానాలు బోధించాడు. అవి ప్రపంచమంతటా వ్యాప్తిలోనికి వచ్చాయి.

తంత్రము : అనగా చక్కగా చేసేపని, ఆచరించేపని - అని అర్థం కానీ - కాపాలికులు - వామాచారులు - ఇలా కొందరు స్వంతమతాలతో పూజా విధానాలతో బయల్దేరి ఆ 64 తంత్రాలనూ - కేవలం తమ స్వార్థ ప్రయోజనాల కోసమూ, సిద్ధులకోసము, నరబలులూ, జంతుబలుల స్థాయికి దిగజార్చారు. తంత్రమంటే - మోసము అనీ - ఒకానొక స్వార్థపూరిత మైన పూజా విధానమనే స్థితిలోనికి దిగజార్చారు. తాంత్రిక విద్యా గ్రంథాలలో ఈ తంత్రముల వివరాలూ - వాటి ద్వారాపొందే ఇంద్ర జాలాది విద్యల వివరాలు వుంటాయి!

ఈ తంత్రవిద్యలు - సాధకులను మోక్షమునకు చేరనివ్వవు. మరి ఈశ్వరుడెందుకు ప్రచారం చేసాడు ? ఈనాటి ఉదాహరణ ఒకటి చెప్పుకుందామా!

రిబేటు అనీ, ఒక వస్తువుకొంటే మరో వస్తువు ఉచితం అనీ ప్రకటనలూ, ప్రచారాలూ, పేపర్లలో టి.విలలోని నిత్యం మనందరం చూస్తూనే వున్నాము.

వెయ్యిరూపాయల చీరె - 250కి ఇస్తామనీ - ఒక డిటర్జెంటు పౌడరు నాలుగు కిలోలు కొంటే ఒక ప్లాస్టిక్ డబ్బా వుచితమనీ - పది పెన్సిళ్ళుకొంటే ఒక రబ్బరు వుచితమనీ ప్రకటిస్తుంటారు వ్యాపారస్తులు! ఈ ఉచితం - రిబేటు - ఆకర్షణా - అత్యాశా, అంతా ఇంతాకాదు. పాతస్టాకు - ఆ "ఉచితం" వస్తువుతో సహాకలిపి ధరవేసి అమ్మే తెలివితేటలు వ్యాపారస్తులవి! ఉచితంగా వూరికే - వస్తువు - వస్తోందన్న దురాశ - అత్యాశ మనది! వెయ్యిరూపాయల చీరె - 250కి వస్తోందనీ - అది - మన్నుతుందా ? రంగు వెలిసిపోదా, డేమేజిలేదుకదా ? అనీ సవాలక్ష ప్రశ్నలువేసి - ఒక చీరెకొంటే మరోచీరె వుచితంగా ఇస్తారా ? అని పీడించి - మరీ కొంటుంటాము మనము అవునా ? మనదురాశా - వ్యాపారస్తునికి - మనలోని "ఆశ" "ప్రలోభం" cash (క్యాష్) చేసుకొనే తెలివితేటల మధ్య నడిచే చక్కని నాటకం - సంభాషణ - క్రియలే - తంత్రము - ఇదే మోహ పరిచే తంత్రం - భ్రాంతి పరచే తంత్రము అవునా ? - అలాగే ఈశ్వరతంత్రాలు - ఈశ్వరుడు సదుద్దేశ్యంతోనే ప్రవేశపెట్టాడు - కానీ సాధకులలోని ప్రలోభ మనస్తత్వం - దురాశ - వారిని కేవలం తంత్రాల వరకే పరిమితం చేసి - ముందుకు సాగనివ్వలేదు మోక్ష పథంలో! అదీ కథ!

ఆ స్వామి స్వానుభవాలెన్నో వున్నాయి. ఈశ్వరుని బాధలు ఈశ్వరునివి! మరి! కోటిమంది తపస్సుచేస్తే - కోటిమందిలో ఏ ఒక్కడో - సాయుజ్యముక్తి కోరుతాడు. మిగతా అందరూ - తమ కోర్కెల జాబితా చదువుతారు. త్రిలోకాధికారం మొదలు - చిరంజీవత్వం వరకూ కోర్కెల గుర్రాలే వారివి. వీరికి మోక్షం యొక్క గొప్పతనమూ - జనన మరణాలు లేని పరంధామ వాసములోని స్వాత్మానంద స్థితి - వివరించి చెప్పినా వినరుగాక వినరు. ఇలాటి తామస - రాజసప్ర వృత్తిగల వారికి - ఆ తంత్రాలు - 64 తంత్రవిద్యలే సరి అయినవి. వాటి సాధనతో కొన్ని దివ్య శక్తులుపొంది - అవి ప్రదర్శిస్తూ - ఇతరులను హింసిస్తూ - మరల మరల ఆపాపం అనుభవించటానికి జనన మరణ చక్రంలో పడికొట్టుకుంటుంటారు. వారికదే సరి అయినది!

కానీ - వచ్చిన చిక్కుఎక్కడంటే - రానురాను - పండితులూ, శాస్త్ర విద్యాపారంగతులూ సాత్వికులూ అయిన సాధకులు కూడా ఈ తంత్ర విద్యల పట్ల ఆకర్షితులు కావటం ప్రారంభించారు. ఈశ్వరుడు - తంత్ర విద్యలను భూమిమీద వదిలి - తన బరువు తగ్గించుకుని సమాధి స్థితిలో కూర్చున్నాడు హాయిగా! ఇక లోకంలో పామర పండితులు అంతా తంత్ర విద్యలతో నిధులు నిక్షేపాల ఆశ నిరాశలలో - సిద్ధుల ప్రలోభాలలో - స్వార్థ ప్రయోజనాలతో, ఇతరులను పూజల పేరుతో వంచించే స్థాయికి దిగజారారు.

జగన్మాత అయిన పార్వతి హృదయం - మాతృ హృదయం కలత చెందిందీ పరిస్థితికి!

ఈశ్వరునికై తపస్సుచేసి - కోరరాని కోర్కెలు కోరే తామసులైన రాక్షసులకు - ఈతంత్రాలే శరణ్యం - ఇది బావుంది.

కానీ - సాత్వికులైన భక్తులు - మోక్షాపేక్షతో తంత్రసాధన ప్రారంభించి, మధ్యలో ఆ తంత్ర ప్రభావ సిద్ధులతో - శక్తుల వలలో పడి మోక్ష మార్గంనుండి పతనం కావటం ఆతల్లి హృదయం సహించలేక పోయింది. అందుకే ఆమె మరల మరలా ఈశ్వరుని ఈ తంత్రాలకు అతీతమైనదీ, స్మరణ, జపధ్యాన, స్తోత్ర మాత్రంచేత - సాదు సజ్జనులకు - సాత్విక భక్తులకు మోక్షం ప్రసాదించేది అయిన ఒక దివ్య విద్యను ఆవిష్కరింపమని కోరసాగింది! అది ఆమె కోసంకాదు. జగత్ హితవుకోసం! అదీ జగన్మాతృ హృదయం. ఆమె అలా కోరగా కోరగా, పోరగా, పోరగా - జగత్పిత అంగీకరించాడు. మహాశక్తి విలయ - విశృంఖల ప్రవాహం ఈ తంత్రాలు అయితే - ఆ మహాశక్తిని ఒక క్రమ మార్గంలో పయనింపజేసే నదీ గమనం - (రిజర్వాయల్‌లో నీళ్ల నిలవచేయటంలా) లాటిదిగా వుండాలి. క్రొత్త విద్య అదే శ్రీ విద్య. అమ్మవారి విద్య అమ్మవారి తంత్రము శ్రీచక్రమూ, శ్రీ చక్రార్చనగా, శ్రీ విద్యా - అట్లా ఈశ్వరుని హృదయంలో నుండి - రూపుదిద్దుకుని - అమ్మవారికి భోధింపబడి - భూలోకంలో ఆవిష్కరింపబడింది - జగన్మాత కరుణతో! అమ్మవారి చెవులకు తాటంకాలుగా కూడా ఆ శ్రీ విద్యా స్వరూప శ్రీ చక్రాన్నే అమర్చాడు పరమశివుడు - ఇది సాధకులను మోహమునకూ - భ్రాంతికీ గురించేయనిది. సర్వ కోర్కెలూ (సాధకులకు శ్రేయస్కరమైనవి మాత్రం) తీర్చుతుంది. భోగమూ (అవసరమైనంత వరకూ మాత్రం) మోక్షమూ ప్రసాదిస్తుంది! అదే శ్రీ విద్య.

ఈ వివరాలన్నిటినీ ఆది శంకరాచార్యులవారు 31 వ శ్లోకంలో పొందుపరచి మనకు తమ అనుగ్రహ ప్రసాదంగా అందించారు గమనించండి!

## 32. శ్లో ॥

## అమ్మవారి పంచదశీ మంత్ర స్వరూపము.

**32. శ్లో॥ శివ శక్తిః కామః, క్షితిరథ రవి శ్శీత కిరణః**

**స్మరో హంస శ్శక్ర స్తదనుచ పరా మార హరయః**

**అమీ హృల్లేఖాభిస్తి సృభి రవసానేషు ఘటితాః**

**భజన్తే వర్ణాస్తే, తవజనని! నామావయవతామ్! ॥**

అర్థము :- ఓ జగజ్జననీ! భగవతీ! శివుడు, శక్తి, కాముడు (మన్మధుడు) క్షితి, మరియు రవి (సూర్యుడు), శీత కిరణుడు (చంద్రుడు) - తర్వాత పర - మార - హరుడు. అనువారల సంకేతములు (చిహ్నములు) అయిన వర్ణములు (అక్షరములు) మూడు హృల్లేఖలు "హ్రీం" చివరియందు చేరగా - ఆ వర్ణములు (ఆ అక్షరములు) తల్లీ! నీ నా మావయవములు - (అనగా, నీ నామమూ - నీరూపమూ) అయిన మంత్రము అగుచున్నది. నీ మంత్రరూప శరీరమగుచున్నది.

"క ఏ ఈ ల హ్రీం, హ స క హ ల హ్రీం - స క ల హ్రీం"

అనే ఈ మంత్రమే పంచదశీ మంత్రము. లేక పంచదశాక్షరీ మంత్రము. ఇదే నీ మంత్రకూట శరీరము. ఇదే నీ నామము. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, అమ్మవారి పంచదశీ మంత్రస్వరూపాన్ని - ఆ జగన్మాత యొక్క మంత్రకూట శరీర స్వరూపాన్ని - ఒక "పద సమస్య' ' - "పజిల్"లా అందించారు.

శివుడు - శక్తి, కాముడు (మన్మధుడు) క్షితి (భూమి) - అనీ రవి (సూర్యుడు), శీత కిరణుడు, చంద్రుడు, స్మరుడు (మన్మధుడు) హంసుడు (సూర్యుడు), శక్రుడు (ఇంద్రుడు) - అనీ - పరా (పరాశక్తి) మారుడు (మన్మధుడు) హరి, విష్ణువు అనీ ఇట్లా మూడు ఖండాలుగా ఆయాదేవతల వర్ణములు (అక్షరములు) ఆ వర్ణములు శక్తులు - తో ఏర్పడిన అమ్మవారి పంచద శాక్షరీ మూలమంత్ర స్వరూపాన్ని ఒక "పజిల్" లా చెప్పారు. ఇవి వివరంగా - ఆయా అసలైన అర్థాలతో తెలుసుకోవాలంటే చాలా కృషిచేయాలి. దేవీ ఉపాసన - శాస్త్రజ్ఞానం - పాండిత్యం - సంస్కృత భాషాపాండిత్యమూ, - ఓర్పుగా వివరించగల శక్తి - అర్హులకు చెప్పగల పరేంగిత జ్ఞానం వున్న పరమగురువులను, సేవించి, వారిని విసింగించక, పీడించక - వారు సుప్రసన్నులుగా ఉన్న సమయంలో - వారిన అర్థించి - మరీ తెలుసుకోవాలి నిజమైన భక్తి ప్రపత్తులు శ్రీ విద్యయందు గల సాధకులూ, భక్తులూ! అంతవరకూ - అమ్మవారి పంచదశాక్షరీ మంత్రస్వరూపంగా మాత్రమే అర్థంచేసుకుని - ఆ మంత్ర జపంద్వారా - మనకు అర్హత వచ్చినపుడు - ఆ పరమగురువెవరో - మనకు లభ్యమయి బోధిస్తారని - భావించాలి. కొన్ని మంత్రని గూఢమైన విషయాలు - ఇలాగే వివరిస్తారు పరమ గురువులు. ఆపనే చేశారు ఆదిశంకరాచార్య. అందరికీ వివరించి చెప్పినా "ఓస్! ఇంతేకదా ?" అని మంత్రాన్నీ మంత్రార్థాన్నీ చులకన చేసే ప్రమాదముంది గనుక అవునా ?

# 33 శ్లో॥ అమ్మవారి మంత్రోపాసన.

**32 శ్లో॥ స్మరం యోనిం లక్ష్మీం త్రితయ మిదమాదౌ తవమనోః**
**నిధాయైకే నిత్యే నిరవధి మహా భోగ రసికాః**
**భజన్తి త్వాం చిన్తామణి గుణని బద్ధా క్షవలయాః**
**శివాగ్నౌ జుహ్వన్త స్సురభి ఘృత ధారాహుతి శతైః**

**అర్థము :-** ఓ నిత్య స్వరూపురాలైన జగన్మాతా! నీ మంత్రమునకు ముందు "స్మర" బీజమును (మన్మథ బీజమును), భువనేశ్వరీ బీజమును, లక్ష్మీ బీజమును కలిపి అనగా

స్మరబీజము - "ఐం"
భువనేశ్వరీ బీజము - హ్రీం
లక్ష్మీ బీజము - శ్రీం
ఈ మూడూ కలిసి ఐం, హ్రీం, శ్రీం

నీ మంత్రముగా ధ్యానించుచూ, నిరవధిక మహా భోగరసికులైనవారు, చింతామణులను రత్నములను చేత కూర్చబడిన అక్షమాలలను (జపమాలలను) చేతులందు ధరించి, - మంత్ర జపము చేయుచూ, శివాగ్ని యందు, కామధేనువు యొక్క నేతిధారలతో, అనేకా హుతులతో హోమము చేయుచు, నిన్ను సేవించుచున్నారు. ఈ శ్లోకమునందు శ్రీ శంకర భగవత్పాదులవారు అమ్మవారి మూలమంత్ర జపధ్యాన - అంతర్యాగ విధానము గురించి ఉపదేశిస్తున్నారు. అత్యంత భోగములను కోరేవారు కొందరుంటారు. త్రిలోకాధి పత్యము - ఇంద్ర పదవి ఇలా, అత్యంతభోగప్రదమైన మహారాజ పదవి, జమిందారులుగా, కోటీశ్వరులుగా భూలోకంలో వుండాలని కోరుకుంటారు కొందరు వీరంతా అతిభోగరసికులు - భోగములు వీరిప్రాణం - వీరిధ్యేయం, (మోక్షాన్ని కోరేవారు వీరిలో చాలా అరుదుగా వుంటారు) ఈ నిరవధిక భోగరసికులైనవారు, మన్మథ బీజం, (ఐం) భుశనేశ్వరీ బీజం (హ్రీం), లక్ష్మీబీజం (శ్రీం) అయిన వర్ణాలు (అక్షరాలు కలిపి - ఐం - హ్రీం - శ్రీం అనేత్ర్యక్ష్యరీ "మంత్రంగా జపిస్తూ - తమ భోగానికి తగినట్లు చింతామణి అక్షమాలలు అనగా - స్ఫటిక మణిమాలలు - లేదా స్ఫటిక పూసలమాలలు - జపమాలలు - చేతితో త్రిప్పుతూ - మానసికంగా, శివాగ్నిలో - అనగా ఆజ్ఞాచక్రంలో ఈశ్వర రూపాన్ని ప్రతిష్ఠించుకుని - ఆ ఈశ్వరుని ప్రీతిగా మానసికంగా హోమం చేస్తూ తమలోని ఆలోచనలనే సమిధాలుగా, తమలోని సర్వరసములనూ కామ ధేనువునే తిధారలుగా భావిస్తూ - అంతర్యాగము - అనగా మానసిక పూజ యాగము చేస్తుంటారు.

వీరు నిరంతరం చేసే ఈ సాధనకు మెచ్చి, జగన్మాత వీరికి, వారి వారి వాంచిత ఫలాన్ని ప్రసాదిస్తుంది. సాధారణమైన మనబోటి వారము, బాహ్యపూజ చేసుకోగలిగిన వారు - తమ ఇష్టదైవం పూజా విధానాన్ని అనుసరించి పూజ చేసుకుంటారు - లలితా సహస్రనామ స్తోత్రపారాయణం, సౌందర్యలహరి "శ్లోక పారాయణము, భవానీ భుజంగ ప్రయాతస్తోత్ర పారాయణం, విష్ణు సహస్రనామ స్తోత్రపారాయణము, సుందరకాండ పారాయణము - ఇట్లా తమ మనసుకు నచ్చిన పద్ధతిలో తమ తీరిక సమయంలో సామూహిక పారాయణంగానో, తాము ఒక్కరిగానో చేసుకుంటుంటారు.

స్ఫటికమాల - రుద్రాక్షమాల - తులసి పూసల మాల, చందనపు పూసలమాల, తామర పూల దుద్దులోనుండి - పూసలుగా చేసి తామరపూసల మాల- ఇలా మనకు అందుబాటులో వున్న జపమాలతో అమ్మవారి మూలమంత్రాన్ని - పైత్ర్యక్ష్యరీ మంత్రాన్ని వీలైనన్నిమార్లు, 108, 1000 - ఇలా జపించుకోవచ్చు. జపమాలలు దొరకనివారు - అవి తిప్పుతుంటే ఎవరేమను కుంటారోనని భయపడే మొహ మాటస్తులూ - తమ చేతివ్రేళ్ల గణుపులు లెక్కపెట్టుకుంటూ - జపం చేసుకోవచ్చు, జపమాల ఏదైనా - జపంలో చిత్తశుద్ధీ, భక్తీ నిండివుంటేచాలు.

ఆహుతులు - హోమం - వీలుపడవని భాధపడనవసరం లేదు. మనం చిత్తశుద్ధితో చేసే ప్రతిపనీ, ప్రతి మంత్రోచ్చారణా, అమ్మవారి యజ్ఞమే! హోమమే!

"జపో జల్పోశిల్పం -" అంటూలోగా శ్లోకంలోనూ "శివమానసిక పూజా"స్తోత్రంలో "ఆత్మాత్వం గిరిజామతే "అంటూనూ - ఆదిశంకరాచార్యులవారు మనబోటి వారి కోసం సులభ తరుణోపాయం శలవిచ్చి వున్నారు కాదా ? పదండి - మన పద్ధతిలో మన జపం - ధ్యానం - పారాయణ - భక్తితో, శరణాగతితో చేద్దాం! ఆ జగన్మాత మనకేది శ్రేయస్కరమో అది ప్రసాదించి ఆశీర్వదిస్తుంది.

## 34 శ్లో ॥ ఈశ్వరుని ఈశ్వరి యొక్క పంచవిధ సామ్యము. "నవాత్మ తత్వము." ఆనంద భైరవీ భైరవులు.

34 శ్లో॥ శరీర త్వం శమ్భో శ్శశిమి హిర వక్షోరుహ యుగం -
తవాత్మానాం మన్యే, భగవతి, నవాత్మాన మనఘమ్ :
అతశ్శేష శ్శేషీ త్యేయ ముభయ సాధారణతయా
స్థితస్స మ్బన్ధోవాం, సమరస పరానంద పరయోః

**అర్థము :-** ఓ భగవతీ! జగన్మాతా! నీవు శంభునకు (ఈశ్వరునకు) రవి, చంద్ర స్తనయుగముగా గల శరీరమగుదువు. అమ్మా నీ శరీరము, దోషరహితమైన నవవ్యూహాత్మకమైన ఆనంద భైరవునిగా తలంచెదను! ఇందువలన శేష శేషీ భావసంబంధము (మిగిలి వున్నది శేషము - మిగలనిది - శేషీ) సామరస్యముతో గూడి (శివ శక్తుల - నామ, రూప, అనుష్ఠాన, అధిష్ఠాన, అవస్థాన పంచవిధ సామ్యములు) అనంద భైర వీరూప చిచ్ఛక్తులయిన మీ ఇరువురకు ఉభయ సాధారణముగా నున్నది.

ఈ శ్లోకంలో - శ్రీ శంకర భగవత్పాదుల వారు, పరమేశ్వరీ పరమేశ్వరుల ఏకత్వాన్ని - జగన్మాత - జగత్పితల ఐక్యరూపాన్ని వ్యూహాత్మకంగా వర్ణించారు.

ఆ తల్లి - ఆ తండ్రి ఇరువురూ సర్వవిధాలా సమ ఉజ్జీలు, పరస్పరం సమశక్తి సంపన్నులు., సమసామ్యము గలవారు. ఒకరు శేషం అనగా పైకి కనిపించే భాగం - మరొకరు శేషీ - పైకి కనిపించని భాగం - అనగా ఒకరిలో ఒకరు అంతర్లీనమై పోయిన ప్రకృతి పురష తత్వానికి ప్రతిబింబాలు, ఇరువురికీ భేధం లేదు. అందువలననే - శ్రీ ఆదిశంకరాచార్యులవారు. ఆనాడు - కైలాసములో - సౌందర్యలహరిని - పరమేశ్వరుని ద్వారా ఉపదేశం పొందిన తర్వాత ఒక సంఘటన జరిగింది.

"నాయనా! నీ తల్లి అయిన జగన్మాత సౌందర్యాన్ని - నా హృదయం ద్వారా - నాలో సాయుజ్యం పొంది మరీగ్రహించావు. నేనూ నీకు ఉపదేశించ వలసినదంతా ఉపదేశించాను. నీ కృషికీ - నీదీక్షకూ, నీ భక్తికీ మెచ్చాను. నీకేమి కావాలో కోరుకో, ప్రసాదిస్తాను" - అన్నాడు పరమశివుడు.

జగద్గురు శ్రీ శంకరా చార్యులవారు ఆనందంతో తబ్బిబ్బై పోయారు. "పరమశివా! పరివ్రాజకాచార్యుడిని! నాకు అంటూ కావలసినదేమున్నది తండ్రీ! జగన్మాత - జగత్పితల దర్శనం, కైలాసంలో - స శరీరునిగా దర్శించే భాగ్యాన్ని ప్రసాదించావు, నా ఈ శరీరానికీ - జీవితానికీ అదిచాలు! శ్రీ చక్రార్చన చేయలేని వారికోసమూ, అమ్మవారి తత్వం తెలుసుకోవాలని జిజ్ఞాస కలవారి కోసమూ, పండిత పామరులైన ఎందరో భక్తుల కోసము, వారు తరించే సులభోపాయంగా, పారాయణయకు వీలుగా, జగన్మాత సౌందర్యలహరిని "రచించటానికి అనుమతి ఇచ్చి, మూలభావాన్ని - ఈశ్వరవాణిగా ప్రసాదించావు. ఇన్ని అనుగ్రహించిన నీ అపారదయకు - నేనేమివ్వగలను తండ్రీ! నా మనసా వాచా కర్మతో చేసే "ప్రణతి" తప్ప! ఇంకా ఏమి వరం

కోరుకోను తండ్రీ నిన్ను? "అన్నారు ఆదిశంకరాచార్య. ఈశ్వరునికి ముచ్చటవేసింది. ఈ బ్రహ్మచారి నిస్వార్థం - ప్రలోభ రహితమైన - పరోపకార పారీణత నిండిని నిర్మోహ నిశ్చల భక్తికి ముగ్ధుడై పోయాడు ముక్కంటి వేల్పు!

"అట్లాకాదు -తండ్రిని ఇస్తానంటున్నాను - వద్దనక కోరుకో!" అన్నాడు పరమేశ్వరుడు అపార కరుణా రసవృష్టి కురిపిస్తూ, "కోరుకో నాయనా!" అన్నది జగన్మాత కోటివెన్నెలల చిరునవ్వుల చంద్రికలు కురిపిస్తూ, "అలాగే తల్లీ! జగత్పితా! కోరుకుంటాను! అమ్మవారి సౌందర్యలహరిని ప్రసాదించావు నాకోర్కె మేరకు! నా హృదయంలో మీఇరువురిపై సమానభక్తి ప్రపత్తులున్నాయి, అందువలన నేను రచనచేసిన స్తోత్రాలలో "శివానందలహరి" వున్నది. శివభుజంగ ప్రయాత స్తోత్రమూ, శివాపరాధక్షమాపణ స్తోత్రమూ, అర్ధనారీశ్వర స్తోత్రమూ, దక్షిణామూర్తి స్తోత్రమూ, అర్ధనారీశ్వర స్తోత్రమూ, - పంచ భూతాత్మిక పంచలింగ స్తోత్ర పంచకమూ ...... "చెబుతున్న శంకరా చార్య వాక్కు తక్కున ఆగింది క్షణకాలం! "పంచభూతాత్మక పంచలింగ స్తోత్ర పంచకమూ" .. మరల మరలా ఆ వాక్కు ఆచార్యుని హృదయంలో సుడులు తిరిగింది ...

జగత్పిత చిరునవ్వునవ్వాడు. "ఊఁ చెప్పు పంచ భూతాత్మిక పంచలింగస్తోత్ర పంచకమూ..'

"స్వామీ! పరమశివా! కర్తవ్యం బోధ పడింది! పంచముఖ స్వరూపమైన నీ శివస్వరూప శివలింగాలను ఐదు - పంచ శివలింగములు ప్రసాదించు తండ్రీ! వాటిని - ఆయా పుణ్యప్రదేశాలలో ప్రతిష్ఠించి ఆ లింగదర్శన స్పర్శన మాత్రంచేత - పరమ పాపులుకూడా పవిత్రులయ్యే విధంగా - నేను జనానికి ఉపయోగపడేట్లు వరం అనుగ్రహించు చాలు!" అన్నారు ఆచార్యులవారు. ఈశ్వరుడు - ఈశ్వరి పరస్పరం ఒకరివైపు ఒకరు చూచుకున్నారు. ఇరువురి కళ్ళు కలుసుకున్నాయి. ఇరువురి పెదవులపై చిరునవ్వు - మెరుపు తీగెలా క్షణకాలం కదలాడింది.

"చక్కని - నీ వ్యక్తిత్వానికి తగిన గొప్ప కోర్కెకోరావు శంకరా! ఇదుగో ప్రసాదిస్తున్నారు. కైలాస శిఖరంలోని ప్రతిలింగాకారమూ, శివ స్వరూపమే! నారూపమే! ఇది భూలోకం చేరటమంటే - ఈశ్వరుడు భూమిపై నిలవటమే!" అంటూనే సంకల్ప మాత్రంచేత ఈశ్వరుడు ఐదు స్ఫటికలింగాలను సృష్టించి తాను - జగన్మాత - వాటిని - స్పృశించి - దివ్యత్వం నింపి - ఆది శంకరులకు ప్రసాదించారు.

"ధన్యుడను తండ్రీ! ఇక శలవా జగన్మాతా!" అన్నాడు ఆదిశంకరాచార్య! ఆ పంచలింగాలనూ ప్రాణప్రదంగా తన ఉత్తరీయంలో మూటలా కట్టి - భుజంపై నుండి ముందుకు - వ్రేలాడ

వేసుకున్నాడు - ఉత్తరీయం నడుం చుట్టూరా బిగించాడు. చేతిలో "సౌందర్యలహరి" మూలం వ్రాసుకున్న తాళపత్రాలు భద్రంగా పట్టుకున్నాడు.

"వెళ్లిరా నాయనా!" అన్నారు జగన్మాత - జగత్పితలు, ఆచార్యులవారు బయల్దేరారు. అప్పుడు నందీశ్వరుడు అడ్డుకున్నాడు. - సౌందర్యలహరి తాళపత్రాల మీదే వున్నది నంది దృష్టి అంతా! శివలింగాలపైకి ఆతని ఆలోచనపోలేదు. తాళపత్రాలు ఎగరగొట్టాడు ఆచార్యుని కొమ్ములతో కుమ్మి, 41వ శ్లోకంవరకూ - "ఆనందలహరి" మూలం ఆచార్యుల చేతిలో మిగిలింది శేషంగా, "సౌందర్యలహరి" 42నుండి 99 శ్లోకం వరకూ గల భాగం - శ్లోకాలు "శేషి"గా - మిగలకుండా ఎగిరిపోయాయి!

తర్వాత - పార్వతీ పరమేశ్వరులు వచ్చి, నందిని శాంతింపజేసి, శంకరాచార్యులను - మరలా ఆశీర్వదించి సాగనంపారు. అంతబాధలోనూ ఆచార్యులవారు - తమ పొట్టచుట్టూరా వున్న ఉత్తరీయం తడుముకున్నారు. నంది పోటుకు - శివలింగాలు ఎగిరి పడిపోలేదు. అవి ఉత్తరీయంలో - తన పొట్ట భాగంలో - భద్రంగా వున్నాయి. అంతేచాలు! ఆచార్యులవారు - భూలోకానికివచ్చారు. సౌందర్యలహరిలోని శ్లోకాలు పోయినవాటి కోసం బాధపడ్డారు.

"ఆఁ! ఇంతటి విఘ్నం ఎందుకు జరిగింది ? ఇప్పుడు స్ఫురణకు వచ్చింది. విఘ్నేశ్వరునికీ మ్రొక్కలేదా తొందరలో!" అనుకున్నారు. పశ్చాత్తాప పడ్డారు. క్షమాపణ చెప్పుకున్నారు. "విఘ్నేశ్వర భుజంగ ప్రయాతస్తోత్రం" - "షణ్ముఖ భుజంగ" ప్రయాతస్తోత్రం" ఆచార్యులవారి హృదయంలో రూపుదిద్దుకున్నాయి. శివకుటుంబం - అంటే - విఘ్నేశ్వరుడు - సుబ్రహ్మణ్యేశ్వరుడు - జగన్మాత - జగత్పిత. కైలాస క్షేత్రపాలకుడైన నందీశ్వరుడు. ఈ ఐదుగురూ - ఐదు తత్వాలకు ప్రతిబింబాలు!

మనసారా శివకుటుంబానికి మ్రొక్కాడు. జగన్మాత జగత్పిత ప్రత్యక్షమై - మరలా ఆశీర్వదించారు. "సౌందర్యలహరి - ఎగిరిపోయిన శ్లోకాలలోని మూల భావం - నీ హృదయంలో సాక్షాత్కరిస్తుంది నాయనా!" అంటూ దీవించారు. వారి పాదాలచెంత - మరగుజ్జు - మూర్తి విఘ్నేశ్వరుడూ వున్నాడు ఆశీర్వదిస్తూ - ఆ ప్రక్కగా - కార్తికేయుడూ దర్శనమిచ్చాడు చిరునవ్వుతో, వాహనరూపునిగా వచ్చినంది - పశ్చాత్తాపం నిండిన చూపులతో "ఆచార్యా! మీ ఔన్నత్యం - ఉన్నత ఆశయం తెలియక - అర్థం చేసుకోలేక - ఘర్షణకు తలపడ్డాను. బాధపడకండి -" అన్నట్లు చూశాడు. అందరికీ మ్రొక్కారు ఆచార్యులవారు. సౌందర్యలహరి రచనకు

ఉపక్రమించారు. ఆ తర్వాత - భాతర దేశమునందలి ఐదు పుణ్యక్షేత్రములలో ప్రతిష్ఠించారు కైలాసం నుండి తెచ్చిన ఐదు స్పటికలింగాలను

మొదటిది - చిదంబరాలయమునందలి "మోక్షలింగము"

2వది "కేదారము" నందలి "ముక్తి లింగము"

3వది "నేపాలు" లోని "నీలకంఠా లయమునందలి "వరలింగము"

4వది "కంచికామకోటి పీఠమందలి "యోగలింగము"

5వది - శృంగేరి శారదా పీఠమునందలి "భోగలింగము"

ఈ ఐదు స్పటిక లింగములు - సాక్షాత్కు పరమశివుడు ప్రసాదించినవి గనుక - మహా మహిమాన్వితమైనవి. ఈ శివలింగ దర్శనం - స్పర్శన మాత్రంచేత మానవులకు మోక్షం సిద్ధిస్తుందనీ ఎంతటి పాపులూ, పునీతులౌతరనీ ప్రసిద్ధి, ఆదిశంకరాచార్యులవారు - ఈ మనదేశానికీ మనకూ ప్రసాదించిన స్తోత్రాలూ, సౌందర్యలహరి -తో బాటుగా ఈ శివలింగాలూ - వారి అవతార ఔన్నత్యానికి తార్కాణాలు! ఈ స్వానుభవంలో నుండి - ఈ శ్లోకం ఆచార్యులవారి హృదయసీమలో కదలాడింది.

జగన్మాత - జగత్పిత - ఇరువురికీ భేధంలేదు.

1. **కాలవ్యూహం :-** కాలస్వరూపం కాలస్వరూపులు వారిద్దరూ, ఈశ్వరుడు కాలాత్మకుడు. కాలాత్మిక ఆ తల్లి,

2. **కులవ్యూహం :-** అనగా షట్చక్రములను "కులము" అంటారు. ఇరువురూ ఆ ఆరు చక్రాలలో కొలువై వుంటారు.

3. **నామవ్యూహము :-** ఆనంద భైరవి - ఆనంద భైరవుడు పరమేశ్వరి - పరమేశ్వరుడు. భవానీ - భవుడు - శర్వాణి - శర్వుడు, ఇలా జంటనామాలలో ఒకరిలో ఒకరు ఐక్యమైన నామసామ్యముగల దంపతులు వారిద్దరూ!

4. **జ్ఞానవ్యూహము :-** ఇంద్రియముల ద్వారా, మనస్సు బుద్ధి మొదలైనవాటి ద్వారా, ఈ కనిపిస్తున్న జగత్తునందు - "సత్తు" - "చిత్తు" ఏదో తెలుసుకోవటమే జ్ఞానం! ఇది రెండు విధములు. 1. సభాగము - 2. విభాగము అని. సభాగము అనగా వికల్పము. అమ్మవారి స్వరూపము. విభాగము అనగా నిర్వికల్పము - ఈశ్వరుని స్వరూపము, ఈ రెండు భాగాల ఏకీకరణ వలన ఈ సృష్టిలోని సకల చరాచరకోటి జనిస్తున్నది. తల్లి విమర్శ, తండ్రి

ప్రకాశస్వరూపుడు. జగన్మాత అపరిమిత శక్తి ప్రవాహము, దానిని అదుపులో పెడ్తూ సక్రమమార్గంలో ప్రవహింపజేసి - ప్రాణులకు - శ్రేయస్సు కలిగించే అధికారి - జగత్పిత! ఇద్దరికిద్దరూ సమశక్తి యుతులు :

5. **చిత్త వ్యూహము** :- అహంకార పంచకములతో కూడినవ్యూహం ఇది. అహంకార పంచకమనగా,

1. అహంకారము = "నేను" అని జీవునికి కలిగే వ్యక్తిత్వ భావన. అదే పెరిగి పెరిగి - తానే సర్వం అనుకొనే అతిశయా హంకారంవరకూ - అహంకార స్వరూపమే!

2. చిత్తము. 3. బుద్ధి. 4. మహత్తత్వము. 5. మనస్సు. 6. నాదవ్యూహం = ఇది క్రియా - ప్రయత్నమునకు సంబంధించిన వ్యూహము. ఉదాహరణకు మూలాధారమునందు ప్రారంభమైన జ్ఞానం - చైతన్యం - త్రికోణ రూపిణియగు చక్రమందు పశ్యంతి - భావనాత్మకంగా మారి (నాభిస్థానము నందు) మణిపూరక చక్రంలో - నాదాత్మకమై సాగి, అనాహతంలో నాదత్మక భావ పరంపరా జ్ఞానంగా "మధ్య మా"గా పరిఢవిల్లి - విశుద్ధి చక్రంలోని వైఖరీరూపంలో శబ్దాలుగా, మాటలుగా, కవిత్వంగా, గానంగా, ఉపన్యాసంగా - మానవ వాక్శక్తి కళగారూపొందిన, - నాదవ్యూహం - ఇందులోని - నాదబిందు కళారూపిణి జగన్మాత. నాద బిందు కళాతీతుడు ఈశ్వరుడు. ఇరువురూ నిండివున్నారు.

ఇక వామ, జ్యేష్ఠ, రౌద్ర, అంబిక అనువారు నలుగురు శక్తులు. వీరు శ్రీ చక్రమునందు అధోముఖములై వున్న శివకోణ శక్తులు (చతుర్యోని శక్తులు అంటారు వీరినే) - "త్రికోణ" స్వరూపిణులు - వీరే. ఇచ్ఛా, జ్ఞాన, క్రియ, శాంతి, పర అనే ఐదు వామాది శక్తులూ శ్రీచక్రంలో ఊర్ధ్వ ముఖములైవున్న శక్తి కోణములు ఐదు - (త్రికోణ) శక్తి స్వరూపిణులై వున్నారు. వీరు - మొత్తం తొమ్మిది కోణములు గల శ్రీ చక్ర స్వరూపంలో జగన్మాత - జగత్పితల స్వరూప ప్రతిబింబములు!

7. **బిందువ్యూహం** :- మూలాధారం మొదలు - ఆజ్ఞాచక్రంవరకూ గల షట్చక్ర సమూహము. బిందువ్యూహము అంటారు.

8. **కలావ్యూహము** :- యాభై (50) కలలై (కళలై) అక్షరములు, హల్లులు - వాని సంఘము. ఇవీ జగన్మాత జగత్పితల ఐక్యస్వరూపాలే.

9. **జీవ వ్యూహము** :- భోక్తృ సంఘము. అనగా భక్తులగు జీవుల సమూహము. "భోక్త - భోగ్యము - భోగము" అను రూపములచే - ఈ తొమ్మిది వ్యూహములు - త్రిఖండములుగా

మారుతున్నవి. మానవ శరీరంలో నయినా, పరమేశ్వరీ పరమేశ్వరుల రూపమైన బ్రహ్మాండంలో నయినా ఈ త్రిఖండములూ వున్నాయి అంతర్గతంగా!

ఈ నవాత్మక వ్యూహాత్మికలగు నవ విధశక్తులయిన జగన్మాతగానీ, జగత్పిత అయిన ఈశ్వరుడు గానీ, "నవ వ్యూహాత్మకుడు" నవవ్యూహాత్మిక" అని కొలువబడతారు. పిలువబడతారు.

అందువలననే వారిద్దరూ - శేష - శేషీ భావము-తో ఐక్యరూపంతో వున్నారు.

ఆనంద భైరవుడు - ఆనంద భైరవిగా. ఇంతటి - కొండంత అర్థాన్ని ఒక్క శ్లోకంలో పొందుపరచి జగన్మాత - జగత్పితల ఐక్యరూపాన్ని తాను దర్శించి మనందరికీ దర్శింపజేసారు ఆచార్యులవారు. పదండి ముందుకు - ఆచార్యుల వారివెంట.

## 35 శ్లో॥ సర్వం జగన్మాతయే! మరి వేరైనది ఏదీ లేదు.

**35 శ్లో॥ మనస్త్వం, వ్యోమత్వం, మరుదసి, మరుత్సా రథిరసి,**
**త్వమాప, స్త్వం భూమి, స్త్వయి పరిణతాయాం, నహి పరం,**
**త్వమేవ స్వాత్మానం పరిణమయితుం, విశ్వవ పుషా!**
**చిదానన్దాకారం, శివయువతి! భావేన భిభృషే!**

**అర్థము :-** ఓజగన్మాతా! భగవతీ! మనస్సునీవు, ఆకాశము నీవు, మరుత్తు నీవు, అగ్నినీవు, జలమునీవు, భూమి నీవు, - అట్లు నీవే ఈ చరా చరప్రపంచ స్వరూపముగా వున్నావు. నీకంటే ఇతరమైనదేయునూ లేదు. నీవే నీ స్వరూపమును ప్రపంచ రూపముగా పరిణమింప జేయుటకు గానూ, చిచ్ఛక్తి, ఆనందభైరవులుగా, చిదానందాకార రూపమును ధరించుచున్నావు.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, అమ్మవారి సర్వరూపమూ, సర్వవ్యాపకత్వమూ, నిరూపిస్తున్నారు. ప్రకృతిలోని అణువణువులోనూ పరమేశ్వరీ స్వరూపాన్ని దర్శించిన ఆ జగద్గురువు - మనందరికీ ప్రకృతిలో ఆ జగన్మాత విరాట్‌రూపాన్ని - నిబిడీ కృత స్వరూపాన్ని దర్శించమని పరోక్ష భోధ చేస్తున్నారు.

నవ వ్యూహాత్మకులైన ఆనందభైరవీ భైరవులుగా - జగన్మాత, జగత్పితలు లోగా (34) శ్లోకంలో వర్ణించిన ఆచార్యుల వారు ఈ శ్లోకంలో - ఆ జగన్మాత మనస్సు, ఆకాశం, మరుత్తు (గాలి) జలము - భూమి - ఇలా ఈ విశ్వరూప శరీరంగా, (విశ్వవపుషా) - గా పరిణమించి సర్వం జగన్మాత రూపంగా సాక్షాత్కరిస్తోందని నొక్కి వక్కాణిస్తున్నారు. సమయాచారులు - మహాయోగులూ - మహాత్ములు అయిన సాధకుల సాధనలో - షట్చక్రములోని భూతత్వం,

అగ్ని, తత్వం, జలతత్వం, వాయుతత్వం, ఆకాశతత్వం - మనస్తత్వం అన్నీ ఆ జగన్మాత స్వరూపంగా భావిస్తారు. ఇలా పిండాండ, బ్రహ్మాండములు రెండూ - జగన్మాత విశ్వరూపమే! ఈ శ్లోకంలోని అర్థాన్నే - భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలో - శంకర భగవత్పాదులవారు - రాగయుక్తంగా పాడుకొనేందుకు వీలుగా రచించారు.

మన మనసులోని కళ్లు, చెవులూ - ఈ స్తోత్రపారాయణతో తెరుచుకుని - జగద్గురువులు ఏమి ఉపదేశిస్తున్నారో - అర్థం చేసుకోగలిగితే - వారు దర్శించి - మనకు దర్శింపజేస్తున్న జగన్మాత - విశ్వరూపాన్ని అణువణువులో దర్శింపగలము. ధ్యానయోగాలు మనకు వీలుగాకపోయినా, స్తోత్రపారాయణం, నామజపం వీలౌతాయికదా ? చేద్దాము. ఈ జన్మ తరింప జేసుకుందాము.

## భవానీ భుజంగ ప్రయాతస్తోత్రం. 12వ శ్లో

శ్లో ॥ త్వమర్క, స్త్వమిందు, స్త్వమగ్ని - స్త్వమాప,
స్త్వమాకాశ, భూ, వాయ వ,స్త్వం, మహత్వమ్!
త్వదన్యో - న - కశ్చిత్ప్ర పంచో స్తి సర్వం
త్వమానంద, సంవిత్స్య రూపాం భజేహం ॥

అహో ఽ! ఎంత గొప్పగా వర్ణించారో ఆచార్యులవారు గమనించండి! ఒక్కసారి - మరొక్కసారి మనసు పెట్టి చదివితే కంఠస్థం అయ్యే శ్లోకం ఇది!

సౌందర్యలహరి 35వ శ్లోకంలో

"న హి పరం ..

త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వపుషా" అంటే - వారే -

భవానీ భుజంగ ప్రయాత స్తోత్రంలో

త్వదన్యో - న - కశ్చిత్ప్రపంచో స్తి సర్వం

త్వమానంద సంవిత్స రూపాం భజేహం ॥

అంటూ ఆ పరమానంద సంవిత్స రూపిణికి మ్రొక్కారు. మనల నీ మ్రొక్కమంటున్నారు.

10 వ అధ్యాయం సమాప్తం.

ఈ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు 28వ శ్లోకం నుండీ - 35వ శ్లోకం వరకూగల 8 శ్లోకాలలో - జగన్మాత తాటంకముల మహిమ, త్రిమూర్తులు ఆతల్లికి చేసేసేవ.

ఆ తల్లి భర్త సేవా పరాయణత - ఆతల్లి అణిమాద్యష్టసిద్ధుల కిరణములతో గూడిన స్వరూపాన్ని ధ్యానించిన సాధకునికి - మహాప్రళయాగ్ని కూడా ఎలా హారతిపట్టేదీ, ఈశ్వరుడు ఆవిష్కరించిన 64 (చతుష్షష్టి) తంత్రములూ - మరలా ఈశ్వరుడే అమ్మవారికోరికపై ఆవిష్కరించిన శ్రీవిద్యా తంత్ర మహిమ, అమ్మవారి పంచదశీ మంత్ర స్వరూపమూ, అమ్మవారి మంత్రోపాసన విధి, నహవ్యూహాత్మకుడైన ఆనందభైరవుడు, ఆనందభైరవిల ఐక్యతాస్వరూపమూ, - జగన్మాత వినా సర్వసృష్టిలో మరే ఇతర మూలేదనే ఆతల్లి జగద్వ్యాపకత్వ స్వరూపమూ అద్భుతంగా వర్ణించారు.

ఈ అధ్యాయము, భక్తి శ్రద్ధలతో పారాయణ చేసిన భక్తులకు అమ్మవారు అపార కరుణతో, సకల కార్యసిద్ధి, అపమృత్యు నివారణము, దుష్టులను, మూర్ఖులను కూడా - తనను భజించినవారిని, సజ్జనులుగా మారే శక్తీ, పంచభూతములలోని అగ్ని ప్రమాదములు నివారించటమూ, ఆర్థిక సమస్యలు తీరటమూ, క్షయవంటి దీర్ఘవ్యాధులు ఉపశమించటంలాటి సత్ఫలితాలు ప్రసాదిస్తుంది.

అమ్మవారు ఏంప్రసాదిస్తుందని గాక- మనం ఆ జగన్మాతకు భక్తితో మ్రొక్కి తరిద్దాం అని పూజించాలి. అవునా ? పదండి ముందుకు.

11 వ అధ్యాయంలోనికి.

## 11వ అధ్యాయము

## (ఏకాదశ అధ్యాయము)

ఈ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదులవారు 36వ శ్లోకంనుండీ, 41వ శ్లోకం వరకూగల 6 శ్లోకాలలో మన శరీరంలోనే, అనగా మానవశరీరంలో శివశక్తుల సమ్మేళన స్వరూపాన్ని ఆయాచక్రాలలో ఎలాదర్శించి తరించవచ్చో చక్కగా భోధిస్తున్నారు.

"దేహో దేవాలయప్రోక్తో, జీవోదేవస్సనాతనః

త్యజే దజ్ఞాన నిర్మాల్యం, సోహం భావేన పూజయేత్!"

అన్నారు పెద్దలు. ఈ మన మానవ శరీరమే ఒక గొప్ప దేవాలయము అందులో వున్న జీవుడే దేవుడు! సనాతనుడైన పరమాత్మ ఈ జీవాత్మయే! మనలోని వివిధ రాకాలైన అజ్ఞానమనే మాలిన్యాన్ని తొలగించి, "నీవే నేను, నేనే నీవు" అనే "సోహం" భావనతో ధ్యానించవలెను. అట్లు ధ్యానించ గలిగిన సాధకులకు తన దేహం అనే దేవాలయంలోనే కొలువై యున్న, ఇష్ట దైవ సాక్షాత్కారం తప్పక కలుగుతుంది.

బాహ్యంగా మన భారతదేశంలో వున్నగొప్ప దేవాలయాలన్నీ, మన మానవ దేహంలోని "షట్చక్రముల" ధ్యానయోగ పద్ధతి ఆధారంగా నిర్మంపబడినవే! స్థూలంగానూ, సూక్ష్మంగానూ ఆపురాతన దేవాలయాలను మనం పరిశీలించి చూస్తే వాటన్నిటిలో ఆనాటి ఆలయ నిర్మాణ శిల్పులూ, వాస్తుశిల్పులూ, ఒకానొక మహాతపస్సులా ఆలయ నిర్మాణాలు చేశారు. అందుకు ఆయా మహారాజుల యొక్క ఆధ్యాత్మిక ఉత్తమ సంస్కారం అండగా నిలిచింది. తమిళనాడు దేవాలయాలు ఇందుకు చక్కని ఉదాహరణ.

అందరికీ ధ్యానం, యోగం సాధ్యంకాదు - ముఖ్యంగా మనదేశంలో నివసించే, మధ్య తరగతి, అంతకు క్రింద తర గతిజనాలు నిరంతరం పని పాటలలో నిమగ్నమై వుంటారు. స్త్రీలూ అంతే! మరి వీరందరికీ దైవ శక్తి ఎలా అందాలి! అవే దేవాలయాలు! దైవశక్తిని పంచి ఇచ్చే ఆలయాలు అవి! ఎలాగో పరిశీలిద్దామా ? - హిందూ దేవాలయాలు ఒక దివ్యమైన తాంత్రిక యంత్ర స్వరూపంగా రూపొందించారు ఆనాటి విశ్వకర్మలు, శిల్పులూ - వారంతా మంత్రశాస్త్ర పారంగతులు. తంత్ర శాస్త్ర ప్రవీణులు, ఋషితుల్యులు.

మానవ శరీరంలో స్థూల, సూక్ష్మకోశాలు వున్నట్లే, దేవాలయంలో కూడా వున్నాయి.

ఒకదానిలో ఒకటిగా చతురస్రాలుగా ప్రాకారాలు వుంటాయి గమనించండి - కంచి, కామాక్షి, మధుర మీనాక్షి - చిదంబరేశ్వరుడు - శ్రీ రంగం - ఇలా ఏప్రసిద్ధ దేవాలయాన్నయినా గమనించి చూడండి. చదురస్రాలుగా ప్రారంభమౌతాయి ప్రాకారాలు - ఈ చతురస్రాలు గర్భగుడి వరకూ ఒకదానిలో ఒకటిగా వుంటాయి. వీటన్నిటినీ ప్రదక్షిణచేస్తాము మనము - ఆయాస్తోత్రాలు చదువుకుంటూ అవునా ? వెలుపల - మొదటగా వున్న చతురస్రము - (ప్రాకారము) "బాహ్యద్వారం" అంటారు. దీని లోపలి చతురస్రం "మధ్యహారం" అంటారు. దానిలోపలి చతురస్రం "అంతరహారం" అంటారు. దానిలోపల "అంతర్మండలం" వుంటుంది. ఈ విధంగా బాహ్య ప్రాకారం నుండి, మూల విరాట్టు వుండే గర్భగుడి (అంతర్మండలం) వరకూ ఐదు (5) ప్రత్యేక చతురస్రాలుగా దేవాలయ ప్రాకారాలు వుంటాయి. ఇక "అంతర్మండలం" అనగా గర్భ గుడిలో "మూలవిరాట్టు" క్రింద - ఒక్కొక్కటిగా వివిధ వస్తు సమూహాలతో ఆరు విభాగాలుగా ప్రతిష్ఠ చేయబడుతాయి. దీనికే "షడాధార" "ప్రతిష్ఠ" అంటారు. నేలబారుగా ఆరు స్థూల కోశాలు ఒకదానిపై ఒకటిగా అమర్చి, ఆపైన ఆరుసూక్ష్మ కోశములు ఏర్పరచబడుతాయి.

మన శరీరంలోని షట్చక్ర నిర్మాణమే ఈ "షడాధార" ప్రతిష్ట యొక్క ఉద్దేశ్యం, ఈ ఆరు అంచెల "షడాధార" ప్రతిష్టలో, పైభాగంలోని బ్రహ్మరంధము (సహస్రారము) పైన మూలవిరాట్టు యొక్క ప్రతిష్ఠ జరుగుతుంది.

"తస్యశ్శి ఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః - సబ్రహ్మ, సశ్శివ - సహరి స్సేంద్ర సో క్షరః పరమస్వరాట్" అనే "మంత్ర పుష్పము" లోని మంత్రానికి సాకారరూపమే ఈ "షడాధార" ప్రతిష్ఠ! ఈ మూల విరాట్టుకు - ఋషులు - ఋషితుల్యులు అయిన సద్బ్రాహ్మణులు - తమ శరీరశుద్ధి, మనశ్శుద్ధి, భూత శుద్ధి మొదట చేసుకుని తాము "శివుని"గా ముందుమారి - ఆతర్వాత - మూలవిరాట్టును "దైవంగా" తమ మంత్రోచ్చారణతో - ప్రాణప్రతిష్ఠ చేసి తమలోని మంత్రశక్తి తపశ్శక్తి ద్వారా - చేతన పరబ్రహ్మగా మారుస్తారు. అప్పుడే ఆశిలారూపదైవం - దైవ స్వరూపంగా జీవకళతో సాక్షాత్కరించి - తనకు పూజలు సలిపే భక్తులకు తనలోని దివ్యశక్తులు ప్రసాదిస్తుంది. సామాన్య మానవులంతా దేవాలయ ప్రదక్షిణచేస్తూ ఆయా చతురస్రాలు "ప్రాకారాలు" దాటుతూ, తమలో వుండే షట్చక్రాలను ధ్యాన యోగంతో దాటే అనుభూతిని బాహ్యంగా పొంది - తరిస్తారు. ధ్యానయోగం ద్వారా సాధకులుపొందే మోక్షాన్ని, ఆ తంత్రవిద్యలేమీ తెలియని సామాన్యులు - ఈ దేవాలయ ప్రదక్షిణలద్వారా, మూలవిరాట్టు దర్శనంద్వారా, స్తోత్రం ద్వారాపొంది తమతమ సంస్కారాలకు తగిన శక్తిని పొతం పొంది తమతమ కోర్కెల సాఫల్యం పొందుతారు. గర్భగుడిపై భాగాన వుండే కలశం (గోపురం) అదే దైవం యొక్క శిరస్సు - కిరీటంగా భావిస్తారు. అందుకే "శ్రీ శైల శిఖరం దృష్ట్వా - పునర్జన్మన విద్యతే' 'అన్నారు పెద్దలు. సామాన్యులు పనిపాటలకు వెళ్తూ ఆలయ ముఖద్వారం వద్ద - ఆగి - శిఖర దర్శనంచేసుకుని - భక్తిగా నమస్కరించి వెళ్తుంటారు గమనించండి. ఆ శిఖర దర్శన మాత్రాన - మూలవిరాట్టును దర్శించిన ఫలితం కలుగుతుందంటారు పెద్దలు. ఈనాడు దేవాలయం కట్టడం అంటే - గబగబా ఇటుకలు సిమెంటు - ఇనుపచువ్వలు కొనెయ్యటం - డాబాలలా శ్లాబ్ పోసెయ్యటం - అందులో ఒక విగ్రహాన్ని ప్రతిష్ఠించెయ్యటంలాటి తంతుగా తయారై - అదొక మంచి "హాలు" గా మారుతోంది.

అలాగే దైవదర్శనం - రాజకీయ నాయకులకైతే - హడావుడిగా హెలికాప్టర్‌లలో దిగి - రాజ లాంఛనాలతో గర్భగుడిలోకి ప్రవేశించి - తమ హోదాకు - పూజారులు మొదలు దైవం వరకూ గడగడ లాడేట్లు చేసి - పూజా కార్యక్రమంతర్వాత 'శేషవస్త్రాల" పేరుతో ఖరీదైన పట్టుచీరెలు - పట్టు వస్త్రాలు - పుచ్చుకుని వెళ్లే "తంతు"గా మారితే - మధ్యతరగతి వారికీ -

సామాన్యులకూ - ఏ ప్రాకారాలు ఏవో తెలియకుండా ఆయా ఆలయాల బయట కిలో మీటరు దూరంనుండీ ప్రారంభమయ్యే క్యూలలో - ఎటు వెళ్తున్నామో (ఆజనంతో పిడీలో) తెలియకుండా - గర్భగుడిలోనికి కుక్కినట్లు జనం - చీమల బారుల్లా, దోమలదండులా ఇరుక్కుని - ఊపిరాడకుండా వెళ్లి - మూల విరాట్టును అరసెకెండు దర్శించి - "హమ్మయ్య! ప్రాణాలతో బయటపడ్డామురా దేవుడా! ఈ చిన్నపిల్లలు ఆ తోపిడీతో - ఊపిరాడక "హరీ" మంటారేమోనని భయపడి పోయాము! "అనుకుని నిట్టూర్చే ధర్మ దర్శనాలూ - 25, 50-100 రూ॥ల దర్శనాలు తయారైపోయాయి. ఆ క్యూల రద్దీకంటే, ఇంట్లోనే హాయిగా "కృష్ణా రామా" అనుకుంటే మనసు నిలుస్తుంది దైవం మీద అనే వేదాంతమూ వస్తోంది! అవునా ? ఇక - సౌందర్యలహరిలో - ఆది శంకరాచార్యుల వారు - ఈమనదేహంలో కొలువై వున్న జగన్మాత, జగత్పితల స్వరూపాన్ని వర్ణిస్తున్నారు. ఈ దేహంలోనే దైవ దర్శనం చేయమని ఉపదేశిస్తున్నారు. పదండి - ముందుకు.

## 36వ శ్లో, ఆజ్ఞా చక్రంలో దైవ స్వరూపం.

**36 శ్లో॥ తవాజ్ఞా చక్రస్థం, తపన, శశి కోటి ద్యుతిధరం!**
**పరం, శమ్భుం వన్దే పరిమిళిత పార్శ్వం పరచితా!**
**యమారాధ్య న్భక్త్యా రవి శశి శుచీనా మవిషయే**
**నిరాలోకే ఽ లోకే నివసతిహి భాలోక భువనే!**

**అర్థము :-** ఓతల్లీ! భగవతీ! నీ ఆజ్ఞా చక్రమును అధిష్ఠించి యున్న, కోటి రవి చంద్రుల కాంతిని ధరించినవాడు నూ, "పర" అనే చిత్తుచేత ఆవరింపబడిన పార్శ్వములు గలవాడునూ, అగు శంభునికి సాధకుడు (ఈ సాధకుడు) నమస్కరించు చున్నాడు! ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు - తానే సాధకునిగా (భక్తునిగా) అమ్మవారి శరణాగతి చెందుతున్నారు.

అట్లా అపర అనే చిత్తుచేత ఆవరింపబడిన పార్శ్వములు గల రూపంతో (అర్థనారీశ్వర రూపంతో) ఏ సాధకుడు ఈశ్వరుని "శివ స్వరూపాన్ని చక్కగా ఆరాధిస్తారో, ఆసాధకుడు, సూర్య చంద్రులకు కూడా అగోచరమై, సామాన్యదృష్టికి అందనిది అయిన, విజనమునకు అనగా "జ్యోతి ర్లోక"మునందు నివసించగలడు, అనగా "పెను చీకటి కవ్వల వెలుగుపుంజం"గా భాగవతంలో వర్ణింపబడినట్టి సూర్య చంద్ర, నక్షత్రమండలములు దాటి - శాశ్వతమోక్ష ధామమును చేరుకొనగలడు అనిభావము. ఈ జనన మరణ చక్రభ్రమణము నుండి శాశ్వత ముక్తుడౌతాడు.

ఆతల్లి ఆజ్ఞా చక్రమే శంభుని నిలయం. ఇది సాధకులు తమశరీరంలో - ఫాలభాగమందు దర్శిస్తారు యోగసాధనలో! సాధారణ మానవులకు, మామూలు పూజలు, జపాలూ, నామజపంతో, ఆ తల్లి యొక్క ఆజ్ఞాచక్రం అనగా ఫాలభాగం భావించినా, అందులో ఈశ్వర దర్శనమై తరించవచ్చు.

## 37వ శ్లో॥ విశుద్ధి చక్రము

**37 శ్లో॥ విశుద్ధౌతే, శుద్ధస్ఫటిక విశదం, వ్యోమ జనకం**
**శివం సేవే దేవీమపి, శివసమాన వ్యవసితామ్!**
**యయోః కాన్త్యా యాన్త్యా శ్శశికిరణ సారూప్య సరణే**
**ర్వి ధూతాన్త ర్ధ్వాన్తా విలసతి చకోరీవ జగతీ.**

అర్థము :- ఓ భగవతీ! జగన్మాతా! శివ శక్తులైన మీ ఇరువురి వలన వచ్చు చంద్ర కిరణముల వంటి (సారూప్య) కాంతితో ఈ జగత్తు అజ్ఞానాంధకారమునుండి దూరమై - అజ్ఞానాంధ కారము తొలగి చంద్ర కిరణములను అమృతమున త్రాగి, ఆనందించే చకోర పక్షివలె ఆనందిస్తున్నదో అట్టి నీ "విశుద్ధ" చక్రమునందు శుద్ధస్ఫటిక నిర్మలుడై వ్యోమజనకుడైన శివునీ, (ఆకాశ స్వరూపుడైన శివుని) ఆయనతో సమాన ప్రయత్నము (శక్తి) గల దేవివగు నిన్నూ సేవించుచున్నాను.

ఈ శ్లోకములో శ్రీ శంకర భగవత్పాదులు "విశుద్ధి" చక్రము అనగా కంఠ ప్రదేశమునందు 16దళములతో వుండే చక్రము - నందుగల ఆత్మతత్వ మిళితమై, ఆత్మతత్వమునుండి వెలువడిన ఆకాశతత్వమును "వ్యోమజనకు"డైన ఈశ్వరునిగా వర్ణిస్తున్నారు. శివశక్తులిద్దరి ఐక్య ప్రకారము చంద్రకిరణములుకాగా, అవి త్రాగి ఆనందించే చకోర పక్షులుగా ఈ జగత్తునూ, జగత్తులోని భక్తులనూ, సాధకులనూ వర్ణిస్తున్నారు.

విశుద్ధి చక్రం ఆకాశతత్వం, ఇది శబ్దప్రధాన చక్రం! ఇక్కడే మానవులలోని "నాదరూప ఆలోచనలు "వైఖరీ" రూపంలో శబ్దాలుగా, వాక్కులుగా, కవిత్వంగా, గానంగా, ఉపన్యాసాలుగా చక్కగా మలచబడి - వారికి గుర్తింపు, గౌరవం - యశస్సు ప్రసాదిస్తాయి. ఈ విశుద్ధి చక్రాన్ని - అందులోని శివశక్తులనూ ధ్యానించే సాధకులు - వారిలోని నాదబ్రహ్మ స్వరూపాన్ని - దైవ వాణిగా వినగలుగుతారు. ఇందుకు ఒక కథ ఉదాహరణగా చెప్పుకుందాము. శ్రీ శంకర భగవత్పాదుల వారి ముఖ్య శిష్యుడైన "పద్మపాదుని" గురించిలోగా మనం తెలుసుకున్నాము కదా ?

ఆ పద్మపాదుని - పూర్వనామం - (సన్యాసదీక్ష - ఆచార్యులవారు అతనికి ఇవ్వకముందు నామం) "విష్ణుశర్మ", విష్ణుశర్మ చక్కని రూపం - వాక్కు సంస్కృత పాండిత్యం గల యువకుడు, అతడు శ్రీనృసింహోపాసకుడు. నృసింహ స్వామిని సాక్షాత్కరింప జేసుకోవలెనని తీవ్రంగా సాధన చేయసాగాడు. ఒక మారు ఒక గురువును నృసింహస్వామి సాక్షాత్కారానికి సులభోపాయం ఏమిటో శలవిమ్మని కోరాడు! విష్ణుశర్మ ఆ గురువు - "ఏదో ఈయువకుడు అడుగుతున్నాడు. అంతేగానీ - ఇతడేం తీవ్రసాధన చేస్తాడా ? ఏమన్నానా ? "అనుకుని, అప్పటికి ఏదో తప్పించుకోవటానికి" ఇట్లా గ్రామంలో - మీ ఇంట్లో సకల సౌకర్యాలు అనుభవిస్తూ కూర్చుని పూజిస్తే - నృషింహస్వామి సాక్షాత్కరిస్తాడా ? ఎన్నటికీ కాదు. ఆ స్వామి అరణ్యాలలో కొండ గుహలలో వుంటాడు. అవే ఆయనకు ప్రీతి పాత్రమైన ప్రదేశాలు. అక్కడకు వెళ్లి ఉపాసన చేయాలి. అన్వేషించాలి! అబ్బో! చాలా ప్రయాసతో కూడుకున్నపని!" అని చెప్పి వెళ్లిపోయాడు.

యువకుడైన విష్ణుశర్మకు పట్టుదల ఎక్కువ పాండిత్యం - శాస్త్రపాండిత్యంతాలూకు అహమూవున్నది. తనకన్నీ తెలుసుననీ, తానుఏసాధన అయినా చేయగలననీ అతి ఆత్మ విశ్వాసము వున్నది. అందుచేత, అతడు - ఆరాత్రికి రాత్రే - తమ గ్రామానికి చాలాదూరంగా వున్న కొండ ప్రాంతమూ, దట్టమైన అడవి ప్రదేశానికి చేరుకున్నాడు. అహోబలం అసలుపేరు అహోబలం" నరశింహస్వామి విశ్వరూపాన్ని దర్శించిన దేవతలంతా ఆయనను స్తోత్రం చేస్తూ "అహోవీర్య, మహాశౌర్య, మహోబహు పరాక్రమం నారశింహః పరందైవ మహుబల మహోబలం" అని కీర్తించి శాంతింప చేయటానికి ప్రయత్నించారు హిరణ్యకశిపునివధానంతరం అది ఈ ప్రాంతంలో గనుక "అహోబలం అనిపేరుగాంచి పామరుల భాషలో అహోబలంగా మారిపోయింది. ఈ అహోబలకీకారణ్యానికి యువకుడైన విష్ణుశర్మ శ్రీనారశింహుని సాక్షాత్కారం కోసం ఎన్నుకొని బయల్దేరాడు. బిగ్గరగా లక్ష్మీనృషింహస్వామి స్తోత్రాలు చేస్తూ - అడవి అంతా తిరగసాగాడు. కొండ గుహలు వెతుకుతూ, అరణ్య అంతాకలయ తిరగసాగాడు. ఇట్లా ఐదారు రోజులు గడిచిపోయాయి. ఆహారమూ నిద్రావేళకు లేకపోవటమూ, అరణ్యంలో తిరగటం వల్ల విష్ణుశర్మ అలసిపోయాడు. నీరసించిపోయాడు అయినా పట్టుదలగా మంత్రాలు బిగ్గరగా చదువుతూనే వున్నాడు. నృసింహ మంత్ర పునశ్చరణ చేస్తూనే వున్నాడు. అతడి కంఠస్వరం నీరసించి - మాట పలకలేకుండా వున్నది. ఈ యువకుడినీ - ఈ మంత్రాలనూ, ఈ ఐదు రోజులుగా ఒక చెంచుజాతి ఆటవికుడు గమనిస్తున్నాడు. బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతున్న ఈ యువకుడు ఎందుకిలా అరుస్తూ అడవి అంతా తిరుగుతన్నాడో ఆ ఆటవిక యువకునికి అర్థం కాలేదు. నాలుగురోజులు మనకెందుకు లెమ్మని వూరుకున్నాడు. ఐదోరోజు - నిస్సత్తువగా

ఒక మహా వృక్షం క్రింద చతికిలబడి పోయి - కళ్లల్లో నీళ్లు తిరుగుతుండగా ఇక అడుగు వేయటానికి శక్తి లేక - కళ్లలో ప్రాణాలు పెట్టుకుని కూర్చున్న - విష్ణుశర్మను చూచి "మనకెందుకులే" అనుకుని పోలేకపోయాడు. అతడి బాధ ఏమిటో తెలుసుకోవాలి అనుకున్నాడు. అతడి దగ్గరగా వచ్చి - నమస్కరించి - "నీకేం కావాలి దొరా . అరణ్యాలెంట ఎందుకెట్టా మంత్రాలేవో చదువుతా తిరుగుతున్నావు ?" అని అడిగాడు స్నేహపూర్వకంగా, విష్ణుశర్మ నృసింహస్వామి కోసం వెదుకుతున్నానని చెప్పాడు నీరసంగా.

"ఆ స్వామి ఎలావుంటాడోచెప్పు, నేను పిల్చుకువస్తా! మాతాత ముత్తాతలు ఈ అడవిలోనే పుట్టి పెరిగి మట్టిలో కలిసిపోయారు. నేనూ అంతే! ఇక్కడి కొండా, కోనా, చెట్టు పుట్టా అన్నీ నాకు తెలుసు," అన్నాడు. ఆటవిక యువకుడు స్నేహపూర్వకంగా.

విష్ణుశర్మ నృసింహస్వామిని వర్ణించాడు" సగం సింహంలా వుంటాడు - పై సగం శరీరం మానవ శరీరం, ముఖం సింహం ముఖం, సింహంలా గర్జిస్తాడు. ఆ గర్జనను బట్టే ఆయనను తెలుసుకోవాలి!" మనిషికి మల్లే చేతులుంట్నాయి. అవినాలుగుచేతులు. వాటిలో శంఖచక్రాలు ధరిస్తాడు. అవసరాన్ని బట్టి గదపద్మం కూడా ధరిస్తాడు మిగతా రెండు చేతులతో." శంఖ చక్రాలు ధరిస్తాడు. మహా మహిమాన్వితుడు!" అంటూ వర్ణించాడు, ఆటవిక యువకుడు అంతా విన్నాడు. "అట్టాగా! నేను వెతికి పట్టుకువస్తాను ఆయనను! ఈసాయంత్రం సూర్యుడు గుంకేలోగా నీకాడికి పట్టుకోస్తా! నువ్వు దిగులుపడకు. ఇదుగో ఈ పండ్లుతిను ఈ పుట్టతేనేతాగు ఆకలీ దాహంతీర్చుకో," అని వెళ్లిపోయాడు.

నిజానికి ఆ ఆట వికునికి - ఆరూపం తన తాతవెంట అడవిఅంతా తిరుగుతున్న చిన్నవయసులో - ఎక్కడా చూచిన గుర్తులేదు. తండ్రి వెంట అడవిలో వేట నేర్చుకుంటున్నపుడూ - తిరుగుతుండగా చూచిన గుర్తులేదు. ఆ స్వామి ఎవరో వింతమృగం కాబోలు! ఆ వింతమృగం ఈ అడవిలో వుంటుందని ఆ యువకుడు ధృఢంగా చెప్పాడు. పైగా అదికనపడకపోతే ప్రాణాలు తీసుక్నొనేలా వున్నాడు! ఏదిదారి ?

ఆటవికుని హృదయంలో తను విన్న ఆనృ సింహస్వామి వింతరూపం ముద్రించుకుపోయింది! మనస్సంతా కళ్లుగా - శరీరమంతా కళ్లుగా ఏ అలికిడి అయినా ఆ వింతమృగం గర్జనగా ఉలికిపడ్తూ అగణ్యమంతా అంగుళం వదలకుండా అదే ధ్యానంతో తిరగసాగాడు. అతడికి ఎండగానీ - ఆకలిగానీ తెలియలేదు. కాళ్లలో ముళ్లుదిగబడినా, ఒళ్లంతా ముళ్లచెట్లు చీరుకుపోతున్న తెలియలేదు. "నృసింహస్వామి" అనే వింత మృగం రూపం - ఆ సింహగర్జన ఒక్కటే ఆతడి సర్వేంద్రియాలలో నిండిపోయాయి. సూర్యాస్తమయం కావటానికి

కొద్ది సమయమే వున్నది. ఆటవిక యువకుడు హతాశుడయ్యాడు. అరణ్యాలలో మృగాలు పగలంతా తిరుగుతాయి. పొద్దు గ్రుంకగానే - అవి తమ తమ గుహలూ - బొరియలు - నెలవులలోకి వెళ్లిపోతాయి. ఇక తెల్లివారితే గానీ కనిపించవు మరలా, ఈ సూర్యాస్తమాయానికి ఆ దొర కుర్రాడికి - తాను ఆ వింతమృగాన్ని పట్టి - కట్టి తెచ్చి చూపుతానన్నాడు! అలా శపథం చేసాడు! తన మాటనమ్మి - తాను బ్రతిమాలగా ఆయువకుడు కాస్తంత పండ్లు - పుట్టతేనే ఆహారంగా తీసుకున్నాడు. లేకుంటే ఉపవాసంతో మరణిద్దామనుకున్నాడట! ఆ బాపన కుర్రాడు నిజంగా మరణిస్తాడేమో?

ఇప్పుడేది దారి!

ఆటవికుడు - ఒక స్థిర నిర్ణయానికొచ్చాడు.

"సరే! నా మాట నిలబెట్టుకోలేక పోయాను. ఆ దొర కుర్రాడికి మొహం చూపలేను - నరసింహసామీ! నేనిక జీవించను!" అంటూనే బాణంతో గుండెల్లో పొడుచుకోబోయాడు! అంతే! ఆతడి ప్రక్కగా భయంకరమైన సింహగర్జన వినిపించింది. ఆటవిక యువకుడు త్రుళ్లిపడ్డాడు ... ప్రక్కనున్న పొదలోనుండే వచ్చిందా గర్జన! వెంటనే - అక్కడ చెట్లకు అల్లుకుని వున్న బలిష్ఠమైన అడవితీగేలు - లాగి - లాఘవంగా పొదలోకి విసరి ఆ ఆకారాన్ని బంధించేసి - పొదబయటకు లాక్కువచ్చాడు. కళ్లారా చూశాడు. కోటి సూర్య చంద్రకాంతులతో దుర్నిరీక్ష తేజస్సుతో - సింహం ముఖం, మానవశరీరమూతో, శంఖ చక్రగదా, అభయహస్త పద్మధరుడైన శ్రీనృసింహస్వామి- ఆతడి అడవి తీగెల బంధంలో సాక్షాత్కరించి వున్నాడు!

నమస్కరించాలని గానీ - స్తోత్రం చేయాలని గానీ - ఏదీ - తెలియదా ఆటవిక యువకునికి! "అబ్బో! ఏం వెలిగిపోతుండావు సామీ! ఎంత అందంగా వున్నావు సామీ! ఎంత చిత్రంగా వుంది సామీ నీరూపు ? నేనెప్పుడూ ఎక్కడా చూడని వింతమృగాని వంటే నువ్వే! నిన్ను చూత్తా వుంటే - ఇంకా ఇంకా సూడాలనిపిస్తుండాది. ఇందుకే ఆ దొర కుర్రాడు ఐదురోజులుగా నిద్రాహారాలు మాని అలమటిస్తున్నాడు. చాలా బాధపెట్టి కనపడ్డావు గానీ ఇక పదపోదాం, ఆ దొరకుర్రాడికి నిన్ను అప్పగిస్తే నాపని తీరిపోతుంది! నా మాట నిలబడుతుంది. ఆతడి ప్రాణాలు నిలుత్తాయి! పద . . పద . . ఈ తీగెలతో కట్టేసే నిన్ను లాక్కెళుతాను. వదిలితే మళ్లీ పారిపోయావంటే - నిన్ను వెతకటం మహాకష్టం!" అంటూ ఆనందంతో ఆతడి హృదయం ఉప్పొంగిపోగా, అడవి తీగెల బంధంతో సాక్షాత్తూ నారసింహుని బంధించి - లాక్కుని వచ్చాడు ఆటవిక యువకుడు.

విష్ణుశర్మ - నీరసంగా పడివున్నాడు చెట్టుక్రింద సూర్యాస్తమయం కావొచ్చింది - ఆటవికుడు రాలేదు. ఇక నృసింహ దర్శనం కాదు. "ఈ ప్రాణాలు ప్రాయోప వేశంతో తీసుకుంటాను", అనుకున్నాడు. అంతలో దగ్గరలో సింహగర్జన వినిపించింది భయపడ్డాడు. దగ్గరలో సింహం వస్తోంది . . తాను తప్పించుకొనే దారిలేదు - పోనీలే! ఆ క్రూరమృగం తనని కబళించి వేయనీ అనుకున్నాడు.

"దొరా! ఇడుగో నీసామి! ఎన్ని తిప్పలుపెట్టాడనుకున్నావు. ఒళ్లంతా హూనమైపోయింది వెతికేసరికి! ఎట్టాగో - పోరబాటుగా గర్జించాడు. పట్టుపడిపోయాడు!" అంటూ అడవి తీగెలు బరువుగా లాగుతూ వచ్చాడు ఆటవిక యువకుడు, "ఏడీ ? ఎక్కడా ." అన్నాడు విష్ణుశర్మ, అతడికి నృసింహరూపం కని పించలేదు. తీగెలు చుట్టి - ఆ తీగె చివర బలంగా పట్టుకున్న ఆటవిక యువకుడు కనిపించాడు, అపరిమితమైన ఆనాందాతిశయంతో వున్నాడా యువకుడు - పనిని సాధించిన ఆనందంతో! దివ్య తేజస్సుతో వెలిగిపోతున్నాడు. ఉదయం తానుచూచిన ఆటవికునిలా లేడు - దేవతలా దివ్య తేజస్సుతో మరో దైవంలా కనిపిస్తున్నాడు. అడవి దేవర - కొండదేవరలా వెలిగిపోతున్నాడా ఆటవిక యువకుడు ఇదేంచిత్రం ? అనుకున్నాడు విష్ణుశర్మ ఆశ్చర్యంగా చూస్తూ! "ఇదుగో దొరా! పారిపోతాడని అడవి తీగెలతో కట్టి మరీలాక్కునివచ్చా, నీవుచెప్పినట్లే - సింహముఖం జూలూ, కిరీటం - శంఖచక్రాలూ తామరపువ్వు - గదా అన్నీవున్నాయి చూడు! ఆ గర్జన మాత్రం సింహానిదే! ఇదొక వింతమృగం! నేనే నాడూచూడనిది ..." అన్నాడు ఆటవికుడు.

విష్ణుశర్మనిర్ఘాంతపోయాడు. ఆ ఆటవిక యువకుడు స్వామి ముఖం - చెవులు - జూలు - కిరీటం - శంఖచక్రాలు అన్నీ తడిమి మరీ చూపుతున్నాడు. కానీ తనకు స్వామి కనిపించటం లేదే ? మరలా సింహగర్జన. "అదుగోస్వామి గర్జించాడు!" అన్నాడు ఆటవిక యువకుడు - ఆనందంగా! "స్వామీ! నాకు దర్శనం ఇవ్వవా ? చదువు సంధ్యాలేని ఈ ఆటవికుని పాటి చెయ్యలేదానేను ? ఆతడికిచ్చిన దివ్య దర్శనుం నాకు ప్రసాదించ లేదేమిటి . నా పాండిత్యం, శాస్త్ర మంత్రోపాసన అంతా వృధాయేనా ? నీ గర్జన వినిపిస్తోంది తప్ప - నీవు కనిపించటంలేదేమిటి?" అంటూ విలపించసాగాడు విష్ణుశర్మ. ఆటవిక యువకుడు ఆశ్చర్యపోయాడు - తన చేతిలోని అడవి తీగెలలో బందీ అయివున్న స్వామి - ఈ దొరకు కనిపించటం లేదంటాడేమిటి ? గర్జన మాత్రం వినిపిస్తున్నదంటాడేమిటి . అప్పుడు శ్రీ నృసింహస్వామి పలికాడు.

"నాయనా! విష్ణుశర్మా! నీలో పాండిత్య గర్వం శాస్త్ర గర్వం, వున్నాయి ఇంకా వాటి సాయంతోనే నన్ను సాక్షాత్కరింప జేసుకోగలననే భావనవున్నది. కానీ - నా సాక్షాత్కారానికి నీలో కావలసినది పాండిత్యమూ, శాస్త్రమూకాదు! నిశ్చలభక్తి! ధ్యానం. ఈ ఆటవికుడు నీ ప్రాణం కాపాడటానికి - నేనుక్రూర మృగరూపుడినని తెలిసీ - నీవుచేసిన నా వర్ణన ఆధారంగా, నిశ్చల ధ్యానం నాపై నారూపంపై నిలిపి - అన్వేషించాడు. నేను కనిపించకపోతే - నీ కోసం ప్రాణత్యాగానికి సిద్ధపడిన నిష్కల్మష - నిస్వార్ధ, నిర్మోహ - అమాయక భక్తుడితడు, - అందువలననే అతడికి సాక్షాత్కరించాను! సాక్షాత్కరించటమేమిటి ? అతడి నిష్కల్మష ధ్యానానికి - భక్తికీ - బందీనై నా అంత నేనుగా ఈ అడవి తీగెలకు కట్టుబడి - అతడు మృగంలా నన్ను లాక్కుని వస్తుంటే, సంతోషంగా వెంటవచ్చాను! నీకు నా నాదం - గర్జన రూపంలో సాక్షాత్కరించాను. నీకు నేను సాకారంగా సాక్షాత్కరించటానికి ఇంకా సమయం వున్నది. నీకు పరమగురువు లభ్యమవుతాడు. ఆతడి సేవలో నీవు పునీతుడవై భక్తి పరాకాష్ఠను అనుభూతి చెందుతావు! ఒకానొక సమయంలో నాదర్శనంతో నీవు ఒక మహత్కార్యాన్ని సాధిస్తావు!" అని చెప్పాడు. మరల గర్జనవినిపించి - అంతర్ధానమయ్యాడు. ఆ ఆటవికునికి మ్రొక్కి - విష్ణుశర్మ - వెనక్కి వచ్చేశాడు. చాలా త్వరలో - కాశీలో - ఆదిశంకరాచార్యుల వారిదర్శనం అయిందాతడికి, ప్రథమ వీక్షణంలోనే - తన పరమగురువు ఆయ నేనని విష్ణుశర్మా, తన ముఖ్యశిష్యుడు ఇతడేనని ఆచార్యులవారూ మనస్సులలో గుర్తించారు పరస్పరం, ఈ అనుభూతే, నిజమైన గురుశిష్యులకు కొండగుర్తు "సనందుడు" అని సన్యాసనామం ఇచ్చి - తన శిష్యునిగా స్వీకరించారు ఆదిశంకరులు - విష్ణుశర్మను. ఆసనందుడే - ఆచార్యుల వారి పిలుపువిని పొంగిప్రవహిస్తున్న గంగానదిపై - ఆయన ఉత్తరీయం తీసుకుని వస్తుండగా, గంగామాత ఆతని గురుభక్తికి ముగ్ధురాలై - ఆతని పాదాల క్రింద పద్మాలు ఉద్భవింప జేసింది - గంగను దాటటానికి నీటిపై! "పద్మపాదునిగా" నామకరణం చేశారు ఆచార్యులవారు అతడికి గురువు గారి గ్రంథాలకు టీకలు వ్రాశాడు ఈ పద్మపాదుడు అద్వైత సిద్ధాంత గ్రంథాలు వ్రాశాడు - ఆతడి స్వంతమామగారు ఈర్ష్యాళుడై - ఆతని గ్రంథాలు తగలబెట్టదలచి - ఉట్టినే గ్రంథాలు తగలబెడితే - అందరూ తెలుసుకుంటారని - తన ఇంటికి తానే నిప్పటించి - తగల బెట్టాడు - ఆచార్యులవారి అద్వైతమతాన్ని "టీకలు' ' వ్రాసి తన అల్లుడు ప్రచారంలోకి తెస్తాడనే భయంతో! అగ్నికి ఆహుతిచేశాడు అలా! పద్మపాదుడు బాధపడ్డాడు గ్రంథాలు తగలబడిపోయాయని, అయితే ఆచార్యులవారు సర్వజ్ఞులు గనుక - ఆతడిని ఓదార్చి - ఆతని "టీక"లలో తనకు గుర్తున్నవి మరల వ్రాయమని ఆదేశించారు -

పద్మపాదునికి అన్నీ గుర్తురాలేదు. ఐదు మాత్రం గుర్తుకువచ్చాయి. అవి వ్రాసిఇచ్చాడు. - వాటినే" పంచపాదిక" అంటారు.

ఒకమారు శ్రీశైలంలో ఆదిశంకరాచార్యులవారు కొంతకాలం వున్నారు. పాలధార - పంచధార ప్రాంతంలో శారదా దేవిని నెలకొల్పి - "శివానందలహరి" వ్రాస్తూ - తపస్సు చేశారు అక్కడ అప్పట్లో శ్రీశైలంలో వామాచారులైన కాపాలికులూ, తాంత్రిక విద్యలలో ఆసక్తి గలిగి - నిధి నిక్షేప అన్వేషణచేసే కపట సాధువులూ కోకొల్లలుగా వుండేవారు.

(ఇప్పుడూ వున్నారు శ్రీశైలం అరణ్యాలలో - గుహలలో - పాతాళ గంగ పరిసర ప్రాంతంలో దట్టమైన అరణ్యాలలో!) వారిలో కొందరు కాపాలికులు - తమ వామాచార పూజకు - ఒకబ్రహ్మచారి బ్రాహ్మణయువకుడిని బలిఇవ్వటానికి ప్రయత్నిస్తున్నారు. కేరళ నంబూద్రి బ్రాహ్మణుడూ - అపరిమిత వర్చస్వీ - అపర శంకరులూ అయిన ఆదిశంకరులను అక్కడ ఆ కాపాలికులు చూచారు. కాపాలికులపెద్ద - ఆదిశంకరులను ఏకాంతంగా కలుసుకున్నాడు. "స్వామీ! మీవల్ల మాకొక ఉపకారం జరగాలి!" అనిచెప్పాడు "తప్పక చేస్తాను! చెప్పండి!" అన్నాడు ఆదిశంకరాచార్య.

"మిమ్మల్ని అమ్మవారికి బలిఇచ్చి, త్రిలోకాధి పత్యం పొందుతాము మేము! మీరు కాదనక మా వెంటరావాలి!" అన్నాడు కాపాలికుల నాయకుడు.

"ఈ దేహం అశాశ్వతం, మీకు మాట ఇచ్చాను వస్తాను! కానీ నా శిష్యులలో పద్మపాదుడు అనే శిష్యుడున్నాడు. అతడు నా నీడలా వుంటాడు - అతడికి తెలియకుండా నన్ను తీసుకవెళ్లండి!' ' అని చెప్పారు. ఆచార్యులవారు కాపాలికులు అలాగే చేశారు. స్నానానికి - పాతాళగంగకు వెళ్లి, శ్రీశైల మల్లిఖార్జున - భ్రమరాంబల దర్శనం చేసుకుని "పాలధార, పంచధార" వద్దకు వచ్చిన పద్మపాదుడు ఆచార్యులవారు రోజూలాగా అక్కడ లేకపోవటం - "శివానందలహరి" వ్రాస్తూ వ్రాస్తూ వున్న తాళపత్రాలు అలాగే వదిలివేసి వుండటం - చూచి ఆలోచనలో పడ్డాడు. - కాపాలికులు ఇక్కడకు పొంచి పొంచి రావటం - రెండు రోజుల నుండీ గమనిస్తున్న అతడి మనసు కీడు శంకించింది. ఆచార్యులవారిని ఆ కాపాలికులే - తీసుకవెళ్లి వుంటారని నిర్ధారణకు వచ్చాడు - కాలి జాడలు ఆధారంగా కాపాలికులగు హకు చేరుకున్నాడు పద్మపాదుడు నిజానికి అతడు చేరుకోలేదు. తన ఇష్టదైవం అయిన శ్రీనృసింహస్వామిని - మనసులో ఆర్తిగా ప్రార్థించాడు "స్వామీ! నాగురుదేవుని రక్షించు! నాకు మార్గం చూపించు!" అంటూ! ఆ ఆర్తి కేక - ఆస్వామికి వినిపించింది. నృసింహస్వామి పద్మపాదునిలో ఆవహించాడు. పద్మపాదుడు ఆ గుహలోనికి ఎలాచేరాడో ఆతడి శరీరానికి తెలియని స్థితి అది - అది ఒకానొక ఖేచరీ విద్య. అణిమాద్యష్ట

సిద్ధులలో ఒకటి - కాపాలికులు బలికి సిద్ధం చేశారు ఆచార్యుల వారిని! వారంతా ఏభై మందిపైగా వున్నారు. త్రిశూలాలు ధరించి - తామ సభావంతో - రాక్షసుల వలె పూనకంతో వూగుతున్నారు.

పద్మపాదుడు ఒక్కసారిగా గర్జించాడు! ఆ గుహదద్దరిల్లిపోయిందా గర్జనకు! కాపాలికులు నిర్ఘాంతపోయారు. ఈ గుహలోనికి హఠాత్తుగా సింహం ఎలావచ్చిందోనని దిక్కులు చూడసాగారు.

పద్మపాదుడు - నృసింహావతారంగా మారిపోయాడు! కాపాలికులనందరినీ - చీల్చి చెండాడాడు! వారందరికీ వందల వేల నృసింహ మూర్తులు దృగ్గోచరమయ్యారు.

ఆదిశంకరులు చూశారు పద్మపాదునిలో నృసింహ సాక్షాత్కరం అయ్యింది! మిగిలివున్న కాపాలికులు పారిపోయారు.

"ఉగ్రం! వీరం మహావిష్ణుం! జ్వలంతం, సర్వతో ముఖం!

నృసింహం! భీషణం! భద్రం! మృత్యోర్మృత్యుర్న మామ్యహం ॥

అంటూ స్తోత్రంచేశారు ఆచార్యులవారు.

పద్మపాదుని ఉగ్రం తగ్గింది. ఆతనిలో అందాకా వున్న నృసింహ స్వామి - ఆతని ఎదుట ఆతని కోరికదీరా ప్రత్యక్ష్యమయ్యాడు - పద్మపాదుడు స్వామికి సాష్టాంగ దండప్రణాములాచరించి సోత్రం చేశాడు. స్వామి ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు.

"పద్మపాదా! ఈనాడు నీ కోరిక తీరింది! నృసింహస్వామి నీ శరీరంలోనికే అవహించి - నీచేత ఈ అసాధ్య కార్యం చేయించి నాప్రాణాలు కాపాడాడు! నేను నిన్ను శాంతింప జేయటానికి స్తోత్రం చేసిన ఆ మంత్రం - కులమత స్త్రీ పురుష వయో బేధముల కతీతముగా ఎవరైనా జపించవచ్చు. "దీర్ఘ వ్యాధులూ, ఆపదలూ, అపమృత్యువులూ తొలగించి, వారిని - ఆ నృసింహస్వామి అనుక్షణం కాపాడుతాడు!" ఈ శ్లోకంలో తొమ్మిది పదముల నామములున్నాయి. అవి నవనారసింహు రూపాలను సాక్షాత్కరింప జేసే మంత్రాలు సుమా. ఉగ్రం, వీరం, మహావిష్ణుం, జ్వలంతం, సర్వతోముఖం, నృసింహం, భీషణం, భద్రం - అనేవి ఈ తొమ్మిది నామాలు, నవనారసింహులకు గుర్తు". అని వేదవాక్కులా పలికారు!

"ఉగ్రం! వీరం! మహవిష్ణుం! జ్వలంతం సర్వతో ముఖం!

నృసింహం! భీషణం! భద్రం! మత్యోర్మృత్యుర్న మామ్యహం!"

పదే పదే పలికాడు పద్మపాదుడు!

ఇరువురూ వెనక్కి వచ్చారు. "శివానందలహరి" కొంత భాగం శ్రీశైలంలో వ్రాశారు ఆది శంకరాచార్యులవారు. ఇంతటి కథలో ఆచార్యులవారి స్వానుభవ కథలో - పద్మపాదునికి - శబ్ద రూపంగా, నాదరూపంగా - ఆటవికుని వద్ద సాక్షాత్కరించారు నరసింహస్వామి.

శాస్త్ర పాండిత్య అహం వదిలి, గురు శుశ్రూషతో పునీతుడై - ఆత్మార్పణతో - సేవచేసి - గురు కృపకుపాత్రుడైన పద్మపాదునికి సాకారునిగా సాక్షాత్కరించి - గురుప్రాణాలు కాపాడే మహత్కార్యాన్ని చేయించాడు నృసింహస్వామి - అతడి ఇష్టదైవం! ఆ గురువుచేత "శ్రీలక్ష్మీనృసింహ రావలంబస్తోత్రమూ" ఉద్భవింపజేసాడు ఆస్వామి.

ఈ శ్లోకంలో - ఆది శంకరులు - అమ్మవారి విశుద్ధి చక్రంలో ఆకాశ స్వరూపునిగా - శబ్దపరబ్రహ్మగా, నాద పరబ్రహ్మగా వున్న వ్యోమ జనకుడైన ఈశ్వరుని గురించి - ఆ నాదరూపాన్ని కవిత్వంగా, గానంగా, ఉపన్యాసంగా - విస్తరింపజేసి - పరోక్షసాక్షాత్కారమిచ్చే - నాదరూపిణి - శివుని సమశక్తి స్వరూపిణి అయిన భగవతి యొక్క "వైఖరీరూపాన్ని" - శివశక్తుల అద్భుత ప్రకాశ విమర్శ రూపాన్నీ వర్ణించారు నిగూఢంగా!

మనవాక్కులో శివశక్తులున్నారు. మనకంఠ ప్రదేశంలో శివశక్తులున్నారు. అందుకే ఆ వాక్కును యొక్క శక్తిని మనం దర్శించగలిగితే - శివశక్తులను దర్శించగలిగినట్లే! అవునా ?

## 38. శ్లో ॥ అనాహత చక్రము.

**38 శ్లో॥ సమున్మీల త్సంవి త్కమల మకరన్దైక రసికం,**
**భజే హంస ద్వన్ద్వం, కిమపి మహతాం, మానస చరమ్!**
**యదాలాపా దష్టాదశ గుణిత విద్యాపరిణతిః**
**యదాదత్తే దోషాద్గుణ మఖిల మద్భ్యః పయ ఇవ ॥**

**అర్థము** :- ఓ తల్లీ! జగన్మాతా! భవానీ! ఏ హంసజంట యొక్క ఆలాపము (కూజితము) వలన అష్టాదశ విద్యలు పరిణమించి నవో, ఏ హంసజంట - నీరమునుండి, క్షీరమును వేరుచేసినట్లు, దోషములను తొలగద్రోసి సద్గుణములను మాత్రము గ్రహించుచున్నదో, వికసించిన అనాహత పద్మమునందుగల మకరందమును గ్రోలుటలో ఆసక్తి కలిగినదియును, యోగీశ్వరుల మనస్సనెడి మానస సరస్సునందు సంచరించునదియును. అగు, అనిర్వాచ్యమగు హంసల జంటను భజించుచున్నాను.

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, శ్వాసక్రమాన్ని ఇడాపింగళ నాడులలోని శ్వాస - అనాహత చక్రం అనగా హృదయస్థానం - లో వాయుచలనం సాయంతో (ఇది వాయు

చక్రం గనుక.) "సోహం" అనే కలకూజితం చేస్తూ - మానస సరోవరం అనబడే మనస్సులో చరిస్తూ - ఆకల కూజితం నుండే అష్టాదశ విద్యలు ఆవిష్కరిస్తున్నవో ఆహంస జంటను భజించవలెనని వర్ణిస్తున్నారు.

ఆ హంస జంట ఎవరో కాదు. శివశక్తులే! వారి ఉచ్ఛ్వాస నిశ్వాసములే - అష్టాదశ విద్యలు, సర్వకళలూనూ, నాదరూప జ్ఞానంలో నుండే సర్వవిద్యలూ, సర్వ కళలకూ రూపం ఏర్పడుతుంది. బాహ్యప్రపంచంలోని అర్థం తీసుకుంటే, హంసలు మానస సరోవరంలోని కమలములలోని మకరందాన్నే ఆహారంగా తీసుకుంటాయి - (మిగతా అన్ని పక్షులలా చేపలు మొదలైనవి తినవు) అట్లాగే హంసలు పాలలోని నీరును వేరు చేస్తాయంటారు పెద్దలు. సరిగ్గా అలాగే అనాహత పద్మవం వరకూ సాధన సాగించిన సాధకుడు - సర్వ ప్రాపంచిక కల్మషాలకూ అతీతుడై, సర్వ విద్యలూ పొందినవాడై, శ్రీదేవీ పాదకమల మకరందాన్ని హంసల జంటవలె సోహం భావనతో పొందుతాడు. మానస సరోవరం ఎక్కడో లేదు. దుష్టచిత్త ప్రవృత్తులు తొలగించుకొనగలిగితే - మన మనస్సే మానస సరోవరం. మన హృదయమే స్వచ్ఛమైన కమలం. మనశ్వాసయే హంసజంట! ఆ శ్వాసను సక్రమంగా నడిపి, సదా లోచనలతో, సదాశయాలతో, సద్భావనలతో - మనలోని ప్రాపంచిక ప్రలోభాలూ, దురాశలూ, మోహాలూ - క్షీరంలో నుండి - నీటిని వేరుచేసినట్లు, తొలగించుకొనగలిగితే, మన హృదయ కమలంలోని మకరందాన్ని గ్రోలుతూ - హంసజంట మన మనో ఆకాశంలో సాక్షాత్కరిస్తుంది.

ఆ హంస జంట ఎవరో కాదు.

కామేశ్వరీ కామేశ్వరులు!

త్రిపుర సుందరీ, త్రిపుర సుందరులు!

ఆనంద భైరవీ - ఆనంద భైరవులు!

సమయిని - సమయులు!

శ్రీదేవీ - మహాదేవులు

జగన్మాత - జగత్పితలు!

అష్టాదశ విద్యలు వారిద్దరి - కలకూజితాలే!

వేదములు - 4

శిక్షాది వేదాంగములు 6

మీ మాంస, న్యాయదర్శనము, పురాణము, ధర్మశాస్త్రము, ఆయుర్వేదము, గాంధర్వవేదము, ధనుర్వేదము, అర్థశాస్త్రము అను 8 - మొత్తం 18 విద్యలు. (అష్టాదశ విద్యలు) అనాహతం - హృదయస్థానమని తెలుసుకున్నాం కదా ? ఇక్కడి వాయుచలనమే శ్వాస. ఈ శ్వాసను వృథాగా ఆత్మస్తుతికీ, పరనిందకూ చాడీలకూ - అనవసరమైన వాగుడుకూ వృథా చేయకుండా వుంటే, సంవిత్కమల మనబడే మనహృదయంలో అష్టాదశ విద్యల నాదాన్నీ వినవచ్చు. ఆ విద్యలలో నుండి వచ్చే అతిస్వల్పనాదం వినగలిగినా, మనకు ఎన్నో కళలు వస్తాయి ఈశ్వరీ ఈశ్వరుల అనుగ్రహంతో! ఇదే చెప్పారు ఆచార్యులవారు ఈ శ్లోకంలో అవునా?

## 39. స్వాధిష్టాన చక్రము.

**39 శ్లో॥ తవ స్వాధిష్టానే, హుత వహ మదిష్ఠాయ నిరతం**
**తమీడే "సంవర్తం" జనని! మహతీంతాంచ సమయామ్!**
**యదాలోకే లోకాన్ దహతి మహతీ క్రోధ కలితే**
**దయార్ద్రా యా దృష్టి శ్శిశిరము వచారాం రచయతి ॥**

**అర్థము :-** ఓ జగన్మాతా! భగవతీ! నీస్వాధిష్ఠాన చక్రమునందు "సంవర్తమును" పేరు గల అగ్నితత్వమును కాలాగ్ని రుద్రుని ఆశ్రయించి, నేను (సాధకుడు) ఎల్లప్పుడూ స్తోత్రము చేయుదును.

"మహ" చ్ఛబ్దముచే (మహత్తుగా) చెప్పబడు ప్రళయాగ్ని స్వరూపమైన "సమము" (దేవి)ని నేను స్తుతించెదను. అనగా కోపముతో కూడిన ప్రళయాగ్ని రుద్రునిచూపు లోకములన్నిటినీ దహించుచుండగా, జగన్మాత స్వరూపిణి వైన నీకృపా దృష్టి. ఆ అగ్నికి శైత్యోపచారము చేయుచున్నది. అనగా ఆ అగ్నిని చల్లార్చుచున్నది!

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు, జగన్మాత - జగత్పితలయొక్క మాతా - పిత గుణాలను వర్ణిస్తున్నారు.

సహజంగా తండ్రి - కఠినంగా ప్రవర్తిస్తాడు. తల్లి మృదుహృదయగా వుంటుంది. తండ్రి కోప్పడినప్పుడు - బిడ్డడు - తల్లి కొంగుచాటున దాక్కుంటాడు. ఆ తండ్రి కోపాన్ని అడ్డుకుని ఆతడిని శాంత పరచి - బిడ్డను తన హృదయంలో దాచుకుంటుంది తల్లి. ఇక జగన్మాత కెంతటి దయార్థ్ర దృష్టివుండాలి ?

స్వాధిష్ఠాన చక్రం - అగ్నితత్వం కలది, అక్కడ ప్రళయాగ్ని రూపుడైన రుద్రుడు వుంటాడు. అగ్నికి అధిదేవత రుద్రుడు! సంవర్తమనే ప్రళయాగ్ని అది. ఇక్కడే సిధ్ధుల పట్ల కోర్కెలు త్రిలోకాధిపత్యం - అందమైన సుందరీ మణుల పై వ్యామోహం - ఇలాటి అగ్నులెన్నో ప్రళయాగ్నివలె సాధకుని చుట్టు ముడతాయి! తామసిక అగ్నులు ఇవి! కోర్కెల అగ్నులు ఇవి. సాధకుని పాలిట మోక్ష పథంపాలిట ప్రళయాగ్నులు ఇవి! సాధకుని, సాధన నుండి పతనం చేసే అగ్నులు ఇవి. వీటిని శీతల పరచగలిగినది ఏది ? యోగసాధనలో - సాధకుడు ఈ దశలో సంధి దశలో - బెంబేలు పడిపోయినపుడు. అందాకా చేసిన సాధనను ఆ తల్లి వృధా పోనిస్తుందా ? పోనివ్వదు గాక పోనివ్వదు. ఆ తన బిడ్డ (సాధకుని యందు) గల అపార కరుణతో - వారి తప్పులను, పొరబాట్లనూ కూడా మన్నించి మరలా మరో అవకాశం ఇచ్చి, తన అపార కరుణా రస వృష్టి కురిపించి ఆ అగ్నులను చల్లార్చుతుంది. ప్రమాదవశాత్తూ ఆ అగ్నులతో సాధకుని శరీరం కాలితే - గాయాలైతే (సాధనంలో పతనం కావటమే గాయాలు కావటమన్నది) ఆ జగన్మాత అతడికి శైత్యోపచారం చేస్తుంది తన చల్లని కరుణా పూరిత దృష్టులతో! ఇక సాధారణ మానవ జీవితాలకు వస్తే - అగ్నిప్రమాదాలూ, గ్యాస్ సిలిండర్లు పేలటం, రైలుప్రమాదాలూ, బస్సుప్రమాదాలూ, విమానప్రమాదాలూ, స్కూటర్ ప్రమాదాలూ, ట్రాఫిక్ ప్రమాదాలూ - ఇలా లక్షరకాల ప్రమాదాల అగ్నుల - ప్రళయాగ్నుల మధ్యనుడులు తిరుగుతూ పరుగెడుతోంది సగటు మానవ జీవన గమనం!

సామాజిక - ఆర్థిక - రాజకీయ - వాతావరణ కాలుష్యాల ప్రళయాగ్నుల మధ్య - ఆప్రళయాగ్ని కీలలమధ్య చిక్కుబడిపోయివుంది మన మానవ సమాజం ఈనాడు!

మరి ఈ ప్రమాదాగ్నులన్నిటి మధ్యా మనం ఇంకా జీవించే వున్నామూ అంటే - మనలనందరినీ కాపాడుతున్న దివ్య శీతలశక్తి ఎవరిది ? మనం ఇష్టంగానో, అయిష్టంగానో, ఇతరుల వత్తిడితోనో, కుతూహలంతోనో, గొప్పకోసమో, స్టేటస్‌కోసమో, జిజ్ఞాసతోనో, మొక్కుబడి కాలక్షేపంగానో, ఎలాగో ఓలా మనం చేస్తున్న కాస్తంతపూజ - స్తోత్రం - పారాయణం లాటి - వాటితోనే సంతృప్తి పడిన ఆజగన్మాత తన అపారమాతృ మమత అనే కరుణా రసవృష్టి మనపై కురిపిస్తుండగా - మనం ఆ అగ్నుల తాకిడి తప్పించుకోగలుగుతున్నాము - అవునా ?

మనస్ఫూర్తిగా - ఇష్టంగా, భక్తిగా చేశామనుకోండి! ఆ తల్లి అపారదయ - సాక్షాత్కారం నుసాధ్యమే సుమండీ!

# 40వ శ్లో ॥ మణిపూరక చక్రము.

40 శ్లో॥ తటిత్త్వన్తం శక్త్యా తిమిర పరి పన్థి స్ఫురణయా
స్ఫురన్నా నారత్నా భరణ పరిణద్ధేన్ద్ర ధనుషమ్,
తవ శ్యామం, మేఘం, కమపి, మణిపూరైక శరణం
నిషేవే వర్షన్తం, హరి మిహిరతప్తం - త్రిభువనమ్ ॥

**అర్థము** :- ఓ తల్లీ! భగవతీ! మణిపూర చక్రమే నివాసముగా గలదై, చీకటిని నిరసించు (పోద్రోలు) ప్రకాశము గల శక్తిచే, మెరపు తీగెలతో కూడినదియు, అనేక రత్నముల చేత నిర్మింపబడిన ఆభరణముల కాంతిచే, ఇంద్ర ధనస్సుతో కూడినదియు - అయిన అనిర్వచనీయమైన నీ సంబంధమగు (నీ స్వరూపమగు) కారుమేఘము - ప్రళయకాల రుద్రుడను సూర్యునిచే తపింప జేయబడుచున్న ఈ త్రిభువనములను వర్షధారలచే (కృపా రసవృష్టిచే) తడుపుచున్నది. అట్టి శివశక్త్యాత్మక మగు నీలమేఘమును సేవించెదను. ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు - మణిపూర చక్రంలో సాధకులకు యోగసాధన తెలియజేస్తున్నారు "మణులతో నింపబడినదే మణిపూరక చక్రం" మణులు అనగా ఐశ్వర్యములు - కొన్ని ధనసంబంధ సిద్ధులు - ఇవిసాధకునికి లభ్యమౌతాయి ఇక్కడ, కాబట్టి దీనిని మణిపూరమంటారు. నాభిస్థానంలో వుండే చక్రంఇది. సాధారణంగా షట్చక్ర క్రమం - మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరం అనాహతం - విశుద్ధి, ఆజ్ఞా, ఇలా సాగుతుంది. కానీ సౌందర్యలహరి అంతటా ఆచార్యులవారు ఎక్కడ ఈ షట్చక్రాలకు సంబంధించిన వర్ణన వచ్చినా, మూలాధారం - మణిపూరం - స్వాధిష్ఠానం - అనాహతం - విశుద్ధి ఆజ్ఞా ఇలా - మణిపూర స్వాధిష్ఠాన చక్రాల స్థానాలుమాత్రం ముందు మణిపూరాన్ని వర్ణించి - తర్వాత స్వాధిష్టాన్ని వర్ణించారు. ఇందులోని మంత్రయోగ రహస్యమేదో - మహాత్ములకే తెలియాలి తప్ప - మామూలు వారికి అర్థంకాదు. ఏదో ప్రత్యేకత ఉండే వుంటుంది ఆచార్యుల వారి ఆలోచనలో - వారు అలా దర్శించి వుండవచ్చు స్వానుభవంలో! ఇది తామసచక్రం (మణిపూరం) ఒక్క క్షణం మెరిసే మెరుపులా అమ్మవారి దర్శన మౌతుంది సాధకులకు అమ్మవారి వర్ణం కారు మేఘం యొక్క శ్యామల వర్ణం! ఆదేవి శ్యామా! శ్యామల! ఆ కారు మేఘం - తీక్ష్ణమైన ఎండను (సూర్యుని తాపనశక్తి) (ఇది - స్వాధిష్ఠానంలో నుండి ప్రసారమయ్యే సూర్యాగ్ని శక్తి) తన జల రేఖలతో కప్పుతూ - ఇంద్రధనుస్సు రంగులవలె - వివిధ మణుల కాంతుల ఆభరణాలు ధరించిన శ్రీ

మూర్తిగా "శ్యామలగౌరిగా" శ్యామల వర్ణగా, కారు మేఘ స్వరూపిణిగా, జలధారలతో ఆ సూర్యతాపాన్ని తగ్గిస్తూ - వర్షిస్తుంది. మణిపూరం - జలచక్రం. అగ్నితత్వం + జలతత్వం కలిసి వుంటుంది. ఆ కారు మేఘంలో - సూర్యకిరణాల రూపంలో ప్రకాశరూపునిగా ఈశ్వరుడున్నాడు. వర్ష రూపంలో అమ్మవారు వున్నది. ఇద్దరూ కలిసి అద్భుత ప్రకాశ రూపమైన మెరుపులతో సాధకునిపై కరుణారస వర్షం కురిపిస్తున్నారు. ప్రపంచరూపంలో మనం పరిశీలించ గలిగితే ఏప్రిల్ - మే నెలల్లో భరణి, కృత్తిక, రోహిణి కార్తెలలో - తీక్షమైన సూర్యతాపానికి సర్వజనులూ, జీవరాశీ, వుక్కపోతతో సతమతమై పోతుంటారు. చిన్న బిడ్డలు సరేసరి! "సన్‌స్ట్రోక్" "(వడదెబ్బ") తగలటమూ సర్వసాధారణం, కలవారు ఊటీ - కొడైకెనాల్, బెంగుళూరు అలా వెళతారు. సామాన్యులు - ఇళ్లలో కూలర్లు - అవీ అందుబాటు లేకపోతే - కరెంటు లేకపోతే - వట్టి వ్రేళ్ల తడికెలు నీళ్లు జల్లి - వుట్టినే గుడ్డలు నీళ్లతో తడిపి కిటికీలకూ, దర్వాజాలకూ కట్టుకునీ - ఆ ఎండదెబ్బకు శరీర తాపాన్ని చల్లార్చుకోజూస్తారు.

అలాటి ఎండలలో హఠాత్తుగా ఆకాశం మేఘావృత్తమై కారు మబ్బులు క్రమ్ముకుని - ఉరుములు - మెరుపులతో వర్షసూచన వస్తుంది. జలరేఖలతో ఇంద్రధనుస్సు వస్తుంది. అది అమ్మవారి విరాట్ రూపంగా - భావించగలిగితే ఆ ఎండ తాపం తీర్చటానికి చల్లని జలాన్ని తనలో నింపుకున్న శ్యామల వర్ణ - శ్యామలాదేవి - జగన్మాతృ రూపం మనం ఆ కారుమేఘంలో దర్శించగలిగితే - ఆ వర్షానికి వెనకాల (ముందుగా) వున్న ఎండ తీక్షతే - పరమ శివుని తాండవనృత్యంలా, ఉరుములు ఆస్వామి ఢమరుక నాదంలా, మెరుపులు ఆస్వామి దేహ ప్రకాశంగా, భావించగలిగితే - ఇంతకు మించిన యోగసాధన, ధ్యానం, నిర్గుణ పరబ్రహ్మ స్వరూప దర్శనం, నిర్గుణ పరబ్రహ్మ స్వరూప సాక్షాత్కారానికి చక్కని ఉదాహరణ మరొకటి వుండదు.

కానీ - అంతటి తీరిక ఓపిక - ఈనాటి పరుగుల జీవన విధానం మానవులకు ఇవ్వటం లేదు. వర్షం వచ్చేలోగా ఇళ్లు చేరుకోవాలి అనే టెంక్షన్ - పరుగు - దేవీ - మహాదేవుల ఈ తాండవ నృత్యాన్ని పరికించి చూచే - కనీసం ఆలోచించే అవకాశం ఇవ్వటంలేదు. దీనిక్కారణం - ఒక్కరోజులో - కారు దగ్గర్నుంచి - విమానం వరకూ స్వంతంగా కొనెయ్యాలనే మనిషి దురాశాపూరిత పోటీ పరుగు జీవితం అవునా ?

ఆచార్యులవారు - ఆ శివశక్తుల సూర్యప్రకాశ - జలద రూపాలను - మణిపూరం చక్రంలో - దర్శించమని పరోక్ష బోధచేశారు.

# 41 శ్లో॥ మూలాధార చక్రము.

41 శ్లో॥ తవాధారే మూలే సహసమయయా, లాస్యపరయా,
నవాత్మానం మన్యే, నవరస మహా తాండవనటమ్!
ఉభాభ్యామేతభ్యా ముదయవిధి ముద్దిశ్యదయయా
సనాథాభ్యాం జజ్ఞే జనక జననీ మజ్జగది దమ్ ॥

**అర్థము :-** తల్లీ! జగన్మాతా! నీ యొక్క స్థానమైన మూలాధార చక్రము నందు, లాస్యరూపమైన నృత్యములో మిక్కిలి ఆసక్తిగల "సమయ" అను పేరుగల ఆనంద భైరవితో కూడి, నవరస భరితమగు తాండవము చేయు నవాత్మకునిగా, తొమ్మిది రూపులుగల ఆనంద భైరవునిగా దలంచుచున్నాను.

సృష్టి, స్థితి, మొదలైన కర్తవ్యాల ననుసరించి, అపార కరుణతో కూడుకొన్న ఈ ఇరువురిచే జగత్తుకు జగన్మాత - జగత్పితలు సాక్షాత్కరించారు. (ఈ జగత్తు మాతా - పితలు కలిగినదైనది.)

ఈ శ్లోకంలో శ్రీ శంకర భగవత్పాదులవారు "మూలాధారం" అనే వేదికపై జగన్మాత - జగత్పిత అయిన "సమయ సమయుడు" అను పేర్లుగల - కామేశ్వరీ కామేశ్వరులు లాస్య - తాండవాలను అత్యంతానందంతో ప్రదర్శిస్తూ - వారిలోని చైతన్య ప్రకాశములే - ఈసృష్టికి మూల హేతువుకాగా, నవవ్యూహములు (లోగా వర్ణించినవి) తో కూడిన నవాత్మకుడయిన పరమశివుడు తాండవనాట్యం చేస్తుండగా, కనుబొమలు, కళ్లు, దృష్టులు (చూపులు) నుదురు - చేతివ్రేళ్ల ముద్రా రచనల అభినయ కౌశలంతో లాస్యనాట్యం చేసే జగజ్జనని ఈశ్వరి కాగా, ఈ ఇరువురి ఆనంద హేల వలన ఈసర్వసృష్టి ఉత్పత్తి అవుతున్నది. సర్వ కళలు పరిఢ విల్లుతున్నాయి. సర్వ విద్యలూ ప్రకటమౌతున్నాయి. సర్వ యోగ, ధ్యాన, జప, తప, యజ్ఞ, యాగ, మంత్ర - తంత్ర - యంత్ర - పూజా విధానాలన్నీ రూపు దాల్చుతున్నాయి.

ఈ ఆనంద నాట్యాన్ని తిలకించటానికి యోగంద్వారా కుండలినీ వికాసం ద్వారా, యోగులు సాధనచేస్తారు. ఇందుకు ఒక కథ వున్నది. మగధ దేశంలో పాటలీ పుత్రంలో (ప్రస్తుతం "పాట్నా') "వర్షోపాధ్యాయుల్తు, ''ఉపవర్షో పాధ్యాయులు'' అని ఇరువురు పండితులుండేవారు. వర్షోపాధ్యాయులు పెద్దవారు ఉపవర్షో పాధ్యాయులు చిన్నవాడు. (ఉపవర్షో పాధ్యాయుల కుమార్తె పేరు ఉపకోసల)

"వర్షోపాధ్యాయుల"వారి శిష్యులే వరరుచి, ''పాణిని'' అనే వారిద్దరూ! వీరిద్దరిలో ''పాణిని ' మందబుద్ధి. ఎంత భోధించినా - విద్య అంటడం లేదుపాణినికి వరరుచి జోతష్యాస్త్రంలోని

ష్ణాతుడైనాడు. కానీ ఈ వరరుచి శాపగ్రస్తుడైన పుష్పదంతుడనే గంధర్వుడు ఈతడు తన తపశ్శక్తితో అదృశ్య విద్య సాధించి, పార్వతీ పరమేశ్వరులు - ఏకాంతంలో వున్నపుడు, పరమేశ్వరుడు పార్వతికి చెప్పిన అద్భుత కథలు అదృశ్యంగా వుండి రోజూవిని, అవి తన భార్యకు చెబుతుండేవాడు. ఒకరోజు భర్తతోబాటు కైలాసం వచ్చినపుష్పదంతుని భార్య - పార్వతీదేవికి నమస్కరించి తనకు భర్త చెప్పిన అద్భుత కథలు - పార్వతీ అమ్మవారికి చెబుతుంది. జరిగినది అర్థమైన పార్వతీదేవి - పుష్పదంతుని మానవునిగా పుట్టమని శపిస్తుంది. ఈశ్వరుడు కరుణించగా "కాణాదుడనే" బ్రహ్మరాక్షసునికి (అతడూ శాపగ్రస్తుడైన గంధర్వుడే) ఈ కథలు వినిపించినపుడు అతడికి (వరరుచికి) మానవ జన్మ పోతుందని అనుగ్రహిస్తాడు శివుడు. అతడే వరరుచి జ్యోతిశ్శాస్త్ర పండితుడు, ఈతడి సహాధ్యాయి "పాణిని" కానీ - గురువుగారైన వర్షోపాధ్యాయులవారు పాణినికి విద్య భోధించి - భోధించి విసిగిపోయారు. చివరగా ఆయన "నాయనా! నీకు విద్య భోధించేశక్తి నాకిక లేదు. నీవు హిమాలయాలకు వెళ్లి, తీవ్రతపస్సు చెయ్యి. ఈశ్వరానుగ్రహం పొందగలిగావంటే - నీకు సర్వ విద్యలూ వస్తాయి. మానవ ప్రయత్నం అంతా నేను చేశాను. నా వల్లకాలేదు. దైవానుగ్రహం ఒక్కటే నిన్ను కాపాడగలదు, వెళ్లు!" అని ఆదేశించారు.

"పాణిని" విద్యలో మందబుద్ధేగానీ - గురువాజ్ఞను దైవాజ్ఞగా భావించే శిష్యుడు, అంచేత, గురువు చెప్పిన ప్రకారం - అనేక కష్టాలకు ఓర్చి - హిమాలయాలకు వెళ్లి - మానస సరోవర పరిక్రమణ చేసి - తపస్సుకు కూర్చున్నాడు. ఆతడు గురు బోధగా తీసుకున్న పంచాక్షరీ జపంలో తాధ్యాత్మం చెందిపోయాడు!

"అ ఇ ఉ ణ్! ఋ ళ్, ఏ ఓ ఙ్, ఐ ఔ చ్ .. హయవరట్ . . ల ణ్., ఞమ ఙణనమ్, ఝభఞ్, ఘ ఢ ధష్ జ బ గ డ ద శ్, ఖ ఫ ఛ ఠ థ, చ ట త వ్, క ప య్, శ ష స ర్, హల్ . . ." అనే నాదం వినిపించిందాతడి ధ్యానయోగంలో! నాదం దిక్కుగా పరుగులు తీశాడు పాణిని! కైలాసంలో అడుగెట్టాడు. అక్కడ - జగన్మాత అయిన పార్వతి - జగత్పిత అయిన పరమేశ్వరుడు లాస్య, తాండవనృత్యాలు చేస్తున్నారు. సత్యదృష్టి గల సనకసనందన, సనత్కుమార, సనత్సుజాతులనేవారు నలుగురు బాల్య దశ ఎన్నిటికీ దాటని దిగంబర యోగులు అవధూతలు వారు. వారు తిలకిస్తున్నారు పార్వతీ పరమేశ్వరుల నాట్యాన్ని!. నంది తిలకిస్తూ తలా, చెవులూ ఆడిస్తూ - తనకు తెలియకుండానే తన కాళ్లు అడుగులు వేస్తూ నృత్యం చేస్తున్నాడు. తపోధనుడైన పతంజలి మహర్షి - వ్యాఘ్రపాదులవారూ - కూడా ప్రేక్షకులుగా వున్నారు. పతంజలి యోగశాస్త్రం రచించిన మహాతపస్వి, అంచేతే వారు నటరాజు నాట్యాన్ని దర్శించే అర్హత పొందారు. వ్యాఘ్రపాదులవారు మహ మహర్షి, వారూ దివ్యదృష్టి కలవారు.

అందరూ ఆ నాట్యాన్ని తిలకించలేరు. కృష్ణభగవానుని విశ్వరూపసందర్శనం - అందరూ చేయలేకపోయారు. సంజయునికి - వ్యాసమహర్షి అనుగ్రహించిన దివ్యదృష్టితో చూడగలిగాడు. - ధృతరాష్ట్రునికి క్షణకాలం కృష్ణపరమాత్మే ప్రసాదించి - మరల ఉపసంహరించాడు. అర్జునునికి కూడా గీతాభోధ సమయంలో - కొద్దిసేపు దివ్యదృష్టి ప్రసాదించగా - విశ్వరూపసందర్శనం చూచి - "నీవు ఈ దివ్యరూపం ఉపసంహరించు స్వామీ! నేను చూడలేను!" అని భయపడి - ఆ దివ్యదృష్టిని కోల్పోయాడు అర్జునుడు అట్లా - భగవద్దర్శనం అందరికీ కాదు - కొందరు సిద్ధులకే అది సాధ్యం. ముఖ్యంగా కైలాసంలో సశరీరులుగా సార్వతీపరమేశ్వరులను దర్శించగలవారు అతికొద్ది మంది సిద్ధులు - వారిలో - వీరున్నారు. నాట్యవసాన సమయం అయింది. ఈశ్వరుడు పదునాలుగు మార్లు ఢక్కమ్రోగించాడు ముక్తాయింపుగా ఆ ఢక్కా నాదం మరలా మొదట పాణిని విన్న అక్షర - హల్లుల సముదాయనాదాన్ని పలికించింది. కైలాసంలో అడుగుపెట్టి - శివపార్వతుల దర్శనం - వారి తాండవ నాట్యలాస్య నాట్య దర్శనం అయిన మరుక్షణంలోనే పాణినిలో అపారవిద్య - అమృత ఝురిలా - కట్టలు త్రెంచుకుని ఉబికి ఉబికి రాసాగింది.

అచ్చులలో "అ" కారము మొదటిది.

"హల్" అనేది చివరిది. వీని మధ్యలో ఇమిడివున్న అచ్చులూ, హల్లులనూ "అల్" = అ= అనేది సూచిస్తుంది "అలోంతస్య" అంటూ పాణిని వ్యాకరణ మొదటి సూత్రాన్ని గట్టిగా చదివాడు ఆనందంతో! శివ పార్వతులు - సనక సనందాదులూ, నందీ - విఘ్నేశ్వర - కార్తికేయులూ - ప్రమథగణాలూ వులిక్కిపడ్డారు. కైలాసంలో మానవ వాక్కు! పాణిని వైపు చూశారంతా! పాణిని అమాయకంగా చెప్పుకు పోతున్నాడు వినయంగా నమస్కరిస్తూ. "పరమశివా! పరమేశ్వరీ! నా గురుదేవుల ఆజ్ఞ మేరకు - హిమాలయాలకు వచ్చి, మానస సరోవరప్రాంతంలో తపస్సాచరిస్తుండగా - పరమేశ్వర ఢక్కా నాదంలోని అక్షర సముదాయపు విచిత్ర నాదం - నన్నిక్కడకు లాక్కునివచ్చింది! తమరిద్దరి తాండవ లాస్య నాట్యాలను తిలికించే అదృష్టం ప్రసాదించారు. ఈ అక్షర సముదాయంలోనుండే నాలో వ్యాకరణమనే - ఒకానొక భాష్య శిక్ష, ఉబికి వస్తోంది. భాషకు వ్యాకరణం ప్రాణం, పద్యమునకు - శ్లోకమునకు ఛందస్సు ప్రాణం.

"మీనృత్తావసాన సమయంలో మరల పదునాలుగు మార్లు "ఢక్కా" మ్రోగించారు. ఆ పదునాలుగు నాదాలలోని అక్షర నాద సముదాయమే నా వ్యాకరణానికి పదునాలుగు (14) సూత్రాలుగా నా అంతరంగంలో రూపుదిద్దుకుంటున్నాయి. మహేశ్వరా! నీ అనుగ్రహంతో ఏర్పడిన ఈ విద్యను "మహేశ్వర సూత్రాలుగా" నామ కరణం చేస్తాను ఇది "అష్టాధ్యాయ" గా

పేరుపొందుతుంది! పదునాలుగు సూత్రాలనూ "మహేశ్వర సూత్రాలుగా 8 అధ్యాయాలలో పొందు పరుస్తోంది నా హృదయం! కాబట్టి ఇది "అష్టాధ్యాయి," అంతేకాదు. మహేశ్వరానుగ్రహంతో ఏర్పడిన ఈ వ్యాకరణం - భూలోక వాసులందరికీ అందాలీ అంటే - ప్రసిద్ధ ఈశ్వరాలయన్నిటిలోనూ."వ్యాకరణ దాన మండపాలు" నిర్మించేటట్లుగా నీవు నీ భక్తులకు అజ్ఞా - అనుజ్ఞ ఇవ్వు స్వామీ!" అన్నాడు సాష్టాంగా దండప్రణామం చేస్తూ! అతడి గురుభక్తికీ - అమాయకపు భక్తికీ - ఈశ్వరుడు ఈశ్వరి ముగ్ధులైనారు!

"నీవు ధన్యుడివి నాయనా! వ్యాకరణాలన్నిటిలోనూ ప్రామాణికంగా నీ "పాణిని" వ్యాకరణం రూపుదిద్దుకుంటుంది.

శిక్షలలో - ఉత్తమమైనది - యాజ్ఞవల్క్య శిక్షకాగా - వ్యాకరణాలలో "పాణిని" వ్యాకరణమే ప్రామాణికమైనదిగా మారుతుంది! నీ గురు భక్తి - నిన్ను మానవులకు అసాధ్యమైనదీ - పరమ యోగులకు తప్ప సాధ్యం కానిదీ అయిన మా తాండవ లాస్యనాట్యాలను తిలకింపజేసింది, కైలాసమునకు పిల్చుకు వచ్చింది. ఇక నీవు క్షేమంగా తిరిగి వెళ్లు!" అని ఆశీర్వదించారు.

నందీశ్వరుడు ముందుకు వచ్చి "స్వామీ! - నీ అడుగులలో అడుగులు కలిపిన నా నాట్యానికీ గుర్తింపూ గౌరవం ప్రసాదించవా ?" అని ఆర్తిగా కోరాడు. ఈశ్వరుడు ఆనందించి - "భరతముని నాట్య శాస్త్రంలో కృషి చేస్తూ తపస్సు చేస్తున్నాడు. అతడు నీ వద్దకు వస్తాడు. అతడికి ఈ నాట్య శాస్త్రం భోధించు అది నీ ద్వారా ప్రచారమై, భరతముని వలన వ్యాప్యమై "భరత నాట్యంగా" భువిలో గౌరవం పొందుతుంది!" అని ఆశీర్వదించాడు.

అట్లా పాణిని వ్యాకరణం వ్యాప్తిలోనికి వచ్చింది. ఈపాణిని కథ "గుణాఢ్యుడు" రచించిన "బృహత్కథ"లో వున్నది. ప్రాకృత భాషలు ఆరు. వాటిలో "పైశాచీ" భాష ఒకటి గుణాఢ్యుడు "పైశాచీ" భాషలో "బృహత్కథా మంజరి" నిరచించాడు. అయితే ఈ బృహత్కథను ఆనాటి మహారాజు ఆదరించక పోవటంతో గుణాఢ్యుడా వ్రాతప్రతిని - (తాళపత్రాలను ఒకటొకటిగా అగ్నికి ఆహుతి చేయసాగాడు ఈలోగా మహారాజు తన తప్పు తెలుసుకుని, గుణాఢ్యుని వెతుక్కుంటూ వెళ్లి, ఆయన వ్రాసిన బృహత్కథ "దహనకాండ" అపాడు కానీ ఆ సరికే బృహత్కథ సగంపైగా కాలిపోయింది. మిగిలినది మహారాజు తీసుకుని గుణాఢ్యుని క్షమాపణలు కోరి, సత్కరించాడు! రాజుగారి కోరిక మేరకు - క్షేమేంద్రుడు అనే మహాకవి - గుణాఢ్యుని - మిగిలివున్న తాళ పత్రాలలోని" బృహత్కథను సంస్కృతములో సంక్షిప్తంగా రచించాడు. దానినే "సోమదేవభట్టు" "కథాసరిత్సాగరము"గా చక్కని కథలుగా రూపొందించాడు!

ఆ పాణిని విన్న ఆశబ్దాలు - ఈశ్వరుని నృత్యంలో ఉదయించిన శబ్దాలు - శివస్వరూపాన్ని - ఏక భోగంగా - (నృత్య - నటరాజుగా) దర్శించటానికి వీలుగా వున్నాయి. వీటినే శివభక్తి సూత్రాలుగా నందికేశ్వరుడు గ్రహించి - భాష్యం చేశాడు. ఇంతటి మహత్తర కధలెన్నో - ఆ శివ పార్వతుల నాట్యహేలలో ఇమిడివున్నాయి. ఆది శంకరాచార్యులవారూ దర్శించారు గనుకనే - ఈ శ్లోకంలో - వారిద్దరి దివ్యనాట్యంతో - ఈ జగత్తు జననీ జనకులు కలదైనది" అని వర్ణించారు. సర్వసృష్టికీ సర్వకళలకూ - సర్వవాఙ్మములకూ జననీ జనకులు పార్వతీ పరమేశ్వరులు మనమంతా సాధారణ మానవులం, ఆయోగాలూ - ధ్యానాలూ తపస్సులూ - మనకు వీలుపడవు - కాబట్టి మనం చిత్తశుద్ధితో కూడిన భక్తితో - ఒక సాకారరూపాన్ని ధ్యానిస్తూ భక్తిగా ఆ స్తోత్ర పారాయణం చేస్తూ - వుంటే - ఆ నామజప మహిమ వలన మన మనో వేదికపై ఆ జగన్మాత జగత్పితల లాస్యతాండవ నృత్యాలను - మన మనో నేత్రాల భావనతో తిలకించవచ్చు. మన హృదయాలే వేదికగా చేసి ఆ దివ్యదంపతుల నాట్యహేలను రంగస్థలంగా మార్చవచ్చు. మనసుండాలేగానీ మార్గంలేదా ?

త్యాగరాజు, అన్నమయ్య రామదాసు, దీక్షితార్ - కబీరు - తులసీదాసు - సూరదాసు - భక్త మీరా - రామకృష్ణ పరమహంస రమణ మహర్షి - భక్తపోతన కాళిదాసు - ఆది శంకరాచార్య, ఇలా ఎందరో మహనీయులూ - మహాత్ములూ - మహాకవులూ, ఆచార్యులూ - సాకార రూపంధ్యానించీ, గానం చేసీ - కవిత్వాలు వ్రాసీ - నామ జపంచేసీ తరించిన వారుకదా ? మనమూ ప్రయత్నిద్దాము, తప్పులేదు కదా ? ఈ అధ్యాయంలో శ్రీ శంకర భగవత్పాదుల వారు - ఈ ఆరు శ్లోకాలలో (36 శ్లోకనుండి 41వ శ్లోకం వరకూ - షట్చక్రాలలో శివశక్తుల సమైక్యరూపాన్ని వర్ణించారు.

ఇక చివరగా 100వ శ్లోకంలో "సౌందర్యలహరి" ఫల శృతిని - తమ శరణాగతిని చెబుతున్నారు.

**100వ శ్లో॥ప్రదీప జ్వాలాబిర్ది వసకర నీరాజన విధిః**
**సుధాసూతే శ్చన్ద్రోపల జలల వైరర్ఘ్య రచనా**
**స్వకీయై రమ్భోభి స్సలిలనిధి సౌహిత్య కరణం**
**త్వదీయాభి ర్వాగ్భి, స్తవజనని వాచాం స్తుతిరియమ్ ॥ అన్నారు.**

**అర్థము** :- ఓ తల్లీ జగన్మాతా! స్వకీయములైన (నేను తయారుచేసిన) చేతి దివిటీ జ్వాలలద్వారా, సూర్యునికి హారతి పట్టినట్లు, స్వకీయములైన (సహజమైన) చంద్రకాంత మణు

వలన స్రవించుచున్న జల బందువులచే (అనగా - చంద్రకాంత శిలలపై మంచు బిందువులు రాలిపడి - అవి మరలా నీరుగా మారి జల జల రాలినట్లుగా) - చంద్రునికి అర్ఘ్యము సమర్పించినట్లు, స్వకీయములైన ఉదకములు నీటిచే (సముద్రంలో వున్న నీటితోనే) "సాగరునికి తర్పణము గావించినట్లు - నీవలన, నీ అపార కరుణ వలన, నా మనసుకు నీవే తోపింప జేసిన నీ స్వరూపములైన నీ వాక్కుల కూర్పుచే - నీవాక్కులే - నీ శ్లోకములుగా కూర్చి నిన్ను నేను స్తుతించుచున్నాను.

ఈ శ్లోకంలో - ఆది శంకరాచార్యుల వినయం - పరిశీలించండి. కాస్తంతచదువూ, డిగ్రీలూ, ఒకమంచి ఉద్యోగం, కాస్తంత గొప్ప హోదా, ఎక్కువగా డబ్బు - కథలో నవలలో వ్రాసి కాస్తంత పేరూ, కొన్ని సన్మానాలూ, ఇలా ఏదో ఒకటి రాగానే - మనలోఎంత అహం తన్నుకు వస్తుంది?

"నేనది రాశాను! ఇది చేశాను, ఆదానం చేసాను, ఈ విరాళం ఇచ్చాను! ఈ పరోపకారం చేశాను!" అంటూ తమని తాము పొగడుకొని - ప్రక్క వాళ్లని - పోరి పోరి వాళ్లచేతా పొగిడించు కుంటే కానీ నిద్రపట్టని మనం సర్వ దేవతలను సాక్షాత్కరింపజేసుకుని, సర్వస్తోత్రాలూ వేదాలతో సమాన ప్రతిపత్తి, మహాత్మ్యం కలిగి రచించి, యావద్భారతానికీ - అతి పిన్నవయస్కుడైన మహా ఆచార్యునిగా జగద్గురువుగా మారిన ఆ మహాను భావునిలోని, వినయం, ఆత్మార్పణ, అకుంఠిత భక్తిలలో - కోటివంతు పొందగలిగినా మన విద్య - శ్రీ విద్యాసాధన, ఈ సౌందర్యలహరి పారాయణ కూడా - గొప్ప ప్రయోజనం సాధించినట్లే మనలో! అహో ! ఏమి శరణాగతి ? ఏమి సత్య ప్రవచనం ? ఏమి వినయ శీలత ? ఏమి ఆత్మార్పణ - జగద్గురువులది ? సర్వ శక్తి స్వరూపిణి అయిన జగన్మాతను, సర్వ వ్యాపకుడైన జగత్పిత అయిన ఈశ్వరుని - స్వయంగా దర్శించి - వారి కరుణపొంది, సౌందర్యలహరి యొక్క "మూలం" "భావం" ఈశ్వరుని వలన, ఈశ్వర వాణిగా పొందిన అనన్య సామాన్య తపస్సంపన్నులూ, అపర శంకరులూ అయిన శ్రీ ఆది శంకరాచార్యుల వారు - తన ఈ కవిత్వం అంతా, సూర్యుని ముందు దివిటీ పట్టినట్లుగానూ, చంద్రునికి, మంచు బిందువులతో అర్ఘ్యం ఇచ్చినట్లుగానూ, సముద్రునికి ఆయన జలంతోనే ఆయనకు తర్పణం ఇచ్చినట్లుగానూ, ఆ తల్లి ప్రసాదించిన ఆ తల్లి ఈమృత వాక్కులతో ఆ తల్లినే స్తుతించానే తప్ప, నా గొప్పతనమేమీ లేదు!" అని చెప్పుకున్నారు. జగద్గురువుల వినమ్రత ఎంతటి వెల లేనిదో మన ఊహక్కూడా అందదు సుమా! వారి కవిత్వం అమృతకవితా ఝరి. ఆ మహాద్గురువు - తమ భవానీ భుజంగ ప్రయాత స్తోత్రంలో 13వ శ్లోకంలో,

13 శ్లో॥ శ్రుతీనా మగమ్యే, సువేదాగమజ్ఞా,
మహిమ్నో న జానంతి పారం,తవాంబ!
స్తుతిం కర్తు మిచ్ఛామి తేత్వం భవాని!
క్షమ స్వేద మత్ర ప్రముగ్ధః కిలాహమ్ ॥

(అర్థము :- (శతులూ, స్మృతులూ కూడా నీ మహాత్మ్యాన్ని, పూర్తిగా (పారం) - తుదముట్ట - తెలుసుకోలేవు తల్లీ! నీ స్తోత్రం నేను చేస్తున్నాను. ఈ బిడ్డడి స్తోత్రాన్ని సంతోషంతో స్వీకరించు!)

14 శ్లో ॥గురుస్త్వం, శివస్త్వం చ, శక్తిం స్త్వమేవ!
త్వమేవాసి మాతా, పితా చత్వమేవ!
త్వమేవాసి విద్యా, త్వమేవాసి బంధు
ర్గతిర్మే మతిర్దేవి సర్వం త్వమేవ!

(అర్థము : గురు రూపిణివి నీవు, శివ స్వరూపిణివి నీవు, శక్తి స్వరూపిణివీ నీవే! నీవే నా తల్లివి, తండ్రివి, విద్యవు, బంధువు, నాగతి, (నీ జీవన సర్వస్వం) నీవే, నా మతివి - ధర్మమార్గాన్ని అతిక్రమించని సన్మతి) - నీవే - ఇంతెందుకు ? నా సర్వం నీవే తల్లీ! జగన్మాతా!)

15 శ్లో॥ శరణ్యే, వరణ్యే, సుకారుణ్య మూర్తే!
హిరణ్యోదరాద్యై, రగణ్యే, సుపుణ్యే!
భవారణ్య భీతేశ్చ మాం, పాహి, భద్రే!
నమస్తే! నమస్తే! నమస్తే భవానీ!

(అర్థము పుణ్యచరితా! శరణా గతుల పాలిటి వఝాల వల్లీ! కల్పవల్లీ! కారుణ్యమూర్తీ! బ్రహ్మాది దేవతలకూ నీ స్వరూపం తెలియరాని తల్లీ! ఈ భవారణ్యంలో భీతిల్లివున్నాను! నన్ను రక్షించు - భద్రా ! నీకు నమశ్శతములు తల్లీ! భవానీ!)

16 శ్లో॥ ఇతీమాం మహచ్ఛ్రీ భవానీ భుజంగ
స్తుతిం యః పఠేచ్ఛక్తి యుక్తశ్చ తస్మై
స్వకీయం పదం, శాశ్వతం వేదసారం!
శ్రియం చాష్ట సిద్ధిం, భవానీ దదాతి ॥

(అర్థము :- ఇది నా చేత స్తుతింపబడిన భవానీ భుజంగ యాతస్తోత్రం - ఎవరైతే, ఈస్తోత్రాన్ని భక్తి శ్రద్ధలతో నిత్యం పారాయణం చేస్తారో, వారికి - ఆ జగ భవానీ, అణిమాద్యష్ట సిద్ధులూ ప్రసాదించి, అంతంలో, ఆ తల్లియొక్క శాశ్వత - మోక్షపదాన్ని ప్రసాదిస్తుంది.

**17 శ్లో॥ భవానీ! భవానీ! భవానీ! త్రివారం,**
**హ్యుదారం ముదా సర్వదా యేజపన్తి,**
**నశోకో, నమోహో, న పాపం, న భీతిః,**
**కదాచి త్కథంచి త్కుతశ్చి జ్జనానామ్!**
**(కదాచిత్, కథంచిత్, కుతశ్చిత్ - జనానామ్!)**

**అర్థము :-** "భవానీ! భవానీ! భవానీ!" అంటూ ఆ జగన్మాతను ముమ్మారు (మూడువేళలా) భక్తి శ్రద్ధ - శరణాగతి ఆనందాలతో ఎవరైతే జపిస్తారో, వారికి - ఎన్నటికీ, ఏ విధంగానూ, ఎవరివలనా, శోకం, మోహం - పాపం, భీతి అనేవి ఏవీ కలగవు గాక, కలగవు!)

ఈ భవానీ భుజంగ ప్రయాతస్తోత్రంలో లానే వారి ప్రతి స్తోత్రమూ మంత్ర, తంత్ర, యంత్ర, భక్తి ప్రపూరిత, శరణాగతితో నిండిన మహానిధులు! వారు రచించినస్తోత్రాలు చదవటానికీ, అర్థం చేసుకోవటానికీ మన ఈ జన్మచాలదు. ప్రతిస్తోత్రం వారి అనుభవసారంలో నుండీ, వారి తపశ్శక్తిలో నుండీ, ఉద్భవించి - వేద సమానమైన ప్రతిపత్తి కలవి. అవి పారాయణం చేస్తేచాలు, ధ్యాన సమాధి సాధించినట్లే! ఈ "సౌందర్యలహరి" వారి స్వానుభవములనే మణుల సమాహారము కూడా! మనం ఆ జగద్గురువుల అడుగుజాడలలో నడచి వారి ఈ "సౌందర్యలహరి" భక్తిగా పారాయణం చేస్తేచాలు, వారు స్వయంగా దర్శించిన జగన్మాత - జగత్పితల దర్శనం - మనకూ లభిస్తుంది, కుశంకలూ, కుయుక్తులూ వదిలి పారాయణం చేసి తరిద్దాము. చివరగా, ఆదిశంకరాచార్యులవారు, తమ పధ్నాలుగు మంది - మణి పూసలల్లాటి శిష్యులనూ, తమ అద్వైత మత ప్రచారకులుగానూ, గ్రంధప్రచారకులు గానూ నియమించి, వారినెవరినీ తమవెంట రావద్దని శాసించి, వంటరిగా, మహాప్రస్థానానికి హిమాలయాలకు వెళ్లిపోయారు!

శిష్యుల బంధం చివరిదశలో, మోక్ష పధానికి అడ్డుకా గలదని భావించిన ఆ పరమగురవు, తమ శిష్యులకు తమ ఆధ్యాత్మిక శక్తిని ప్రసాదించి - నిర్మోహత్వం, నిరాడంబరత్వం, నిశ్చలతత్వంతో - మహాకవిత్వ (సరస్వతీ) స్వరూపుడై తన "ఉత్క్రాంతి" (మరణం) అతి గోప్యంగా సాధించారు! వారు భౌతికంగా లేకపోవచ్చు, కానీ, వారి ప్రతి స్తోత్రములో, ప్రతి పలుకులో స్వచ్ఛమైన నడవడికలో - అక్షర రూపులై ఈ భారతావనిలోనే గాక, యావత్ప్రపంచంలో చిరంజీవులై, చిరయశస్సు పొందినవారై, వారి ఏస్తోత్రం ఎలా చదివినా ఆ భక్తుల హృదయాలలో చిరంజీవులుగా,పరమగురువుగా నిలిచివున్నారు. ఎన్నటికీ నిలిచేవుంటారు!

"మాకు గురువుదొరకలేదు! గురు భోధ పొందకుండా ఏ పూజ అయినా ఎలా చేయగలం ?" అని బాధ పడ్తుంటారు చాలామంది అలాటివారందరూ, ఆది శంకరులను మించిన పరమగురువు మరొకరు లేరని భావించి, వారి ఏకలవ్య శిష్యులుగా మారి, వారిస్తోత్రాలు కంఠస్తం చేసి, హృదయస్థం చేయగలిగితే చాలు! గురు భోధ దానంతటదే లభ్యమౌతుంది ఆస్తోత్రాలలోని ఆచార్యవాణిగా!

ఈ చివరి 11వ అధ్యాయంలో జగద్గురువు 35వ శ్లోకంనుండి 41వ శ్లోకం వరకూగల ఆరు (6) శ్లోకాలలో షట్చక్ర వివరణలో శివశక్తుల సమైక్య రూపదర్శనం, చేయించారు. ఈ అధ్యాయం పారాయణం భక్తి శ్రద్ధలతో చేసిన వారికి, నానావిధ కఠిన రోగములు ఉపశమిస్తాయి. భూతప్రేత పిశాచ, గ్రహ బాదలు తొలగిపోతాయి, దుస్స్వప్నములు రావు. సకల ఉదర రోగములు శాంతిస్తాయి. నూరవ (100 వ) శ్లోక పారాయణం వలన సకలకార్య సిద్ధి, జయము కలుగుతుంది.

శ్రీ చక్రపూజ రోజూ సాంగో పాంగంగా చేయలేని వారూ, వీలుకానివారూ, శ్రీ చక్రాన్ని పూజించటానికి (అనవరంగా) భయపడేవారూ, లలితా సహస్రనామస్తోత్ర పారాయణం చేయగలిగిన వారూ, చేయలేని వారూ, ఇలా ఎవరైనాసరే, రోజూ "సౌందర్యలహరి" అన్ని శ్లోకాలూ (100 శ్లోకాలూ) గానీ, లేక ఒక్క అధ్యాయం ప్రకారం కొన్ని శ్లోకాలు గానీ భక్తి శ్రద్ధలతో పారాయణం చేయగలిగితే, సాంగోపాంగంగా శ్రీచక్రార్చన చేసిన ఫలం పొందగలరు.

జగన్మాత అపార కరుణ కలగాలేగానీ, మనం పొందలేనిది అంటూ ఏమీ వుండదు అందుకు మనం చేయవలసిన దల్లా భక్తి శ్రద్ధలతో కూడిన పారాయణం .

జగద్గురువుకు మ్రొక్కి - తప్పక పారాయణం చేద్దాము రండి! ఆ జగన్మాత కృపకు పాత్రులమవుదాము రండి!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

"భవానీ సౌందర్యలహరి"

రచన పవని నిర్మల ప్రభావతి.

అంకితం

శ్రీ మాల్యాద్రి లక్ష్మీనృసింహ స్వామి దివ్య పాదారవిందములకు భక్తి ప్రపత్తులతో, అంకితం.

రచయిత్రి,

పవని నిర్మల ప్రభావతి.



## రచయిత్రి రచించిన యితర ఆధ్యాత్మిక గ్రంథములు

- ★ శ్రీరామాయణ రసవాహిని
- ★ శ్రీ భాగవతామృత కలశం
- ★ శ్రీ సుందరకాండ
- ★ అవధూతతో అనుభవాలు
  (మొగలిచర్ల శ్రీ దత్తాత్రేయ స్వామి చరిత్ర)
- ★ శివభక్త చరితామృతము
- ★ శ్రీ లలితా సహస్రనామ సర్వస్వము
- ★ శ్రీ షిరిడి సాయినాథ భాగవతము

Printed at : Swamy Offset Printers, Gandhi Nagar, Vja-3. ✆ : 578211